చెప్పెను స్వామి. సర్వ సమగ్ర విశ్వరూపమును, తత్త్వమును దర్శించి కృతార్థుడై ధృతాయుధుడైన పార్థుడు మానవజాతికే సంకేతము. ఆతని మాట లిట్లున్నవి.

"మోహ తమంబు వాసెఁ దుదిముట్టిన నీదు ప్రపత్తి వీత సం
దేహుఁడనైతి గాథ సందీప్త మహాకృతి గాంచి బోధ స
న్నాహ నిరామయ స్థిర మనఃస్థితిఁ బొందితి సర్వలోక ని
ర్వాహ వినోద! నీవిమల వాక్యము చొప్పున నెల్లఁ జేసెదన్."
(1-228)

అనుచు పార్థుడు సర్వాత్మనా శరణాగతుడైనాడు.

నారదుడు నిరంతర సంకీర్తనా పరుడైన భక్తుడు. ప్రాధాన్య వివక్ష కట్లనవలసి వచ్చినది గాని, నారదుఁ డేమార్గమునకు చెందడు? ఈ దివ్యర్షి క్రొత్తగ పొందవలసిన సంస్కారము గాని, అందవలసిన ఆధ్యాత్మిక శిఖరము గాని లేదు. కాని లోక సంగ్రహార్థమై మహోత్తర సన్నివేశముల నభినయించి, స్వామి తత్త్వమును ముల్లోకముల వెదజల్లుటయే నిరంతర ధ్యేయముగ ప్రవర్తించువాడు. ఈ పాత్ర యందు ద్వంద్వ స్థితి గలదు. ఒక దశ యందీతడు దివ్య మానవ పరస్పర వాహికా సంకేతము. ఆ స్థితిలో నారదుడు. స్వామి నామముల అయనములను లోకమున కొసంగువాడు. మరియొక దశలో స్వామి దుష్టశిక్షణాది కార్యక్రమములకు కలహపూర్వక బీజము లవైచు అరివేరంపుఁదపసి. ఆయనకు కావలసినది లేదు, లోకహితార్థమై యక్కరలేనిది లేదు. కాని, యంతటి దేవర్షియు స్వామి తత్త్వము నందలి లోలోతుల తెలిసికొని చూచి మరియు చూడఁ గోరును. అవియు తన ధ్యాన నిష్ఠ కుపస్కారముగనే. అవతరణా వ్యూహము మొదలు తత్సమాప్తి పర్యంతమీయన తాకని తీఁగ లేదు. కదల్చని డొంక లేదు. స్వామి పదియారువేల వనితలతోఁ గుటుంబమెట్లు తీర్చుచుండెనో చూడవలెనని సంకల్పము కలిగిన బ్రహ్మమార్గచారియైన బ్రహ్మచారికి. ద్వారకకు బోయినాఁడు.

స్వామిచేత సత్కృతుఁడై యెక్కెడు గడప దిగెడు గడపగా నన్ని యిండ్ల కేఁగినాఁడు. కనిపించిన దశ్యము కనిపించక దివ్యదర్శన మైనది. ఇట్లు:

" ఒకచోట నుచిత సంధ్యోపాసనాసక్తు
నొకచోట బౌరాణికోక్తి కలితు
నొకచోటఁ బంచయజ్ఞోచిత కర్మని
నొకచోట నమృతోపయోగలోలు
నొకచోట నుజ్జనోద్యోగానుపక్తుని
నొకచోట దివ్యభూషోజ్జ్వలాంగు
నొకచోట ధేను దానోత్కలితాత్ముని
నొకచోట నిజసుత పరికరయుక్తు
నొక్కచోటను గానవినోదచిత్తు
నొక్కచోటను జలకేళియుత విహారు
నొక్కచోటను సన్మంచకోపయుక్తు
నొక్కచోటను బలభద్రయుక్త చరితు "

( దశమోత్తర-68-615 భాగవత )

ఇవికాక శృంగార దృశ్యములును. దేవర్షికి తల తిరిగి పోయి నది. "...నిఖిలలోక పావనమును సజ్జనహితము నైన నీ కీర్తన మఖిల జగంబులందుఁ దగ నెఱిఁగింతున్" ( 628 ) అనుచు స్వామి సర్వాంతర్యామితను గొనియాడినాడు. అతడు కోరిన దర్శనము నాతని కొసగి నాడు స్వామి!

ఇట్లు ప్రతిపదికగ గ్రహింపబడిన వృత్తాంతముల చాయ లున్నవి. ఇవి కాక స్వామి భక్తానుగ్రహమునకు నిదర్శనములో మరికొన్ని వృత్తాంతము లున్నవి. అవి పూర్వోక్త మార్గములలై నందో లీనము గాకపోవు. కాని ప్రాస్తావికముగ నొక్కొక్క వినూత నాంశమునకు తావలమ్మునై యుండును. అట్టివానిలో మోక్షప్రదాన మునకు భీష్మాచార్యుని, దివ్యపదవీ ప్రాప్తికి ఘంటాకర్ణుని, నరనారా

యణ తత్త్వనిరూపణమున కక్రూరుని, సంపదనుగ్రహమునకు కుచేలుని గ్రహింప వచ్చును.

స్వామితో నిత్యనైమిత్తిక సంబంధములు లేక నిరంతర భక్తి ప్రపత్తులలో స్వామిని ప్రసన్ను నొనర్చుకొన్న వారిలో విదురు డొక్కడు. స్వామి కృపచే సర్వజ్ఞానమునంది దానిని పరంపరగా కలియుగ పర్యంతము వ్యాప్తి నందించుటకు నియమితుడైన మైత్రేయుడు, మహాజ్ఞానియై స్వామి నిరంతర సన్నిధానమువలన నా జ్ఞానమును పెంపొందించుకొని, స్వామిని సేవించి జీవించి, యాయన నోటి నుండియే మహాతత్త్వ ప్రవచనము విని యాయన యాదేశముచే తపోదీక్షితుడైన ఉద్ధవుడు, స్వామిని నిరంతర దాస్యభావముచే సేవించి సర్వసందర్భముల రథసారథియై యాయన హృదయపు లోతులు దడవ గల్గిన నిరంతర కైంకర్యశీలి దారుకుడు, దూరమునుండి స్వామితత్త్వమును గమనించి తమ హృదయమున పదిలపరచికొని లోకానుగ్రహ బుద్ధిచే ప్రవచించిన వ్యాసులు, దానిని వ్యాపింప జేసిన శ్రీశుకులు, స్వామినోటనే తత్త్వమును విన్న మిథిలాపతి బహుళాశ్వుడు, యాదృచ్ఛికముగ స్వామి దర్శనము లభింప భక్తి నెరపి పూర్వభవ కర్మశేషమును బాపుకొన్న ముచికుందుడు, పుత్రశోకమున క్రుంగి స్వామి దయచే పుత్రప్రాప్తినందిన విప్రుడు, కొంతవరకు వెడసరముగ స్వామితో వ్యవహరించి యటుపై స్వామిని శరణమన్న ఉదంకుడు, అసంఖ్యాక మహర్షి బృందము—ఇట్లెందరో స్వామి భక్తానుగ్రహ తత్త్వమున కుదాహరణములుగ నిలిచియున్నారు. ఇందే యితివృత్తము గైకొన్నను నొక్కొక్కటి యొక్కొక్క మహత్తర దర్శనము.

## భీష్ముడు

వీరిలో భిన్నదృక్పథముల కాకరమై స్వామి యనుగ్రహ విశేషమునందలి సమగ్రతను నిరూపించునట్టి కొన్ని ఘట్టముల నాంధ్ర వాఙ్మయమున ప్రచలితమైన మార్గము నిట్లనుశీలనము చేయ వచ్చును.

అట్టి వానిలో భీష్ముని వృత్తాంతము ప్రముఖమైనది. భారత మహావీరులలో నకలంక త్యాగమూర్తి, బ్రహ్మచారి, వేదవేదాంగ విదుడు, మహాతాత్త్వికుడునైన భీష్ముని జీవిత వృత్తాంత మొక మహోత్తర ఘట్టము. స్వామి తత్త్వమును సాకల్యముగా భీష్ముడవగతము చేసికొనినాడనిన విషయము ధర్మజుని రాజసూయ వృత్తాంతమున స్పష్టము. శిశుపాలునితో వాదించు నప్పుడీతడు కృష్ణతత్త్వపు లోతులను తడవి యుపన్యసించినాడు. దీనిమూల నాతని పరమతాత్త్విక జ్ఞానము నిరూపితమైనది. భారతకథ యందలి యితర వృత్తాంతములను పరిశీలించి నప్పుడాతనిలోని యుత్తమ సద్భక్తి, ధర్మాచరణము నందలి కఠోరత్వ మెట్టిదో, సత్యవాక్పాలన మెట్టిదో, త్యాగశీలమన నెట్టిదో యవగతము కాగలదు. దానిగూర్చి రెండభిప్రాయములు లేవు. అట్లే భీష్ముడు మహోత్కృష్ట [illegible]డయి ఆయన యనుసరించిన ధర్మమార్గము స్వామి శాశ్వత ధర్మమార్గమున కభిముఖముగ సాగివచ్చిన దనియు భారతము నందు నిరూపితమైనది. కొన్ని సందర్భము లందాతని ధర్మబద్ధ చిత్తవృత్తి బాహ్యార్థ నిరూపకమై యున్నది. ద్రౌపదీ వస్త్రాపహరణ ఘట్టమును, స్వామి రాయబారము జరిపిన ఘట్టమును నిందుల కుదాహరణములుగ గ్రహింప వచ్చును. ఇతరులతోఁబాటు తానును వాచా వ్యతిరేకత ప్రదర్శించినాడు మొదటి ఘట్టమున. స్వామి శాంతి వచనముల కుపస్కారియై మాటలాడినాడు రెండవ ఘట్టమున. ఈ రెండు సందర్భములలో భీష్ముడొక దశను దాటి ధర్మరక్షణమునకు పూనుకొనలేదు. ఈ సందర్భమున నొక చిన్న యూహ. అధర్మము కురు సభయందు ప్రవర్తిల్లుచున్నప్పుడు తాను రాజ్యమును త్యజించిన త్యాగియే యైనను కలుగఁజేసికొని, యే ధనుష్టంకారము చేతనో వారింపగల శక్తిమంతుడు భీష్ముడు. అట్లొనర్పలేదు. రాయబారము సందర్భమునఁ దాను ధర్మపక్షపాతియై పాండవులతోఁ జేరుదునని గాని, కనీసము బెదరింపుగ తనకు రాజ్య

ముపై నాటికిని గల యధికారమును పురస్కరించుకొని యందలి కొంత భాగమును తానే పాండవుల కిప్పింతు ననిగాని చెప్పి యుండ లేదు. ఇవి సాక్ష్యములుగ నితని ధర్మరతి వాచికోపచారమేగాని కార్యోన్ముఖము కాదు- అని వాదించుటకును వీలు లేకపోలేదు. ఊహయందలి వైచిత్రిని బట్టియు, సుక్తి సామర్థ్యమును బట్టియు, బహువిధ తర్కములకుఁ దావొసంగుట నైతిహాసిక గాంభీర్యము నందలి భాగము. దానిని పురస్కరించుకొని భారతజ్ఞేయమైన స్వామి శాశ్వత ధర్మ గోప్తృత్వమును విస్మరింపరాదు. ద్రౌపది కక్షయ వస్త్రదానము చేయగల సర్వాంతర్యామి ధర్మజుని రాజ్యభ్రష్టత నాపలేకపోయెను. కురుసభ యందు విశ్వరూపమును ప్రదర్శించిన స్వామి పాండవులకై సూదిమొన మోపినంత భూమినేని సంపాదింప లేక పోయెను. ఈ రెండంశములు కార్యకారణ సంబంధము గలవి కావు. కౌరవుల యధర్మాచరణమునకు వలసిన బీజములు వారి జన్మాంతర సంస్కారము లందు నిహితములై, జరుగవలసి యున్న వృత్తాంతముల కున్ముఖములై సాగివచ్చినవి. అట్టి సందర్భముల స్వామియే నిస్సహాయుడు. ఇక భీష్ముని మాటేమి? కావున నాది నుండియు తన కృషి విశేషములను స్వామి సంకల్పముల కున్ముఖము గనే మలచికొని వచ్చిన మహావేత్త భీష్ముడు. కాగా తన మరణో పాయమును పాండవుల కెరిగించుటలో నించుకంతయు నధర్మవృత్తి లేదు. ఏలన ఆతని మరణము నందలి రెండంశములు పూర్వ నిర్దిష్ట ములే. శిఖండి జననము, తత్ఫలితమైన పతనము నొక యంశము, స్వచ్ఛంద మరణ మింకొకటి. ఈ రెంటి యందలి యవశ్యత్వము తనకు విస్పష్టముగా తెలియును. ఆ యెరుకను స్వామియొక్క శాశ్వత గోప్తృత్వమున కనుకూలముగ వినియోగించుటేమి యధర్మము? తాను నూతనముగ నేదియో మరణోపాయమును సృజించి తన్మార్గ మున నసువులుఁబాసి పాండవులను గెలిపింపలేదా యేమి? ఈ చర్చ



వలన భీష్ముడు జీవితాంతము కఠోర ధర్మ నిర్ణయ బద్ధుడై సూత్రితః సర్వతోముఖ విజ్ఞానము గలిగి ప్రవర్తించిన ఋషితుల్యుడను విషయము తెల్లమైనది. స్వామియే భీష్ముని పరమ విజ్ఞాన పారమ్యము నిట్లు ప్రశంసించినాడు: ఆ మహాత్ముడు వశిష్ఠ శిష్యుడు. భూత భవిష్య ద్వర్తమాన వేది. సర్వ విద్యాధార భూతుడు. అతడ స్తమించి నచో ధాత్రి యందలి సమస్త విద్యలును, సకల జ్ఞానములును నిరాశ్రయంబులై పొనుంగువడుసు- అని. అతని ప్రసాధనా విశేష మును సామాన్యమైనది కాదు. దానిని స్వామియే నిరూపించినాడు. శరతల్ప గతుడైన భీష్ముడు పరమోన్ముఖాత్ముడై మహిత సమాధి స్థితియందు స్వామిని తలచెను. ఆ స్థితి యందు స్వామి భావ మాత్రనిపై వెలసి ధర్మజుని చిత్త వైక్లబ్యమును పోనాడుటకై భీష్మునిచే ధర్మ బోధ చేయింప నిశ్చయించెను. దీనిసిబట్టి నిస్సందేహముగ భీష్ముని వైజ్ఞానిక ప్రతిపత్తిని, మహత్తర సాధనా సంస్కారమును స్వామి గుర్తెరిగెనని స్పష్టము. తనచే నీ ధర్మ ప్రవచన మేల చేయించు చుండెనన్న భీష్ముని ప్రశ్నకు స్వామియే సదుత్తర మొసంగినాడు. "అనఘ! శ్రీయస్సునకు యశంబునకు నేను మూలకందంబ; విను చంద్రముండు శీతకిరణుం డనుమాట విస్మయకరమె చెపుమ? యశ ముపార్జింప గ్రొత్త పెంపగు నె నాకు?" (భారత-శాంతి-2-146) స్వామి తన బుద్ధి స్ఫురణమును భీష్మునియందు జొనిపి వేదతుల్యమైన వాక్య ముల ప్రసంగింప జేసి యాతని కీర్తి నా చంద్ర తారార్కముగ చేయ సంకల్పించెననియు నీ సందర్భముననే చెప్పినాడు. ఇట్లు మహా వేత్తగ, సాధకునిగ, ధర్మ వీరునిగ స్వామి భీష్ముని సంభావించినట్లు నిరూపితమైనది. కాని, యసలు స్వామి తత్త్వము, భక్తానుగ్రహము బాహిరిల్లిన దిందులగాదు. ఇంతకుమున్న యంశముల నన్నిటిని భీష్ముడు సముపార్జించుకొన్నను నొక్క యంశము మిగిలినది. అదియే భక్త్యావేశ పురస్సరమైన అనన్య శరణాగతి. ఆ యవకాశము నాతని కిచ్చి యుద్ధరించుట స్వామి సంకల్పము. శరతల్ప గతుడైన నాటి

నుండియు ఉత్తరాయణ పుణ్యకాలమువరకు భీష్ము డందిన యార్తియు నిందులకే. క్రమదశలలో ఈ సాక్షాత్కారమును, సన్నిధిని భీష్మున కిచ్చుటకు వలసిన ప్రణాళికను స్వామి మొదటి నుండియు జాగ్రత్తగా నిర్మించి యమలు పరచినాడు.

భీష్ముని విజృంభణ మనితరమైనపుడు స్వామియే దానికి తట్టుకొన లేకపోయినాడు. మున్ను స్వామి పరమకారుణికుడై "తనయడు నొవ్వన కలుగక ధైర్యవృత్తి నయ్యాపేంద్రుఁడు నొచ్చిన హాయు చయంబు దడవి తేర్చి..." (భీష్మ-2-141) భంగ్యంతరమున దన యెడరును పార్థునికి స్పష్టమొనర్చినాడు. అటుపై భీష్ముని పరాక్రమ మజేయమై విజృంభింప "అవని గంపింప లలితపీతాంబరంబు చెఱఁగు తూలఁ జక్రాంశులు దుఱఁగలింప సింహనాదంబు క్రోధరంజిత భయంకరాననంబునఁ జెలగంగ నడరుఁ బెలుచ" (భీష్మ-2-155) విజృంభించినాడు. ఇట్టి ఘట్టములు రెండు ప్రవర్తిల్లినవి. ఈ రెండు సందర్భములందును భీష్ము డిందలి యాంతర్యమును గమనించెనో యను నట్లు స్వామి నాహ్వానించినాడు. చక్రముచే మరణ మిప్పింపు మని ప్రార్థించినాడు. (చూచెను గదా శిశుపాలవృత్తాంతము!)

"కనుగొని భీష్ముఁడుల్లము వికాసము నొందఁగ నల్ల నవ్వి యి
ట్లనుఁ జనుదెమ్ము వేగమ మహాత్మ! వికస్వర పుండరీక లో
చన! యిదె లెస్స నాకిచట శాశ్వతమైన యశంబు నచ్చుట
న్వినుతికి నెక్కు సద్గతియు నీదయ జేయు మిష్టమున్." (2-267)

ఈ ప్రార్థనమున నొక ఆంతర్యమున్నది. స్వామి చక్రముచే మృతి నంది తత్ఫలితమైన సద్గతినే యాత డాశించెను. అందులకు వలసిన భక్తి ప్రపత్తు లింకను నెలకొన్నవి కావు. ఇప్పుడిప్పుడే తన్మార్గమున భీష్ముని సంస్కారములు పరిణతము లగుచున్నవి. స్వామి కోపావేశాదులఁ గాంచి మురియుట, స్వామి నాహ్వానించుట, త్రిలోక మోహనమైన యాతని స్వరూపము ననుసంధానము చేయుట వంటి పనులలో నీ భీష్మ శరణాగతి కిందు ప్రారంభ మేర్పడినది. రెండవ

దశలో తత్పర్యవసానమును స్వామి భీష్మునికి కరుణించెను. ఇట్లు తీవ్రసాధనా మహానుభావులకు చరమ స్థితియందు సర్వాతిశాయియైన సన్నిధి విశేషమును ప్రసాదించి యుద్ధరించుట స్వామి ప్రత్యేకత. అందులకీ భీష్మ వృత్తాంతము మహత్తరోదాహృతి. తరువాతి పరిణామము లిట్లున్నవి.

భీష్ముడు ధర్మజుని కుపదేశించిన విషయములు తాత్త్విక సర్వస్వములని చెప్పదగినంత గంభీరములు. సర్వవేదాంత ధర్మసారమును, పురాణప్రపంచమును, స్వామితత్త్వమును, భీష్ముడు ధర్మజుని నిమిత్తునిగ నొనర్చి మానవాళికి ప్రవచించినాడు. ఈ విషయమున నీతడు స్వామికి మాత్రమే రెండవవాడు. ఆతని యౌన్నత్య మట్టిది. ముందు భాగమున స్వామి తత్త్వమును, వేదవేదాంత ప్రతీకగ యజ్ఞస్వరూపముగ దశావతార మూర్తిగ శాశ్వత నారాయణ తత్త్వముగ—నిట్లెన్ని మార్గము లున్నవో అన్ని మార్గములు భీష్ముడు నిరూపించినాడు. భీష్ముని మేధస్సునందు చిక్కుపడియున్న సర్వతాత్త్విక ప్రవచనములు వెల్లువికి వెలికివచ్చినవి. భీష్ముని హృదయాకాశము విశద స్వచ్ఛమైనది. అపుడు శరణాగత తత్త్వ మీ మార్గమున బాహిరిల్లినది. వివశుడై పరమార్ద్రముగ నిట్లు స్తుతించినాడు.

"దేవదేవ జీవాత్మక దేవవంద్య శంఖచక్ర గదాపద్మ చారుహస్త
వాసుదేవ త్రివిక్రమ పరమపురుష ప్రణతి యొనర్చెద గరుణం
జూడు."

"బలిమినీవ నాకు భక్తుండ నీయెడ నాలుబిడ్డ లేనియట్టి వాడం
గావునన్ను నధిక కారుణ్యమున నిమ్మనుజ్ఞం గమలదళ మనోజ్ఞ
నయన." ( అనుశాసనిక, 5-462, 463 )

యని ప్రార్థించినాడు. ఈ యవకాశమునకే యెదురుచూచుచున్న స్వామి భీష్ముని పరమాదర భావమున నవలోకించి యాతని యందొక తప్పులేదనియు, ఆతడు కృతపుణ్యుడనియు, తండ్రివలన భక్తిపెంపు గలవాడగుటచే మృత్యువాతనికి వశవర్తి యనియు చెప్పి, వసువులం

జేరుట కాతని కనుజ్ఞ నొసగెను. ఇట్లే భీష్మ వృత్తాంతమును కవి బ్రహ్మ మహత్తర శిల్ప సమ్మితముగ స్వామి భక్తానుగ్రహము నందలి వివిధ దశల నిరూపించుచు స్వామి శరణాగతి గమ్యత్వమును స్థాపించుచు తీర్చిదిద్దినాడు.

ఈ వృత్తాంతమును పోతన మరింత భక్తి మార్గమున తీర్చి దిద్దినాడు. ప్రణాళిక మాత్ర మొక్కటియే. భీష్ముడు ధర్మజునకు వలసిన ధర్మసముచ్చయమును బోధించిన పిమ్మట నాతని స్థితి యిట్లున్నది. ఆత డాలాపములు మాని చిత్తమును మనీషాయత్త మొనర్చి హరి యందు నిష్కాముడై 'ధారణావతి యైన బుద్ధి'ని సమర్పించి పరమానందంబు నందెను. అటుపై స్వామిని తాను భిన్నకోణములలో దర్శించిన దృశ్యములందలి మహత్తర సౌందర్యము, విభూతి, భీష్ముని హృదయము నాకట్టుకొన్నవి. ఈ సందర్భమున నాంధ్ర భారతికే వన్నె పెట్టు మహత్తర రచనా విభూతిని పోతన ప్రదర్శించినాడు. "త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింపఁ, బ్రాభాత నీరజ బంధు ప్రభమైన చేలము పయిన్ రంజిల్ల, నీలాలక వ్రజ సంయుక్త ముఖారవింద మతి సేవ్యంబై విజృంభింప..." (భాగ-1-9-217) విజయునిఁ జేరు వన్నెలాడుగ; "హయరింఖా ముఖధూళి ధూసర పరిన్యస్తాలకోపేతమై రయజాత శ్రమతోయ బిందుయుతమై రాజిల్లు..." (218) నెమ్మోము గలవానిగ; "కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి గగన భాగంబెల్లఁ గప్పికొనఁగ, నురికిన నోర్వక నుదరంబు లోనున్న జగముల వ్రేఁగున జగతి కదల..." (221) లంఘించు వానిగ; 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః' అను తత్త్వమూర్తిగ; "పలుకుల నగవుల నడపుల నలుకల నవలోకనముల నాభీరవధూ మనముల తాలిమి కొలుకులు పాదలించు..." (223) ఘనునిగ స్వామి భిన్న భిన్న మూర్తులు భీష్ముని కపవర్గ ప్రదాయకములై పాతరలాడినవి. ఇప్పుడు భీష్ముడు సర్వజీవుల హృత్సరోరుహము లందు సంస్థితుడైన అంతర్యామిగ స్వామిని

భావించినాడు. ఆయన దర్శనమును మహాకవి యిట్లు వర్ణించెను."...
ఇట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్మయగు కృష్ణుని హృదయం
బున నిలుపుకొని నిఃశ్వాసంబులు మాని నిరుపాధికంబైన వాసుదేవ
బ్రహ్మమ్మునందుం గలిసిన..." (226). భారతములోవలె స్వామి
యనుజ్ఞ వేడుట, యుత్తరాయణ పుణ్యకాలమున రానున్న వసుప్రా
ప్త్యాశ వంటి స్వల్ప కామ్య స్పర్శయు లేని మహోదాత్త బ్రహ్మతత్త్వ
లీన స్థితి నిందు భాగవతకర్త దర్శించినాడు. మనీష నుండి మాధురీ
దర్శనమునకు, నటుపై నిరుపాధిక బ్రహ్మ తత్త్వమునకు తాను
కోరకయే స్వామి సన్నిధి మహత్త్వ ఫలితముగ భీష్ముడీ ప్రస్థానము
నొనర్చినాడు. ఒకవేళ నెట్టి కోరికలు తొలిదశ యందున్నను స్వామి
సన్నిధి వానిని నివారించి సమస్త లౌకిక స్పర్శలను దూర మొనర్చి
పరతత్త్వోన్ముఖముగ భక్తచిత్త వృత్తుల లయింపఁ జేయునట్టిది
స్వామి తత్త్వము. తన కుమారుల కిలా భాగమును స్వామి పంచి
యిచ్చునా? యని కోరిన కుంతి తుదకెట్టి పరిణామము నందినదో
గనించినచో నీ విషయము స్పష్టమగును. "యాదవులందుఁ బాండు
సుతులందు నధీశ్వర! నాకు మోహ విచ్ఛేదము సేయుమయ్య!
ఘనసింధువు చేరెడి గంగభంగి నీపాద సరోజ చింతనముపై ననిశంబు
మదీయ బుద్ధి సత్యాదర వృత్తితో గడియు నట్లుగఁ జేయఁగదయ్య!
యీశ్వరా!" (భాగ-1-8-198) ఇప్పుడింక స్వామి యీశ్వరుడే.
మేనల్లుడు, నీశ్వరుడు నన్న ద్వంద్వ స్థితి లేదు.

స్వామి యీ భక్తానుగ్రహ వృత్తాంతములలో నొక కొన్ని
యర్వాచీన మార్గమున నించుక విస్తృతి నందినవి. అందు శ్రీ అచ్యు
తుని వేంకటాచలపతిరావు రచించిన అంపశయ్య [22] గమనార్హము.
స్వామి భక్తానుగ్రహ వృత్తములందున్న శాంతరస ప్రాధాన్యమును
బట్టి వాని రంగ నిర్వహణ మెంత కష్టమో స్థలాంతరమున సూచిత

---

22. వివేకవర్ధనీ గ్రంథమండలి, వాణీ ప్రెస్, బెజవాడ. 1931.

మైనది. తత్ఫలితముగ నాటకీయ నిర్మాణ శిల్పము కుంటువడుట యన్న లోపమున కీ నాటకమును గురియైనది. నాటక కర్త చిత్తశుద్ధి, భక్తిభావము తప్ప నిందు గమనార్హమైన మెరుగు లేవియును లేవు. కథా వృత్తాంతమంతయు ప్రసిద్ధ మార్గమునే ఆశ్రయించినది. ఒక్క కల్పనము మాత్రము విశిష్టమై ప్రేక్షకుల దృష్టినుండి కృష్ణతత్త్వ పరిజ్ఞానమునకును, నటుల దృష్టినుండి అభినయావకాశమునకును తావలమై యున్నది. కథాక్రమమున భిన్నదశలలో భీష్మునికి భక్తి తన్మయత్వ ఫలితముగ స్వామి లీలలు దృగ్గోచరములై, యతడు వానిని స్తుతించి కీర్తించినట్లు చిత్రింపబడినది. ఇందు బాల్య లీలాదులతో బాటు సత్యారుక్మిణీ వైమనస్యములు, స్వామి యిబ్బందులు చిత్రింపబడుట వలన నాటకము నందలి యేకోన్ముఖత్వమునకు భంగము వాటిల్లినది. కథకు శాంత, వీరములు ప్రధాన రసములై భీష్ముని నాయకత్వ ముపాదేయము కావలసి యుండగా నాంది యందు శృంగార స్ఫోరక వర్ణన మొనర్చి దానిని సమర్థించుటకీ కల్పనము చేసినాడీ నాటకకర్త. మొత్తము మీద స్వామి గోపాలకిశోర, నవనీత చోర, మురళీ మోహన, విజయ సారథి, రాయబార, పరాత్పర బ్రహ్మ - మున్నగు ఘట్టముల యందలి లీలాదర్శన మార్గము రమ్య పద్యములచే ఆవిష్కృతమైనది. వస్తుస్వీకృతిచేత, రచన యందలి భక్తి ప్రతిపాదనముచేత నీ నాటకము స్వామి భక్తానుగ్రహ తత్త్వమునకు నిరూపకమై యున్నది. నూత్నాంశములు లేకపోయినను నీ ప్రసక్తి కర్హమగుట కిదియే కారణము.

ఉదంకుడు

స్వామి భక్తులు పలు తెరగులవారు. ఎవ్వరి కేది యర్హమో దానిని స్వామి యిచ్చును. ఆ యిచ్చుటలో తన గోప్తృత్వ శీలమును మాధుర్య లీలను స్వామి యెన్నడును వీడడు. ఉదంకుడు భారత భాగవతాదుల యందు ప్రసక్తి కల మహా పురుషుడు. ఆతనితో యాదృచ్ఛికముగ స్వామి కొక సమావేశము ఘటిల్లినది. ఈ యనుశీలనము

నకు సంబంధించి యీ సమావేశము స్వామి తత్త్వమునకు, భక్తానుగ్రహ రీతిలోని వైశిష్ట్యమునకు నిలయమై యున్నది. తిక్కన దీని ననన్యముగ చిత్రించినాడు.

అశ్వమేధ పర్వమున స్వామి పార్థునికి తత్త్వజ్ఞానమును స్థిరీకరించిన పిదప ద్వారకకు బయలుదేరి వెడలుచు మార్గ మధ్యమున నుదంకాశ్రమమును కాంచి 'వినయమొప్ప నతనిం గని' యథోచిత సత్కృతుడై యతని పాల నాసీనుడై యుండెను. మహర్షులు తన కడకు వచ్చినప్పుడు గాని, తాను వారికడ కేగినపుడు గాని స్వామి వినయమును చూపును. ఉదంకునికడ కేగి, ఆతని సత్కారము నంది యాతని నుద్ధరించుట స్వామి ధ్యేయము. ఉదంకు డింతకు పూర్వమే సర్వసిద్ధుల నార్జించుకొని యున్నవాడు. స్వామి తత్త్వమును, విభూతిని సిద్ధాంతరీత్యా అధ్యయన మొనర్చియున్నాడు. ఆతని సంస్కారమున నొక రజః ప్రవృత్తి యాతని జీవితమున నొక యుపరోధముగ భాసిల్లి యున్న వైనమును స్వామి యెఱుగును. దానిని పట్టి క్షాళన మొనర్చి యుదంకు నుద్ధరించుటయే యీ సందర్భమున స్వామి ఆశయము. ఉదంకుడు స్వామిని నిందాగర్భముగ నిట్లు ప్రశ్నించినాడు. "...సుఖస్థితిరాజుల వారి వారి విస్ఫురిత మహోధి రాజ్యముల చొప్పున నిల్పితె పక్షపాతితా దురితము లేని నీవు జనలోప విధాన విశారదుండవై" (అశ్వమేధ-3-29) యని ప్రశ్నించినాడు. ఈ ప్రశ్నముసందలి యాంతర్యము స్వామి గ్రహించియు 'నెఱుంగమి భావించి' 'యాతని యాననం బవలోకించి' యిట్లనినాడు. కౌరవ పాండవులకు సంధి చేయుటకై యుచితములైన మాటలాడితిని. గర్వపుఁ బల్కులతో నదల్చితిని, భయపెట్టితిని, దీనముగ మాటలాడితిని. నాతోఁబాటు భీష్మద్రోణులు, మునులు బహుభంగుల నొత్తి చెప్పిరి. కౌరవు లతిలోభంబున వంశ ధర్మమును పరిత్యజించి పాండవులతో యుద్ధము చేసి సబంధు పరిజనంబుగా మరణించి యుత్తమ లోకమునందిరి. పాండవ పక్షమున పాండవులు తప్ప మిగత

వారట్లే యైరి. ఇది గడవరాని కాల నియతి- అని స్వామి చెప్పు చున్నంతలో ముని యాగ్రహ పరవశుడై "...రోష కషాయి తంబులగు తారకంబు లుద్వృత్తఁబులు సేయుచు..." (32) మిథ్యా చారపరాయణుడైన స్వామిని శపింప పూనుకొనెను. స్వామి మునిని వారించి యాగ్రహ వృత్తి వలదని చెప్పి, తానల్ప తపంబున పోవు వాడను గానని యు, నట్టి తన్ను శపించుటకై దుష్కర తపమును, సంచితమైన బ్రహ్మచర్యమును కోల్పోవ వలదనియు జెప్పి తన తత్త్వమును ప్రవచించెను. అందులకు మున్నుదంకుడు తాను స్వామి చెప్పినది విన్న పిదప నుచితముగ నున్నచో శాపోన్ముఖమైన తన మనస్సును మరలించుకొందు ననెను. ఇట్లీ ఘట్టమున నింత స్వామియు నుదంకుని చెంత దోషివలె నిలిచి ప్రవర్తింపవలసి వచ్చినది. యోగ్యతాధికారములు కల్గి యుద్ధరణమున కర్తలైన వారి యెడ స్వామి యిట్టి యిబ్బందులను లెక్క చేయడు. స్వామి యిప్పట్లు ప్రవ చించిన తత్త్వము నందలి యంశములలో ప్రసక్తమైన భాగ మిట్లున్నది.

"తమము రజస్సు సత్త్వము నుదంక! మదీయ వశప్రవర్త మా
నములు మరుద్వసు ప్రభృతి నాకిచయంబు మదుద్భవంబు స
ర్వమునను నేను నిల్తు సుఖవాసత నన్ దగఁజెంది నిల్చు స
ర్వము విను మేన చూవె యపరంబు పరంబునఁ గల్గు తత్త్వముల్."
(39)

ఈ కథకుమూలమైన సత్త్వరజస్తమోగుణముల విన్యాసము, స్వామి సర్వాంతర్యామిత, పరాపరతత్త్వము నిందు స్థాపితములైనవి. వీనిని తన తత్త్వ, విభూతులతో పాటు స్వామి ప్రతిపాదించినపు డుదంకుడు స్వామియెడ ప్రసన్నుడైనాడు. స్వామి మహిమము తనకు శ్రుత పూర్వమే యనియు, గర్వాతిశయమున తానట్లు పల్కితి ననియు చెప్పికొని, స్వామి విశ్వరూప సందర్శన మాకాంక్షించినాడు. ఆననమును గాంచి భ్రూమధ్య మార్గమున మెల్లగా స్వామి యీా

భక్తుని హృదయమున తన తత్త్వమును చొప్పించినాడు. ఆతని కోర్కెను తీర్చుటకు విశ్వరూపమును చూపినాడు. విశ్వరూపమును దర్శించిన యుదంకుడు నిభృతస్వరమున స్వామి నిట్లు స్తుతించెను.

"పుండరీకాక్ష యీపుడమి యంతయును
భవత్పాదపంక్తి సంవ్యాప్తమయ్యె
నంబరం బెల్లను నావృతమయ్యె నీ
మహిత సముజ్జ్వల మస్తకముల
నంతరిక్షము దావకాద్భుత కుక్షిదే
శంబులచేత సంఛన్నమయ్యె
భవదీయ మహనీయ బాహార్గళా నిచ
యాపిహితములయ్యె నన్ని దిశలు
బహుచరణముల బహుశిరోభాగములను
బహుజఠరముల బహుభుజాప్రకరములను
దేవ యిట్లు సర్వంబును నీవయై త
నర్చెడిది నాదు కన్నులు మనంబుం దనిపె" (50)

ఈ స్తుతియందు స్వామి వైభవముతో పాటు గమనింప దగిన యంశ ముదంకుని హృదయ ప్రవృత్తి, భక్తి భావవిన్యాస మార్గము. అతని చిత్తవృత్తి స్వామి వైభవమును దర్శించి, అద్భుత భావమున స్తంభించి పోయినదే గాని యందు లీనమైనది కాదు. ఈ వైభవమైనను మనస్సునకు, నేత్రములకు తృప్తి నొసంగినది గాని హృదయ పర్యంతము వ్యాపించి తన్మయత్వము నీయలేదు. అట్లగుటకు కావలసిన యుత్తమ భక్తి సంస్కార మీ మహాపండితునికి, నీ తపస్సిద్ధునికి ఇంకను లభింపలేదు. అట్లు లభించు పర్యంతము స్వామి యీతని విడువడు. స్వామి సూచనపై నుదంకుడు కోరినవరము విచిత్రముగ నున్నది. తానున్నది మరుదేశము గావున జలసన్నిధి నాతడు కోరెను. స్వామి తన యథాపూర్వ లలితమూర్తిని ప్రదర్శించి, తన్ను తలచినపుడు జలము లభించునని చెప్పి వెడలిపోయినాడు. అటుపై జలార్థియైన

యుదంకుడు స్వామిని ప్రార్థించుట, శునకపరివేష్టితుడైన మలిన మాతంగు డొకడు వచ్చి తన శరీర స్వేద జలమును పానము చేయుమని యుదంకునకు జెప్పుట, ముని యలిగి యతనినదల్చి, యీ కపటవ్యాపార మంతయు స్వామి సంపాదితమని తలంచుట జరిగినది. సరిగా నదే సమయమునకు స్వామి వచ్చినాడు. మాతంగుడు దేవేంద్రు డనియు, నాతని స్వేద మమృతమనియు చెప్పి, యుదంకుడా మహావకాశమును జారవిడచుటలో తన బాధ్యత లేదని నిరూపించి, యటుపై తన్ను తలచినపుడు ఉదంక మేఘములు వచ్చి జలమును వర్షించి యాతని యశస్సును విస్తరించు నట్లు నిర్దేశించి వెడలిపోయినాడు. విశ్వరూపమును కాంచినను, స్వామి తనంతట తాను సర్వమున తానుందునని చెప్పినను, నుదంకునివంటి శాస్త్రజటిల బుద్ధుల కెట్టి ప్రయోజనమును కలుగదని స్వామి నిరూపించినాడు. స్వామి సర్వాంతర్యామి యను సిద్ధాంతమును బుద్ధికక్ష్యయుం దంగీకరించిన ఉదంకుడు మతంగునియందీ స్వామిని కాంచలేక పోయెను. ఇట్లు కేవలధిషణామూర్తులైన వారికి సమదర్శన తత్త్వమెట్లు భాసమానము కావలెనో నిరూపించుట యిందలి స్వామి భక్తానుగ్రహరీతి. భంగ్యంతరముగ నిది "...శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః" (భగవద్గీత 5-18) అను స్థితియందలి యాంతర్యమును నిరూపించు చున్నది. ఉదంకుని స్వామి లాలించెను. భయపడి నట్లుగ నాతని సన్నిధి నటించెను, విశ్వరూపమును చూపెను, అమృతము నీయదలచెను, కడ కాతని పరిధిని బట్టి కోరిన వరమును మాత్రమిచ్చెను. నిరంతరము స్వామి యిట్టి ప్రయత్నమును చేయుచునే యుండుననియు, స్వామి ప్రసన్నత వారి యోగ్యతను బట్టి యుండుననియు తెలుచున్నది. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని యను వారిలో నెవ్వరైనను స్వామి కభ్యంతరము లేదు. ఉత్తమశిఖరములను మెట్టింప చేయుటకు నిరంతరయత్నము చేయును స్వామి. ఫలస్థితి వ్యక్తుల సంస్కారమునకు చెందిన దేమై యుండును.

## అక్రూరుడు

ఈ శీర్షికయందు మిక్కిలి ముఖ్యముగ పరిశీలింప దగినది ఎట్టిన శమంతకోపాఖ్యానము. ఇది నరనారాయణతత్త్వ ప్రతీకగ స్వామి భక్తానుగ్రహమును సంపూర్ణముగ ప్రతిపాదించు ఘట్టము. ఎట్టిన దీనిని లోకోత్తరముగ తీర్చిదిద్ది " శ్యమంతక మణేర్హర్తా నరనారాయణాకృతిః " అనెడు (శ్రీ) కృష్ణాష్టోత్తర స్తోత్రవాక్యమునకు వ్యాఖ్యానప్రాయముగ నొనర్చినాడు.

త్రిమూర్త్యాత్మక తత్త్వప్రతీక, జ్ఞానరోచిర్మూర్తి యైన సూర్యదేవునిచే సత్రాజిత్తునకు మైత్రీభావముననను, తపఃఫలితముగను ప్రసాదింపబడిన శమంతకరత్నము నాధారముగ, హరివంశమున ప్రసక్త పాత్రలన్నిటి చిత్తవృత్తులు, దివ్యమానుషభావలీలలు, ప్రతిపాదింపబడి కథార్థనిరూపణమునకు భిత్తికగ వర్తించినవి. సత్రాజిత్తు మణిని ధరించి ద్వారకానగరమునకు వచ్చుచున్నప్పుడు యాదవులా దృశ్యమును కాంచి, తపనుడు స్వామి దర్శనమునకు వచ్చుచుండెనని భావించి స్వామితో చెప్పిరి. ఇట్టి భావము కల్గుటకు కారణమైన యాదవుల చిత్తవృత్తి, స్వామితోడి వారి సంబంధములు నీ యనుశీలనమున మిక్కిలి ప్రధానములైన యంశములు. యాదవుల చిత్తవృత్తిలోని అమాయికత మాధ్యము ప్రతిబింబించును. కన్నులు మిరుమిట్లు గొలుపు తేజము కనుపించినంత మాత్రమున నది భాస్కరుని తేజమే యని భావించుట, ఆ తేజము స్వామి తత్త్వము నందలి భాగమే యని తెలియకుండుట యాదవుల చిత్తవృత్తిలోని యంశములు. బహుఘట్టములందు స్వామి మహత్తును సాక్షాత్తుగ దర్శించియు వీరికి సమగ్రమైన యవగాహనము లభింప లేదు. సామాన్యప్రజల విషయమిట్లుండ యదువృద్ధులైన నందాదుల చిత్తవృత్తులు నిట్లేయున్నవి. అక్రూరుడు దేశాంతరగతుడైనపుడు దేశమున నెలకొన్న' దుర్భిక్ష పరిస్థితులకు కారణమును నందుడు నిరూపించుచు హరితో నిట్లు జెప్పినాడు. " ఆతడు దొలగిన నెంతయు భీతికిఁబట్టయ్యె నిట్లు పృథివి..." (హరి

వంశము -3-230 ) సాక్షాద్భగవానుడు నివసించియున్న ద్వారక యందుత్పాతములు జన్మించుటకు, దుర్భిక్షము పొడముటకు నక్రూరుని దూరస్థితి కారణమని భావించునంత మేరకే వారి బుద్ధి ప్రసరించినది. ఇక ప్రముఖులైన రాజ పురుషుల చిత్తవృత్తులు నిట్లే యున్నవి. స్వామి కోరినపుడు మణి నీయక యాతని వలన నెట్టి యెడరు పుట్టునో యని చింతించిన సత్రాజిత్తు స్వామిపై మిథ్యాప వాదము ను కల్పించినాడు. సత్యభామను వివాహ మాడదలచి విఫలులై యెవరి సామర్థ్యమును బట్టి వారు కక్ష తీర్చుకొనుటకు యత్నించిన వారు కృతవర్మాక్రూర శతధన్వులు. తుది ఘట్టమున మణి విషయమై స్వామి చిత్తశుద్ధినే శంకించి యలిగి, మిథిలకు పోయి, అక్కడ దుర్యోధనునికి గదా యుద్ధ కౌశలమును ప్రసాదించి, భావిభారత రణ రంగమున స్వామి కొక ధర్మాధర్మ నిర్ణయ సమస్య తెచ్చిపెట్టిన వాడు బలరాముడు. కథాంతమున అక్రూరుడు మణిని స్వామి కర్పించి నపుడు రామ కృష్ణ సత్యభామల చిత్తవృత్తులు సైతము మానవ కక్ష్యయం దంత ప్రశంసార్హములుగ లేవు. ఈ కథకు వలసిన మానుష వాతావరణమును భిత్తికా ప్రాయముగ చిత్రించుట కీ సందర్భ మాకరముగ హరివంశమున భాసించుచున్నది.

"బలదేవుడిది నాకుఁ బద్మనాభునకునుఁ
 బొత్తుల సొమ్మని బుద్ధిసేసె
సత్యభామ మదీయ జనకుని పడసిన
 యర్థంబు తను జేరునని తలంచె
నగ్రజుఁ బ్రియురాలి నాత్మఁజూడక కృష్ణుఁ
 డొక్కింతవడి కోర్కి నుదిలకొనియె
సకల యాదవులును సంస్పృహాలోకన
 స్మేరవిస్మయ రసస్తిమితులైరి..." (243)

ఇందు స్వామికి సైతము తాత్కాలికమైన స్పృహ కల్గుట గమ నార్హము. ఇది పూర్వోక్త ప్రకారము మానుష కక్ష్యకు చెందినది.

ఇందలి అంతర్యము స్వామి తక్కిన వారి 'నాత్మసంవాదక' యుండుట యని నిపుణముగ ధ్వనించినాడు ఎట్లన. మొత్తముమీద యాదవుల నందర నంతో యింతో ప్రసక్తుల నొనర్చి పట్టి చూచినదీ శమంతము. ఆయా సందర్భములందు కులమున నంతః కలహములు పుట్టకుండునట్లును, తన విశ్వశ్రేయోవాంఛ నిరూపిత మగునట్లును, భక్తానుగ్రహము నిరూపణమగు నట్లును స్వామి దీని నొక యసిధారావ్రతముగ నిర్వహించి దివ్య మానుష కృత్యలందు తన స్థితిని నిరూపించినాడు.

మహత్తరమైన సంపద నిచ్చుచున్న మణి రాజైన యుగ్రసేనునొద్ద నుండుట మంచిదని తలచిన స్వామి యాశయము శుద్ధమైనదే. ఏలన దేశమునందలి సర్వైశ్వర్యములు రాజునకే చెందుట నీతి. కాని, యిది సాధారణమైన సంపదకాదు. తపస్సిద్ధము. దానిపై స్వామికి కాని, యుగ్రసేనునికి కాని అధికారమెట్టిది? అడుగుట యెంతవరకు న్యాయము? ఇందు స్వామి కేవలము మణినే కోరినాడు కాదు. దాని నిచ్చుటచే వ్యక్తము కావలసియున్న సత్రాజిత్తు సౌజన్యమెట్టిదో తెలియగోరినాడు. అతడిచ్చుటకు నిరాకరించుటయే గాక స్వామిపై మిథ్యాపవాదమును గూడ వ్యాపింపజేసెను. స్వామి దాని నెట్లో తొలగించుకొనినాడు. ప్రసేనజిత్తు మరణము, అర్వాచీన కాలమున సత్రాజిత్తు మరణము మణి కారణముననే సంభవించినవి. మరి సర్వ రక్షాప్రదమై, యైశ్వర్య దాయినియైన శమంతము మృత్యు హేతు వగుట యెట్లు? 'అదియును నశుచియైన వాడు దాల్చిన దన గుణంబులు నూపక ప్రాణాపద నొనర్చు' (177) ననుటయే యిందులకు సమాధానము. పూజార్హమైన దానిని వేట కేగుచు నలంకారముగ ధరించుట ప్రసేనుని యశుచిత్వమునకు కారణము. మరి సత్రాజిత్తు విషయమున? స్వామి యడిగినపుడు దానిని సమర్పణ బుద్ధితో నీయకుండుటయే అశుచిత్వము. ఆ లోపము పుత్రిక నిచ్చి

మ్రొక్కినను తీరునది కాదు. కథా వశమున ధ్వనింపబడిన యీ యభిప్రాయము తరువాతి అనుశీలనమునకును దోహదకారి యగును. తాత్పర్యముగ నీ మణి విషయమై స్వామి కాంతర్యమున నెట్టి ప్రీతియు లేదనియు, భిన్న సందర్భములందు భిన్న మార్గముల నీ ప్రీతి నాతడు బాహ్యముగ వ్యక్తము చేయుచు, భిన్న పాత్రల మనస్తత్వములకు గీటురాయిగ నీ మణి నుపయోగించి, కడకీ సర్వ వృత్తాంతమును తన భక్తానుగ్రహమునకు ప్రతీకగ నుపయోగించె ననియు వ్యక్తమగుచున్నది. మొదట లీలగా ఈ ఆంతర్యముతో మణిని కోరిన స్వామి, సత్రాజిత్తు సమర్పించి నపుడును, అక్రూరుడు సమర్పించి నపుడును వలదనుటలో నిదియే స్ఫురించును.

సత్యా వివాహ సందర్భమున అసంతృప్తులై అవకాశము వచ్చి నపుడు సత్రాజిత్తుపై కక్ష తీర్చుకొనవలెనని యత్నించిన ప్రధాన పాత్రలు మువ్వురీ కథయం దున్నారు. అక్రూరుడు, కృతవర్మ, శతధన్వుడు. కృతవర్మ స్వామి కెన్నడును నమ్మిన బంటు కాలేదు. కౌరవ పక్షమున చేరినవాడు. శతధన్వుడు సత్రాజిత్తును చంపిన పాపము నకై స్వామిచే నిహతుడయ్యెను. ఇక మిగిలినది అక్రూరుడు—ఈ కథ యందొక సంకీర్ణ సృష్టి. ఇతనిని నరత్వమునకు ప్రతీకగ నొనర్చియే స్వామి నారాయణ తత్త్వము, భక్తానుగ్రహము నిరూపితములైనవి. ప్రస్తుత కథా వృత్తాంతమును వదలి చూచినచో నక్రూరుడు కేవల భక్తుడు. కంసుని పంపున వ్రజమున కేగి స్వామి కటాక్షము వలన నాతని దివ్యస్వరూపము గాంచిన మహనీయుడు. మధురకు వచ్చిన పిదప స్వామి యాదేశమున హస్తినకు పోయి స్వామి ప్రతినిధిగ వ్యవహరించినవాడు. ఆ యీ విషయముల వలన నాతని యౌన్నత్య మెట్టిదో స్పష్టమగును. స్వామి విశ్వరూప దర్శనమును కటాక్షించియు ఈ పాత్ర నొక సమగ్ర స్థితికి కొనివచ్చుటకు శమంతక వృత్తాంతము నాధారముగఁగొని ప్రవర్తింపవలసి వచ్చినదన్న మాట. తమ కిత్తు నన్న కన్యను స్వామి కిచ్చిన సత్రాజిత్తుపై వీరు కినుక నంది, యొక

నిర్ణయమునకు వచ్చిరి. "...విచార మేమిటికిఁ దుచ్ఛున్ వీని దునిఁగించి యొందు నలభ్యంబగు మానికంబుఁగొని సంతోషింత మంతర్గతిన్" (201). ఇట్లనుకొనిరే గాని కార్యరంగమున దుముకుటకు కావలసిన ధైర్యము స్వామి కారణముగ నెవ్వరికిని లేకపోయినది. శతధన్వుడే తెగించి సత్రాజిత్తును చంపి మణిని గైకొనినాడు. స్వామి యీ వృత్తాంతమును తెలిసి తనను జంప నిశ్చయించెనను వార్త విన్న శతధన్వుడు భీతుడై తన మిత్రుల కడ కేగి, పూర్వము వారొనర్చుకొనిన సమయమును జ్ఞప్తి చేసినాడు. కృతవర్మ రామకృష్ణుల తోడి వైరమునకు చాలనని చెప్పి తప్పుకొనెను. అక్రూరుడు (ఇంతవరకు భాగవతోత్తమునిగ పేరందియున్న వాడు) ఇట్లనెను.

"అసురీనాగ మృణాళ ఖండనము, మహేంద్రాంతఃపురీ కర్ణప
త్ర సమున్మీలన మూలశిల్పి, కుముద ధ్వాంతార్క బింబంబు, దు
ష్ప్రసహుం డెవ్వని చక్రమట్టి హరికిం బ్రత్యర్థియై నిల్వఁగా
వశమే యెంతటి వానికిన్ నిరతు నిర్వైరస్యముం బూనఁగన్."
(207)

తానతని శరణాభిలాషకుడననియు, దోషాచరణమునకు పూనుకొనజాలననియు, వెడగ్గ తొల్లి తాను వీరి తలపునకు కలిసితి ననియు— నక్రూరుడు చెప్పెను. ఇందాతడు స్వామి మహాత్త్వమును (పూర్వ దర్శనము వలన) సంపూర్ణముగ గుర్తెరిగినట్లును, పూర్వాకృతమైన తన యుపరాధమును శతధన్వునితో సహకరింపకుండుటచే పోనాడ దలంచినట్లును వ్యక్తమగుచున్నది. వాదమునకై యిది యంతయు నిజమనియే భావించినను అనంతర కథావృత్తాంత మందుల కుపస్కారకముగ లేదు. ప్రాణభీతితో దేశమును త్యజించి వెడలుచున్న శతధన్వుడు మణి నక్రూరున కిచ్చి యిట్లనెను. 'నీవీ యులభ్య రత్నంబును దాఁప వలయుఁ బ్రాణంబుపయి వచ్చునంతటి పోరామియుండును నెవ్వరికి నెఱిఁగింప కుండునది' అని యొడంబరచి యతని చేతి కిచ్చినాడు. ఇందు శతధన్వుని సంకల్పమేమి? యని పరిశీలించిన నా మణి కృష్ణు

నికి చెందకుండుటయే యాతని యాంతర్యమని తెల్లము. ఇది యొక పాపచింత. అందుచేతనే స్వామిచే నతఁడు నిహతుడయ్యెను. బయలుదేరి వెడలునపు డిట్లగునని యాత డూహింపక అక్రూరునుండి వాగ్దానము నందినాడు. తాను మరణించిన యనంతర మా మణి యెవరి కడనున్న నాతని కేమాయె! అనగా బ్రతికి బట్ట కట్టి మరలివచ్చి మణిని పొందవలెననియు, అంత దనుక నక్రూరుడు దీనికి రక్షకుడై యుండవలెననియు మాత్రమే యాతని కోరిక. ఈ ఘట్టమునుండి యక్రూర పాత్ర యందలి నరసంకేతము ప్రారంభమైనది. తత్క్షణ మా మణిని కొనిపోయి స్వామి కిచ్చుట యీ 'భక్తుడు' చేసి యుండవలసిన మొదటిపని. అట్లు చేయక మిత్రవాక్య పరిపాలనా దీక్షితుడై యున్నను, శతధన్వ మరణానంతరమైన నట్లు చేయవలసి యున్నది. ఇందులకు రెండు కారణములు: శతధన్వుడు మరణించినట్లే తానును మరణింపవచ్చును గదా! రెండవది సర్వాంతర్యామి యైన స్వామి శ్యమంతము తనకడ నున్నదని యూహింపలేనంత అశక్తుడా? ఆయన దివ్యత్వ మెట్టిదో తానింతకు మున్ను ప్రత్యక్షముగ చూచెను, శతధన్వుని కుపన్యసించెను కూడ. ఇక్కడ అక్రూరుని పాత్రలో నున్న భక్తి భేషజము (Devotional Hypocrisy) వ్యక్తము. స్వామి తన జోలికి రాకుండ యజ్ఞయాగాది క్రతువులు, దానధర్మములు చేయుచు, మణివలన వచ్చిన సర్వధనమును సన్మార్గమున వెచ్చించుచు, ద్వారక యందలి సుస్థితి కితడే కారణభూతుడని యాదవులందరు విశ్వసించు నంతటి యుదాత్త మార్గమున నీతడు ప్రవర్తించినాడు. అనగా తన దోషమును కప్పిపుచ్చుకొనుటకై సద్ధర్మాచరణమును కవచముగ నొనర్చుకొనెను. అంత మాత్రమున స్వామి తత్త్వవిలసనము యొక్క పరిధిని తప్పించుకొని పోలేక పోయినాడు. స్వామి యితనిని శరణాగతు నొనర్చుటకు చక్కని వల పన్నినాడు. అక్రూరుడు దేశమున లేని సమయమున పుట్టిన ఉపద్రవము లాధారముగ, యదువృద్ధుని ఆదేశమును పురస్కరించుకొని యక్రూరుని దేశమునకు

రప్పించి, సకల యాదవ సమక్షమున 'దానపతీ' (ఎంతటి హేళనము! నీకు చెందని మణివలన వచ్చిన ధనముతో దానములు చేయువాడా యని భావము) యని సంబోధించి, యటుపై నాతని కపట నాటకమును, శరణాగతి దూరమైన యజ్ఞ ధర్మ సత్కర్మా చరణమును ముగింప దలచి యిట్లు చెప్పినాడు. ఈ సందర్భమున స్వామి యవహేళనము, చావగొట్టి చెవులు మూయు వాక్చాతుర్యము ఎట్టిన అనన్యముగ పోషించినాడు.

"సకల జగంబులందుఁ గడు సారమునందగు నుజ్జ్వల చ్ఛ్యమం
తకమణి నీకునిచ్చె శతధన్వుఁడు నీవును డాఁచి నాఁడ వి
య్యకుటిల కర్మ ముర్వీఁగల యంతటికిన్ హిత మేను నాత్మ దీ
నికిఁ గడుసింతసిల్లితిమి నిక్క మెరుంగుదు మింత యెప్పుడున్."

(236)

అది మా యర్థమైనను, నీ యొద్ద నున్న విషయమును మేమెరింగియును, నీ మహత్త్వము బహుమతి క్షమమగుట వలన నేమియు ననలేదు. ఇప్పుడు రత్న విషయమున రౌహిణేయునకు కల్గిన యవిశ్వాసమును పోనాడుటకై యొక్క మారు చూపుము- అనెను. పై జెప్పిన వ్యంగ్యముతోపాటిందు మహార్థస్ఫూర్తి యొందున్నది. నీవు దీనిని దాచుట యుర్వికి హితము. అనగా నీ వృత్తాంతమును లోకమునకు సమర్పణ బుద్ధిని నేర్పుటకు నే నుపయోగింతును. నీ మహత్త్వ మీవరకే నాబాల్యమున దివ్య దర్శన మందినది కావున బహుమతి క్షమము. నీతోబాటీ బలరాముని, సత్యభామను నుద్ధరింపవలసి యున్నది. ఇట్టి యర్థముల స్ఫురించుచు స్వామి మాట్లాడినప్పుడు శ్వఫల్కుని తనయుడు పూర్వము నిర్మించుకొన్న యడ్డుగోడలొకటొకటే నేల గూలినవి. అచ్ఛమైన శరణాగతి తత్త్వము వానికి భాసించినది. నిశ్శంశయముగ స్వామి పాదముల చెంత నర్పించినాడు దానిని. ఇప్వ డక్రూరపాత్ర నిజమైన యకుటిల తత్త్వమునకు ప్రతీకగ రూపొందినది. స్వామి బలరామునికి కాని, తనకు గాని, సత్య

భామకు కాని చెందవలసిన యీ మణి యన్యులది కాదని చెప్పి సక
కాల శుచిత్వము, సుభృత బ్రహ్మచర్యము లేని తమ కి
యోగ్యము కాదని (లౌకికముగ), నిరూపించి (ఇప్పుడు) సర్వగు
సంశుద్ధ భావుండైన అక్రూరునకే దాని నిచ్చెను. ఇట్లీ కథ స్వా
భక్తానుగ్రహ తత్త్వమును మిక్కిలి సూక్ష్మ వ్యంగ్య మార్గము
నిరూపించినది. అక్రూరుడు పరత్వము నందలి కపట భక్తి భా
మునకు, చిత్తశుద్ధిలేని సాంప్రదాయిక సత్కర్మాభిరతికి ప్రతీక
స్వామి దానిని ఛేదించి సర్వ సమర్పణాత్మక శరణాగతిని నేర్పె
దివ్యమానుష చిహ్నము.

## ఘంటాకర్ణుడు

స్వచ్ఛమైన భక్తితో నిండిన చిత్తవృత్తి యెంత యసంస్కృ
మైనను నట్టి భక్తుల యారాధనా మార్గము లెంత మొరటు
నున్నను స్వామి లెక్కచేయడు. అట్టివారిని సైతి మాదుకొని వా
అసంస్కృత లక్షణముల పునీత మొనర్చి దివ్యపదవీ భాజనుల నొ
ర్చును. ఇట్టి యర్థమును నిరూపించు మహత్తర ఘట్టము నాచ
సోమనాథుడు రచించిన ఘంటాకర్ణ వృత్తాంతము. అలంకృతమై శ
ప్రయోగ వైచిత్రితో నిండిన సోమనాథుని విశిష్ట శైలిలో పా
ఘట్టమున ఆ మహాకవి ప్రదర్శించిన భక్తిభావ చిత్రణాశక్తి గణ
నార్హమై యున్నది. స్వామి శివుని గూర్చి తపము చేయుటకు వెడ
గంగానది యుత్తరతటి యందున్న కాంతారమున నియమోన్మీ
న్మనః పద్ముండై, భంగాపేత పయోధివలె, ననిలాపాయ ప్రదీపము
వలె తపోవ్యాసక్తుడై యున్నప్పుడు, నిశాసమయమునసీ వృత్తాంతము
ప్రవర్తిల్లినది. నిశాసమయ మసురుల విజృంభణమునకు యోగ్య
మైనది. ఈ ఘట్టమున రసవ్యవస్థకు ఇది యుపస్కారకమై యుండును
ఇంకొక విచిత్రమైన రసభావ వ్యవస్థ యున్నది. అదియు నీ కథ
యందలి వ్యంగ్య మహార్థమున కుపస్కారకమై యుండుట విశేషము
పిశాచద్వయము వేష చేష్టాదికము బీభత్సము. వారి హృదయ గా

భక్తి భావము, స్వామి సన్నిధి, శాంతమున కాకరము. ఇట్టి పరస్పర భిన్న రసభావముల సన్నికర్ష నిందొక మహా శిల్పముగ సోమన తీర్చి దిద్దినాడు. వేటకై పిశాచబృందము బయలుదేరి వచ్చిన దృశ్యము పరమ వాస్తవికమై యున్నది. వారి నాయకుల చిత్రణమునందు బొమ్మ కట్టించు మహత్తర రూప చిత్రణా శిల్పము భాసించినది.

"పిరిగొన దాల్చు నెట్టెముగఁ బ్రేవులు చుట్టి కపాల పాత్రలో
విరియ గలంచు క్రొమ్మెదడు వెండ్రుక లేరి తొలంగ వైచు నె
త్తురు చవిచూచుఁ గండలు తొఘూయని క్రాయుఁ ద్రిశూల ధారలం
జెరివిన ప్రేతమాలికలఁ జిమ్ము పిశాచ విభుండు వేడుకన్."

(2-124)

అతని సోదరుడును నిట్లే యుండెను. వారిని కాంచి స్వామి ఘనతర విస్మయము నందినంత వారు రుధిరమును చవిచూచి స్వామికి సమ ర్పించి సహస్ర నామముల పేర్కొని యిట్లు నుతించిరి.

"ఓ నారాయణ, యో మురాసురహరా, యో భక్త చింతామణీ
యోనీలాంబరవర్ణ, యోగుణనిధీ, యోలోక రత్నామణీ,
యోనీ రేరుహ పత్రనేత్ర, కృపనా యుల్లంబులో నుండవే
యోనావే భవబంధముల్ చెరుపవే యో దేవకీనందనా."

(129)

పై వర్ణనమునందలి బీభత్సమునకును, నీపద్యమునందు జాలువారు చున్న భక్తి భావమునకును నెంతటివైరుధ్యమో యంతటి సమన్వయము. ఆ సమన్వయమే స్వామి యునికి. వారు స్వామిని మరింత దగ్గరగ దర్శించి యాతని దివ్యసన్నిధిలో దమ పైశాచిక ప్రవృత్తి కతీతమైన మహత్తర వాత్సల్యసంస్కారమును పొందిరి. అది యే నందయశో దాదులలోనో భావింపదగిన మార్గమున జాలువారినది. స్వామిని గూర్చి కొన్ని ప్రశ్నలడిగి, భయంకరా రణ్యమున నంతటి సుకుమారులు చరింపరాదని చెప్పి, యగ్రజుడైన ఘంటాకర్ణు డిట్లనెను: (ఈ పద్యము నందు ఘంటాకర్ణుడు తనకు తెలియకయే స్వామి సర్వతత్త్వమును ప్రవ

చించినాడు. వాని వాక్కున నాశ్రుణమున ప్రద్యుమ్న వృత్తాంతము. స్వామి తపస్సు, మున్నగు సర్వాంశములు పరమరమ్యమైన వస్తుధ్వని మార్గమున బాహిరిల్లినవి. ఇది సోమనాథుని వ్యంగ్యరచనా శిల్పమునకు, పరమార్ధ భావసంపన్న రచనావైభవమునకు తార్కాణము.)

"చేతో జాతుఁడు నీవు నేమగుదురో! శీతాంశు చూడామణిన్
బ్రీతుం జేయఁ దపంబుఁ జేసెదో! విచారింపంగ నట్లేలగున్
పాతాళంబును నేలయుం దివియుం బాలించు సిద్ధుండవో
నాతండ్రీ! నను నేల వచ్చిన జగన్నాథుండవో! చెప్పవే." (133)

స్వామి తన్నుతాను పరిచయ మొనర్చుకొనెను. పిమ్మట నాతడు ధ్యానసమాధిగతుడై స్వామిరూపము నంతర్బహిః కత్యాలం దొకటిగ నే దర్శించి భక్త్యావేశమున నిట్లు స్తుతించెను.

పుండరీకములతోఁ బురణించుగన్నులఁ
గారుణ్యమనుఁ దేనెఁ గడలుకొనఁగ
మందార శాఖతో మలయు జాలెడుగేలఁ
బాంచజన్యంబనుఁ బండు మెరయ
నుదయాద్రి తటముతో నుద్దించు నురమునఁ
గౌస్తుభంబను దివాకరుఁడుదోఁప
నాకలోకంబుతో నవ్వు పాదంబున
నాకాశనది యను నమృతమొప్ప
నమృతధారాధరము మాటలాడినట్లు
భాగ్యదేవత రూపుఁ జేపట్టినట్లు
లలితగతినున్న సద్గుణాలంకరిష్ణుఁ
బొడగంటి భవముల పీడుకొంటి. (146)

ఈ యానంద స్థితియందు విప్రమాంసమును స్వామికి నివేదన మొనర్చు పర్యంతము పోయినది వారి భక్త్యైకతత్త్వము. స్వామి వారికి మహీదేవుని చంపు టనుచితమని చెప్పి, తన కరమున నిమిరెను. ఘంటాకర్ణుడు దివ్యరూపము నిట్లు పొందెను. "తామర రేకులుఁగన్నులం

సామజహస్తములు తొడలు శశిమండలమున్ మోమును నొరపును నొడలును సొబింపగ దివ్యరూప సుందరుడయ్యెన్" (152) (ఈ పద్యమునందలి దివ్యరూప విభవముతో పాటు, పద్యరచనావేగము వలన సురూప ప్రాప్తి యొక్క వేగమును సూచించు ఛందశ్శిల్పము మనోహరము.) స్వామి ఘంటాకర్ణునికి దివ్యరాజ్యపదమునిచ్చి యటుపై పరమాత్మని కూడునట్లును, అతని తమ్ముడైన కాలాంతకుని కిరెండు ఘట్టముల నగ్రజ సాహచర్యమును, నియమించెను. మరియు వరము కోరుమన, ఘంటాకర్ణుడు స్వామి నిత్యధ్యానమును కోరెను. ఇట్లు స్వామి పైశాచిక భక్తు లుద్ధరింపబడిరి. ఇందు స్వామి స్పర్శ లేనంత కాలము మానవజీవితము బీభత్స ప్రాయమైన పిశాచలోకమనియు, నందలి యంతస్తత్త్వము స్వామి ప్రశాంతమైన స్పర్శచే నుద్ధరింపబడినపుడు దివ్యలోకమనియు, పూర్వోక్త రసవ్యవస్థచే ధ్వనింపబడినది.

## కుచేలుడు

పోతనామాత్యుడు రచించిన కుచేలోపాఖ్యానము భక్తానుగ్రహ కథలలో నుత్తమమైనది. కుచేలుడు బాల్యమున గోవిందసఖుడు. ధర్మ బద్ధమైన జీవితమును నడుపు చున్నవాడు. స్వామి దర్శనము చేయుటకు మున్ను "మానధనుడు విజ్ఞానరాగాటి విరహిత స్వాంతుడు శాంతుండు ధర్మవత్సలుడు ఘనుడు విజితేంద్రియుడు, బ్రహ్మవేత్త" (భాగ-దశమోత్తర- 75-961) యై ఉత్తమ వ్యక్తిత్వమును కల్గినవాడు. స్వామి దర్శనము వలన నాతడు ప్రత్యేకముగ పొందవలసినదియు లేదు. ఏలన, బాల్యమునుండియు స్వామితో దర్శన, స్పర్శన, క్రీడా సహాధ్రవణాది మార్గముల సన్నిధిని సౌభాగ్యమంది యున్నవాడు. బాల్యమున వారు గురుసేవాపరాయణులై యున్నపుడు వారి నడుమ ప్రవర్తిల్లిన మైత్రీ నిరూపకములైన అనేక వృత్తాంతములను స్వామియే వారి సమావేశఘట్టమున జ్ఞప్తికి తెచ్చి, స్నేహబంధమన నెంత పవిత్రమైనదో నిరూపించినాడు. ఒకప్పుడు వారు గుర్వాదేశమున

ప్రవర్తించిన తీరు స్వామి హృదయమున చెక్కుచెదరని మధురస్మృతి. గురుపత్ని నియోగమున వారింధనార్థ మరణ్యమున కేగినపుడు, వర్షాంధకారములవలన బాధపడి,

"బయలు నొందియు బెనుమిఱ్ఱి పల్ల మంబు
రహితస్థలంబు లేర్పరుపరాక
యున్న యత్తఱి మనము నొండొరుల చేతు
లూఁతఁగాఁ గొని నడుచుచునుండు నంత." (996)

సూర్యోదయమగుట, దీక్షతో గుర్వర్థమును నెరవేర్చిన కృష్ణకుచేలురను సాందీపని విస్ఫుటఘనబంధు దార బహుపుత్ర విభూతి జయాయు రున్నతులు గలుగున ట్లాశీర్వదించుట జరిగినది. ఈ యాశీస్సు కుచేలు నెడ సంపూర్ణముగ ఫలవంతము కాలేదు. తన జీవితము దుర్భర దారిద్ర్యమునకు నిలయమై యుండ కుచేలు డనుభవించిన బాధ లిట్లున్నవి. పతివ్రతాతిలకమైన యతని భార్యకడ నాతని పుత్త్రులు, పుత్రికలు "దుస్సహ దరిద్ర పీడచే గడునొచ్చి పెదవులు దడుపుచు శిశువు లాకటి చిచ్చుచే గృశించి మలమలమాడుచు మానసం బెరియుంగ బట్టెఁడోరెము మాకుఁ బెట్టుమనుచు..." (962) వేడుకొనుచున్న దృశ్యమాతని దారిద్ర్యమునకు చిత్రణము. దీనిచే కుచేల పత్ని మాతృహృదయము దుఃఖమును నిలువరించుకొన లేకపోయినది. స్వామి దర్శనమార్గము నామెయే సూచించి పంపినది ఆమె. కుచేలు నిట్లంపునపు డాతడు స్వామిని దర్శించి తమ దారిద్ర్యమును పోనాడుటకు వలసిన కటాక్షమును పొందవలయునని ఆశించినది. కుచేలునికి సంబంధించినంత వరకీ ద్వారకాగమనము స్వామి సాక్షాద్దర్శన హేతువు మాత్రమే. ఒక దశయం దాత డిది ఇహపరసాధనమని భావించినను, నిందలి యైహికాంశము కడముట్ట నెరవేర్చుట నంతటి ప్రమితము స్వామి దర్శనానంతర మీ సఖ్య భక్తుని మనస్సున నిలిచియున్నది కాదు. అనగా స్వామి దర్శనమువలన పొందిన తన్మయత్వము, సన్నిధివిశేషము మాత్రమే కుచేలుని దృష్టిలో ప్రధాన

ములు, స్వామి నైశ్వర్యమునకై అర్థించుట యను సద్యః ప్రయోజనము నాతడు నెరవేర్చనే లేదు. ఇది కుచేలుని యుత్తమ సంస్కారమునకు, స్వామి సన్నిధియందలి మహాత్తర విభూతికి చిహ్నము. కష్ట్యాంతరములు గడచి మనంబు బ్రహ్మానందంబునంద కుచేలుడు స్వామి యీ దివ్యస్వరూపమును దర్శించి తరించినాడు.

"ఇందీవరశ్యాము వందిత సుత్రాముఁ
కరుణాలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామిత మందారు
సురుచిర లావణ్యు సురశరణ్యు
హర్యక్ష నిభమధ్యు నఖిల లోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిప యానుఁ గౌశేయ పరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను
మకరకుండల సద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగర విహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధి చంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు" (975)

ఇందీతడు దర్శించి తరించిన స్వామి స్వరూపము తనకు బాల్యమున పరిచయమున్న నాటి రూపము కాదు. ఈ దర్శనముచే పులకితుడైన కుచేలుని స్వామి యొక్క భక్తు నాదరించినట్లుగ నాదరించలేదు. బాల్యమిత్రునికి సహజమైన స్నేహార్ద్ర చిత్తవృత్తి యొకవైపు, విప్రార్హమైన పూజా సత్కారము లొకవైపు స్వామి ప్రదర్శించినాడు. కనక కలశమునందలి జలముచే కాళ్ళు కడిగి పూజించి, తన తల్పముననే కూర్చుండ నియమించి, పరిచర్య లొనర్చి విప్రోచిత గౌరవము నాతని కిచ్చినాడు. బాల్య వృత్తాంతముల స్మృతికి తెచ్చి, కుశల ప్రశ్నాదుల నడిగి, తన యింట విందు నొనర్చి మిత్ర ధర్మము నెరపినాడు. నిజమునకీ రెండు స్థితుల కతీతమైన బ్రహ్మానంద

స్థితిలో, తానిన్ని యేండ్లుగ జరుపుచున్న జప హోమ యజ్ఞాద్యనుష్ఠానముల ధ్యేయమూర్తిగ స్వామిని దర్శించి తరించినాడు కుచేలుడు. ఇంతకు పూర్వమాతడొనర్చియున్న సర్వసాధనల ఫలితమో యనునట్లీ సాక్షాత్సన్నిధి కుచేలునికి దారిద్ర్య ఫలితముగను, గురూపదేశ సమానమైన భార్యావాక్కు వలనను లభించినది. తన బాల్యసఖుడైన విప్రునికీ మహత్తరానంద స్థితిని ప్రసాదించుట యీ వృత్తాంతమునందలి స్వామి సంకల్పములలో మొదటిదిగ భాసించుచున్నది. అటుపై వారిరువురి నడుమ నొక చిన్న సంభాషణ స్వామి పరతత్త్వ నిరూపకమై ప్రవర్తిల్లినది. స్వామి గురు మాహాత్మ్యమును కీర్తించినాడు. "తివిరి యజ్ఞాన తిమిర ప్రదీపమగుచు నవ్యయంబైన బ్రహ్మంబు ననుభవింప భరిత సత్త్వుండు సత్కర్మ నిరతుండతుల భూసుర శ్రేష్ఠుండనఘుండు బుధ్యవతారుండు." (990) అటుపై స్వామి తన తత్త్వమునందలి కొన్ని ప్రత్యేకాంశములను ప్రస్తుత సందర్భమున కుపయోగము లగునట్లు చెప్పినాడు. ఇవి కుచేలుని మనస్సునన్నున్న సందేహములను తీర్చుటకు నుద్దిష్టములై యున్నవి. స్వామియే సకల వర్ణాశ్రమముల వారికి పరమ గురుడయ్యును, గురుభజనంబు పరమ ధర్మమని లోకమునకు నిరూపించుటకై యాచరించిన వాడు. సకల వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థను స్థిరీకరించుచు, భూసురులకు ముఖ్యుడై సర్వాంతర్యామియై దేశకల్పమును నెరపువాడు స్వామి. "అట్టి వర్ణాశ్రమంబుల యందు నర్థ కుశలులగు వారు నిఖిలైక గురుడనైన నాదు వాక్యంబులచే భవార్ణవము వెలుచ దాటుదురు మత్పదాంబుజ ధ్యానపరులు" (993). అందు తనకు ప్రీతియైన మార్గము (ప్రస్తుతము కుచేలుని కన్వయింప దగినది) గురుజనంబులను పరమభక్తి సేవించుట. ఈ ధర్మమును కుచేలుడు స్వామితోపాటీవరకే నెరవేర్చి యున్నాడు. కాగా లోకైక గురుడైన తన్ను పరమ భక్తితో కుచేలుడింకను సేవింపవలసి యున్నదను విషయమును స్వామి యీ యుపన్యాసమున లీలగ స్ఫురింప

చేసినాడు. అట్టి యవకాశమును కుచేలునికి కలిగించుటకే దారిద్ర్య మువకరించినది. మానవుడు ప్రయత్నించి పొందు నుపదేశముల కతీతములైన కొన్ని దివ్యోపదేశములు జగద్గురువుచే ప్రసాదింప బడును. ఇవి యొక్కొక్కరి కొక్కొక్క మార్గమున భాసించును. అప్పుడు పొందిన యీ దివ్యోపదేశము వారి సంతరణ మార్గమై యుండును. గజేంద్రునికీ యుపదేశము మృత్యుముఖమున సిద్ధించినది; పరీక్షిత్తునకు ప్రాయోపవేశమున; ద్రౌపదికి మానభంగ వేళ; భీష్మునికి శరతల్పగత స్థితియందు-ఇట్లెన్నెని యుదాహరణము లున్నవి. ప్రస్తుత మీ విప్రునికి దారిద్ర్య మట్టి మహోపదేశ హేతువైనది. ఆ యుపదేశము భార్య మాటల యందు బొడమి, స్వామి చర్యలందు కడముట్టినది. ఆ ఘట్ట మిట్లున్నది. గురు తత్త్వము ప్రస్తావనము వచ్చినపుడు, స్వామియే జగద్గురువన్న విషయమును చెప్పి తక్కిన విషయ మంతయు లోకవిడంబనార్థమే గదాయని సాభిప్రాయముగ ప్రశ్నించిన కుచేలుని, స్వామి సుందస్మిత వదనారవిందుడై అతడు తన కేదేని యుపాయనంబు తెచ్చెనా యని సాభిప్రాయముగ నడిగి నాడు. ఇందొక మనోహర వ్యంగ్యార్థ స్ఫూర్తి ప్రారంభమైనది. తనచే నింతకు మున్ను సూచింపబడిన తన జగద్గురు తత్త్వ మెట్టిదో స్వామి ప్రత్యక్షముగ కుచేలునికి నిరూపింపనున్నాడు, అందులకీ మందస్మితము ప్రాతిపదిక. కుచేలుడు తనకు తెచ్చిన యుపాయనం బెంత లేశమాత్రమైనను పదివేలుగ నంగీకరింతుననియు, అట్లుగాక తన యందు భక్తిలేని నీచవర్తనులు హేమాచలతుల్య పదార్థములు సమర్పించినను నవి తనకు ప్రీతికరములు గావనియు స్వామి చెప్పెను. "దళమైన పుష్పమైనను ఫలమైనను సలిలమైనఁ బాయని భక్తిన్ గొలిచిన జనులర్పించిన నెలమిన్ రుచిరాన్నముగ నే నేను భుజింతున్." (1006) అని చెప్పి "పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః" (భగవద్గీత-9-26) యను గీతా వాక్యమును స్ఫురింపజేసి

నాడు. అంతర్యమున నిట్టి చిన్న వస్తు వేదైన నీవు సమర్పించినచో నా జగద్గురుత్వము ప్రీతమై నిన్నుద్ధరింపనున్నది, యీ యవకాశ మును వీడకుమని కుచేలు నెచ్చరించినాడు స్వామి. కాని, స్వామికిని కుచేలునికిని నిర్నిరోధాను సంధానమున కింకను నొక చిన్న యభ్యంతర మున్నది. దానిని స్వామియే గమనించి వ్యాఖ్యానించినాడు. స్వామి దర్శనమునకై బయలుదేరి వచ్చిన కుచేలుడు తన జీర్ణవసనము నందు పృథుక తండులములను కట్టికొని వచ్చియు, నవి స్వామి కర్పింప దగినవి కావని సంశయించి, స్వామి పై మాటలచే తన సౌలభ్యమును నిరూపించి యున్నను ముఖము వంచుకొని కూర్చుండి యున్నాడు. అనగా స్వామి కిచ్చు పట్ల నాధిక్యైశ్వర్యములు ప్రతీయమానములు కావలెనను వాంఛ, తన లేమి, స్వామి యౌన్నత్యమునకు సంబంధించిన యొక అద్భుత చిత్తవృత్తి, స్వామి తత్త్వమున నేరుగా లీనము కాలేని ప్రవృత్తి - మున్నగు లక్షణముల తోడి యొక భావ సంస్కార మీతని కడ్డము వచ్చినది. అందులకు కారణమైనది స్వామియే చెప్పినట్లు కుచేలుడు పూర్వజన్మమునం దైశ్వర్యవంతుడై తన్ను సేవింపకుండుట. జన్మ జన్మాంతర సంస్కారముల నొక కటాక్ష మాత్రమున పునీత మొనర్పగల స్వామి, యటుకుల ముడిని తానే విడిచి ముదముతో భుజించినాడు. అతని కిందాద్రిదుల కతీతమైన సంపద్విశేషమును ప్రసాదించుట స్వామి సంకల్పము. పూర్వజన్మాగతమైన సంస్కారము మాట నటుంచి, కుచేలుడు నియమవ్రత శీలుడు, స్వామికి బాల్యసఖుడు. దారిద్ర్యానుభవము వలన కర్మశేషము ననుభవించినాడు. స్వామిని దర్శించి, సన్నిధి విశేషము ననుభవించి సత్కృతుడై బ్రహ్మానందము నందిన మహనీయుడు. స్వామి బ్రహ్మణ్య ధర్మము, జగద్గురుతత్త్వము, సౌలభ్య భక్త ప్రీతులు ఈ చిన్ని వృత్తాంతమున రమణీయార్థ ప్రతిపాదకముగ, మహాభక్తుడు పోతన తాను కుచేలుడై యీ ఘట్టమును నిర్వహించినంత మనోహరముగ రచించినాడు. మరునాడు స్వామిని వీడ్కొని వెడలిన కుచేలుడు స్వామి దర్శనానందమును-

"నా పుణ్యమరయ నెట్టిదొ
యీ పుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యునిఁ జి
ద్రూపకుఁ బురుషోత్తమునిఁ బరుం గనుగొంటిన్." (1012)

అని భావించినాడు. స్వామి మందిరము వెడలి వచ్చిన యనంతరము గాని కుచేలునికి తాను వచ్చిన పనియైన ధనార్థిత్వము స్ఫురించినది కాదు. స్ఫురించి నప్పుడును ఇట్లనుకొనినాడు. స్వామి తనకు విత్త మీయకుండుట 'దరిద్రుఁడు సంపదంధుఁడై కానక తన్నుఁ జేరఁడని' (1015) యే కావచ్చునని, ఈ ఘట్టమున స్వామి యాశించి నట్లీతని జన్మాంతర సంస్కారాగతమైన ధన సంబంధ మలిన భావము క్షాళిత మైనది. ఇంక నుండి తాను స్వామికి భక్తుడు. అంతకు మున్ను కాక పోలేదు గాని సన్నిధి విశేషము ననుభవించిన పిమ్మట తీరు వేరు. సంపదలు తన యింట త్రివ్వి తండములై యున్న దృశ్యమును కాంచిన కుచేలుని భావ పరంపరయే యిందులకు తార్కాణము. "అట్టి పురుషోత్తముండు భక్తినిష్ఠులైన సజ్జనులు లేశమాత్రంబగు పదార్థంబైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన నది కోటి గుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిది దృష్టాంతంబుగాదె! మలిన దేహుండును జీర్ణాంబరుండును నని చిత్తంబున హేయంబుగా పాటింపక నాచే నున్న యటుకు లాదరంబున నారగించె, నన్నున్ కృతార్థునిం జేయుట నిర్హేతుక దయయె కాదె! అట్టి కారుణ్య సాగరుండైన గోవిందుని చరణారవిందంబుల యందుల భక్తి ప్రాభవంబుఁ గలుగుంగాక!" (1027) అను మాటలతో ఇల్లాలికి స్వామి తత్త్వము నుపదేశించిన కుచేల విప్రుడు స్వామి భక్తానుగ్రహమునకు శాశ్వత ప్రతీక. పోతనచే అనన్యమార్గమున తీర్చిదిద్దబడిన యీ ఘట్ట మర్వాచీ నాంధ్రవాఙ్మయమున కావ్యనాటక వాఙ్మయమున నించుక ప్రచలితమైనది.

అట్టి వానిలో గట్టు ప్రభువు రచించిన కుచేలోపాఖ్యానము[93]

93. వావిళ్ళ ప్రచురణము. 1930.

గమనార్హమైన చిన్న కావ్యము. ఈ కావ్యమునకు కర్తృత్వము తెలియని పీఠికలో నీతడు సుమారు నూరేండ్ల క్రిందటి వాడనియు, భ్రమరాంబోపాసకుఁడనియు, ఘటికాశత గ్రంథ ఘటనా సమర్థుడనియు, గావ్యమును నరాంకితము సేయని నియమము కలవాడనియు తెలియుచున్నది. ఈతడు మహాకవి కాకపోయినను చిత్తశుద్ధితో తాత్త్విక దృక్పథముతో కృష్ణకథా రచనోన్ముఖుఁ డయ్యెనన్న విషయ మీ కథా వస్తువు నెన్నుకొనుటలో వ్యక్తమగుచున్నది. అర్వాచీన ప్రబంధ కవులందరును ప్రాయికముగ స్వామి శృంగారేతి వృత్తములను గ్రహించియుండ ఈత డీ కథ నెన్నుకొనుట విశిష్టము. రచనా ప్రణాళిక యందు గూడ నప్రసక్త విషయ వివృతి లేక, ధారాశుద్ధితో కూడిన చిక్కని కవిత్వ పద్ధతి యిందు గోచరించుచున్నది. సందర్భమును బట్టి కొన్ని తాత్త్విక వాక్యములను వేదోపనిషత్తుల నుండియు, గీత నుండియు గ్రహించి యీతడు వాడియుండుట, పలుకుబడిలో తెనుగు పోంకము ప్రత్యేకముగా గమనింపదగిన యంశములు. అవంతీ పురమున కనతి దూరమున నున్న యొక ముని పల్లె యందు మునికుమారుఁడైన కుచేలుఁడు నివసించుచుండినట్లు చెప్పబడినది. కుచేలుని యీ నివాస పద్ధతి నూతనము. అతడు గ్రామవాసియైన గృహస్థుగనే పురాణము లందున్నది. 'శత సహస్ర పరిచ్ఛేద సంఘటిత పురాణ జీర్ణోత్తరీయంబు రమణఁ దాల్చి" (1-27) యతడు కుచేల నామధేయము నందెను. ఇతని జీవిత విధానమున వేద, ధర్మ శాస్త్రముల సమన్వయ మున్నది. 'వేదమూల మిదం బ్రాహ్మ్యమ్' అను న్యాయమున తయీవిద్య నభ్యసించుట, 'భార్యా సమో నాస్తి శరీర పోషణం' అను న్యాయమున వివాహమాడుట, 'అపుత్రస్య గతిర్నాస్తి' యని పెక్కు పుత్త్రుల నందుట, 'సతత మేకో నివాసః పట్టణం వా వనం వా' యని కానలనుండుట, 'నదైవం కేశవాత్పరమ్' అని స్వామికి బహు సమారాధన మాచరించుట—యిట్టివి. సుందర సుగుణోద్దామయైన కుచేలుని భార్య వామాక్షి.

(ఈమె పేరు భాగవతాదుల యందు లేదు. ఆధునిక నాటక సాహిత్య మున నున్నది. ఈ నామ కరణము నీతడే యొనర్చినాడేమో! లేక స్థలాంతరమున నెచ్చట నేనియు నున్నదేమో!) కాననమందు లభ్యమైన ధాన్యముతో కాలక్షేపము చేయుచున్న యీ కుటుంబమును వామాక్షి సమర్థముగ నిర్వహించిన వైనమిందు వాస్తవిక శిల్పముతో వర్ణింప బడినది.

"పొరుగు పిల్లలతోడి పొరుడున కేమైన
నాటల కిమ్మన్న నాలసించు
బహు బెల్లములకై బ్రతిమాలి యేడ్చుచుఁ
గొంగుఁ బట్టీడ్చిన గుస్తరించుఁ
జాలు వెన్నలకు గా బ్రామిడి వడిబోరఁ
జన్నిచ్చి కౌఁగిట సంగ్రహించు..." (1-39)

మున్నగు సందర్భములిట్టివి. స్వామిని దర్శింప నేగిన కుచేలుని వర్ణనము మున్నగునవి యిట్లే వాస్తవిక వర్ణనాశిల్ప సముచితములై యున్నవి. సాధారణముగ వృత్తాంతము లన్నియును భాగవతోచితములై యున్నను నెడ నెడ నిట్టి వర్ణనా శిల్పములు గమనార్హములై యున్నవి. దీనికి తోడు కుచేలుడు ద్వారకనుండి తిరిగివచ్చిన పిమ్మట నతని మన స్తత్వము నందు చింతా ప్రవృత్తియు, స్వామి ధ్యాన నైరంతర్యమును చిత్రింప బడినది. అట్టి సందర్భమున స్వామి కుచేలునికి ప్రత్యక్షమయ్యెను. కుచేలుడు స్వామిని ప్రార్థించి తనకు స్వామి పాదారవిందము లందు స్థాన మీయుమని కోరెను. ఆ సందర్భమున స్వామి కుచేలుని కొక తత్త్వోపదేశము నొనర్చినాడు. పంక్తి భేదము చేయని యన్నదానము, నిత్యానిత్య వస్తు వివేకము, వైరాగ్యము నంది జ్ఞానమార్గమున కైవల్యము నందుట ఇందలి ముఖ్యాంశములు. కుచేలుడు స్వామి యాదేశించిన మార్గమున తన జీవిత శేషమును గడిపి తరించినాడు. కథా వృత్తాంతము దృష్టిలో నిది ముఖ్యమైన

కల్పనము. దీనిచే కృష్ణ కుచేల సంబంధమున కంటె భగవద్భక్త సంబంధ మధికముగ భాసించుచున్నది. కథా వృత్తాంతమునం దంతట సఖ్య భావనమునకన్న నిదియే ప్రాముఖ్యము వహించినది. విరక్తి నందియున్న కుచేలునికి తాత్పర్యతః స్వామి 'జ్ఞానా దేవ మోక్షః' అని చెప్పుటవలన కావ్య రచనమున గట్టు ప్రభువు దృక్పథము వ్యక్తమగు చున్నది. ఇట్లిది రమణీయమైన కావ్యమగు చున్నది.

నాటక వాఙ్మయమునకూడ ఈ వృత్తాంతము కొంత ప్రచలితమై యున్నది. అందుమున్నుగ పరిశీలింపదగినది బళ్లారి పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రి రచించిన భక్తకుచేల.[94] ఇందు భాగవతేతివృత్తమునకు కల్పనలఁ జేర్చుట గమనార్హము. ఈ కల్పనలు ప్రత్యేకముగ మౌలికరమ్యతను గల్గియుండక నాటి నాటకరంగము ధోరణినే తలపించుచు ఎబ్బెరికముగ నున్నవి. గద్యపద్యరచనా పద్ధతులలో (శ్రీ) శాస్త్రి తన పూర్వ నాటకము లందలి పద్ధతులనే అనుసరించినాడు. రుక్మిణి తులసీపూజారతయై యున్న వేళ సత్యాకృష్ణు లచ్చటికి వచ్చిరి. వైరాగ్యభక్తికిని, భోగాసక్తికిని, నడుమ నొక చిన్న చర్చ బయలు చేరి యది సవతులమధ్య చిలికిచిలికి గాలివానమైనది. నాటకసూత్రము ననుసరించి నారదాగమనము, సవతుల కయ్యమును పురస్కరించు కొనిన నాటక బీజావాపనము, యథావిధిగ సాగినవి. స్వామి "..ప్రేమ మోహ ప్రపూర్ణ సంకేతమైన సత్యాచంగల్వ పాలికెంపు సైపనగునె" (పుట 6) యని ఆందోళనము నందినాడు. నారదుడీ నాటక కథా వృత్తాంతమును ప్రేక్షకులకు పరిచయ మొనర్చుటకో యనునట్లు"... యింట నిరువదేడ్గురు పిల్ల లేడ్పుధ్వనులు స్వస్తి కాఁగ మంగళసూత్ర మాత్ర విభవయాభార్యతోఁ గుచేల నిప్రవరుఁడు వగలుచున్నాఁడు మాధవభక్తుఁడగుచు" (పుట 7) అని చెప్పినాడు. ఈ సందర్భమున భక్తికి పరమోదాహరణముగ రుక్మిణి వ్యాఖ్యానింప, సౌఖ్యప్రదము

---

94. కె. యస్. శాస్త్రులు & సన్స్, బళ్లారి, 1933.

గాని భక్తి నిరర్థకమని సత్యా వాదించినది. అంతటితో నాగక కుచేలుని పరీక్షించుటకై యతిథుల నంపుట, మోహిని యను వేశ్య నంపుట, మున్నగు పనులఁ జేయువరకు పోయినది. నాటకమునం దనంతర భాగమున కుచేలుండీ పరీక్షలకు తట్టుకొని నిలిచినట్లు చిత్రింపబడినది. కథావిషయముగ సింకొక నూతనాంశము కుచేలుడు శిశుపాలపాలితమైన రాజ్యమును నివసించుట. తత్ఫలితముగ శిశుపాల పురోహితుడైన కరటకశాస్త్రి వంటి కల్పితపాత్రల చేత భిన్న సందర్భములందు కుచేలుని దృఢభక్తిని పరీక్షింప జేయుటకు, అతడు సర్వమును విష్ణుమయముగ భావించిన జ్ఞానియని నిరూపించుటకు వీలేర్పడినది. మృత్యుముఖమున నుండియు జననీజనకులకు కష్టమును కల్పింపక హరినే ధ్యానించు కుచేల పుత్త్రుని వృత్తాంతము, శిశుపాలుడు కుచేలుని కారాగారమున నుంచుటవంటి యంశములు సమకాలీన నాటకపద్ధతులను తలపించుచున్నవి. స్వామి కుచేలుల సమాగమము, వారి బాల్యమైత్రి, కుచేలపాత్రయందలి భక్త్యావేశము, పరమ మనోహరముగ చిత్రింపబడినది. అచ్చమైన భక్తికిని, సఖ్యభావమునకును నిలయమైన యీ యితివృత్తమున నతుకని కల్పనలఁ జేర్చి, నాటి విజయవంతములైన నాటకముల మూసకట్టులో తీర్చిదిద్దవలెనని నాటకకర్త ప్రయత్నించుట వలన నిందలి సహజసౌందర్యాదులు నశించినవి. ప్రత్యంశమును సహజోన్మీలనము నందక నాటకకర్త పట్టి లాగినట్లు భాసించినదీ నాటకమున. మొత్తముమీద కృష్ణకుచేల సమాగమము నందలి స్వచ్ఛంద భక్తిభావము వినా యిందు చెప్పుకొనదగిన యంశము లేదు.

ఇట్టి కోవకే చెందిన మరియొక నాటకము పురిటి బలరామదాసు రచించిన భక్తకుచేల.[95] ఇదియొక విచిత్ర ప్రయత్నము. సమకాలీన నాటకరంగమున నెక్కువ ఖ్యాతి నార్జించుకొనిన నాటకముల ననుకరించుట యను స్థితిని దాటి, తద్గత సన్నివేశముల సైతమెట్లో తమ

---

95. శారదా పబ్లిషింగ్ హోమ్, రాజమహేంద్రవరము. రెండవకూర్పు. 1936.

నాటకముల ప్రవేశపెట్టి కీర్తినార్జించుకొను చౌర్యపద్ధతికిది యుదాహృతి. రంగూన్ రౌడీవంటి నాటకములందు వ్యాప్తినందిన మద్యపాన స్త్రీ లౌల్య వ్యతిరేకత, గాంధీజీ అస్పృశ్యతా నివారణము, స్వాతంత్ర్యోద్యమము వంటి నినాదములకీ కుచేల వృత్తాంతమును భిత్తికగ గైకొనుట యెంతటి వింతయో వివరింపనక్కర లేదు. ద్వితీయ ముద్రణము నందుటవలన ప్రేక్షకులలో నొక అమాయక వర్గము వారిని తృప్తినందించిన దేమొ! యనిపించును. రచనాదులయందు విశేషములు లేవు. కథానిర్మాణ మిట్లున్నది. కలహాభోక్తయైన నారదుడు స్వామి యాజ్ఞవలన తన క్షుత్తు తీరినదని చెప్పి నిష్క్రమించిన పిదప, సుశీలా ప్రభాకరుల వృత్తాంతము భిన్న రంగములలో ప్రవర్తిల్లినది. ప్రభాకరుడు స్త్రీ, మద్యలోలుడై భార్యను హింసించుట, యామె పాతివ్రత్యము, తుదకాతడు రక్షకభటులచే బంధితుడై మరణింప బోవుచు, దీర్ఘోపన్యాసమున భారతీయులను దుర్వ్యసనముల వీడుడని ప్రబోధించుట -యిందలి యంశములు. నారదుడు తుంబురు సహితుడై దేశమునందలి దురాచారముల సవ్యాఖ్యానముగ నిరూపించుచు మున్ను గాంచిన దృశ్యమునకన్న భక్తి ముక్తి ప్రదాయకమైన దృశ్యమును చూపింతునని చెప్పి కొంపోయెను. అటుపై కుచేల వృత్తాంతము ప్రవర్తిల్లినది. నారదుడు వామాక్షితో మాటలాడి కృష్ణ సందర్శన మార్గమును సూచించెను. ద్వారక కేగుచున్న కుచేలుడు మార్గమధ్యమున నస్పృశ్యులకు జరుగు నన్యాయముల విమర్శించును. రాధారుక్మిణుల భక్తి, సత్య తర్క పద్ధతి, భక్తి, ధన లక్ష్ములకు నారదుడు కలహమును కల్పించుట వంటి వృత్తాంతము లిందున్నవి. అసలు కథా వృత్తాంతమున నెట్టి యవకతవకలు చేర్చకుండుట యీతడాంధ్ర వాఙ్మయమున కొనర్చిన ఉపకారము. ఎట్టి కథ కెట్టి రచనా పద్ధతి నీత డనుసంధించెనో నిరూపించుటయే యీ యనుశీలనమునకు ధ్యేయము.

ఈ యనుశీలనమున చేర్పదగిన రమణీయ రూపకము (శ్రీ) నోరి

నరసింహశాస్త్రి రచించిన సుహృత్సుదామము.[96] ఇందు ప్రథమాంకమున కుచేలుని జీవిత విధానము రమణీయముగ చిత్రితమైనది. సుదాముడు కుటీరవాసియైన కులపతి. గురుకులమున విద్యార్థుల వేద పఠనము నందలి హీనస్వరములు, సుదాముల నిష్పంద ధ్యానముద్ర యీ ఘట్టము నందలి ముఖ్యాంశములకు వ్యాఖ్యాన ప్రాయములు. సుదాముల పొలముచేయు కాపులు వచ్చి ధాన్యము పండలేదని చెప్పుట, సుదాముల శ్రేయోऽభిలాషియైన శ్రేష్ఠి యొక్క డిందలి మోసమును నిరూపించుట. శ్రేష్ఠి సూచనను, బ్రాహ్మణి అభ్యర్థనమును మన్నించి సుదాములు స్వామి దర్శనార్థము బయలుదేరుట- యిందు ప్రవర్తిల్లిన వృత్తాంతములు. వీనిలో బ్రాహ్మణి అమాయక చిత్తవృత్తి, సుదాముల ధ్యాన సాంద్రత, గమనార్హములైన యంశములు. కథా వృత్తాంతము ప్రవర్తిల్లు చున్నప్పుడు సుదాముని ధ్యానమునందు వ్యక్తములైన వివిధ వృత్తాంతములు కృష్ణలీలా ప్రతిపాదకములై భాసించుట గమనార్హమైన రచనా శిల్పము. రెండవ రంగమున స్వామి లీలా విశేషము లందలి యొక ప్రత్యేకాంశ మావిష్కృతమైనది. అందలి తాత్పర్యమేమన- స్వామి కాకలియైనపుడు దానిని తీర్చుట కష్ట మహిషులు పలురకములైన వంటకముల నివేదించిరి. స్వామి కాకలి తీరలేదు. యాదృచ్ఛికముగ వచ్చిన యశోదా స్తన్యమును స్వామి శిశుత్వమునంది గ్రోలినను నాకలి తీరలేదు. సగమే తీరినది. మిగత సగము సుదాము లీయబోవు నడుకుల వలన తీరనున్నది. తృతీయ రంగము కుచేల కృష్ణుల సమాగమము. నాల్గవ రంగమున సుదాముల కుచేలత్వము, నామ సార్థక్య హేతువని నిరూపితమైనది. పంచమ రంగమున పృథుక తండుల సమర్పణాదులు. అనంతర కథాంశములలో క్రమముగా సుదాముల సమస్యలు నివారణము చెందుట, కృష్ణతత్త్వమును సుదాములు దేవకీ యశోదలకు, అష్ట

---

96. ప్రచురణ - ఆంధ్రపత్రిక - కీలక సంవత్సరాది సంచిక. (1968 -'69)

మహిషులకు బోధించుట, సుదాముల పునరాగమనము- ప్రధానము లైనవి. తన నిలయమునకు తిరిగి వచ్చిన సుదాముడు కృష్ణభక్తి నేమరవలదని భార్యకు చెప్పుటయు జరిగినది- ఇది సంగ్రహముగ ఈ రూపకము నందలి వృత్తాంతము. పది రంగములతో బహు సంఖ్యాక పాత్రలతో నున్న యీ రచనమునకు నాటికయని పేరున్నను ఇది ప్రదర్శనార్థ ముద్దిష్ట మైనట్లు తోచదు. బహుశః శ్రవ్య నాటికగ వినియోగ మున్నదేమో! ఇందు మున్నుగ పరిశీలింప దగినది సుదామ కృష్ణుల సంబంధము. ఇందు సుదాముడు కులపతి, వేద వేదాంగ విదుడైన ధర్మశీలి. కృష్ణ ధ్యానమునసే నిరంతరము మసలుచు లౌకిక భూమికకు దిగిరానివాడు. కథ యందలి వృత్తాంత మును బట్టి కులపతుల కీయబడిన పొలములు కర్షకుల మోసము వలన ఉపకారకములు కాకుండుట యను నంశము ప్రధాన మై భాసించి, ఈ యితి వృత్తము నందలి ఆర్తి, దైన్యములను నంశ ముల దొలగించి వైచుట నాటకకర్త ధ్యేయమేమో యను భావ మున. కాకరము కల్పించుచున్నది. స్వామి సుదాముల సంబంధ ప్రతిపాదనము రమణీయమై యున్నది. తన్నిరూపకములుగ సుదా ముల మనో నేత్రమున భాసిల్లిన దృశ్యములు, ద్వారకయందు ప్రవర్తిల్లిన యంశములు విశిష్ట లక్షణముల కలవి. ద్వారకయందు సుదాముల ప్రవర్తనము, బ్రహ్మజ్ఞాన సంపత్తి కనుగుణములైన సన్నివేశములు చక్కగ నిర్వహింప బడినవి. యథేచ్ఛావ్యావహారిక భాషాప్రయోగ మీ రూపకమునందలి యౌన్నత్యము నించుక చెనకినది. అది యట్లుండ నింకొక సందర్భ మిందు చంద్రునిలో మచ్చవలె సౌందర్యమున కొక కళంకమై యున్నది. అది యష్ట మహిషుల యొక్కయు, దేవకి యొక్కయు మందిరములందు స్వామికై యొనర్ప బడిన వంటకముల వృత్తాంతము. ఒకచోట వరాహ మాంసము, మరి యొకచో కృష్ణ మృగ మాంసము- ఇట్లె న్నియో వివరము లిందున్నవి. కథా సందర్భమును బట్టి యట్టి

సంపన్నమైన ఆహారమైనను స్వామికి యశోదా స్తన్యమువలె, సుదాముల యడుకులవలె ప్రీతి పాత్రములు కావనుటయే ప్రసక్తము. ఇందు స్వామి మాంసాహారమును తినునా? లేదా? నాటి భారత దేశమున వరాహ మాంస భక్షణముండెనా? లేదా? మున్నగు విషయము లీ యనుశీలనమునకు గాని (శ్రీ) శాస్త్రి రూపకమునకుగాని ప్రసక్త విషయములు కావు. అయినను వివాదాస్పదములు. ఒకవేళ వీనిని చెప్పక తప్పని చారిత్రిక విజ్ఞానము నోరి వారి మేధస్సున నిండి యుండి యెట్లైని ఆ భారమును దించివేయవలసిన పరిస్థితి వారికి ప్రాప్తించినను, పవిత్రము, భక్తిభావ స్ఫోరకమునైన యీ రూపక మందులకు తగదు. పఠనవేళ పాఠకుల కెట్టి భావ విచ్ఛిత్తి కలుగునో వీ రూహించిరికారు. ఇట్టి సంగతు లెంత చిన్నవైనను పాలకుండలో ఉప్పు కల్లువలె అనౌచిత్య కారణములగును. ఇక నెంత రచనా సౌందర్య మున్ననేమి? ఎట్లైనను కథా వృత్తాంతము నోరివారి లేఖినిలో క్రొత్త రూపమును సంతరించుకొనినదని చెప్పుట కభ్యంతరము లేదు.

## ముక్తకేశి, పుండరీకుడు, సుశీల

స్వామి 'భక్తానుగ్రహ' కథలు కొన్ని ప్రౌఢకవి యైన రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యమున విశిష్ట రూపమున నావిష్కృతములై స్వామి లీలా కారుణ్యావిభవముల నిరూపించుచున్నవి. అందు కతిపయ సందర్భముల నిం దెన్న దగును. క్షేత్రమహాత్మ్యములందు సాధారణముగ భక్తానుగ్రహ వృత్తాంతములే ప్రాధాన్యమును వహించును. కాని, వానిని తీర్చి దిద్దుట యందు రామకృష్ణుని కవితా శిల్పము భాగవతార్థ స్ఫోరకమై భాసించినది. వివిధ భక్త వృత్తాంతము లిందు న్నవి. వానిలో ముక్తకేశియను గోపిక వృత్తాంతము, పుండరీకునికథ, సుశీల కథ-ప్రత్యేకముగ గమనార్హము లగుచున్నవి. వ్రజ గోపికలలో ప్రత్యక్ష మార్గమున స్వామి నారాధించి తపశ్శక్తిచే ప్రసన్ను నొనర్చు కొనుట యీ గోపిక ప్రత్యేకత. ఆమె స్వామిని గూర్చి తప మొనర్చి నపుడు స్వామి ప్రత్యక్షమైనాడు. గోపిక "...త్రిలోక

మోహన క్రియారోప నిరూపణంబగు సరోరుహాలోజను రూపుఁ జూచుచున్" (2-128) వివశమైన స్థితి నందినది. నిర్నిమేషనయనములు, ఊరలిపోయిన కేశపాశములు, జారిపోయిన నీవి మున్నగు లక్షణములతో నూరకుండిన యీ మధుర భక్తురాలిఁ గాంచి స్వామి యొక్కింత నగి, 'ఇది యేమినీ' వనినాఁడు. భక్తానుగ్రహము పట్ల స్వామి మధుర ప్రౌఢ మార్గమున కిది నిదర్శనము. ఈ చిన్న వాక్యము స్వామి చిరు నగవున మిళితమై బహ్వర్థ స్ఫోరకమైనది. గోపికలందరు భక్తి మార్గమునకు ప్రతీకయైన కామోత్కంఠతో నన్నారాధించిరి కదా! నీవిట్టి తపస్సు చేయుట యేమి? యనియు, తపఃఫలితముగ నీ శరీరాచ్ఛాదన యనెడు ప్రాథమిక విధినే నీవు విస్మరించినా విది యేమి? యనియు- ఇట్లెన్ని యో యర్థము లిందు భాసించునట్లు రామకృష్ణుడు రచించినాడు. నిజమునకా గోపికకు దేహాత్మ భ్రాంతి నశించిన పరిస్థితి యీ వరకే వచ్చినది. ప్రస్తుతము ముగ్ధమోహనమైన స్వామి స్వరూపము నందలి లక్షణములు మాత్రమే యామెకు కన్పించుచున్నవి. తక్కిన సృష్టి యందలి యే విషయము నందును ఆమెకు స్పృహ లేదు. ఇంతటి తాదాత్మ్య స్థితి నందిన యామె కోర దగినది స్వామి యీయదగినది లేదు. కాని, యామె కోరిక లోకమున కాదర్శప్రాయముగ, స్వామి సన్నిధి యందు విసర్జింప దగని దేది యును లేదు- అను నర్థమును ప్రతిపాదించుచున్నదై యున్నది. "...కుంచితాననయన భంగురవృత్తిఁ దత్పాద బిసరుహాంబులు కేల బిగియఁ బట్టి నుచ్చిత్తహారములో మధువైరి, నీ పాదవనరుహంబులు, వీని వదలఁ జాల, వీని లావణ్యమీవే భూషణముగ నాకస్మత్కరార్ద్రితంబగుట నడుగఁ గవ యిది సలాంఛనం బగు గాత..." (131) యని ప్రార్థించినది. శాశ్వతముగ స్వామి పదచిహ్నములతో తన కరచిహ్నములు జోడించి యుండవలె ననుటలోని ఆర్తిని స్వామి యిట్టే గమనించి యామె వరమును గటాక్షించి యిట్లు చెప్పినాడు- "...అట్లు యగుఁ గాక సర్వంబు నతివ! నీ వసంబరయు, ముక్తకేశియు, నఖిల

భూషణాంచితాంగియునై యుండు' (పూర్వోక్తము) ఇట్లీ ముక్తకేశి వృత్తాంతము గోపిక తపస్సిద్ధికిని స్వామి'అనుగ్రహమునకును చిహ్నమై, పాండురంగ క్షేత్రమున నీశాన్య దిశయందు శాశ్వతమై వెలసి యున్నది. పుండరీకుడు హరిభక్తి, గురుభక్తి నెరపి స్వామిని ప్రత్యక్షీకరించుకొనెను. వివశుడై స్తుతించెను. స్వామి ప్రసన్నుడై యిట్లనెను :

"నిచ్చలు నిచ్చలోఁ బొదలు నీ పితృ భక్తికి జ్ఞానశక్తికిన్
మెచ్చితి; నచ్చితిన్ గరము నీయెడ; నీ యెడ లేల? వేదు కొ
మ్మిచ్చెదఁ జెచ్చెరన్ వలయు నీప్సితముల్ శతమేని; దీన నే
పొచ్చెము నొచ్చెమున్ జొరదు భూసుర కేసరి! నమ్ము నావుడున్" (2-53)

ఇందు స్వామికి మిక్కిలి ప్రీతికరములైన యంశములుగ పితృభక్తి, జ్ఞానవిశేషము, బ్రాహ్మణధర్మమును నిర్వర్తించుట-అను నంశములు సూచితములైనవి. అట్టివారికి నూరులకొలది వరముల నిచ్చుటకైనను వెనుదీయని కరుణాసముద్రుడు స్వామి. పుండరీకుని వాంఛితార్థమున కనుగుణముగ "...నీక్షేత్ర తీర్థంబులుం బౌండరీకంబులై పాండు రంగాహ్వయుండనగు నాకు నెక్కాలంబును శ్వేతద్వీప సుధా సాగ రంబుల కంటె బ్రియంబులై నిత్యనివాసంబులై యత్యంత విభవం బుల నభిరామంబులయ్యెడు; నీకోరిన యట్ల యిచ్చితి..." (2-75) ననినాడు. ఉత్తమ పతివ్రతయైన సుశీలను స్వామి యనుగ్రహించిన వృత్తాంతము మరింత మనోహరము. భర్త కుటిలాచార చతురుడైనను, వీలున్నంత మేరలో నిహపర సంసిద్ధి సూచకమైన కీర్తిత చరిత్రము నందు ప్రవర్తిల్లుచుండిన ఆ యిల్లాలికడకు, స్వామి వటు వేషధారియై పోయి, పరీక్షా స్వరూపమైన యాతిథ్యమునంది తృప్తి చెంది, యామె పూర్వ భవ వృత్తాంతమును చెప్పి వరము లనుగ్రహించెను. అవి సామాన్యములైనవి కావు. ఆమె జీవితమునందున్న లోపములను

తొలగించి భావి కాలమున ఔన్నత్యమును ప్రసాదించునట్టివి. " నిష్ఠు రత్వంబ తొలగించి నేటినుండి నీకు నలుకూలుఁడయ్యెడు నీ విభుండు మత్పదద్వయ భక్తి సమగ్రులైన సుతుల నేపురం గాంచ దూర్జిత విభూతి" (4-202). ఇంటిలో బైడియు, వెండియుఁ ద్రవ్విఁ తండముగా నుండునట్లును, నూరేండ్లు జీవించి పరమ పదము నందునట్లును కటాక్షించిన స్వామి సుశీలను నిమిత్తముగా నొనర్చి భక్తకోటి కొక హెచ్చరిక చేసియున్నాడు. " మన్నన చేసినాఁడు మురమర్దనుఁ డంచు నహంకరింపకో కిన్నరకంఠి! యట్లయిన కీడొదవున్; విను తొంటి కన్న నస్మ న్నిహితాంతరంగవయి సత్యశమార్జవ శుద్ధి లక్ష్మికిన్ వన్నియవెట్టుమీ! మహిత వర్తన కీర్తులు నిర్వహింపుచున్." (204) అనగా నుదాత్త స్థితి యందున్న వారు గర్వదూరులై సత్కర్మాచరణశీలురై ప్రవర్తింప వలెనని స్వామి యాదేశించినాడు. ఇట్లీ మహాకవి చిత్రించిన మూడువృత్తముల వలన స్వామి తన్మయీభవ పూర్వకమైన తపస్సాధనమున, గురు హరి సేవాపరాయణత్వమున, జీవిత పరిస్థితులందలి దుర్భావ వలయముల కతీతమై వర్తించు ధర్మాచరణమున పీ్రతుడై అనుగ్రహము చూపునను విషయము నిరూపింప బడినది.

బహుళాశ్వుడు

స్వామి భక్తానుగ్రహ మెన్ని రీతుల నుండునో యెప్పు డెవ్వారి యెడ నే మార్గమున ప్రసరించునో చెప్పజాలము. అర్హులైన భక్తు లున్న చోటికి స్వామి తనంతతానై వచ్చి వారి యాతిథ్యమును స్వీక రించి, తన సన్నిధి మహత్త్వముచే వారియం దనుగ్రహము ప్రద ర్శించునట్టి యొకానొక వృత్తాంతము భాగవతము నందున్నది. దాని నర్వాచీన కాలమున విస్తృత మొనర్చి రచించిన ప్రబంధము బహుళాశ్వ చరిత్రము.[97] ప్రబంధ లక్షణముల ప్రభావము వలన

97. దామరల వెంగళ భూపాల విరచితము, (సరస్వతి పత్రిక నుండి ముద్రితము) సరస్వతీ ముద్రాక్షరశాల, కాకినాడ, 1906.

నంశవలసినంత యానౌన్నత్యమునీ కావ్య మందుకొన లేక పోయినది. అయినను వస్తు గౌరవము వలనను మూల కథౌన్నత్యమును విపులీక రించు నొండు రెండు ఘట్టములందీ ప్రబంధ కర్త ప్రదర్శించిన రచనా నైపుణ్యము వలనను, నిది ప్రస్తుతానుశీలనమున ప్రసక్తము. ఇందు కథ యెంత అల్పమో ప్రబంధోచిత వర్ణనా చాతుర్య మంత యనల్పము. బహుళాశ్వుడను పేరు గల మిథిలా పాలకుని, ఆ పురము నందే వసించు శ్రుతదేవుడను విప్రోత్తముని స్వామి కరుణించుటకై యటకు మహర్షి బృందముతో నేగి, అందు కొన్ని దినము లుండి యెల్లర సంప్రీతుల నొనర్చు టెందలి కథారేఖ. ప్రబంధోచితముగ నీ వృత్తాంతమున కొన్ని చేర్పుల నొనరించు కొన్నాడు కవి. స్వామి కతిపయ మహర్షి బృందముతో మిథిల కేగినట్లు భాగవతమున నుండ, నుద్వేల శృంగార వర్ణనమునకు పనికి వత్తురుగదా యని అష్ట మహిషులను కూడ మిథిలకు రప్పించినా డీ కవి. వివిధ వర్ణనము లతోపా టిందు స్వామి శృంగార విహారములు, బహుళాశ్వుని విందు, విశ్వామిత్రోక్త రామకథ, కళానిధి యను వైశ్యుని వృత్తాంతము కథా విస్తృతి కారణములు. చమత్కారము లుద్వేలముగ వాడి నను, గతానుగతిక ప్రబంధ ధోరణులకు తలయొగ్గినను వేంగళ నాయకుని రచనములో నొక జీవకళ, ఉక్తి వైచిత్రి యున్నవి. బహుళాశ్వుడు మిథిలా పాలకుడు. మిథిలను పాలించిన చక్రవర్తు లందరు జనకుని మొదలుకొని యుత్తమ బ్రహ్మజ్ఞాన సంపన్నులైన రాజర్షులు, కర్మాచరణమున నిర్లిప్తతనంది పరతత్త్వమును ముట్టిన యోగులు. ఈ యర్థము భగవద్గీత యందే స్వామిచే నుక్తమైనది. "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః లోక సంగ్రహమే వాపి సంపశ్యన్ కర్తుమర్హసి" (3-20) అట్టి చక్రవర్తుల పరంపరకు చెందిన బహుళాశ్వుని స్వామి తనంత తాను చూడబోవుటలో నొక అంతర్యమున్నది. సర్వ యజ్ఞ యాగాది క్రతువుల నాచరించుట, కర్మ మయ జీవనము, స్వామి సన్నిధి ప్రాప్తియందు పర్యవసింపవలెను.

అందులకే యీ కథ భాగవతమున ప్రసక్తమైనది. దీనిని కని పెట్టిన కవి తన్నిరూపక మార్గమున పరిబంధమును తీర్చి యుండవలసినది, కాని యుగ ధర్మమందుల కనుకూలమైనది కాదు. కథకు కండ పట్టయిన బహుళాశ్వ కృష్ణ సమావేశము నీత డభివర్ణించిన పద్ధతి గమనించినచో, నీతని యంతస్సున నున్న భావధార విశిష్టమైన దనియు, అది పరిబంధ స్వరూపము మాటున దాగి యున్నదనియు వ్యక్తము. నిరంతర ధ్యానపరివణుడైన మిథిలాపతి స్వామిని తన్మయత్వమున నర్చించి భజించినాడు.

"అప్పుడు రమ్మని మురహరు
డప్పనయిడఁ గూరుచుండి హరి హస్తాబ్జం
బప్పార్థివుఁ డౌదల నిడి
చొప్పడ నేత్రముల నొత్తుచున్ జేర్కొనుచున్."

(తృతీయ. పుట. 35)

స్వామి చేతుల నిట్లు వాత్సల్య భావ స్పందనమునకు గురిసైె లాలించినాడు.

"గోరక్షణమునకై గోవర్ధన మహీధ్ర
మెత్తిన నాఁడెంత యిల్కెనొక్కొ!
కువలయాపీడంబు కొనఁగొమ్ము వట్టి పె
కల్చిన నాఁడెంత కందెనొక్కొ!
చాణూరమల్ల వక్షః కవాట తటంబు
వొడిచిన నాఁడెంత యిడిసెనొక్కొ!
యుగ్రసేనుని పట్టి నొడిసి ముందల వట్టి
తిగిచిన నాఁడెంత తెగియె నొక్కొ!
కటకటా! తమ్మి తలిరుల కంటె నున్న
నున్న యిక్కేలు గాసి కెట్లోర్చె మిగుల
నొగిలెనో తండ్రి యని తొంటి నొప్పి దీర
నట్టివలచేయి గట్టిగాఁ బట్టి పట్టి" (పూర్వోక్తము)

తన యదృష్టము నిట్లు వ్యాఖ్యానించు కొనినాడు:

"కొండలఁ గోనలన్ నిలిచి కూటికిఁ గూరకుఁ జింత యింత లే
కెండకు వానకున్ జలికి నిచ్చఁ జలింపక రాఁత జేసిన
ట్లుండి నినుం దలంచు నరు నొక్కనిఁ దాఁకి తలంచ వీవు నా
యుండకు వచ్చి నా వెతలనన్నియుఁ దీర్చితి నందనందనా!"

(పూర్వోక్తమే.)

ఇంతటి యదృష్టమునకు బహుళాశ్వుఁ డర్హుఁ డెట్లాయె నన్న విషయ మును స్వామియే నిర్ధరించినాడు. అతడు రాజై యుండియు వైభ వములలో దగుల్కొనక సర్వమును స్వామి మయముగ దర్శించి నాడు. అందు ముఖ్యముగ వనితా సంగతి సాధనా పథమునకు నిరోధము. (అంతకు మున్నే యువతులతో అనన్యముగఁ గ్రీడించి వచ్చిన) స్వామి స్త్రీల దర్శించు పట్ల నెట్టి దృష్టి వలయునో నిరూపించి నాడు:

"మదనాగ గామినీ వదనాబ్జ దర్శనో
త్సుకకేళి నానాభిఁ దలఁపఁగలఁడె?
ముకురాననామణీ చికురావ లోకంబు
తఱి నా నెమిలి కుంచెఁ దలఁపఁ గలఁడె?
ఘనకచాకంత జఘనదృష్టియెడల నా
దరసుదర్శనములఁ దలఁపఁగలఁడె?
వరకటీ భ్రూలతాధర వీక్షితముల నా
ధర్మకౌస్తుభములఁ దలఁపఁగలఁడె?
యొకఁడు నినుఁబలెఁ దమి రెంట నొకటి గాఁగఁ
గవులు తలఁచిన తలఁపులు దవులుగాక?
చింతయిటు చేయనేటికిఁ జెల్లెనయ్య!
రాజ ఋషివర్య! బహుళాశ్వ రాజవర్య!" (పుట-36)

విరాగియైనవాడు లోకవృత్తమునందు ప్రవర్తిల్లు చున్నను సౌందర్య సీమ లన్నియు స్వామి విభూత్యంశములే యన్న గమనిక నాతడు

కలిగియుండునను నర్థమిందు గమ్యమానము. కవిసమయముల యంత ర్లక్షణము నీతడు చమత్కారముగ నిరూపించినాడు. ఈ కథయందలి కీలకము నిట్లు ప్రతిపాదించినాడు కవి.

"సన్నుని కోటికెన్నఁడుఁ బ్రసన్నుఁడు గాఁడు విదేహమేదినీ
భృన్మణి యింటికై యరిగి పెట్టెడునన్నము పట్టెడున్ భుజిం
చెన్మధుసూదనుం డనఁ బ్రసిద్ధి గణించితిఁ జాలుఁజాలు నా
జన్మము ధన్యమయ్యె నిమి సంతతి పావన మయ్యె మాధవా!

(పుట 54.)

ఇందలి ప్రధానార్థము లన్నియు భాగవతము నుండి గ్రహించినవే యయ్యు నిందలి రచనామార్గమున ప్రబంధోచిత దీప్తి, చమత్కృతి కనుపించుచున్నవి.

'ఒకయింత గుడిసెలో నొదుగుట యొప్పెఁగా
  నల జగత్పరిపూర్ణుఁడైన తండ్రి!
యడుగుదోసెడు నీటఁగడుగుట కలరెఁగా
  మిన్నేరుఁ బదమునఁ గన్నప్రోడ!
త్రావి చేరెడు పాలఁ దనిసెఁగా నిలపాల
  మున్నీటిల్ నోలగన్న మేటి ?
యిచ్చిన యొక్క సామ్మొదఁబూని మెచ్చెఁగా
  సిరికిఁ గాపురమున్న యురము వాడు!
భక్తియే కారణముగదా! భక్తులిడ్డ
యొక్క తులసీ దళంబున కుత్సహించి
భక్తిముక్తులు దయసేయు పుణ్యమణికి
జగలు ననిపించితివి పుణ్యజనశరణ్య!"

(పుట 54)

యను వ్యాప్యములీ కథార్థమును నిరూపించుచున్నవి. స్వామి లీలా మానుషత్వమునకు, భక్తానుగ్రహమునకు నీ ఘట్టము నిదర్శనము. సన్నిధి వలన ప్రాప్తించు నానందస్థితియే యిందు గమ్యము.

ఆంధ్రవాఙ్మయమున నీ మార్గమున వ్యాప్తిచెందిన భక్తానుగ్రహకథలలో ప్రాచీన కవివరేణ్యుల మార్గమే యుత్తమోత్తమమై సహృదయుల కనుసంధానము నన్నిదశలలో కల్గించునంతటి మహాత్మ్యమును కల్గియున్నది. రచనా మార్గముల యందలి తారతమ్య పరిశీలనము వలన భారతకవుల యైతిహాసిక గాంభీర్యము, రచనా శిల్పము ప్రముఖమై భాసించును. భాగవతకర్తయైన పోతన ఈ యనుశీలనమున ననన్యస్థానము నాక్రమించును. అందులకు భాగవత దృక్పథమున ప్రముఖాంశమైన ప్రపత్తి తత్త్వమే పోతనామాత్యుని జీవిత తత్త్వమై యుండుటకు కారణము. అర్వాచీన కాలమున నీ యంశము నాటకీయముగ పొడసూపియున్నను విశిష్టతను సాధింపలేకపోయినది. మొత్తము మీద స్వామి భక్తానుగ్రహనిరూపకమైన సాహిత్యమున ప్రాచీన మహాకవులదే ఘంటాపథము.

# 6. రాధాకృష్ణ సాహితి

రాధాకృష్ణతత్త్వము :

కృష్ణ కథాంశములలో రాధాకృష్ణ సందర్భ మొక విలక్షణమైన విషయము. ఇంతటి వివాదాస్పదమైన యంశముగాని, ఇంత మోహనమైన యంశముగాని కృష్ణకథ యందు లేదనియే చెప్పవచ్చును. ఆంధ్ర వాఙ్మయమునం దీ యంశము యొక్క విస్తృతి వికాసముల నిర్దేశించుటకు మున్ను స్థూలముగ తచ్చరిత్ర, తత్త్వము నిర్దేశించు టవసరము. భారతీయ సాహిత్యమునం దొక ప్రముఖ స్థానము నాక్రమించి అనితర విస్తృతి నందిన రాధాకృష్ణ సంబంధము మిక్కిలి ప్రాచీనమైన దనియు, నందలి యంశములు క్రమముగ భారత దేశము నందలి సమస్త కళా స్వరూపములను, ఆరాధనా మార్గములను ఉత్తేజ పరచిన వనియు చారిత్రికుల యాశయము. రాధకు స్వామితో అవిభాజ్యమైన స్థితి పురాణములందును, అర్వాచీన లౌకిక సాహిత్యము నందును, శిల్ప చిత్రకళ లందును, మిక్కిలి ప్రాచీనమైన శాసన వాఙ్మయము నందును ప్రసిద్ధమై యుండుట వారు నిరూపించి యున్నారు. అందలి ప్రసక్తాంశము లిందు గ్రాహ్యములు. ఈ అనుశీలనమున ప్రధానములుగ భావింపవలసినవి వామన పురాణ, దేవీ భాగవతములు. దేవీ భాగవతము నందు రాధ వృత్తాంతము బాగుగా విస్తృతము. వామన పురాణమునందు (21-48) రాధా వృత్తాంత మున్నది. మత్స్యపురాణమునందు (13-38) రాధ దేవీ దాక్షాయణితో నభేదము కల్పింపబడి, ద్వారకకు రుక్మిణివలె బృందావనమున కధీశ్వరిగ వర్ణితమైనది. రాధ యొక్క యీ బృందావన స్థితి స్కాందము నందు కూడ ఇతర వృత్తాంతములతో పాటు ప్రతిపాదింప బడినది. బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మ వైవర్త, పద్మ, గర్గ

సంహితాదులయందీ రాధా వృత్తాంతము విపులముగనే యున్నది. కాని, ఆంధ్రి వాఙ్మయమున సత్యధికముగ కృష్ణకథా వ్యాప్తికి మూల భూతములైన హరివంశ భారత భాగవతాదులయందీ వృత్తాంతము లేదు. కాని యింతగ విస్తృతమై కృష్ణతత్త్వము నందలి యొక మహోదాత్త దర్శనమునకు కేంద్రిమైన యీ వృత్తాంతము వ్యంగ్య నిగూఢ మార్గమున వీనియందున్నదని భావించి, తదర్థ నిరూపణము నెట్లో సాధించిన వారును కలరు. ఇందలి యథార్థమును సప్రిమాణముగ నిరూపించుట కష్టము. కాని, యూహ యందలి రమ్యతను మాత్రిము కాదనలేము. హరివంశ విష్ణుపురాణములందున్న సందర్భములలో గొన్నిటి నిందుల కుపస్కారములుగ గ్రిహించుట జరిగినది. హరివంశమున కృష్ణుని నృత్యమును గోపిక లనుసరించు ఘట్టమున స్వామి 'హే, హేతి..." (11. 21-33) యని పిలిచిన వైనమును పురస్కరించుకొని స్వామిచే నిట్లాహూతమైనది, రాధ గాని, చంద్రిముఖి యను నామె చెలిగాని కావచ్చునని యూహించుట జరిగినది. అట్లే విష్ణు పురాణమునం దితర గోపికలకన్న నెక్కువగ స్వామికి ప్రీతిపాత్రియైన గోపిక రాధయే యనియు, భాగవతమున గోపికలు స్వామి నన్వేషించినపుడు వారికి కన్పట్టిన పాదచిహ్నములు రాధకు సంబంధించిన వనియు, ఊహలు చేయబడినవి. మొత్తము మీద పురాణములందు భిన్నమార్గముల నీవృత్తాంత ముండియున్న దనియే ప్రిస్తుతాను శీలనమునకు వలసిన యంశము.

లౌకిక సాహిత్యమునందు ప్రాచీన ప్రిసక్తుల నుద్దేశించుట వలన నీయంశమునందలి ప్రాచీనత్వమును స్థాపించుట చారిత్రికుల ఆశయమైయున్నది. హాలుని గాథాసప్తశతి యందును వరాహ మిహిరుని బృహత్సంహితయందును, 7 వ శతాబ్దినుండి భిన్న భిన్న శిల్పములందును నీయంశము ప్రిచలితమై యుండుటను వారు నిర్దే శించి యున్నారు. అతిప్రాచీనమని చారిత్రిక విమర్శకులచే భావింప బడిన సిలప్పదిగారము నందును, తమిళ పురాణములందును ఈ

వృత్తాంతము వ్యాపించి యున్నది. పంచతంత్రాది గ్రంథములందును, వేణీ సంహారాది నాటకములందలి నాందీధ్యాన శ్లోకములందును, సంస్కృత ప్రాకృత సాహిత్యము లందును, బ్రహ్మవైవర్త మార్గమున ప్రచలితమైన వంగసాహిత్యమునందును, ఇట్లెన్నియో మార్గముల నీ వృత్తాంతము వ్యాపించి యున్నది. ఆ యీ వృత్తాంతముల క్రమ విస్తృతితో గాని పారమ్యముతో గాని యీ అనుశీలనమునకు సాక్షాత్ప్రసక్తి లేదు. గమనార్హమైన యొక యంశమును చెప్పుట కీ మాత్ర ముల్లేఖనము జరిగినది. ఏమన రాధాతత్త్వ వృత్తాంతముల ప్రాచీనాధునికత లట్లుంచి, భారతీయ సంస్కృతి సంతటిని మహోజ్జ్వల మార్గమున నుత్తేజ పరచినదీ దర్శనము. ఇందలి ప్రముఖాంశముల నీ క్రింది విధముగ నిర్దేశింప వచ్చును.

రాధ స్థితియందు రెండు విభిన్నాంశములు పురాణ ప్రోక్తమైన మార్గమునందు నెలకొని యున్నవి. అందొకటి పరమ తాత్త్వికము, దర్శనాత్మకము. సర్వ సృష్టికి కేంద్రమై యున్న గోలోకమునందీ రాధ, స్వామి హ్లాదినీ శక్తిగ మూలప్రకృతి స్వరూపముగ రాసమండలేశ్వరిగ, సర్వ జగన్మాతృ స్వరూపిణిగ నిరూపితయైనది. ఇందొక్కొక్క యంశ మొక విపుల దర్శనాత్మక సంహితగ రూపొందినది. ఇది ప్రస్తుతానుశీలనమునం దేకదేశ భాగముగ నుల్లేఖింప బడిన విశిష్ట పురాణము లందు వ్యక్తము. రెండవది లౌకికాంశమైన అర్వాచీన వాఙ్మయ మార్గము. ఇందు రాధకు సంబంధించిన తాత్త్విక ప్రతిపత్తితో నెట్టి సమన్వయము గోచరింపదు. వివిధ కావ్యములందు స్వల్ప భేదములతో ఈ కథ్యకు చెందిన రాధ శృంగారైక స్వరూపిణి. స్వామితో వివిధములైన చుట్టరికములను కలది. కొన్నిట వివాహిత మరి కొన్నిట స్వైరవిహారధీర. ఈ మార్గ మాంధ్ర వాఙ్మయమున నే గాక యితర వాఙ్మయములందును పర్యాప్తమైనది. ఇందులకు తమిళ పురాణ ప్రసక్తి నిరూపకమై గోచరించును. నాప్పిన్నాయ్, పిన్నాయ్ అను పేర్లతో ఈమె కృష్ణ

దేవుని శృంగార భావమునకు కేంద్రమై, సాక్షాత్తుగ స్వామికి వివాహిత యైనట్లు కూడ చెప్పబడినది. గోపికలు భర్తతో గలసి యమునాతీరమున నృత్యము చేసిన పిన్నాయ్ మనోహర సౌందర్యమును గానము చేయుదమని చెప్పికొన్న సందర్భ మిందున్నది.[98] ఇక వంగ సాహిత్యమున నామె లీలల కంతులేదు. భావార్ద్రత, ప్రేమైక లక్షణము నిండారగా వ్యాప్తి నందినవో తద్వ్యతిరేక లక్షణములు నంతియే. ఆమెకు స్వామితోడి చుట్టరికములలో ప్రముఖమైనది మేనత్తతనము. ఇందులకు మొదటి ఆకరమును నిర్బాధకముగ నిర్దేశించుటకు వీలుకాదు. ఆమె రాయణ యను పేరుగల వ్యక్తికి వివాహితయయ్యు స్వామితోడి సంబంధమును కల్గి యున్నదనియు, బాల్యము నుండియు స్వామి యామెను ప్రీత నొనర్చెననియు భిన్న వృత్తాంతములు ప్రచలితమై యున్నవి. ఇందనేక వృత్తాంతములకు బ్రహ్మవైవర్తమున మూలము లున్నవి. బంధుత్వము మాత్రము జనశ్రుతి వలన వ్యాప్తి నందినదే యని యెక్కువమంది యూహింతురు కాని యీ యూహనే మరికొంత కొనసాగించినచో, నంద వృషభానులకు కల పరస్పర సంబంధమును బట్టియు, హరివంశమున నీలా వివాహ సందర్భముగ నుక్తమైన కుంభకుని బంధుత్వ సామ్యమును బట్టియు నీ వృత్తాంతము క్రమముగ వ్యాపించి యుండె నన వచ్చును.[98a] ఎట్లైనను ఫలితాంశ మొక్కటియే. ఈ రెండవ మార్గమునకు చెందిన వృత్తాంతము లాంధ్ర వాఙ్మయమున కూడ వ్యాప్తి నంది యున్నవి.

రాధా తత్త్వమునకు ప్రముఖ మూలములైన బ్రహ్మవైవర్తాదుల యందే యీ కథ యందలి యర్వాచీన కల్పనములకు వలసిన బీజము లుండుట గమనార్హము. బ్రహ్మవైవర్తము నందలి శ్రీకృష్ణ

98. చూ. శ్రీ. వి. ఆర్. రామచంద్ర దీక్షితార్. శిలప్పదిగారము. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్సు. 1939. పుట-233.

98.a చూడుడు. కథానుబంధము.

జన్మఖండము నందలి వివిధ శాప వృత్తాంతములు పరిశీలించినచో నీ విషయము తేటతెల్ల మగును. శ్రీదాముని శాపము నందీ విషయములు గమనార్హములు :

‘మను జాంగనకుం బలె నీ
కును మానసమందుఁ జాలఁ గృథగల్గుటచే
జననీ, మనుజాంగనవై
మునుకొని వ్రజమూని యందుఁ బుట్టుము ధరలోన్.’

‘కళచేత చాయ చేతను
లలన! పరగ్రస్తవై కళంకిని వగుచున్
చెలువొప్పఁగో వ్రజంబున
సలలితముగ జారవృత్తిఁ జరియింపు మిలన్.’

‘నీవిచ్చిన శాపంబున
గోవిందుఁడు మందయందు గోపాలకుఁడై
యావిర్భవించు సుజనులఁ
బ్రోవఁగ దుర్జనులఁ బట్టి పొలియించుటకై’

‘అతివరో నందగోకులమునందు మనోవిభుఁ గృష్ణుఁ గూడియుం
చితగతిఁ గానలోన నివసించి రమింపుము కొన్నినాళ్లు స
మ్మతి నట నూరువర్షములు భర్తృ వియోగము గల్గు నివ్వలం
బతిసహితంబుగా మరల వచ్చెద వాత్మనివాస సీమకున్.’[99]

(శ్రీకృష్ణజన్మఖండము 1, 120–123)

ఇందే స్వామిని జారునిగ చోరునిగ ప్రసిద్ధులనట్లు రాధ శాపమున్నది. ఆమె మూఢుడైన రాయణ పత్నియను వృత్తాంతమునకును బ్రహ్మవైవర్తము నందే ఆకరము లభించుచున్నది. “మూఢ రాయణపత్నీ త్వాం వక్ష్యంతి జగతీతలే...” (తృతీయాశ్వాసము–

99. గోపీనాథ వేంకట కవికృతము. చెదలవాడ సుందరరామశాస్త్రుల వారిచే పరిష్కృతము. శారదాంబా విలాస ముద్రాక్షరశాల ముద్రితము, 1889.

103 వ శ్లోకము ) ఈ పరిశీలనము వలన రాధా వృత్తాంత మౌలిక సందర్భముల స్థితి వ్యక్తమగుచున్నది.

మరియొక యంశము. అది రాధా కృష్ణుల పారస్పర్యమునకు సంబంధించినది. వారిరువురి పరస్పరానురాగము బ్రహ్మవైవర్తాదులం దనన్యముగ కీర్తింప బడినది. ఒకరి నొకరు వీడి క్షణమైనను నుండలేని వారనియు, శరీరములు వేరైనను ప్రాణమొక్కటియే యనియు, అగ్ని యందు దాహకత్వమువలె, శీతకరు నందు వెన్నెలవలె వారి తత్త్వములు పరస్పరావిభాజ్యములనియు, భిన్న సందర్భములం దుక్తమైనది. దీనిని బట్టి సర్వసమగ్రమైన స్వామి పురుష తత్త్వమునకు మూల ప్రకృతి రూపముగ, సమస్త సృష్టి కాధార భూతమైన స్వామి చిచ్ఛక్తిగ రాధాతత్త్వము దర్శింప బడినది. తక్కిన నాయికలందున్న విధాంశములు కరువునఁ బోసి రూపొందించినచో రాధాతత్త్వ మనుమేయమాన మగుచున్నది. దీనిని బట్టి యసలు స్వరూపము ప్రకృతియనియు, గోలోకాది వ్యూహములచే నిది గమ్యమాన మనియు వ్యక్తము. నిరుపాధికమైన బ్రహ్మానందతత్త్వము సాకారమై సర్వ గమ్యమై అవతరించినది కృష్ణ తత్త్వము. దాని చేతనా స్వరూపమై అనుభవ కర్తృత్వయందు దానిని నిరూపింప జేయు సంధాన స్వరూపమగు రాధను కీర్తించిన కావ్యములును కలవు. స్వామి గోపికల యెడ ప్రసన్నుడగుట యను నంశము ప్రసక్తమైనపుడు, విశిష్ట పురాణములం దన్నిట రాధయే అందులకు వాహికయై యుండుటను బట్టి యిట్టి పెంపుదల సాధ్యమైనది. ఆమె స్వామిపై నధికారము నెరపుచు, స్వామికి విధేయమై ప్రవర్తింపుచు, భిన్న భిన్న పాత్రలకు స్వామి తత్త్వమును పంచి పెట్టును. ఇతర గోపికల అనుభవ వాహిని కామె మార్గమును సూచించును. ఒక స్థితి అనుభవ వాహిని తానే యగును. ఇట్లు పురాణములందు రాధాతత్త్వమునకు సంబంధించిన భిన్నచ్ఛాయలు నిరూపితములైనవి. సాధనా ప్రతీకగ రాధను గూర్చి యనేకాంశములు వివృతములైనవి. కృష్ణానుగ్రహము

నందుటకు రాధా మార్గము సర్వ సంపన్న మైనదని యందు సూచిత మైనది. "మరియు రేఫకారంబు కోటి జన్మార్జితంబైన శుభా శుభ కర్మ ఫలంబు హరించి కృష్ణపదాంభోజ భక్తియును, దాస్యంబును, వాంఛి తార్థంబు నొసంగు, నాకారంబు జన్మ మృత్యు జరారోగం బుల నశింపఁజేయు, ధకారంబు భవబంధంబుల నడంచి దీర్ఘాయువు నొసంగి కృష్ణు డెంతకాలంబుండు నందాక, దత్సహచర్యంబును సార్ష్టి సారూప్యంబులను తత్త్వజ్ఞానంబు నొసంగు. రెండవ యాకారంబు బ్రహ్మ తేజంబున దానశక్తియు, యోగశక్తియు, సర్వకాల హరి స్మరణంబు నొసంగు." (శ్రీకృష్ణ జన్మఖండము. 2-185.) స్వామియే యిట్లు చెప్పినాడు. "రా శబ్దము పఠియించిన నో శశిముఖి వాని కిత్తు నుత్తమ భక్తిన్, ధా శబ్దము పఠియించిన వేసర చరియింతు వెంట నిడియెడు వాంఛన్." (పూర్వోక్త గ్రంథమే. 2-305) ఇట్టి సమ న్వయ విశేషములే గ్రంథాంతరము లందును కలవు. భారతీయ సంస్కృతి యందొక ప్రముఖ భాగమై ఆరాధనా మార్గముల ననన్య ముగ నుత్తేజపరచిన పరమాద్భుత శక్తి స్వరూపమీ రాధాదేవి.

ఇట్లు పరమోదాత్త తత్త్వమునకు, సామాన్య మానవకథా విలాసమునకు ఏక కాలమందు ప్రాతినిధ్యము వహింప గల్గుట రాధా తత్త్వ ప్రత్యేకత. ఆంధ్ర వాఙ్మయమునందీ వృత్తాంతము ననుశీల నము చేయుటకు మున్నుగ నందలి క్రమ వికాసమును స్థూలముగ నిర్దేశింపవలసి యున్నది. ఆంధ్ర వాఙ్మయమున కృష్ణకథ భాగవత ప్రోక్తమైన కథా సంవిధానమే ప్రధానమై భాసించినది. అర్వాచీన మైన ప్రబంధ యుగమున శృంగార ప్రధానమైన కథాసృష్టికే ప్రాధాన్యము లభించినది. అనంతర కాలమందు కొలదిగ బ్రహ్మ వైవర్తాదుల యందున్న కథా వృత్తాంతములకు ప్రాధాన్యము వచ్చి, కొన్ని మూల గ్రంథాను వాదములు వెలసినవి. నవ్య యుగము నందు కావ్యనాటక వాఙ్మయమున రాధ యుత్తమ తత్త్వమునకు ప్రాధాన్య మేర్పడినది. నవ్యులీ వృత్తాంతమును భిన్న భావ ...

కేంద్రీయముగ దర్శించి ప్రదర్శించినారు. ఆ యీ యంశముల క్రమానుశీలన మొనర్చుటయే యిందు ప్రసక్తము. ఇందలి ప్రణాళికలో స్థానము లభింపని కతిపయాంశములు పరిశిష్ట భాగములం దుల్లేఖితములైనవి. ఇది రాధాకృష్ణ కథాంశముల అనుశీలనమునకు భిత్తికాప్రాయముగ నుద్దిష్టము.

రా ధా మా ధ వ ము

ముఖ్యముగ పరిశీలింప దగినది చింతలపూడి ఎల్లన రచించిన రాధామాధవము.[100] రాధామాధవ కావ్యకర్తలలో నీతనిది ప్రథమస్థానమే కాదు, ప్రధాన స్థానము కూడ. రాధాకళ్యాణమును రుక్మిణీ కళ్యాణ మార్గమున నీతడు తీర్చి దిద్ది యుండుటవలన భాగవత మార్గము నందలి ప్రసిద్ధిని, రాధా వృత్తాంతము వలన నవ్యతను సాధింప గల్గినాడు. శ్రీకృష్ణ దేవరాయలచే 'రాధామాధవ కవి పురస్కార' మందుట యీతని యౌన్నత్యమునకు హేతువు. కావ్యపు మూస రుక్మిణీ కళ్యాణ మగుట వలనను, కరగించి పోయ వలసిన వృత్తాంతము రాధకు చెందిన దగుట వలనను, ఈతడు భిన్న సందర్భము లందు స్వోపజ్ఞ కాల్పనికాంశముల జేర్పవలసి వచ్చినటి. ఆ కార్యము నీతడు మిక్కిలి సమర్థముగ నిర్వహించి యీ ప్రబంధమున నొక రమ్యకథా శిల్పాకృతిని చేకూర్చినాడు. దీనికి తోడు రాధామాధవకవికి పరమ రమణీయమైన భావనా శిల్పము, ప్రౌఢ సుందరమైన రచనా శిల్పము కలవు. పరమ సాంప్రదాయిక విజ్ఞాన మీ యంశములకు దోహద మొసంగినది. ఫలితముగ రాధామాధవ ప్రబంధ మత్యున్నత స్థాయి నార్జించుకొన్నది.

కథావతరణము నందలి శ్రోతృ సంప్రశ్నమున రాధా ప్రాధాన్యము వ్యక్తముచేసినాడు కవి. స్వామి అష్టమహిషుల యందును, పదారువేల గోపికలయందును ప్రదర్శించిన శృంగార భావోజ్జ్వల్యము ప్రసిద్ధము. వారికన్న మిన్నగా రాధయందు స్వామి

100. కపిలేశ్వర పురాధినాయక ప్రకటితము. 1936.

మనస్సు లగ్నమగుటకు కారణమేమి? అను ప్రశ్నము కథా సూత్రము నకు వ్యాఖ్యాన ప్రాయమై యున్నది. సాంప్రదాయిక మార్గమున పరీక్షిత్తు శ్రోత. శ్రీశుకులు వక్త. కథావతరణ వ్యూహము నీతకు తీర్చిన పద్ధతియు రమ్యమై యున్నది. ఇందు సాధారణాభి ప్రాయములకు, విశిష్ట పురాణ మార్గములకు భిన్నముగ రాధయందు రమాంశము నారోపించినాడీకవి. దీనిని నిరూపించుట కొక కల్పనము చేయవలసి వచ్చినది. చింతలపూడి ఎల్లన కాల్పనిక కళయందు సిద్ధ హస్తుడను విషయమున కిది నిరూపకముగ నున్నది. శ్వేతద్వీపవాసి యగు నారాయణునికడ కొకనాడు పరమేశ్వరుడు వచ్చినాడు. ఆ యుభయుల పరస్పర సమాగమము, పరస్పర గౌరవ ప్రకటనము నకు, ప్రీతికి, తావలముగ తత్త్వస్ఫోరకమై చిత్రింపబడినది. శివుడొక నూతన వృత్తాంతమును తెల్పెను. స్వామి రామావతారమున నున్నపుడాతనియందు లక్ష్మీదేవికి ప్రీతి కల్గినదట! శివుడామె కోరికపై శంభుభట్టారకుడను వేషమును ధరించి యామెను వెంట నిడుకొని రాముని కడకేగ, ఏకపత్నీవ్రతుడైన రాముడామెను నిరాక రించెను. ఇప్పుడు స్వామి కృష్ణావతారము నందున్నాడు కావున, నామె హృదయగతమైన వాంఛ నీయవతారముననే తీర్పవలెనని శివుని యాశయము. స్వామి వల్లెయని అవతార ప్రయోజనములలో దీనినికూడ చేర్చి ప్రవర్తింప జేసినాడు. ఈ కల్పనమునందలి రమ్య త్వముతోపాటు స్వామికి రాధ పరకీయ కాదను విషయము నీతడు నిరూపింప యత్నించినట్లు వ్యక్తమగుచున్నది. అటుపై స్వామి బాల్య క్రీడాదులు, యౌవన ప్రాదుర్భావము మున్నగు విషయములు రమ్యముగ నిరూపితములైనవి. ఇందు ఎల్లన చిన్న చమత్కార పూరితమైన కప్పదాటు వైచినాడు. స్వామి తన అప్రాకృత రూప మున తల్లి దండ్రులైన దేవకీ వసుదేవుల యనుమతితో వ్రజమునకు వచ్చి నందయశోదల కూర్మిపుత్త్రుడై చరించినట్లు చెప్పబడినది. దీని వలన నందవ్రజమే కథారంగమగుట యను సౌకర్యము, బాల్య

వృత్తాంతములలో కంస వధాదుల పరిహరించుటవంటి కథాక్లుప్తి, సిద్ధించినవి. బృందావనమునకు చెంతనేయున్న యొక మంద కేలికయైన సహస్రగోపునికి రాధ శివప్రసాదమున జన్మించి మహాద్భుత సౌందర్యవతి యైనది. నారదుడు నందవ్రజమునకు వచ్చి స్వామిని స్తుతించి, రాధా సౌందర్యము నుగ్గడించి తానొక త్రివిధాత్మక ప్రయోజనమును సాధించుకొనెను. స్వామియెడ భక్తి ప్రకటన, శృంగార సాహాయ్యకత్వము, కలహాశనత్వము. స్వామి రాధాగతమైన విరహము నందినాడు. పిమ్మట స్వామి పక్షమున శారద రాధకడకు బోయి శృంగార సంధాత్రిగ వ్యవహరించినది. అటుపై నాయికా విరహము. సహస్ర గోపుడు రాధ వివాహమును గూర్చి తలపోసినపుడాతని పుత్రుడైన భద్రకుడు స్వామి దుర్గుణముల నుగ్గడించి రాధాకృష్ణ వివాహమునకు సమ్మతింపకుండుట రుక్మిణీ కల్యాణ కథామార్గమున సాగివచ్చినది. ఈ సన్నివేశమున నాందోళనము నందిన సహస్ర గోపుడు శివునిగూర్చి తపమొనర్చి యాతని వలన స్వయంవర ప్రకటనము నీ సమస్యకు పరిష్కారముగ నంది, సర్వము శుభాంతమగు నన్న యాశీస్సును పొందినాడు. స్వయం వరమున బ్రాహ్మణి పెంపుడు చిలుక సర్వవిద్యా వైశద్యమును కల్గినది కావున, రాజపుత్రుల పరిచయ మొనర్చు కార్యమును నిర్వహించినది. స్వయంవరానంతరము జరిగిన మహాయుద్ధమున భద్రకుడు, కాలగ్రీవుడను రాక్షసుడు, ఇతర రాజన్యులు స్వామిచే పరిభూతులైరి. స్వామి భద్రకు నవమానించుట విలక్షణమై యున్నది. స్వామి యాతనిపై వికటనారీ గర్భమను అస్త్రమును ప్రయోగింప నతడు మర్కటాకృతి నందెను. రాధ కోరికపై స్వామి వానికి యథాపూర్వ రూపమును ప్రసాదించెను. స్వామి యట్లు విజయియై, మదనగోపాలమూర్తియై, మహత్తర విభవమునకు కేంద్రముగ నందవ్రజమున నొప్పారెను.

ఈ కథా కల్పనమున రుక్మిణీ కళ్యాణచ్ఛాయ స్పష్టము. నారద

వాణీ దౌత్యాదులు, కీరవృత్తాంతము పురాపసిద్ధ కల్పనలే. రాధ రమాంశము, శివుడు నిర్వహించిన పాత్ర, ప్రధానముగ జెప్పదగినవి.

ఈ కథ కల్పనయొక యెత్తు. కవి ప్రదర్శించిన రచనాశైలి యొక యెత్తు. నారదుడు కృష్ణసందర్శనమునకు వచ్చినపుడును ఇతర స్థలములందును ఈ కవి శతక రచనమును బోలిన భక్తి ప్రధాన రచనమును ప్రదర్శించినాడు. వర్ణనాశిల్ప మీ కావ్యమున ప్రబంధోచిత మార్గమున పెక్కు సందర్భముల భాసించియున్నది. కొన్నియెడల అచ్ఛమైన భావసౌకుమార్యమునకీ వర్ణనాసందర్భములు నిలయములగుట ఎల్లనార్యుని ప్రత్యేకత. స్వామి రాధను పెండ్లాడఁబోవుచుండెనని విన్న గోపికల వర్ణన మిట్లున్నది.

"మేను మాఱ్పడ నొక్క మెలఁత యూరకయుండె
ఘర్మాంబువుల దోఁగె గాంతయొకతె
యశ్రులు దొరగించె నలివేణియొక్కతె వై
వర్ణ్యమునుఁ బొందె వనితయొకతె..." ( 4-18 )

లోనుగానున్న వర్ణనమున స్తంభము, స్వేదము, అశ్రువులు మున్నగు సాత్త్విక భావములు మనోహరముగ వ్యంజ్యములు.

"పూరించెన్ హరి పాంచజన్యము జగత్పూర్ణ ప్రభాధన్యమున్
ధీరధ్వాన కుతారలూన దనుజస్త్రీ స్మారముద్యన్యమున్..."
( 4-32 )

వంటి పోతనామాత్యుని ముద్ర కల్గిన పద్యములిందనేకములున్నవి. చిన్నమాటలలో ప్రసక్త రసభావస్ఫూర్తిని కలిగించు చిక్కని పదముల యొదుపు ఎల్లన కున్నది. భద్రుకుడు స్వామి బాణమువలన నందిన రూపవైకల్య మిట్టిది.

'ఎక దిగబారిన చన్నులు
చికి చికి వెంట్రుకల కొప్పు చిరుత పిరుందున్

వికటపు మోముం గల్గిన
కకిబికి యంగమున నొక్క క్రొత్తై నిలిచెన్ ' ( 5-108 )

ఈ ప్రబంధమున గమనింప దగిన రూపచిత్రణ వైభవము స్వామి మదన గోపాలాకారమున నీతడు ప్రదర్శించినాడు. స్వామి రాధికను పెండ్లియాడి సమస్త దేవతాసేవిత విభవమూర్తియై విరాజిల్లినాడు.

" యమునాతటంబున నమర భూజమునీడ
మహనీయ కర్పూరమంటపమున
పుష్పసింహాసనంబున రాధవామాంక
పాళిక లీలాంకపాళిఁ దనర
ధవళ ముక్తాతపత్ర ద్యుతుల్ నిగుడఁ జా
మరముల ననుగాలిఁ గురులుదూల
నాభీరకన్యా సహస్రదృక్చంద్రిక
లర్చనా పుష్పోపహారముగ
హార కేయూర మకుట మంజీర మకర
కుండల శ్రీలు దిక్కుల నిండుకొనఁగఁ
గొలువుఁ గూర్చుండి గోగోపకులము గొలువ
సమధికస్ఫూర్తి గోపాల చక్రవర్తి-"( 5-264 )

ఈ వర్ణనము నందలి వైభవమే సర్వకథా ధ్యేయమైన మదనగోపాల తత్త్వముగ నీతడు తీర్చి దిద్దినాడు. ఎల్లనార్యుని కవిత్వమునందు క్తి విశేషములు, సముచిత సంభాషణావైఖరులు, స్పష్టమైన పాత్రచిత్రణారీతి యున్నవి. తావన్మాత్రమైన కృష్ణ తత్త్వమును, రాధాతత్త్వమును మాత్రమే యీతడు ప్రతిపాదించుటకును, ఇతరేతర తాత్త్వికార్థ స్ఫూర్తులను త్రవ్వి తలకెత్తుకొండుటకును కారణ మీతని ప్రతిభా దారిద్ర్యము కాదు. మరి ప్రబంధయుగపు లక్షణముల యొత్తిడి. ఎట్లయినను నాంధ్ర వాఙ్మయమున రాధాకృష్ణ కథాసాహితి కీతని ప్రారంభము గంభీరముగనే యున్నదని చెప్పవచ్చును.

రామకృష్ణుని రాధ

రామకృష్ణుని రాధ స్వామి మనః ప్రీణనమునకై పరమేష్టి చేత సృజింపబడినది. తపోమార్గమున స్వామితోడి యైక్యమును సాధించిన మహాతత్త్వమునకు ప్రతీకగ ప్రకృతి స్వరూపముగ రామకృష్ణుడీ పాత్ర ననన్యముగ తీర్చియున్నాడు. రాధ నందుని మరంది యైన శతగోపుని పుత్రిక. [101] ఆమె నిఖిల భువనైకమోహిని, శక్తి స్వరూపిణి. ఆ శక్తి భువనము నందలి మోహినీశక్తి. మోహినీ శక్తి ప్రకృతి శక్తులలో నొకటి. ఈ సృష్టియుద్దేశ్యము కూడ స్వామికి మనఃప్రీణనము కల్పించుట. విశ్వవిరాడ్రూపుడైన పురుషునకు విలసన పూర్వకమైన ఆనందమును కల్పించుట. స్వామి తత్త్వమున ప్రకృతి శక్తులైన యిచ్ఛ, క్రియ, జ్ఞానశక్తులు సమ్మేళనము నందనిదే ఏ యవతారతత్త్వ ప్రయోజనము సంపూర్ణముగ నెరవేరదు. వాని కతీతమైన మోహనత్వ లక్షణమే యిందు స్వామి నాశ్రయించినట్లు గమ్యమానమై, యితరావతారముల కన్న నిందలి ప్రత్యేకత గమ్యమానమై యున్నది. రాధను వర్ణించుటకు లోకమునందున్న ఉపమా సామగ్రి నంతటిని కడముట్ట వాడి విడిచినాడు రామకృష్ణుడు. ప్రకృతి సౌందర్యమునకు నిలయములైన వస్తు సముదాయము, కవిసమయము లనెడు సామాన్యస్థితిని దాటి ప్రకృతి స్వరూపముగ దర్శింపబడవలె ననియు, ఈ దర్శనమునకు పూరకమైన యంశము స్వామి పురుషత్వ మనియు నిరూపించి, యాలంకారిక సమయముల అంతస్తత్వము నీతడు ధ్వనింపజేసినాడు. "బిసరుహానన కటిసీమ పృథివి యగుట నిక్కమాటు గాక యున్న బైనెలవు గొనునె? కాంచియును మధ్యమాయయుఁ, గమ్రనాభిలక్ష్మియును ద్వారవతియు లక్షణముగ" (3-184)

---

101. రాధ తండ్రి పేరు భిన్న పురాణముల భిన్నరీతిలో నున్నది. బంధుత్వ సూచన మున నిది గమనార్హమైనది. జనశ్రుతితోఁ బాటిట్టి సందర్భములు పౌరాణిక వాఙ్మయమునను, అర్వాచీన గ్రంథములందును వ్యాపించినవి.

ననియు, "వాసుదేవాది నవశక్తి వైభవంబు రుక్మిణీ సత్యభామల రూప రేఖ యిదియె వహించునన నల్వ యిడిన ఏడునొకంటి లెక్కన కను బొమ్మలు విదకనురు" (198) ననియు చెప్పుట యిట్టి ప్రత్యేకతకు నిదర్శనము. దీనిచే వాసుదేవాది తత్త్వములును, రాధ సమగ్ర నాయికా లక్షణములును వ్యక్తము లగుచున్నవి. ఇట్టి రాధాకృష్ణులు పరస్పరాను రాగమునందిరి. తద్వర్ణన మిట్లున్నది :

"ఈ ధారన్ భువనైక మోహన కళాహేలా విలాసంబులన్
రాధాకన్యక ధన్యకాంతిఁ దనరారన్ దద్విశారతిన్
గోధుగ్బాలక దివ్యమూర్తి యగు శ్రీగోవిందుఁ డంభోజినీ
మాధుర్యంబున కగ్గలించు నళిసమ్రాడాకృతిం గైకొనెన్."
(3-203)

ఇందలి వర్ణనా వస్తు సామగ్రి చేత ఈ వృత్తాంతము పూర్వ నిర్దిష్ట మైన సమాజ ప్రకృతిపురుష సమ్మేళనము ననుకరించినది అను విష యము ధ్వనితమైనది. స్వామియెడ రాధ యనురాగము దిన దిన ప్రవర్ధమానమై చిగురుకొమ్మ యందలి చేవవలె గట్టిపడినది. ఆమె స్వామిని తనకు అధినాథునిగ కోరెనని చెప్పుట విశేషము. ఆమె యందులకై తపశ్చర్యకు పూనుకొన్నది. స్వామిని నాథునిగ ఇతరుల వలె పొందుటకు తపస్సక్కరలేదు. అధినాథునిగ పొందుటకు దప స్సొక్కటే మార్గము. ఇటుపై రాధ తపస్సు సుదీర్ఘముగ వర్ణితమై నది. గమనింప దగిన విశేషము పరమేశ్వరునికైన పార్వతి తపస్సుతో దీనికి సామ్యము. దీనివలన రాధాకృష్ణ తత్త్వమునకును, శివపార్వతీ తత్త్వమునకును బ్రహ్మాండ పురాణోక్తమైన సామ్యము నీతడు ప్రసక్త మొనర్చినాడు. రాధ తపోవేషము మున్నగు నంశము లన్నియు ఈ వృత్తాంతమునకే నిరూపకములై యున్నవి. తపస్సు హేమంతమున ప్రారంభమై యొక యావర్తము తిరిగి శరత్తున ఫల వంతమైనది. ఈ మొత్తము కథలో ప్రకృతి, కాలము, తత్పరి

గామము, మున్నగు సర్వాంశములు తపస్సున కున్ముఖములై వర్తిల్లి నట్లు చిత్రించుట మహత్తర శిల్పము. సాధారణ కవులిట్టి రమ్యార్థ స్ఫురణములను కేవల సౌందర్యాపాదకములుగను, చమత్కృతి సందర్భములుగను నిర్దేశించుట కద్దు. రామకృష్ణు డిట్టి వానిని కావ్య గత మహార్థోన్ముఖములుగ పర్యాప్త మొనర్చును. అట్టి దాతని ప్రౌఢోక్తి చాతుర్యము. తపస్సందర్భమున ప్రకృతి యంతయు సర్వ దైవత సమాశ్లిష్ట మార్గమున వ్యాపించినది. దీపము పోగా చీకటి, కోపము పోగా శాంతము వలె, కారుకాలము వచ్చినది. కోకిల నీలము, జలధరపాకము శివస్వామి కంఠ నీలిమవలె నున్నవి. షణ్ముఖ వాహనము సకిలించుట మున్నగు నీ వర్ణనము లన్నియు కాలస్వరూప వ్యాఖ్యానములు ఈ కాలస్వరూపుడు శివస్వామి. వానిని తనలో నాహరించుకొనుట రాధ తపస్సు నందలి యాంతర్యము. ఇప్పుడు స్వామి యామెకు ప్రసన్ను డగుట యనగా పార్వత్యంశముగ తనలో నీవరకే లీనమైయున్న ప్రకృతి స్వరూపమునకు తోడుగ స్వామి యీ కాల స్వరూపమును కూడ తనలో లీన మొనర్చుకొనుట. ఈ యర్థముకూడ బ్రహ్మాండము నందున్నదే.[102] అందు వలననే స్వామి రాధకు ప్రకృతి స్వరూపముగ సాక్షాత్కరించినాడు. "ఇంద్ర చాపంబు గాదిది మౌళితలమున నవరించు బర్హిపింఛంబుగాని, భిదుర ఘోషంబుగాదిది పాంచజన్య సంజాత గంభీరఘోషంబుగాని, యాశ్రయించిన బలాకావళి గాదిది మరి ముక్తాహార యష్టిగాని ..." ( 4-31 ) వంటి వర్ణనము లిందు లకు నిదర్శనములు. నీలగిరి నాశ్రయించిన వెన్నెల నిగ్గువలె స్వామి రాధ యగ్రమున నద్రిజ నేలిన శూలిపోలిక నిలిచినపుడు చరాచర సృష్టియంతయు నొక్కయూపున సంచలించినది. రాధా సంగము ముది తుడైన స్వామిని గని యోటువడిన రీతిగ శంపాధరము తెరలినది, నీలాంజనవర్ణుడైన స్వామి లీలావతియైన రాధను పెనగినపుడు ప్రకా

102 చూ : కథానుబంధము.

శించు చున్న రీతిగ, కాలమే శరత్సమాగమ హేలాగతి నందినది. ఈ సర్వ కాల స్వరూప ప్రకృతి స్వరూప సంచలనము లన్నిటిని తనలో లీనముచేసికొన్నట్లు "...ముదిత శతగోప కన్యకా వదనతులిత లలిత రుచిబొల్చె రాకాకశాధరుండు" ( 4-37 ). శివసారూప్యస్ఫూర్తి రమ్యమై కథార్థమును వ్యాఖ్యానించుచున్నది. ఇటుపై ప్రకృతి యంతయు రాధా మాధవ శృంగార విలసనముల కాకృతి కల్పనమే. స్వామి రాధ పెదవులనుంచిన దంతక్షత రేఖలవలె కొత్తమంకెన పూలపై తుమ్మెదలు వ్యాపించినవి. పాంచజన్యము రాధ కంధర కోడిపోయినది. స్వామి సప్తస్వర విన్యాస పూర్వకమైన మురళీ రవ మును వ్యాపింపజేసి "...కృశోదరీ సహాయుడై మాయా శబలితుం డగు జీవపురుషుని వరుసన వివిధ భోగ పరాయణుండై" ( 4-45 ) ప్రవర్తిల్లినాడు. ఈ విధముగ రాధాకృష్ణ సమాగమమును రామ కృష్ణుడు తపస్సిధ్యమై ప్రకృతి పురుష కాల స్వరూపములను మూడు కేంద్రములలో విలసిల్లిన మహాయోగముగ తీర్చిదిద్దినాడు. ఇది అనన్యమైన సంప్రదాయము, అర్వాచీను లెవ్వ రనుసరింప జాలక పోయినది.

దశావతార చరిత్రము

ఇటుపై ఆంధ్ర వాఙ్మయమున రాధ జాతకము మారిపోయి నది. సప్తమమున కుజ శుక్రులు తాండవ మొనర్చినారు. పచ్చి శృంగారమునకు, ప్రాకృత భావ విలసనమునకు తావలమై రాధా కృష్ణ సాహిత్య స్రవంతి అర్వాచీన ప్రబంధము లందును, సాంత్వన కావ్యము లందును వీధి కాలువయైనది. మరియొక సందర్భమున చెప్పినట్లు సదసదంశములు రెండును సమగ్రతకు కారకములు గావున, నట్టి గ్రంథముల ప్రసక్తి యించుక యిందు తప్పనిసరియైనది. అట్టి వానిలో మున్ముంగ ధరణి దేవుల రామయ్య మంత్రి దశావతార చరిత్రము[103] నందలి ప్రసక్తాంశముల గమనిక యిట్లుండును.

103. వావిళ్ళ ప్రచురణము- 1926.

కావ్యరచనా సామర్థ్యమే ప్రసక్త విషయమైనచో నీ కవి రచనాశక్తి గొప్పదని చెప్పుట కెట్టి యభ్యంతరమును లేదు. దశావతార చరిత్రము నందు రామకృష్ణావతార వృత్తాంతముల నీతడు గైకొని విడంబించినాడు. అందు బలరామ చరిత్రము సర్వసమగ్రమైన శిల్పాకృతిగ రూపొంది యున్నది. వస్తు తత్త్వము నందలి వైవిధ్యమును బట్టి కృష్ణావతార వృత్తాంతము యొక్క సంక్షేప కథనము (దాదాపు 272 గద్యపద్యములు) పాఠకుల హృదయముపై సమగ్రమైన ముద్ర వేయలేక పోయినది. సంక్షేప మార్గమున సర్వకథా వృత్తాంతములను చెప్పునట్టి కావ్యనాటకముల కీ స్థితి సామాన్యము. బాల్యము మొదలుకొని అవతార సమాప్తి వరకున్న యీ ప్రసక్తాశ్వాసమున రాధావృత్తాంతము నిట్లు రచించినాడు.

నందుని యింట రాధయను కన్యకలదు. సౌందర్యవతి. స్వామి బాల్యము నుండియే దాని మదికెక్కినాడు. తొడలపై నుంచి యుగ్గు పెట్టినపుడు వానిని పుడికి చూచుట, పయ్యెద జార్చి కౌగిలించుట, ముద్దు పెట్టుమని కోరినపుడు చెక్కుమీటి చుంబించుట వంటి గడుసుదనములతో (ఇవి ప్రాథమికములు. ఇంకను పై స్థాయి పనులున్నవి!) స్వామి యామె కడనే పెరిగి యెవ్వరు పిల్చినను నిలువక యామెకే మచ్చికయైనాడు. (ఇటుపై స్వామి బాల్యక్రీడలు పురాణ ప్రసిద్ధ మార్గమున వర్ణితములైనవి.) స్వామి యేడేనిమిది వత్సరముల ప్రాయమున గోపసహితుడై నురికొన్ని కాయకపు పనుల పచరించినాడు. నా బంతి దాచుకొన్నచో విడుతునా యని గుబ్బలంటి చూచుట, యీ ముడి యేమి? యని పోకముడి విప్పుట మున్నగునవి యిందుల కుదాహరణములు. ఇంతలో కుంభక పుత్రికయైన నీలతో స్వామికి వివాహమైనది. కాపురమునకు వచ్చిన నీల రాధపట్ల సోదరీ భావముతో మసలు చుండెడిది. అప్పటికి స్వామికి పదిమూడేడులు. చిన్ననాటి నుండి రాధపై కన్ను వేసి యున్న స్వామి యామెం పొందుగోరి సన్నలుచేయ నారంభించినాడు. ఆ వైనమిట్లున్నది.

"ఒంటిపాటునఁ గౌఁగి లోఁగుఁ దత్తరముతో నంతలో పలుమఱు నలుకుడైన, మైమైఁ జూచుచు నెఱుఁగని రీతిని మారు మోమునఁ జెంతఁజేరి నిలుచుఁ, గట్టుకొంగెడలించి గట్లు నల్లల్లన గంభీరనాభికిఁ గంటఁ జూడ..." (62) ఈ రీతి రాధ కృష్ణుని వలకు తగిలినది. అటుపై విపులముగ స్వామి గోపికా బృందముతో సల్పిన రతిక్రీడలు వర్ణితములైనవి. ఇందు స్వామి రతిక్రీడా సామర్థ్యము వారికి దేవతాంశను స్ఫురింపఁ జేయునట్లున్నది! పాలు చల్లారబెట్టి ప్రాలు మాలికగ పవ్వళించిన రాధ, గోపాల గీతము చెవిని బడినపుడు లేచి పాలను భ్రాంతితో మజ్జిగలో తోడుపెట్టి, శృంగారించుకొని వచ్చి, స్వామి గోపికలతో విహరించుచున్న వైనమును కనులతో చూచి గిరుక్కున తిరిగి పోయినపు డొక చిలుక వచ్చి యామె ననునయించినది. ఒక పొదరింట రాధ పరుండి స్వామిని దూరుచుండ, స్వామి యామె రాకపోకలను గమనించెనేమో! వచ్చి తన నేరమును సైపుమని ప్రార్థించి యామెతో రమించెను. పిమ్మట గోపికల అన్వేషణమున సందర్భోచితమైన తాత్త్విక ప్రవచన మతుకని యాభరణమై యున్నది. గోపికల యన్వేషణ ఫలితముగ స్వామి వారికి ప్రత్యక్షుమైనపుడు, వారాతని శరీరమున రతి చిహ్నములను చూచి ధర్షించిరి. ఆతడు కలరూ పెరిగించి రాధను కూడఁ గట్టుకొని విహరింపనిచో తమ గుట్టు రట్టు కెక్కునని చెప్పినాడు. వెలదులు రాధను కలిపికొని జలక్రీడ నొనర్చిరి. ఈ జలక్రీడా వర్ణనము మనోహరమై యున్నది. ఇందు వెలదుల యవయవముల వర్ణించుచు స్వామి దశావతారముల స్ఫురింప జేయు శిల్పమున్నది. పిమ్మట వారు స్వామి నలంకరించి బరాబరులు చేసిరి. స్వామి రాధ నంకమున నుంచికొని కొలువు తీర్చెను. వారు మరల రతిక్రీడ సల్పి (పునారతి కాబోలును!) ప్రాతఃకాలమున నెవరి యిండ్లకు వారు పోయిరి. రాధాకృష్ణులలో రాధ యిందు ముంగి ముచ్చు వంటిది. స్వామి జానపద శృంగార నాయ

కుని వలె దూతుడు తత్త్వము వాడు. రాధాకృష్ణ పాత్రలాలంబనము లుగ నొనర్చి యుద్వేల శృంగారమును వర్ణించు మార్గము నీ కవి ప్రారంభించినాడు. ఇది అర్వాచీన కవులకు, కవయిత్రులకు నుపాదేయమైనది. మొత్తము మీద రాధాకృష్ణ శృంగార పరిణత చరిత్రమున నిది మొదటి యధ్యాయము.

### రాధామాధవ సంవాదము

ఇంతకన్న రచనాది గుణములలో మేలితరమై రాధాకృష్ణ వృత్తాంతమును సంపూర్ణ ప్రబంధ వస్తువుగ స్వీకరించినది వెలిదండ్ల వెంకటపతి. రాధామాధవ సంవాదకర్త.[104] ఇతడు మహత్తర శిల్పి. మనస్తత్త్వపు లోతుల నెరిగి రచించు నేర్పరి. అచ్చ తెనుగునను, తత్సమ మిశ్రమమునను కండ చక్కెర వంటి శైలిని రచింపగల దిట్ట. కథా వస్తువును స్వీకరించుటలోని యౌచిత్య తత్త్వమును విడిచి చూచినచో, కథా సంవిధానమున, పాత్ర చిత్రణమున, రసభావ పోషణమున చేయి తిరిగిన వాడని చెప్పవచ్చును. అర్వాచీన ప్రబంధముల కీతని మార్గ మొరవడి యైనది. కేవల కావ్య శిల్ప దృష్టితో మాత్రమే ఇది గమనార్హము.

నందుని ముద్దు చెల్లెలగు రాధకు చిన్నతనమునందే యొక అనామధేయునితో పెండ్లి యైనది. ఆమె వానిని మగడని యెరుగదు. అతడు పీడచేత, వెర్రి గొల్లతనము చేత నామెను చూడ నోచుకొనడు. ఈ ప్రబంధమున రాధ ప్రౌఢ. బాల్యము నుండియు నింపు నొప్పు సొంపులతో మేళవించి వలపులను నేర్పినది. కృష్ణుడు క్రమముగ నీ విద్యలలో ప్రావీణ్యము నందినాడు. అత్తకడ నేర్చిన అలంకారములను గొల్ల పడుచులకడ ప్రదర్శించుచుండ, వారు వచ్చి యశోదతో చెప్పి కొనిరి. నూనూగు మీసముల ప్రాయము వచ్చిన పిదప రాధ స్వామికి తన కోర్కెను వ్యక్తము చేయగా, మున్ను స్వామి మొదు

104. ఆంధ్ర విజ్ఞాన సమితి, విజయనగరము, ప్రచురణము 1940.

గని వానివలె మౌగ్ధ్యము నటించియు, కరిమముగ లొంగి యామె నేలుకొనినాడు. స్వామి మధుర కేగుట మొదలుకొని అష్ట మహిషీ కళ్యాణముల వరకు కథా వృత్తాంతము సంక్షిప్తముగ నున్నది. స్వామి యొకనాఁ డుద్ధవునితో తన పరిణయ రహస్యమును చెప్పుట, రాధ విరహమును భరింప జాలక చిలుకను రాయబారమంపుట, స్వామి అష్టమహిషుల రిపగవలను గమనింపక వ్రజమునకు బయలు దేరి వెడలుట జరిగినది, ఇప్పటి రాధాకృష్ణుల సమావేశ సంవాదాదులే యీ ప్రబంధమున చెప్పదగిన యంశములు. స్వామి తన కడకు వచ్చి నపుడు తొలుత విముఖత్వ మూకీ భావములను ప్రదర్శించిన రాధ, హృదయగతమైన భావము లొక్కుమ్మడి పెల్లుబికి మహోపన్యాస మొనర్చినది. అందు రాధ మనస్తత్త్వము నందలి విషాద శృంగార భావచ్ఛాయలను మేళవించి వెంకటపతి తీర్చిదిద్దిన వైనము తెలుగ వాఙ్మయమున నీ తరగతి కావ్యములలో ననన్యమై యున్నది. స్వామి యెట్లో తన దక్షిణ నాయకత్వ పరిభావమున నామెను ప్రసన్ను నొనర్చుకొని తమిదీర ననుభవించినాడు. ద్వారక కామెను తనతో తీసికొనిపోయి అష్ట మహిషులతో సమాన స్థానము నొసగి మన్నించుట, రాణుల రవరవలు, రాధ స్వామి దక్షిణ నాయకత్వమున కను గుణముగ వారి వారితో స్వామి గడపవలసిన విషయమై యొక సమన్వయ మేర్పరచుట యిందలి యనంతర కథాంశములు.

వెంకటపతి వాక్కున మాధుర్యమున్నది. అన్ని విషయము లట్లు, రాధ కృష్ణునితో సంవదించిన ఘట్టము మనోహరమైయున్నది అలనాటి తమ భోగ గాధలు "...వింతలై కనుపించెన్ రచియింప నేరిచికవుల్ కల్పింప లోకానకున్ వినవా! నింతియచాలు! మీఁది కథలీ వీనుల్ వినన్ లేవికన్" (తృతీయ, పుట91) అనియు, '...దేవుఁ డటంచును నీకు లేకున్నను మాకుఁ బామరికమున్నది యున్నది నాలలో పలన్' (తృతీయ, పుట 96) అనియు స్వామిని దెప్పిన పట్ల నామె విషాద మధురమూర్తి, "నామీఁదం దయయుంచుమయ్య యనుచున్

మౌనంబుతో రాధికాభామారత్నము చెక్కు కేలనిడి గోపాలుం గనుంగొంచు వీణామాధుర్య కలస్వనంబు దొలంకన్ దానేడ్చె కన్నీళ్ళనున్ గోముం జన్నులు దొప్పదోగి కడఁకన్ లో వెక్కుచున్ స్రుక్కుచున్' (పుట 98) ఈ సందర్భమున రాధ శోకమూర్తి. స్వామి నిష్ఠురోక్తులను కొంత తడవు మౌనముగ విని, హఠాత్తుగ నాతని దుప్పటి పట్టుకొని లాగి శయ్యకు తార్చికొనిన రాధ ప్రౌఢశృంగార మూర్తి. ద్వారకయందు స్వామి శృంగారవర్తనముల సమయము నేర్పుఱచి "అనుచునో యక్కలార! నేనంటి ననుచుఁ గోపముంచ కుఁడీ మేర కొదువగాదు సమ్మతిలు డంచు సతుల మొగమ్ము జూచి హరికి మొదలుగ రాధ యందరకు మ్రొక్కె" (పుట 136) నన్న పట్ల నిర్వహణ చాతుర్యముగల మనస్విని. ఇట్టి రాధాచిత్రణ మీ కావ్యమున నొక మెరుఁగు. తక్కిన యంశము లన్నియు గతానుగతికములే. ఇట్లు వేంకటపతి రాధామాధవ సంవాదము సమగ్రరచనాశిల్పము గల కావ్యము.

## రాధికా సాంత్వనము

ప్రస్తుతానుశీలనమున మరియొక ముఖ్య కావ్యము ముద్దుపళని కృత రాధికా సాంత్వనము.[105] ఈ ప్రబంధమునకు వక్త శ్రీశుకులు. శ్రోత జనకుడు! శ్రోత ప్రశ్నయందే కథా రేఖ ధ్వనింపబడినది. "... నందుతోఁబుట్టి గోవిందుని కత్తయై వరగుణాకర యన వరలు రాధ

105. శ్రీమతి విద్యాసుందరి బెంగుళూరు నాగరత్నముచే పరిష్కృతము. వావిళ్ళ ప్రచురణము. 1950. రాధికాసాంత్వనము లాంధ్రవాఙ్మయమున రెండు కన్పట్టుచున్నవి. రెండవది సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు రచించినది. (ఆంధ్ర సాహిత్య పరిషన్ముద్రణము. 1950) దీనికి పీఠిక వ్రాయుచు నాయకుడు 1704-1731 ప్రాంతమునకు చెందినవాడనియు, ముద్దుపళని 1741-1764 ప్రాంతములకుఁజెందిన దనియు, ఆమె సముఖము నాయకుని కావ్యము ననుకరించె ననియు, స్వామి శృంగారమున ప్రముఖనాయికలైన రాధా సత్యభామ లిరువురికి ప్రసక్తి కల్పించుట వలన నిది యుత్తమ కావ్యమనియు డా. యస్. వి. జోగారావు ప్రతిపాదించియున్నారు. రాధికా సాంత్వనమునకు ముద్దుపళనికర్త్రియనియు మరి

తానెత్తి పెంచఁగఁ దగ నిలాసతిమీఁద వడినేలఁ బలుకారు బారు చేసి గోపాలదేవుపైఁ గోపించె? నపుడెట్లు దక్షిణ నాయకాధ్యక్షుఁడైన దేవకీసూనుఁ డానారి తీరుఁ తీరఁ దీరుగానేలె?..." (1-3) దీని విస్తృతియే యిందలి కథావృత్తాంతము. వ్రేపల్లె అంగభవ మల్ల రంగము. ఇందితర వ్యావృత్తులకు తోడుగ ఏణీ విలోచనా రతికూజి తార్భటీరావచయము, సంగీత సాహిత్య భరత సంభ్రమములు మొరయుచుండును. అది కథారంగము. అందు స్వామి వివిధ శృంగార క్రీడాకలాపముల వర్తిలుచుండెను. స్వామి ప్రౌఢ నాయిక రాధ. ఆమె సౌందర్య వైదుష్యాదులు లోకోత్తరముగ ప్రతిపాదింప బడినవి. ఇళ యీడేరకమునుపే స్వామి శృంగార భావమునకు కేంద్రమైనది. రాధ ఇళకు వలసిన సర్వవిద్యలను (కామశాస్త్రముతో సహా) నేర్పినది. ఆమె యీడేరిన పిమ్మట రాధ సాంప్రదాయికములైన ముచ్చటలు జరిపి, వలసిన యుపదేశములనిచ్చి శోభనము గదిలోని కంపినది.

"చెలువుండు కౌఁగిటఁ జేర్చునో యపుడీవు
  గుబ్బల మెలమెల్లఁ గుర్మ్మవమ్మ,
విభుఁడు చెక్కిలి ముద్దు వెట్టునో యపుడీవు
  నలరు మోవొక్కింత యానవమ్మ,
స్వామి పైకొని రతిసల్పునో యపుడీవు
  నించుక యెదురొత్తు లీయవమ్మ
ప్రాణేశుఁ డలకేళి బడలునో యపుడీవు
  పురుషాయితము వేగఁ బూనవమ్మ..." (1-66)

---

యొకరెవ్వరో రెండవ గ్రంథమును కల్పించి నాయకుని పేర వెలయించిరనియు శ్రీఆరుద్ర బాహ్యాంతర సాక్ష్యముల వలన ప్రతిపాదించియున్నారు. (సమగ్ర ఆంధ్రసాహిత్యము. 12 వ సంపుటము. పుటలు 171-174) ఈ వివాదముతో నీ యనుశీలనమునకు ప్రసక్తి లేదు. కావ్యముల తత్త్వ. సామ్యములనుఁ బట్టియు ప్రసక్తాంశములీ వివాదముతో సంబంధము గలవి కాదు కావునను, అనుశీలన మీ ముద్దుపళని పేరనున్న గ్రంథమునుఁ బట్టియే జరిగినది

మున్నగున విట్టివి. తన యింటికి తాను వచ్చిన పిదప రాధ మనస్సున విశ్రాంతి నంద జాలక యచ్చటి వృత్తాంతములనే తలపోసినది. తెల్లవారు జామున శయనాగారము తలుపు తట్టి లోనికి పోయి యందలి వృత్తాంతముల గమనించినది. చిలుక సూచన మేరకు విరహితయైన రాధను స్వామి యేలుకొనుట, త్రపాముగ్ధయైన యిళ యావల కేగుట జరిగినది. అటుపై కుంభకుడు వచ్చి తన కూతును నల్లుని గొంపోవు సందర్భమున రాధ పరమ సౌజన్యమూర్తియై యాతని యాహ్వానమును తెప్పించుకొనినది. పిమ్మట రాధా విరహ ముద్వేలమై వర్ణితమైనది. చిలుక రాయబారము వలన రాధ కచ్చటి వృత్తాంతములు తెలిసి, స్వామి అవజ్ఞను ఇల ప్రదర్శించిన వైమనస్యమును తలచికొని కోపనశీలయైనది. స్వామి వచ్చినపుడు రాధ మున్నుగ వైముఖ్య, కోపాదులను ప్రకటించుట, పాదతాడన వృత్తాంతము, తుదకు సంయోగ శృంగారమున పర్యవసానము - అను సాధారణ ప్రణాళిక కథా పరముగ నిందున్నది. రచనా విషయమున మున్నుగ చెప్పదగినది ముద్దులు మూటగట్టు ముద్దుపళని శైలి. అలతి యలతి తెలుగు పదముల పోహళింపుతోను, కోకొల్లలైన జాతీయములతోను మోహనమై జాలువారినదీ శైలి. ఇట్టి ప్రబంధముల కథా కల్పనమున నంతో యింతో తప్పనిసరియైన యనుకరణము లట్లుంచి, రాధ పాత్రను తీర్చి దిద్దుట యందును, స్వామి దక్షిణ నాయకత్వ ప్రతిపాదనము నందును నీ సాంత్వన కావ్య మగ్రస్థాయి నందుకొన్నది. ఇళను తీర్చి దిద్దుటలో వాత్సల్య సౌజన్యాది గుణములు, తన నామె యవజ్ఞ చేసినపుడు పొడమిన రోషము, స్వామి దూరమైనప్పటి విరహము - మున్నగు భావ విశేషములీ ప్రౌఢశృంగార నాయిక మనస్తత్త్వమునకు నిండైన మానవాంశమును చేకూర్చినవి.

'ఎల్ల జగంబులన్ మనుచు నేలిక కంజభవాది మౌనిహృత్ఫుల్ల సరోజ రాజములఁ బూని వెలింగెడి తేజ మిందిరా హల్లక పాణి బాహువుల కందని దివ్య సుఖంబు చిత్రమీ వల్లవ కామినీ చరణవారిజ

సేవకు లెస్సఁ జిక్కెఁగా' (3-44) వంటి ఉదాత్త భావ ప్రపంచమున్న యీ ప్రబంధముననే మేర మీరిన శృంగారము, అవయవిక వర్ణనము నుండుట విచిత్రము. అందుల కుదాహరణముగ మరు నింటిని వర్ణించిన పద్యము (3-105) వంటి వాని నెన్నవచ్చును. ముద్దుపళని కావ్య కళా నైపుణ్యము ప్రౌఢతకు, సౌకుమార్యమునకు నిలయము. పాత్రల మనోగతముల కనుగుణములైన సంభాషణముల నడిపించు పట్ల నీమె నిపుణ. రసభావ పోషణమున జాణ. శృంగార చిత్రణమున ననన్య. ఇట్లీ రాధికా సాంత్వనము సాంత్వన కావ్యములలో నుత్తమమైనది. కథా విషయముగ నొక చిన్న గమనిక. ఇళాదేవి యను నాయిక ఆంధ్రవాఙ్మయమున బహునామముల బహురూపముల కన్పట్టుచున్నది. ఈమెతో స్వామి వైవాహిక సంబంధము పురాణ ప్రసిద్ధము కాదు. ఇందీమె నందుని బావమరదియైన కుంభకుని పుత్రికయని చెప్పబడినది. హరివంశమునందు కుంభకుని పుత్రికయైన నీలను స్వామి సప్తవృషభ సంహార మొనర్చి పెండ్లి యాడినట్లున్నది. ఇతర సందర్భములందామె ప్రసక్తి మృగ్యము. ఇట్టి వైవాహిక వృత్తాంతము భాగవతమున నాగ్నజిత్తి విషయమున నున్నది. ఆ యీ యంశముల ఫలితముగ ఇలా వృత్తాంతము ముద్దుపళని స్వకపోల కల్పితమను భావము కలుగుటకు వీలున్నది. ఇది పరిశీలనార్హమైన విషయము.

రాధాకృష్ణ శృంగారము నధమస్థితి కీడ్చిన యిట్టి కావ్యములను గూర్చియు, నిట్టివే యైన యితర శృంగార కావ్యములను గూర్చియు నించుక సామాన్య వివేచనము సల్పదగియున్నది. రాధ కథలో కవుల కొక సులువు చిక్కినది. పూర్వోక్త రీతి ఈ కథా వృత్తాంతమే లౌకిక పారలౌకిక స్థితులందు సమన్వయించుటకు తగియున్నది. ఒక పద్ధతి కవులిందలి యుత్తమాంశమును దర్శింప, మరి కొందరిందలి యధమాంశమును దర్శించినారు. ఉదాహరణముగ జయదేవుని గీత గోవిందమునందు గాని, విద్యాపతి, చండీదాసు మున్నగు వారి రచనములందుగాని ఆంగిక శృంగార వర్ణనములున్నను తత్త్వ

నిర్దేశమే గరీయసి లక్షణమై గోచరించును. అష్టపదీ క్షేత్రయ్యాదులు దివ్యనాయక చిహ్నితములైన పదములు రచించినను ప్రాయికముగ లౌకిక శృంగారమే ధ్వనించును. కావున తత్త్వస్ఫూర్తి, తద్వ్యాపారేక స్థితి యనునవి కేవల మంగాంగ వర్ణనలకు చెందినవి కావు. కవి సంస్కారమునకు, యుగధర్మమునకు చెందినవి. క్షేత్రయ్య భోగమయమైన యుగ ధర్మమునకు లొంగుటయు, నంతకన్న సంకుచిత క్షీణ లక్షణములనే గల్గిన యుగధర్మములను త్యాగయ్య లొంగకుండుటయు విచిత్రము. దీనినిబట్టి కృష్ణకథకు చెందిన యంతస్తత్త్వమేదో ఆ యుగముల యందలి కవుల నొకొక్కరీతిగ నావేశించి యుండు ననిపించును. గతాను గతికముగ కావ్యములు రచించిన సాధారణ కవిశబ్దవాచ్యు లటుండ నుత్తమాభిరుచి వలనగాని, యుధమాభిరుచి వలనగాని కృష్ణకథా కావ్యములు రచించినవారి విషయమున, వారు మహాశిల్పులైనచో ఈ సూత్రము వర్తించును. ఉత్తముల విషయము వివరణము నపేక్షింపదు. అధములుగ లోకముచే ముద్రవేయ బడినవారి విషయము నించుక లోతునకు దిగి యాలోచింప వలసిన అవసరమున్నది. లౌకికార్థమున నిట్టి కావ్యములను పచ్చి బూతుకబ్బము లని చెప్పు టబ్బురము కాదు. కాని లోకేశ యొక్కలే స్వామి తత్త్వము కాదుకదా! అది సహస్రముఖము. తన్నిసృతమైన తత్త్వోద్దీప్తి యెవరి నెప్పుడ ట్లుద్ధరించునని చెప్ప జాలము. కొందరి కది మంత్రముగ నంతశ్చేతనమును కదలించును. కొందరి దురాచార సంపత్తిని దుస్సంస్కారములను సల్లప యిచ్చి, వాని నుద్వేలముగ ప్రసరింపనిచ్చి, తనయందు న్యాస మొనర్చిన పిమ్మట వానినెల్ల నాహరించి యుద్ధరింప వచ్చును. పరిణామ దశలో జీవి యే కక్ష్య యందుండెనో యచ్చటి నుండి వాని సముద్ధరణ మారంభమగును. దీనికి యమ, నియమాదులతో నిమిత్తము లేని మార్గమున్నది. తదేక ధ్యాన

మున చేసిన నే పనియైనను స్వామి కర్పణముగ నొనర్చిన చాలును. ఈ ధ్యానార్పణములు పూర్వజన్మ సంస్కారములను బట్టియు, పరిణామ చక్రమున నా జీవి యున్న స్థితిని బట్టియు నుండును. దుష్ట సంస్కారము గలనను స్వామి యందు న్యస్తము లైనచో పవిత్రీ భూతము లగుచునుండును. పైగ భక్తుల చరిత్రములు, నసంఖ్యాక మార్గములు స్వామి నంది మోక్షప్రదము లగుననుటకు ఘంటాకర్ణాదుల వృత్తాంతములు సాక్ష్యములు. ఈ సూత్రము నించుక పొడిగింపవచ్చును. ఒక వేశ్య యున్నది. వేయు వృత్తిపట్ల వైముఖ్యము కలది. నిరంతరము స్వామి యందే ధ్యానము. తన సరసు లందరిలోను స్వామినే గాంచును. కొంతకాలమైనది. తప్పని సరిగా నామె సంభోగమున వచ్చిన దుస్సంస్కారము లీ భావనా వశమున తొలగిపోవును. ఆ క్షణమునుండి యామె చింతామణి. అప్పుడీ లౌకిక వ్యాపారమునను అందలి దుస్సంస్కారములకును నాకరము లేక పోవును. ఇదియే యామెయొక్క అభ్యుత్థానము. స్వామి యొక్క కటాక్షము. కొన్ని సందర్భముల నీ యుద్ధరణము మనకు కన్పించును. మరి కొన్నిట జన్మాంతర పరిపాక స్థితి మనకు తెలియక పోవును. తుచ్ఛ శృంగార కావ్యములు రచించినవారి విషయమున నీ సూత్రమును సంధించినచో కొన్ని విషయములు తెల్లమగును. వారు యుగ ధర్మమును బట్టియో, కీర్తి కాంక్ష వలననో తమ లౌకిక తుచ్ఛ శృంగార భావ వాసనలకు స్వామిని కేంద్రముగ నొనర్చినారు. వారి సత్త్వభావ ప్రపంచము అనుక్రమమున సంస్కృతమై క్షాళితమైనది. రెండవది: వారొనర్చిన భావ న్యాసాంతరము ప్రాప్తించినది యుత్తమ స్థితియో కావున పరిణామ చక్రమున వారు రెండవ మెట్టు నెక్కినవారైనారు. ఈ దృష్టితో చూడగల్గిన వారికి కావ్యము నందు చెప్పబడని పారలౌకిక శక్తి వారు తప్పక సరిగ నప్పుడో యవగాహింప దగిన మెట్టు. పూర్వకవుల విషయముల నీ సూత్రమున కొక బాధ యున్నది. వారి జన్మాంతర సంస్కారము

లను గూర్చిగాని, యాగత వృత్తాంతములను బట్టియైన అనాగత వృత్తాంతములనుగాని శాస్త్రీయ నిష్కర్షతో చర్చింపలేము. ఈ రెంటిని మన మెరుగము కనుక! నవ్యాంధ్ర వాఙ్మయమున నొక చక్కని యుదాహరణము లభించును. 'చలం'గారు మహా రచయిత, వచనశిల్పి. ఉత్తమాదర్శ చోదితములైన రచనము లనేకముల నొనర్చినారు. కాని వాని యందు వావి వరుస లెరుగని ప్రణయములు, నుద్రేకమును కల్గించు సన్నివేశములు లేకపోలేదు. వానిచే నుత్తేజితులై వక్రమార్గమును బట్టిన యొక తరపు యువకులుండి యున్నారు. కాని నేటి 'చలం'గారు బ్రహ్మర్షి తుల్యులు. రమణాశ్రమము నందు జీవించుచు ఆధ్యాత్మిక రచనము లనేకముల నొనర్చి తాముద్ధరణము నొంది యితరులకు జ్ఞానమార్గమును నిర్దేశించి యున్నారు. ఇప్పుడు వారిని ప్రశ్నించినచో తాము పూర్వము రచించిన దంతయు చెత్త యని నిస్సందేహముగ చెప్పుదురు.[106] ఇట్టి సందర్భముల పరిణామ చక్రమునందలి రెండవమెట్టును వారెక్కినట్లు మనకు తెలియును. కావున నిట్టి యభ్యుత్థాన మార్గ మొకటి రచయితల విషయమున గమనార్హమైనది కలదు. భిన్నభిన్న సంస్కార కక్ష్యలందు కొట్టుమిట్టాడుచున్న జీవాత్మలలో శిల్పులైన వారికీ మాధుర్య శృంగార ప్రస్థానములచేత గతి గల్పించు తత్త్వము స్వామి యంశము. ఆ యీ గ్రంథ పఠనము వలన లోకమునందు వ్యాపించెడు దుస్సంస్కారముల మాటేమి? వాని కెవరు బాధ్యులు? అను ప్రశ్నలు సహజములై పుట్టును. అవి యుగ పరివర్తనమునందు భిన్నదశలలో తలసూపి కాల మహాసముద్రమున లీనమగు బుద్బుదముల వంటివి. వానికి శాశ్వతత్వము లేదు. శాశ్వతమైనది స్వామి పరతత్త్వ మొక్కటియే. దానిని ముట్టుట సర్వసాధనల ధ్యేయము. అందుల కక్కరకు వచ్చునవే శిల్పాదులు-ఇట్టి భావమార్గ మొకటి అధమశృంగార ప్రతి

---

106. ఇటీవల వారట్లు వ్రాసిరి కూడ. చూ. కళావని, హైదరాబాదు వారు ప్రచురించిన నాటక సంచిక, 1966.

పాదక కావ్యముల అనుశీలన సందర్భమున నేమి, సమస్త లౌకిక వ్యావృత్తుల సందర్భమున నేమి యనుసంధింప దగినది కద్దు. అధమ లక్షణములను పదేపదే పేర్కొని వానియందు వైరాను సంధాన మొనర్చుటకన్న నిది శ్రేష్ఠమైన మార్గము. కందుకూరి వీరేశలింగము పంతులుగారీ ముద్దుపళని కవిత్వమునుగూర్చి విమర్శ నాత్మకముగ నిందలి శృంగార విషయము నధిక్షేపించుటను శ్రీమతి బెంగుళూరు నాగరత్నము విమర్శించి యున్నది. అందు ప్రధానమైన విషయముగ నిది భగవచ్చరిత్రమని యామె సమాధానించి యున్నది.[107] భగవచ్చరిత్రము మహిమమెంత గూఢార్థ విలసితమో పై యనుశీలనము నిరూపించును. అది యటుండె.

గోపీ కథా కౌముది

నవ్యయుగమున వెలిసిన రాధాకృష్ణ సంబంధ కావ్యనాటక వాఙ్మయమున నెక్కువ భాగము ప్రాయికముగ నుత్తమాంశమును ప్రతిపాదించునవే. అందీ యనుశీలనమున మున్ముందుగ పరిశీలింప వల సినది శ్రీ చిలకపాటి రామానుజశర్మ రచించిన 'గోపీకథా కౌముది' యను నామాంతరముగల రాధికా పరిణయము.[108] గర్గపురాణో క్తములైన కతిపయ ఘట్టములను గ్రహించి యీ కవి రాధా చరి త్రము నీ పేరున కావ్యముగ నిర్మించినాడు. ఇందు మౌలికత స్వల్పము. మూల గ్రంథము నందు తాత్పర్య బుద్ధి, ప్రామాణికత ప్రధాన విషయములు. మహత్తర శక్తి శోభితము గాకున్నను యథో చిత రమ్యశైలిగలదు. ఇందు మున్నుగ వివిధ గోపికల పూర్వజన్మ వృత్తాంతము, వారు స్వామిని చెట్టబట్టి యానందించుటయను విషయ ములు నిరూపితములైనవి. అటుపై రాధా జననాదులు విస్తరింప బడినవి. గర్గుని యాదేశము ప్రకారము రాధ స్వామికై సిద్ధాశ్రమ

107. చూ: పీఠిక. పూర్వోక్త గ్రంథము.

108. రాధికా పరిణయము అను శ్రీ గోపీ కథా కౌముది. చిలకపాటి వేంకట రామానుజశర్మ. కపాలి ముద్రాక్షరశాల. మద్రాసు.

మున తపముచేసి స్వామిని పొందుటయన్న వృత్తాంతమిందు సర్వాంగీణ స్ఫూర్తితో రచింపబడిన ఘట్టము. ఇందష్టమహిషులు స్వామితో వచ్చి దివ్య తపస్స్వరూపయైన రాధను దర్శించుట, యామె తత్త్వమును స్వామి నిరూపించుట ముఖ్యాంశములు. సిద్ధాశ్రమమునకు వచ్చి రాధ ఔన్నత్యమును గుర్తెరిగిన అష్టమహిషులామె నారాధించిరి. నాటి రాత్రి స్వామి నిదురింపలేదు. కారణ మడిగిన రుక్మిణితో స్వామి రాధ కొనర్పబడిన యుపచారము లన్నియు తనకు చెందుననియు, రుక్మిణి రాధ కొసంగిన క్షీరము మిక్కిలి యుష్ణమై యుండుటచేత తనకు నిద్రరాలేదనియు స్వామి నిరూపించెను. వారందరును రాధాతత్త్వము నెరిగి స్తుతించి యామెను గూడ ద్వారకకు గొంపోయిరి. రాధాకృష్ణాభేద ప్రతిపాదక మీ ఘట్టము. ఇట్టి వృత్తాంతము లనేక గొన్ని యిందున్నవి.

పరిపూర్ణ శరదిందు బింబాస్య
చకితైణ శాబక చటులనయన
మణిదర్పణ ప్రభాప్రణయ కాంతికపోల
తప్త హాటక లతా తనువిలాస
కుంద కుట్మల పంక్తి కోమల రచనాళి
మదమత్త మాతంగ మందయాన ......"(4-269)

వంటి విశద స్వచ్ఛశైలియందు రాధా స్వరూప చిత్రణము, 'తపము ఫలించె నా భవము ధన్యత జెందెను నీవు వచ్చినన్ గృపం గనుగొన్న మాత్రమున నీరజలోచన! మత్సహాయివై యుపరిమితానురాగమున నప్పుడు రాసమునందు నన్ను నీ వపగత కింకరీత్వ కలితోన్నతి జేసితివయ్య పేర్మితోన్' (4-383) వంటి భావస్ఫోరక రచనముతో రాధా హృదయావిష్కరణమును నీత డొనర్చినాడు. గర్గపురాణోక్తమైన రాధా తత్త్వము నెరుగుట కిది మిక్కిలి యుపకారకమైన కావ్యము. ఇట్టి సత్ప్రయత్నము లాంధ్ర వాఙ్మయమున నెక్కువగ లేవు.

## విరజోపాఖ్యానము

ఇట్టిదే విరజోపాఖ్యానమను కావ్యము.[109] ఇది గోలోక పవిత్రగాథ. బ్రహ్మవైవర్తము నందలి కథా వస్తువును ఛాయా మాత్రముగ గ్రహించి యీ కవి దీనిని ప్రబంధముగ పెంచి వ్రాసినాడు. కథా మూలస్వరూపము సుదాత్తస్థాయిలో ప్రతిపాదించుట యిందలి గమనార్హమైన విషయము. గతానుగతిక వర్ణనములు, రస భావ పోషణము నిందున్నను మూలవస్తు గౌరవమునుబట్టి సంభావ్య మైన కావ్యమిది. రాధా శ్రీదాముల పరస్పరశాప వృత్తాంతములకు కారణమైన విరజా వృత్తాంత మిందున్నది. రాధికా లోలుడు, శాశ్వతుడు నైన స్వామి గోలోకమున నివసించి యుండుట, విపులమైన గోలోక వర్ణనము, రాసకేళి మున్నగు వృత్తాంతము లిందు ప్రబంధ శైలిలో ప్రతిపాదింప బడినవి.

'తన కిరుప్రక్కలందు వనితల్ సెలఁగంగ విచిత్రలీలఁదా
ననుఁ గడుఁ బ్రేమ నొక్కొ-క యనుంగుఁ బడంతికి రెండువైపులం
దునుఁ దగ నిల్చి మాలగతిఁ దోరపుబాహు మృణాల జాలము
ల్లన గళసీమలందిడి చెలంగెను మండల మధ్యవర్తియై'

(పుట.18)

రాసాంతమున స్వామి గోపికలనెల్ల క్రమావనయునలగు నట్లొనర్చినప్పుడు విరజ స్వామి మాపున వ్రాలుట వారిరువురి శృంగారమునకు బీజమైనది. స్వామి యామె సౌందర్యమున కబ్బురపడి రాస వృత్త మును నాటికి నిలిపినాడు. గోపికలెల్లరు స్వామిని వేరు వేరుగ వీడ్కొని వెడలిపోవు చున్నపుడు విరజ స్వామి కడ నిల్చి భక్తి భావమున స్తుతించినది. ఈ స్తుతి '(శ్రీ)వత్స కౌస్తుభ (శ్రీ) విరాజిత చారు వక్షః స్థలాయ తుభ్యం నమోఽస్తు, నీలజీమూత సన్నిభ శరీరాయ

---

109. ప్రబంధకవి శిరోమణి శ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి. 1932. ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల యందు కర్లపాలెం కోదండరామయ్య గారిచే ముద్రితము.

'దేవాది దేవాయ తుభ్యం నమోఽస్తు' (పుట 27) వంటి పరిపాటి ననుకరించినది. స్వామి యామె నాశీర్వదించుచు 'దీర్ఘ' యని పలికి రాధాభీతిచే నర్ధోక్తియం దాగినాడు. ఈ వృత్తాంతము భావి కథను స్ఫురింప జేయుచున్నది. అటుపై విరజా కృష్ణుల శృంగారము ప్రబంధ మార్గముననే పోషింపబడినది. చెలికత్తెలు స్వామికి నాయిక నప్పగించు నపుడు 'జలచరుండవుగానఁ జాటి చెప్పగనేల కోమలాంగి యటంచు గూడనయ్యా, కొండమోసిన చేవఁ గొను నీవు కలియంగఁ గోమలాంగి యటంచు గూడనయ్యా...' (పుట 66) వంటి చమత్కారము లున్నవి. "ప్రణయుంబందిన పట్లఁ దర్కమొనరింపన్ దర్కశాస్త్రంబుగామినిఁ గేళింగదలించుచో గళరవంబే శబ్దశాస్త్రంబు నింతి నిజాస్యంబున మోము నిల్పుటయెగాదే యోగశాస్త్రంబు నేపున నీవిన్ విదలింప నయ్యదియెపో మోక్షంబు చర్చింపగన్" (పుట 68) వంటి యుక్తి విశేషములు నున్నవి. విరజా కృష్ణుల శృంగారము నెరిగిన కుపిత రాధా స్వరూపము, స్వామి దక్షిణ నాయకత్వము, శాపముల వృత్తాంతములు మిక్కిలి మనోహరముగ మానవకక్ష్య యందు తీర్చబడినవి. మొత్తము మీద రచనా మార్గమున నెట్టి విశిష్టత లేకపోయినను ప్రసక్త వృత్తాంతముల వ్యాప్తి కిట్టి కావ్యములు దోహదభూతము లగును. వీనినే మరింత స్వాదుస్వచ్ఛందమైన మార్గమున ప్రకటించి యున్నచో బాగుండెడిది. కాని పరంపరాగతమైన ప్రబంధ ప్రక్రియా దాస్యమును తప్పించుకొనుట సామాన్యము కాదు.

## శృంగార వీథి

పరిశీలనార్హమైన మరియొక కావ్యఖండము శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రచించిన శృంగారవీథి[110] యందలి ప్రసక్తభాగము. గ్రంథ నామమునకు కారణమైన శృంగారవీథి యను ఖండ మాంధ్ర

110 రచన: 1920. వి. యస్. యన్. & సన్స్. విజయవాడ-4. పంచమ ముద్రణము - 1969.

వాఙ్మయమున సుప్రసిద్ధము. "మదన మహీపతి ప్రసవ మార్గణ భిన్న శరీర, దీనతాస్పద పరిపాండురానన, విసర్పిత నీల పటాభిరామ" (పుట 5)మైన మాధవరాధిక శృంగార భావ చిత్రణ మిందలి విషయము. ఆమె బృందా భూమియందు విరహితయై యుండెను. అట్లు చెప్పునపుడు బృందామహాత్మ్యము వివిధ రీతుల ప్రతిపాదితమైనది. అది యొక పవిత్రమైన ప్రదేశము. అందు "చంద్రికానవనీహార విలాస దీధితుల యందు గోపశ్యామ కైశోర కేశవ పాదాంకిత శంఖ చక్ర నవరాజ చిహ్నములు" "సుదర్శన ప్రభృతి సంగత వైష్ణవ పాదచిహ్నములు" [పుట 6] వ్యక్తములైనవి. ధూర్త శేఖరుని విరహమున నవయుచున్న రాధ యెడ జాలినందిన చెలియొకర్తు స్వామిని కొనివత్తునని బయలుదేరి స్వామి యున్న తావునకు పోయినది. దూరము నుండియే యామెను కాంచిన స్వామి రాధ యందధిక గౌరవమున్న వానివలె లేచి వచ్చి యామె చెప్పినది యాలకించెను. ఆమె రాధ విరహమును సంపూర్ణముగ వర్ణించి చెప్పి "దయచేయం గదె నందగోపకుల రాధాకృష్ణ యంచున్ సదా ప్రియతాత్మన్ జపియించుచున్న యది బాష్పప్లుష్ట నేత్రద్వయిన్ నయనం బందున నంటుకొన్న యది కార్శ్యంబంది యేకమ్యో నయ్యాయోఽప్రాభాతిక చంద్రలేఖవలెఁ గృష్ణా పల్లవీ పల్లవా" (పుట 13) యని యర్థించినది. కాని యామె రాయబారము ఫలింపలేదు. యూత్థ దృగంచలయై తిరిగి వచ్చిన యామెను రాధ 'నా సందేశము తానెరింగికొనెనా? నా మాట లాలించెనా? రాసక్రీడలు మానెనా? యింటికిన్ రాఁగాఁ దలంపూనెనా' (పుట 14) వంటి ప్రశ్నల వర్షములో ముంచెత్తినది. కన్నుల నీరు నించిన దూతిక "...మారధనుర్ద్వయంబువలె మండల బద్ధ సహస్ర షోడశాభీకరులైన హాయున విభీతమృగీ సమాలోచనా దృగంభోరుహ చంచలాసహిత మోహనతోయదమూర్తి వంశీగర్జారవ శీలికిన్ మనము జ్ఞాపకమా? యదువంశ మాళికిన్" (పుట 15) అని చెప్పుటతో నాశాలత తెగిన రాధ మరింత దుఃఖితయై కుమార గోకులుని గాథలు వినగోరినది. దూతిక స్వామి విహారములను వర్ణించి

చెప్పి "... దివ్య షోడశ సహస్రాంగనా పారిహార్య భోగంబున బాలకృష్ణ సుషిరం బామ్నాయముల్ మోసెడున్" (పుట17) అనియు, నా విశ్వగానలహరి యందు బృందావన దేవత ప్రతి స్పందించెననియు, మానసక్షేత్రములు కందళించిన గోపికలు శృంగార భావార్ద్రలై యుండిరనియు, స్వామి నాద బ్రహ్మమున ప్రకృతి లీనమైన దనియు జెప్పినది. రాధ మూర్ఛిల్లి చెలుల శీతలోప చారములచే తేరుకొనినది. నాటి సాయంతనమున స్వామి రాధా సౌధమునకు వచ్చి గద్గదస్వరముతో నామెను పిలిచెను. బాష్పములు నిండిన కన్నులుగల రాధాకృష్ణులు విప్రయోగమును మఱచి ప్రేమచే నొకరైరి. మిగత భాగమున యమునాతీర కాననము నందు రాధాకృష్ణుల విహారము వర్ణితమైనది. శరన్నిశీథి యిందులకు భిత్తిక. ఈ భాగమున పూర్వ విరహమెంత గాఢముగ నున్నదో శృంగార వర్ణనము నంతే యుద్వేలముగ నున్నది. ఎక్కువ భాగము స్వామి రాధతో చెప్పిన మాటలయందు ధ్వనింపబడినది. స్వామి రాధ చీర కుచ్చెలల చెంపకు తీసి పట్టుకొని సేవయొనర్తునని చెప్పుట, రాధ యొక్క సింహమధ్యమును పట్టుకొందు ననుట, గాఢమగు పట్టున నామెకు సిగ్గువలదని చెప్పుట, "త్రివళి రేఖమున బందమువై చితి నీదుపాదముల్ నడుముల రెండు పాములు పెనంబడి నట్లుగ నీకరమ్ము లన్ మెడకు ననంటి మొవ్వవలె మెత్తని నీవగు బాహు మూలముల్ తొడలును నొచ్చునో చెలియ తోరపు నామెయితోడి రాపిడిన్." (పుట 23) అనుటయు, "...రెండు మేనులు నొక్కలువోలె నంటుకొని పోయినవో ప్రియురాల నేటి యీ చీకటిలోన ..." (పుట 24) నని చెప్పుటయు నట్టి శృంగార భావోద్విగ్నతకు, శారీరక చేష్టా వర్ణనమునకు నిదర్శనములు.

ఈ ఖండికయందు భావనాసౌకుమార్యము, ప్రౌఢ రమణీయ శైలి కలవు. ముఖ్యముగ స్వామి గోపికా క్రీడనమును దాటి వర్ణించి నప్పటి శబ్దార్థ చిత్రము లాంధ్రసాహిత్యమున ప్రసిద్ధములైనవి.

"బంధూక ప్రసవాతి సౌరభ రజః పాళీ ప్రభాపీచులన్
రుంధన్మాధవ రాగభూత ధరణీ రుక్మీతల చ్ఛాయలన్
గంధేభ ప్రవికంపిత ప్రసవ శాఖాసల్లకీ రేఖలన్
స్కంధ ప్రావృత వల్లరీ నవసుధూక శ్రీఫల శ్రేణులన్." (పుట 16)

వంటి ప్రౌఢోజ్జ్వల పదబంధములు యందీ ఖండిక యందలి యితర భాగములందు వలెనే జయదేవుని ముద్రయించుకంత నారికేళ పాకమున వ్యక్తమగుచున్నది. "ప్రిదితె స్నీవులు రైకముళ్ళు సడలెన్ స్వేదాంబు పూరంబు లొప్పిద మయ్యెన్" (పుట 18) వంటి తెనుగుదనమును లేకపోలేదు.

మొత్తము మీద విశ్వనాథ వారి యీ కృతి రాధాకృష్ణ సంబంధము నందలి విరహాగాఢత్వ సంయోగ సారస్యముల ప్రౌఢ మార్గమున నిరూపించినది. అందందు తాత్త్విక పరములైన భావముల చెణుకులున్నను వానిపై ఊనికలేదు. కావుననే యీ కృతి నాంధ్రలోకము రాధాకృష్ణ ప్రౌఢ శృంగారోపనిషత్తుగ భావించినది.

ప్రేమమయి రాధ

ఆధునికాంధ్ర వాఙ్మయమున రాధాకృష్ణ సంబంధములైన రచనలు నిబద్ధానిబద్ధ మార్గమున ననేకములున్నవి. వానినన్నిటి నీ యనుశీలనమున చేర్చుట సాధ్యము కాదు. కాని విభిన్నమార్గములకు, భావసంస్కారములకు చెందిన వానిని కొన్నిటి నుదాహరణ ప్రాయముగ గ్రహింప వచ్చును. ఇట్లు గృహీతములైన వానిచే భావ మార్గ సాధర్మ్యముగల యితర రచనములు సైత ముద్దేశిత ములని గమనిక. అట్టివానిలో మున్నుగ శ్రీ చిరాత్రివూరు కామేశ్వరరావు రచించిన ప్రేమమయి రాధ [111] పరిశీలింప దగినది. ఇందు రాధ ప్రాచీన ప్రబంధములందు వలె శృంగార నాయిక కాదు. ప్రేమ స్వరూపిణి. కావ్యకర్త నభినందించుచు శ్రీకట్ట

111. భారతీప్రెస్, బరంపురము. ముద్రణ 1935. రచన 1924 ప్రాంతము.

మంచి రామలింగారెడ్డి యీ కావ్యమున బుద్ధిగమ్యము హృదయగమ్యమునైన కవితా శక్తియు నుత్తమ భాషయు కలదని చెప్పియున్నారు. (చూ: శ్రీ కట్టమంచి లేఖ.) ప్రభాత శోభచే విస్ఫురితమైన బృందావనమున రామకృష్ణులు విహరించుచుండ స్వామి మనస్సు కలతనంది యుండెను. రాముడు కారణమును ప్రశ్నింప స్వామి యిట్లనెను. 'సోదరా! దావరిక మేల? సుఖనిదానమైన గోకులావాస మేనభిలషితు... నందుగల యందమిల నెందునైన లేదు నాకుఁ జీకటి బిలము బృందావనంబు, అనియు, '...శత గోపకన్య యబ్జాక్షి రాధ నా మనంబు హరించె నింకేమి కలదు' (పుట 5) గోకులము నుండి వచ్చిన పిదప బృందావనమున స్వామి ప్రకటించిన యీ విరహమును రాముడు సానుభూతితో నర్థము చేసికొని రాధిక కడకు రాయబారిగ పోయెను. గోవర్ధనాచల ప్రాంతమున ఋణవిమోచన తటమునఁ గుసుమలతా నికేతనమున రాధ విరహమునంది యుండెను. "... అమృతరస తరంగిత మగు జనమనోహర మురళీ రవంబునకు వీను లొసంగని వారుగలరే? మురిసి కృష్ణ కథాంబుధి నోలలాడని చరాచరాత్మక జగము గలదే!..." (పుటలు 7, 8) అని చెప్పి నిలపింప, లలితయను చెలికత్తె స్వామి లీలా మాహాత్మ్యములను వివరించెను. రాధ యున్న పాశములం విసర్జించి యోగసమాధి నిష్ఠ నంది నారచీరలు తాల్చి తపశ్చర్యకు పూనుకొనగ, నామె నిలువెల్ల పుట్టలు పెరిగినవి. బలరామమూర్తి వచ్చి రాధకై యన్వేషించి లలిత మార్గమును నిర్దేశింప పుట్టకడకు వచ్చి రాధ నుద్దేశించి, "నిండు జాబిల్లి నిరసించు నెమ్మొగమున్ జూపవేటికి? కన్నెత్తి చూడవేమి? మమ్ము మరచితివే? సుకుమారి రాధా... ఈ కఠోర ప్రతిజ్ఞ నీ కేటికమ్మ" (పుటలు 18, 19) యని పలికి స్వామి విరహమును, సందేశమును వివరించెను, రాధ లౌకిక భూమికకు దిగిరాలేదు. లలితాదులు కర్తవ్యము నాలోచించి కృష్ణ గానమును పుట్టచుట్టు వెల్లి విరియించిరి. రాధ కన్నులు విప్పి చరా

చర మంతయు కృష్ణ మయముగ దర్శించెను. రామాగమనము నిరీక్షించుచున్న స్వామి కడకు రాముడు వచ్చి రాధికయొక్క దివ్య ప్రణయ తత్త్వము నెరిగించెను. శీఘ్రమే స్వామి యామెను కరుణింప నిచో ప్రాణహాని యగునని యుద్బోధించెను. స్వామి కొంత తడ వూరకుండి, సృష్టిస్థితిలయ కారణమైన యీశ్వరాత్మక ప్రణయ భావ మును రాధ నిస్స్వార్థముగ నభ్యసించిన దనియు, నట్టి మనోహారిణి ప్రణయము నందుట తన యదృష్టమనియు రామునితో జెప్పి హర్షము నందెను. అటుపై స్వామి రాక, రాధాకృష్ణులు ప్రణయ సింహాసీరము నధివసింప లోకము సర్వసుఖ సమాలంకృతమైన సర్వసమగ్రమైన స్వర్గ స్థానమగుట జరిగినది. పిమ్మట ప్రణయతత్త్వమును గూర్చి రాధకును విశాఖకును చర్చ జరిగెను. ప్రేమతత్త్వమునుగూర్చి రాధ ప్రశ్నింప విశాఖ ప్రేమ యక్షయ మనియు నిత్యమనియు ప్రతిపాదించెను. రాధ తనకు ప్రాప్తించిన జీవన సంధ్యయందు కృష్ణ పాదారవింద ధూళిని శిరమున చల్లుకొని, శ్యామ మృత్తిక నొడలికి పూసికొని, పూల సమాధిలో వేణుగానము వినవచ్చు దిక్కున తనను పూడ్చి పెట్టుమని కోరినది. దీనితో నీ కావ్యము ముగిసినది. చింతా విమోక్షమను శీర్షిక (చివరిది) ప్రధాన కావ్య భాగముతో సంబంధమును లేక పాశ్చాత్య సంస్కార సూచకమై యున్నది. ప్రణయము విషాద సమ్మిశ్రితమే కావలెనన్న దృక్పథము నిరూపించినను ప్రస్తుత కావ్య ప్రణాళిక యందిది యస్థానపతితము. ప్రేమమయి రాధ యను ఖండిక యందు బలరామ పాత్ర సృష్టి చక్కని కల్పనము. లలిత, విశాఖ, బృంద మున్నగు పాత్రలు వంగ సాహిత్యమున చైతన్యానంతర యుగము నందలి గోస్వామి రచనల ప్రభావమున వచ్చినవి. కాగా ప్రధాన కావ్య భాగము రాధాకృష్ణ ప్రణయ దార్ఢ్య నిరూపకము. ఉదాత్త కావ్యశిల్పరీతులు, ప్రౌఢ కావ్య శైలి లేకపోయినను తెనుగుదనముతో మాధుర్య గుణముతో నిండిన చిత్తశుద్ధి గల రచనా మార్గమున్నది. పవిత్ర రాధాకృష్ణ ప్రణయముచే నుత్తేజితములైన నవ్యకావ్యములకు దీని

నుదాహృతిగ గైకొన వచ్చును. పూర్వోక్త పాశ్చాత్య ప్రభావముతో బాటు వంగ సాహిత్యముయొక్కయు, గీతాంజలి ఏకాంత సేవవంటి కావ్యముల యొక్కయు పరిభావమిందు స్పష్టము.

## రాధ

శ్రీ పోడూరి భోగరాజు రచించిన రాధ[112] యను కావ్యమున రాధ పాత్రయందలిన శృంగార భావమునకు తాత్త్విక ప్రతిపత్తికి కేంద్రము. రాధ పాత్రయందు కేవలము భౌతికముకాక, తొలుదొల్త భౌతిక భావముతో నిండి యున్నను క్రమముగ నా కత్త్యను వీడి పురుషోత్తముదర్శన ప్రాప్తికై తపించి దానినే యద్వైతసిద్ధికి హేతువైన ధ్యానయోగముగ రూపొందించినది. ఇందుల కనుకూలముగ నొక చిన్న కథను రచయిత కల్పించెను. స్వామి బృందావనమున రాధను గూడి యున్నపు డొకనా డుద్ధవుడు స్వామిని దర్శింప వచ్చి సత్కృతుడై స్వామిని తనయింటి కతిథిగ నాహ్వానించెను. స్వామి యంగీకరించి రాధతో నీ వృత్తాంతమును చెప్పెను. రాధ యౌను కాదని చెప్పక మిన్నకుండ స్వామి యామె మౌనమునే యంగీకృతిగ భావించి రాధతో తాను సూర్యాస్తమయమునకు మున్నే మరలి వత్తునని చెప్పి వెడలెను. ఉద్ధవునింట నర్చితుడై విందారగించి యాతనికి దివ్యసన్నిధిని ప్రసాదించెను. ఉద్ధవు డుజ్జ్వలానందరస సిద్ధి నంది, బాహ్యస్మృతిని వీడి యోగియై జ్ఞానియై యుపాధి భేదముల కతీతమైన తురీయస్థితి యందు రమించెను. అటనుండి బయలుదేరి రాధా గృహమునకు వచ్చుచున్న స్వామికి మార్గమధ్యమున నొక వింత తలపు కలిగెను. రాధకు కొంతకాలము దూరమై, యార్తులు భక్తులు నైన తాపసులకు సాక్షాత్కృతి కల్గింప వలెనని సంకల్పించి స్వామి మహానందమతియై వేణుగానము చేయుచు ఋషివాటికలకు వెడలెను. రాధ స్వామికై నిరీక్షించి యుద్ధవ గృహమునకేగి యాతని నిర్వికల్ప సమాధిస్థితిని గాంచి, యచటనున్న వారివలన స్వామినైవనమును

112. వి. ఆర్. కె. పబ్లికేషన్స్, ఏలూరు, 1954.

దెలిసి "...గోపికాలలన విచారమంది యతులస్థితి నొప్పు చునుందు మాయలం దలంచుచు నుద్ధవున్ విడిచె దైన్యమునందుచు సాఁగె ముందుకున్." (పుట 17) స్వామికై యన్వేషించి, బాల్య వృత్త ముల తలచి రాధ దుఃఖించెను. ప్రార్థన, తపన యను ఘట్ట ములలో రాధ యన్వేషణలో తీవ్రత, భావస్ఫూర్తి చక్కగా చిత్రింప బడినవి. "మబ్బులదాగి యుంటివో రమా హృదయాబ్జ మరందధారఁ దబ్బిబ్బగుచుంటివో సతుల వీక్షణముల్ ప్రసరింప డెంద మున్ నిబ్బర మెల్లఁ దూలి రసనిధి ... నొప్పుచుంటివో! అబ్బ! తలంప నించుకయు నందవు నీ గతులో పరాత్పరా!" (పుట 42) వంటి భావము లిందున్నవి. రాధ యిట్లు స్వామిని కీర్తించి దుఃఖితయై శరణా గతి నందెను. తుదకు నిరీక్షణా పారవశ్యమున మరణపర్యంత మున్యో గింప స్వామి సన్నిధి నొసగెను. ఆ సందర్భమున రాధాకృష్ణ సంబంధ మును రాధ వ్యాఖ్యానించుట, స్తుతియొసర్చి స్వామికి ప్రణతయగుట జరిగినది. ఆమె చెప్పిన తత్త్వ మిట్లున్నది. "ఓస్వామీ! మన దిప్పటి చుట్టరికము కాదు. జగత్తుల యొక్క సృష్టి స్థితి లయముల నిన్నోటినో మనకన్నుల ఛాయలందు ప్రవర్తింప జేసితిమి. నేను తాత్కాలికమైన మాయకు లోనై యింత కాలము బాధ నందితిని. నా యీ దోషమును మన్నించుము. ఆదికాలమున విశ్వవీధికి గోడలు సైత మేర్పడని వేళల వెలుగుబంతితో నాడుకొని ప్రణవమును బాడుకొంటిమి. స్త్రీపురుష స్వరూపములకు విత్తనములుచల్లి జగన్నాటకమునకు శాశ్వత సూత్ర ధారులమైతిమి..."

'ప్రకృతి పురుష భావంబునఁ బరగు మనకు
నెందు లేదు వియోగమ్మెందుకైన
సకలజగములు నీ కృపా చంద్రికలనుఁ
జాటుచున్నవి వేనోళ్ల శ్యామలాంగ" (పుట 78)

ఇట్లు రాధా కృష్ణుల ప్రకృతి పురుషతత్త్వమున ననతివిస్తృత మనోహర కథా కల్పనము, సుకుమార సుందరమైన సాధారణ

శైలి, ప్రాచీన పురాణములందలి భావముల పునరావృతి-యిందలి విశేషములు. శక్తిమేరకు రాధాకృష్ణ తత్త్వమును రమ్యముగ నిరూపించిన చిన్న కావ్యమిది.

### రాధాకృష్ణ నాటకము

ఈ శీర్షిక యందొక కొంత నాటక వాఙ్మయమున్నది. అందు శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావు రచించిన రాధాకృష్ణ నాటకము ప్రథమ గణ్యము.[113] ఉత్తమ రచనాశిల్పము, పవిత్ర రాధాకృష్ణ తత్త్వ ప్రతిపాదనము, ప్రదర్శన యోగ్యత మున్నగు ననేకాంశములీ నాటకము యొక్క యనితర సాధ్యమైన గౌరవమునకు మూలమైన యంశములు. ఉక్కునకు స్వీయగుణము నిచ్చు నయస్కాంతము వలె భక్తులను దగ్గరకు తీసి, వారి స్వాంతములకు మోదము నిచ్చునట్టి రాధికాస్వాంత విహారియైన స్వామి యీ నాటక నాంది యందు స్తుత్యుడు. నాటకము నందలి కథాంశములను పానుగంటి వారు దర్శించిన తీరును నిదియే. నాటక ధ్యేయమును భక్తిగమ్యమైన స్వామి తత్త్వము నిట్టిదియే. సూత్రధారుడు నటితో "శృంగారమునకు ముద్దుఁ జెల్లెలైన భక్తిరసము ప్రధానముగాఁ గలది." (పుట II) యని చెప్పుట వలన నిది భక్తిరస ప్రధాన నాటకమని నాటకకర్త సూచించినట్లైనది. భక్తి రసమగునా కాదా? ఒక వేళ రసమే యైనచో సంపూర్ణ నాటక నిర్వహణమున కనుకూలమైన శక్తిని కల్గినదా? మున్నగు ప్రశ్నము లాలంకారిక జగత్తున ప్రముఖములైనవి. వాని నట్లుంచి యీ నాటకమున భక్తియే రసమని చెప్పి నాటకము నట్లే నిర్వహించి యుండుట వలన ప్రస్తుతాను శీలనమునకైన దాని నంగీకరింపక తప్పదు. కాని పానుగంటివారు మహార్థస్ఫోరకమైన చమత్కారమును కావించినారు. భక్తి శృంగారమునకు ముద్దు చెల్లెలనిరి. ఈ యూహా నించుక పొడిగించిరి. నటి భక్తి శృంగారము

113. ప్రచురణకర్తలు : కొండపల్లి వీరవెంకయ్య. సత్యనారాయణబుక్ డిపో. రాజమండ్రి. 6వ కూర్పు. 1929.

లకు తేజస్తిమిర న్యాయములను చెప్పి వైరుధ్యమును సూచించినది. సూత్రధారుడు 'కాముకులకుగ్గి శృంగార నామకంబు భక్తియగు నిదె దైవంబునై నిలిచెట్టి...'(పుట II), ననసమాధానము చెప్పెను. కలికికిని, వలపుల మగనికిని గల సంబంధమున కంటె మోదకరమైన విషయ మిలలో లేదు కావున, కవులు భక్తుల భక్తికిని వలపుననును పోల్చి చెప్ప దురనియు, నీ దృష్టిలో స్త్రైణిక చిత్తవృత్తితీవ్రత భక్తితీవ్రతకు ప్రతీకయునియు నీప్రస్తానమునందే విపులీకృతము. బాహ్యదృష్టికిది భక్తిశృంగారములకు సామ్య నిర్దేశక చర్చవలె భాసించినను, నిందు పానుగంటి వారు రస సిద్ధాంతపు లోతుల తడవినారని చెప్పవలెను. ఎట్లన రససిద్ధాంతము యొక్క ఉత్పత్తి, ఆదర్శము గమనించినచో జీవాత్మ పరమాత్మల సంబంధమునకు లౌకిక ప్రతీకగనే మన పూర్వ ర్షులు శృంగారమును దర్శించిరని వ్యక్తము. ఎంతటి యుదాత్త శృంగార కావ్యమైనను నీ యలౌకిక తత్త్వమును పటుకరించని నది లౌకికస్థాయికి చెందినదే యగును. ఈ భేదమే కార్యనిక సామాన్య కవులను వేరుచేయును. బహిరంగకత్వలో స్త్రీ పురుషుల శృంగార లీలావిన్యాసముల విన్యాసమాంతరంగికకత్వలో జీవాత్మ పరమాత్మల కలయికయే యున్నదిందలి యాంతర్యము. కృష్ణకథ యందలి బహు నాయికా స్వరూపములు కిదియే యన్వయము. కాని యంతటి స్తుత్య మైన భక్తిని మానవుని తెలిసిన శృంగారరూపముగ మహాకవులు నిర్దే శించుటలోని రహస్యమిదియే. నారద భక్తిసూత్రములలో "సా త్వ స్మిన్ పర(మ)ప్రేమరూపా" (1-2) యునిన దిట్టిదే. విభావాను భావాది వ్యవస్థలో నిరెంటి సామ్యము పోషితమై ధ్యేయమైన రసా నందమున నెట్టి భేదమును లేక కేవలదృక్పథ విషయమున నున్న వైవి ధ్యమే వేరుచేయు నంతటి సూక్ష్మతమమైన సంబంధము వీని కున్నది. కావుననే చైతన్య నంతర యుగాలంకారికులైన రూపగోస్వామి వంటి వారి భక్తిరస సిద్ధాంతమున కీయర్థమునసే స్థితి కలదని చెప్పాలి. ప్రస్తుతనాటకమున నీ సూక్ష్మము వదిలమై రాధా సత్యభామాల వైవిధ్య

ముచే నిరూపితమైనది. తాత్పర్యముగ, బాహ్యముగ శృంగారశబ్ద వాచియైన యెట్టి తత్త్వనిర్దేశమును కృష్ణ కథయందు ముఖ్యముగ రాధ, గోపికలు మున్నగు పాత్రల మూలమున నొనర్చుట ప్రాచీన ఋషుల యభిప్రాయమో యా మూల సూత్రమును పానుగంటివారి నాటకమునకు జీవగఱ్ఱనొనర్చుట యిందలి మొదటి విశేషము. విమల భక్తి ప్రతిపాదకనాటకమున రససామగ్రి శృంగార సామ్యమును కల్గియుండుట యిందులకే.

ప్రథమాంకమున స్వామికై నిరీక్షించు రాధ చిత్రణమున్నది. ఆమె స్వామి వచ్చినచో తగిన యేర్పాట్లు చేయవలె ననియు, తన యలంకరణము సముచితముగ నుండవలె ననియు నాతురత నందినది. ముఖ్యసఖి యగు లలితతో నుద్విగ్నమానసయై యీ విషయమును చర్చించెను. స్వామికి జాజిమొక్కలతో లలిత శయనమును సిద్ధము చేయ, రాధ శిరీష కుసుమ దేహుడైన స్వామి కవి గ్రుచ్చుకొను ననును. తనకు కర్ణాగ్రముల గన్నేరు పూల నుంచ తత్ఫలితమైన నేత్రారుణకాంతి స్వామికి కోప భ్రాంతి కలిగించు ననును. ఈ సందర్భము లన్నియు రాధ స్నేహ ధర్మమున తన ప్రాణ, దేహ సర్వస్వముల స్వామికి త్రికరణశుద్ధిగ నర్పణ చేసికొన్న మెలకువను నిర్దేశించును. ఈ యంకమున జాగృతయై నిరీక్షించు రాధ ఉద్విగ్న భావశబలతకు ప్రతిబింబము. లలిత స్వామి నీలదేహమును వ్యంగ్యముగ ప్రస్తావించెనో లేదో రాధ "యనిర్వాచ్యమై యనేక చంద్రప్రభాభమైన యొక్క దివ్య తేజమా మహామహుని మూర్తియందు ప్రకాశించుచున్నట్లు నీ కింత కాలము నుండియును గనబడనే లేదా? కనులు లేని దాని కంధకార దర్శనము గాక మరేమున్నది!" (పుట 3) యనుట రాధకు స్వామి దివ్య స్వరూప దర్శనముతో పాటు, తదన్యమైన యెట్టి వ్యాఖ్యానమునైనను సహింపని మనస్తత్త్వము వ్యక్తము. ఈ యంకము నందలి యింకొక యంశము స్వామి తత్త్వమును గూర్చి లలిత భిన్న సందర్భములలో నొనర్చిన వ్యాఖ్య. రాధాకృష్ణతత్త్వ

భిన్నాంశములకీ పాత్రి గ్రీకు నాటకములలోని 'కోరస్' స్థానము నాక్రమించినది. ఇట్టి పనినే యించుక వ్యంగ్యమార్గమున శారదుడు నిర్వహించెను. ఈ రెండు పాత్రలును నాయికా నాయక పక్షముల సమాన స్థితి గలవి. స్వామి యంతటి నవరస రసికుడు, జనహృదయాకర్షకుడు, ఆశ్రితవత్సలుడు, సంగీతలోలుడు, మాయలాడు లేడని జను లనుకొనుచుండి రనియు, శమదమాది సద్గుణ సమాకలితుడగు భూసురేంద్రుని వేదాంత విద్య వరించినట్లు గోపాలరత్నమును రాధ వరించి తన దేహమున కమూల్య భూషణముగ చేసికొన్న దనియు చెప్పుట యిట్టి పద్ధతి కుదాహృతి. (పుటలు, 5, 6) శారదుడు వచ్చి స్వామి యాగమనము సూచించినపుడు, రాధ యప్పటికే యైన యాలస్యమున కుద్విగ్నయై దీర్ఘోపన్యాస మొనర్చినది. (పుటలు. 9–10) అందు తన్ను గూర్చి తాను కాపట్యమెరుగని దనియు, నాటవిక కురంగి వలె నమాయిక యనియు, ననురాగాంబునిధి యనియు, శుద్ధాంతఃకరణము గలదనియు, విశ్లేషము నోర్వజాలని దనియు, నిందాభాజన యయ్యును స్వామియే సర్వస్వమని నమ్మికొన్న దనియు–చెప్పికొన్నది. ఈ లక్షణముల నిరూపణము నాటక ధ్యేయము. స్వామి వచ్చిన పిదప రాధ నెరపిన యౌచిత్యమును స్వామియే సంభావించెను.

"చెక్కు చెంగావిఁ బూనదు ముక్కరంబు
తెగుర వూర్పులమోవి యిట్టిట్టుఁ గాదు
బొమలు ముడివడ వద్దిర పుష్పగంధి
చిత్తశాంతత యేమని చెప్పవచ్చు" (పుట 15)



స్వామి రాధానురాగము ఫలాపేక్ష లేనిదనియు, నామె చిత్తమున నసూయ లేదనియు, వారి సంగమము జ్వాలాధూమలతిక వలె, జ్వాలా వాయువుల వలె, వాయూ పరిమళములవలె నున్న దనెను. స్వామి ప్రవేశమునకు పూర్వము సరస సంగీత మాధుర్యముగల వేణువును మరిమొకమారు పూరింపుమని కోరిన రాధ, స్వామి తారావళి యను

నాయికతోడి సంగమము వలన నఖక్షత దంతక్షతాదుల నందియుండ చూడ జాలక "నిన్నిట్టి యవస్థలో నేఁ జూడఁ జాలను" (పుట 16) అని తన యింటికి నిష్క్రమించుట, స్వామి యెడ సారాధనైక మానస యగు రాధ సుకుమార ప్రవృత్తికి నిరూపకము. ఈ విధముగ ప్రథమాంకమున రాధ నిరీక్షణా పూర్వకమైన భావోద్వేగము, భావికథా బీజా వాపనము ముఖ్యాంశములు.

ద్వితీయాంకమున శారదుడు బృందావనము నందలి రాధ కడనుండి యామె స్వామి నటకు రమ్మనిన సందేశమును కొనివచ్చి, స్వామి సత్య యింట నుండెనని యటకు వచ్చెను. సత్య తన చెలికత్తె యగు తరళచేత నాతని పిలిపించి రాధా వృత్తాంతమును కూలంకషముగ నెరుగ ప్రయత్నించెను. అంతకు మున్ను తరళతోడి సంభాషణమును బట్టి సత్యభామ హృదయమున సౌందర్యాభిజాత్య ఫలితమైన యహంకృతి నిరూపితము. శారదుడు రాగా నామె రాధ రూపు రేఖలను గూర్చి ప్రశ్నించుట, యతడు వికటముగ విజ్ఞాన గోపనము చేయుచు బదులు చెప్పుట పానుగంటివారు సహజ హాస్యముతో శబ్దార్థ చమత్కృతులతో విడంబించుట గమనార్హము. స్వామి బృందావన గమనమునకు సిద్ధుడైన విషయము సత్య సంభాషణ వశమున గమనించెను. స్వామిపై నధిక్షేప వాక్యముల విసరినది. స్వామి "సత్యాసమవర్తనైక ప్రసంశసరణి రహిని గాంచిన నా యనురాగము వసుంధావలంబులు గానట్టి తావులేవి..." [పుట 29] యని చెప్పి లౌకికముగ దక్షిణ నాయకత్వము, తాత్త్వికముగ సర్వాంతర్యామిత నిరూపించెను. ఈ ఘట్టమున తన విశ్లేష మోర్వజాలని రాధను చూడఁ బోవుట. సత్య నూరడించుటకై మధురలోనే యుండుట యను భావముల మధ్య నలిగి, తుదకు కోపశాంతి నందని సత్యభామపై దృష్టి నుంచియు బృందావన గమనమునకే నిశ్చయించినాడు స్వామి. ఈ యంకము కథాగమనమున నొక స్థితిని నిరూపించును. సత్య తీవ్రాహంకృతి కిందు స్థానము కల్పింప బడినది. దక్షిణనాయకునిగ స్వామి

తటస్థత, శారదుని చమత్కృతి యిందు స్థాపింప బడి తృతీయాంక కథా గమనమునకు ప్రాతిపదిక లేర్పడినవి.

తృతీయాంక మీ నాటకమున గొలికిపూస, స్వామి యాగమున మును రాధ భావించి చెలులతో ప్రథమాంకము నందలి యుద్విగ్నతనే ప్రదర్శించుచు నా ననంతనిరీక్షణకు, సేవానిరతికి, భక్తి భావమునకు తావలమైనది. తాను స్వామి కర్హమైన యంభోజ మాలికను గాదనియు, స్వామి తనకు భగవంతుడే యనియు చెప్పి "త్వన్నితాంత మృదుల దామ ప్రసూన కేసరజ ధూళిఁ గాఁగ జనన మందియున్న నేను విరహమ్మున్నఁ డొరుఁగని తన్మయత్వంబుననుఁ దగిలియుందు" (పుట41) నని చెప్పుట భక్త్యావేశమునకు ప్రవృత్తికి నిదర్శనము. స్వామి వచ్చినచో నాతని పూజించుటకే పుష్పములు గావలెను గాని తన యలంకృతి కక్కర లేదని యనుటయు నట్టిదే. ప్రతీక్ష యందామె పాదకంపము, కరకంపము, స్వేదము, హృదయము కంఠమున కొట్టుకొనుట నంటి యుద్వేగ లక్షణములు వ్యాపించెను. స్వామి వచ్చినపుడు తాను సరిగా మాటలాడ జాలనని భావించిన రాధ, మాటనడి కల లలితను కొన్ని లలితా లాపముల నేర్పుమని కోరుట వ్యగ్రతా స్ఫూర్తికి నిరూపకము. ఈ యవకాశమును పురస్కరించుకొని లలిత పరమార్థ రాధాకృష్ణ నాటక సందర్భమును కల్పించి, పూర్వోక్త రీతిగ నాటకకర్త యొక్క ప్రతినిధిగ సామాజికులకు వ్యాఖ్యాతగ వ్యవహరించినది. ఈ యంతర్నాటకము కథా గమనమునకును, పాత్రతత్త్వ నిరూపణమునకును, మూలమైన యద్భుత సృష్టి. అంతర్నాటకముల పాత్రల నెన్నుకొనుటలో యథాలాపముగ తాను రాధ వేష మభినయింతునని లలిత చెప్పగా "నేనే రాధను. పూర్వ జన్మముల రాధను. వర్తమానమున రాధను. భవిష్యజ్జన్మముల రాధను. ప్రళయాంతమునఁ బునః సృష్టిలో రాధను. నా పతి శ్రీకృష్ణుఁడు, శ్రీకృష్ణుఁడు, శ్రీకృష్ణుఁడు" (పుట 55) అనుట వారి సంబంధము నందలి శాశ్వత తత్త్వ నిరూపకము. అంతర్నాటకమున

నామె వేదన, చిర విరహ దుస్సహార్తి ప్రకటితములు. రాధ భావించిన కృష్ణ స్వరూపమిది. "వెలుగుc గుండలముల మిసమిసల్ గండ భాగములపై నట్టిట్టు గంతు లిడcగ, రంగారు కటి నుండు బంగారు పుట్టంబు చిరుబొజ్జనుండి కొంచెముగ జార, బవన పూరణమున జవు జవ్వమని లేతబుగ్గలు బూరెలై పూరటిల్ల, నిగనిగల్ గల కుచ్చు సిగనున్న శిఖిపింఛ మొయ్యారముగc దల యూపుచుండ, నుత్తమోత్తమ జన్మమై యొప్పు మురళి నధరమున మోcపి జలుcజల్లు మనగ జగతి గానమునుc జేయు కళ్యాణకాంతు లొలుకు నీదు వదనంబుcజూపింపు నీరజాక్ష" (పుట 47). పరితపించుచున్న రాధ, రుక్మిణి కొరకై బ్రాహ్మణునితో వచ్చినట్లు శారదునితో రావలెనని కోరినది. శారదా కృష్ణులు, సత్యాతరళలు నొకరికొకరు కానరాకుండ నీ యంతర్నాటకమును దర్శించుచు వ్యాఖ్యానించుట నిర్వహణ దక్షతకు నిదర్శనము. ఆత్మతోబాటు తన దేహమును స్వామి కర్పణము చేసితినని రాధ యనుట, సత్య రాధ స్వేచ్ఛా సంభాషణమును విమర్శించుట, స్వామి జ్ఞానకర్మము లంగముగ వెలుగుచున్న ముక్తి సాధనమగు భక్త్యాకృతివలె రాధ యున్నదని చెప్పుట-యిందు ముఖ్యాంశములు. భావనాపథమున మధుర భాషిణినే స్వామిగ భావించిన రాధ యొనర్చిన యుపచారములు సేవాపద్ధతికి, సర్వగత కృష్ణ భావనకు నిదర్శనము. సత్యభామ స్వామిని పూజించి ధన్యమగు నుత్తమురాలని రాధ చెప్పుట క్రమముగ నామెకు రాధపై సదభిప్రాయ మేర్పడుటకు కారణమైనది. ఈ ఘట్టమున రాధ దైవసాన్నిధ్యమున భక్తురాలని స్వామి చెప్పినాడు. స్వామి కొంత తడ వంతర్నాటకమును తిలకించిన పిమ్మట రాధ స్వామి చెంగటకు వచ్చినది. తన్ను వలపించిన ప్రాణనాథుడు, బృందావనాధీశు డనియు, మధురాధీశుడు కాడనియు చెప్పి, రాధ చెరగు మోమున కడ్డు వైచుకొనెను. కథానిర్వహణమున నీ సందర్భమున భక్తిబోధక కలాపమైన రాధామాధవము ప్రభావము వ్యక్తమగుచున్నది. రాధామాధవ

మును గూర్చి శ్రీమతి అన్నాబత్తుల బుల్లి వెంకటరత్నము గారిట్లు వ్రాసిరి. "ఇది ఆంధ్రదేశములో తూర్పు తీరమున కొండపాడుట కలదు... శ్రీకృష్ణుడు బాల్యములోనే వ్రేపల్లెను వదలి మధురకు వెడలి పోయెను. అటనుండి ద్వారకకు తన రాజధానిని మార్చు కొనెను. కృష్ణుడు పెద్దవాడై మహారాజైనను, అతనిని గోప గోపీ జనము, రాధయు మరువలేదు. వెన్నదొంగయగు కృష్ణుడే వారి కండ్లముందు కదలాడుచుండెను. కృష్ణాష్టమి రోజున ఉట్లపండుగను అందరు జరుపుకొనుచుండగా, రాధ ఒంటరిగా కూర్చుండి కృష్ణుని స్మరించుచు ఆదారిన వెళ్లు హంసల ద్వారమున అతనికి కబురు పంపెను. తుదకాతనికి తన చెలికత్తె ద్వార వార్తనంపెను. దానిపై కృష్ణుడు వ్రేపల్లెకు పయనమయ్యెను. సత్యభామ రాధను గూర్చి యసూయ పడుటయేగాక అనుమానపడెను. రాధయొక్క పవిత్ర ప్రేమను గూర్చి కృష్ణుడు సత్యభామకుఁ దెలిపెను. అయినను ఆమె పట్టు బట్టి అతనితో వ్రేపల్లె కేగెను. కృష్ణుడు తన రాకను వ్రేపల్లెవాసులకు ఎఱుక చేసెను. గ్రామపు పొలిమేరవద్ద నందరు నతని కొఱకు వేచి యుండిరి. కాని కృష్ణుడు రథముపై వచ్చుచు వారిని సమీపింపగనే అందరును తిరిగి తమ గ్రామమునకు వెళ్లిపోయిరి. సత్యభామకు ఆశ్చర్యము కలిగెను.

"ద్వారకా నాథునిగాదు మేము చూడదలచినది; మాతో ఆడుకొనిన వెన్నదొంగను - మురళీధరుని!" అని వారు కబురంపిరి. కృష్ణుడు ఆరూపములోనే వారికి దర్శన మిచ్చెను. వారతని నారా ధించిరి. భక్తిప్రబోధము చేయు యిట్టి చక్కని కథ అరుదుగా లభిం చును. ఇందులో శృంగారము తక్కువ; అందుచే ఇది విశేష ప్రచా రము కాంచలేదు." 114 రాధకు బృందావనవాసి స్వామి స్వరూపక్షే త్రేయమన్నంత వఱకే సామ్యము వర్తించును. ఇది యాదృచ్ఛిక మైనను కావచ్చును. రాధ కోరిక మేరకు స్వామి బాలకాకృతితో

114. సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము-ఆరవ సంపుటము-పుటలు-563-564.

సాక్షాత్కరించెను. "...చెలువ! వాల్గన్నులను గటాక్షించు మపుడు వీడకుల జగన్మోహన బాల లీలంగలుగు రాధాధినాథుడో! కాక ముదిరి మోహమైన సత్యభామా వధూటి పతియో!" (పుట 63) అని స్వామి యన్నమాటలలో 'ముదిరి మోహమైన' యను విశేషణమును సత్య తన కన్వయించుకొని కుపితయై స్వామిని పాదతాడనము చేయుట, నారదుడు కృష్ణావతార ప్రయోజనములలో ననేక భార్యాత్వ మహాయ కరమని నిరూపించు టొకటి యని మేల మాడుట, వేద శిఖపై నుండు పాదపద్మములుగ తన శిఖపై సత్యభామ పాద మలరుట యామె భాగ్య గరిమ యని దక్షిణ నాయకుడైన స్వామి సంభా వించుట గమనార్హములు. సత్య స్వభావమును నిరూపించు పాద తాడన వృత్తాంతము తిమ్మనోపజ్ఞమై వివిధ యుగము లందలి కవుల రచనములపై ప్రభావము చూపినదని యీ ఘట్టమున స్పష్ట మగు చున్నది. రాధ యీ సన్నివేశమును కాంచి దుఃఖించి స్వామి కుప చరించి, యాతని దాసురాలైన తానును పాదతాడన కర్హురాల నని ప్రణమిల్లుట సత్య చెప్పినట్లు రాధ శాంత చిత్తత. రాధ ప్రవర్తన సత్యమనస్సును నొకరీతి నాకర్షించి మార్చినది. రాధ తన కుచమండల భాగమున స్వామి తల యుంచి నిదురించినపుడు, శిరము నొవ్వకుండ తన మెడలోని మల్లికా సరము నడ్డము వేయు వృత్తాంతమును ప్రస్తావించినపుడు సత్య దానిని సిగ్గులేని తనమని యధిక్షేపించినది. "మరియొక మగవాడెవడు లోకమున లేకపోవుటచేత నాకు సిగ్గు లేదు... సృష్టిలోని జీవతతి యంతయు స్త్రీతతియై యందర కొక్కడే పురుషుడు" (పుట 67) అని చెప్పుట భక్తురాలగు మీరా జీవిత సన్నివేశమును తలపించుచు స్వామి పరతత్త్వమును నిర్వచిం చును. రాధయొక్క దిక్కుమాలిన వేదాంతముతో విసుగెత్తిన సత్యభామ యమునలో పడి చత్తు ననుట భావికథార్థ సూచకము. స్వామి నైపుణ్య దాక్షిణ్యములతో పాద తాడనమునకు కారణమైనది యనురాగాతిశయమే యని సమన్వయించి యామె పశ్చాత్తప్త

మైనది. స్వామి యటనుండి సత్యా సహితుడై వెడలుచు సర్వాంత ర్యామియైన తాను రాధలోనే యుంటి ననుట, రాధ మాటలకు పూర్తిగ లొంగి విచిత్రానుభూతి నందియు నహంకారావ రోధన ముచే దాని నంగీకరింపని సత్యభామ మనఃస్థితి యీ యంకము నందలి పరిశిష్టాంశములు. తృతీయాంకము సత్యారాధల తారతమ్య పరిశీలనమునకు, స్వామి దాక్షిణ్యములోని సూక్ష్మ తత్త్వ ప్రతి పాదనకు నెలవై భావికథా ప్రవృత్తికి బీజములనుఁ గల్గి శిల్ప సమ్మ తమై యొప్పుచున్నది.

చతుర్థాంకము రాధ మనస్సు నందలి మహత్తర పరిణామ మునకు, నాటకకర్త చెప్పదలచిన భక్తితత్త్వ పారమ్యమునకు స్థానమై చక్కని పరిసమాప్త్యంగములతో నొప్పారుచున్నది. రాధ కృష్ణ భక్తి తన్మయతా ఫలితమైన యున్మాదము నంది, కాషాయము మీద వైచుకొని, నామస్మరణ మొనర్చుచు నరణ్యమున సంచ రించుచు, తన నన్వేషించుచు వచ్చిన మధురనే సరకు గొనక, శంఖ చక్ర చిహ్నితములైన స్వామి పాద దర్శన భ్రాంతిచే చరించుచుండెను. మధుర యీ పరిస్థితిని గాంచి దుఃఖించెను. మధురను స్వామిగ భావించి రాధ భక్తి తన్మయుడైనది. యమున యందు చంద్ర బింబ మును స్వామి యని భ్రమించి యందు దుమికెను. ఇందు రాధ పాత్ర తన్మయ పూర్వక కృష్ణభక్తికి పర్యాయము.

పంచమాంకమున నాటక బీజములన్నియు ఫలవంతములైనవి. ఇందు మున్ను నారదునికిని శారదునికిని సత్య చెలి తరళకును జరిగిన సంభాషణము వలన సత్యలో నొక విధమగు మానసిక పరిణామము కల్గెననియు, రాధాకృష్ణుల సంబంధము వారికే వేద్యమని యు వ్యక్తము. సత్యాంతఃపురమున స్వామి, సత్య, శారదుడు ప్రసం గించుటను బట్టి యొక భక్త శిఖామణి యమునలో పడినట్లు స్వామి కగపడిన వృత్తాంతము ప్రసక్తమైనది. అటుపై భక్తి తత్త్వము నందలి యౌన్నత్యమును గమనించిన సత్య స్వామిని భక్తి తత్త్వ

ముపదేశింపుమని కోర స్వామి నారదునిచే చేయింతునని చెప్పెను. పిమ్మట నారదుడు వచ్చెను. ఆతడు స్వామిని స్తుతించి యమునయందు దూకిన భక్తురాలిని గూర్చి ప్రస్తావించెను. సత్యభామ మనస్సున నన్యాలోచనము కలుగకుండునట్లు వర్ణలింగ నామాకృతులు బాహ్యశరీరమునకే యనియు, జడ సుఖముల వేడిన భక్తునకు లేవనియు స్వామి చెప్పిన పిదప, మునిబాలుం డొకడు రాధతో ప్రవేశించెను. రాధనీ మునిబాలుడు నదినుండి వెలికి తెచ్చిన వృత్తాంతమును నారదుడు చెప్పెను. సత్యభామ పశ్చాత్తప్తయై "ఈమె పరమధన్యవలె నున్నది. ఐహికము లన్నియుఁ ద్యజించిన పరమ భక్తురాలు" (పుట 93) అని భావించి ప్రేమతత్త్వ ముపదేశింపుమని యామెను శరణ మందెను. స్వామి తనకై రాధ పడిన కష్టములను ప్రస్తావించి తానామె ఋణమును తీర్చుకొన లేననియు, శాశ్వతముగ నామె సన్నిధి వసించ నగుదు ననియు చెప్పెను. ఈ మాటలు సామాన్యదృష్టికి రాధ నాశ్వాసించినట్లు కనబడినను నిందు నాటక గతమైన మహార్థ మిమిడి యున్నది. తొలి భాగమున రాధ స్వామికై తహతహ లాడుచున్నను, నాతడు సర్వాంతర్యామి యని సిద్ధాంతరీత్యా విశ్వసించినను, తనకు ధ్యేయమైనది బాలకృష్ణ స్వరూపమే యని యొక పరిమితత్వమున బద్ధమైనది. తనలో రాధాత్వము శాశ్వతమని మానసికముగా విశ్వసించియు, స్వామి తాను రాధ యందే యుంటినని చెప్పిన పిమ్మట కూడ స్వామి యన్వేషణమునకు బయలు దేరినది. అనగా స్వామిని గూర్చిన సంపూర్ణ జ్ఞానమును కలిగియు, సవికల్పమైన సమాధి స్థితికే యర్హత నార్జించుకొన్నది. కాని, సంపూర్ణ శరణాగతి పూర్వకమైన త్యాగము చేయనిదే స్వామి శాశ్వత సన్నిధి లభింపదని తెలియవలసి యున్నది. యమునయందు పడుట యీ సర్వసమర్పణ చిహ్నము. కావున నిప్పుడు స్వామి యామెకు శాశ్వత సన్నిధిని ప్రసాదించెను. ఈ విధముగ నాటకమున పరమ ధ్యేయమైన భక్తి పారమ్యము స్థాపింపబడెను. సత్యభామ రాధతో

కలిసి భక్తురాలై కృష్ణ సంకీర్తన మొనర్చినది. పిమ్మట నారదుడు సత్య నుద్దేశించి యీ నాటకము నందలి తాత్త్వికార్థ నిర్దేశకమైన యుపన్యాసము నిచ్చెను. అందలి సారమిది: సమిధలను దరచి శ్రమ చేసి వచ్చిన యగ్ని కీలల మరి యొకరికిచ్చినపుడు రాధ భక్తి తత్త్వ మును సత్యభామ కొసగెను. నెరసున్న వర్ణములతో చేర్చినపుడే యుచ్చారణార్హ మైనట్లు నిర్గుణము సగుణముతో బాటుగ మాత్రమే సాధ్యము. కొందరు నిర్గుణ బ్రహ్మ సంధాననిష్ఠ వలన జ్ఞానసిద్ధి (అద్వైతసిద్ధి) నందితిమని భావింతురు. జ్ఞానమొక్కటే ముక్తికి కారణము కాదు. భక్తి లేనిదే ముక్తి లేదు. స్వామి తత్త్వారమ్యము నిరూపించుటకే యవతార మెత్తెను.

"ఈ మహోపనిషత్సార మీశ్వరుండు
భార్యలగు వీర లష్ట వైభవము లగుదు
రిలనుఁ బదునారు వేల వేతలును జీవ
సంఘమం దుత్తమోత్తమ జన్మ రాధ" (పుట 35)

స్వామిపై నామెకున్న రాగము భౌతికవాంఛ కాదు. పరమాత్మ యందు రాగపరిపూర్ణ జీవునకు కల సంబంధ సిద్ధివంటిది. దానిని నిరూ పించుటకే స్వామి యీ నాటక మాడించెను. పిమ్మట స్త్రీ పురుషు లనేకులు వచ్చి రాధా సత్యాసమేతుడైన స్వామిని దర్శించిరి. అట్లు రుక్మిణి గూడ దర్శింపవలెనని కోరిన దైన్యమును స్వామి తెలిసికొని తానే యామె కడకు పోదునని చెప్పి యామెపై తనకు గల గౌరవ మును నామె ప్రత్యేక ప్రతిపత్తిని నిరూపించినాడు.

ఈ విధముగ ఈ నాటకము భక్తితత్త్వ ప్రధానమైన రాధా కృష్ణ సంబంధముల నిరూపించు మహత్తర సృష్టి.

ఇతర నాటకములు

ఈ యుగమున రాధాకృష్ణ కథ నాధారముగ గైకొనిన నాటకము లనేకములు రచింపబడినవి. అందు మూడు నాటకములు

ప్రస్తుతాను శీలనమున వస్తు, రచనాతత్త్వ వైవిధ్యములను బట్టి ప్రసక్తములగుచున్నవి.[115] వీనిలో మొదటి నాటకము బాల్య లీలా వృత్తాంతము ప్రధాన వస్తువై, ప్రసక్తిని బట్టి రాధాకృష్ణ వృత్తాంతము చేర్పబడినది. బాలకృష్ణుడు బాల్యము నుండి రాధకు మచ్చికయై యుండెను. ఒకనా డామె స్వామిని లాలించుచు ప్రేమ పూర్వకమైన యనుభూతి నందినది. ఆ యనుభూతి క్రమముగ కామ మార్గమున పర్యవసింప, స్వామి కతిపయ చమత్కార పూర్వక సంభాషణము లొనర్చి హఠాత్తుగ యువక రూపము నందెను. రాధ స్వామి యొక్క సౌందర్య యౌవనముల కద్భుతము నందియు (సన్నిధి విశేషమున కావచ్చును) భక్తి భావమునకు లోనై స్వామిని కీర్తించెను. స్వామి యామెను మరల మోహ మార్గమునకు మరల్చ నెంచి తాంబూలము తెప్పించుకొని నంతలో నామె భర్త వచ్చి తలుపు తట్టెను. రాధాకృష్ణులు తబ్బిబ్బులు పడునంతలో నాతడు లోనికి వచ్చెను. అతడు ముసుగు తీసి చూచుసరికి స్వామి రాధా సోదరియగు కమల రూపమున మెల్లగా బయటకు పోయెను. రెండవ నాటకము కథా కల్పనమున దీనినే పోలియున్నది. మూడవ నాటకము మిక్కిలి విశాలమైన యితివృత్తమును కలది. చంద్రముఖి యను నొక వనిత పాతివ్రత్య ప్రభావమున నహంకరించి రాధ నవమానింప యత్నించుట, తత్ఫలితముగ స్వామి నారదాకూ్రర సాహాయ్యమున నామె గర్వమును పోనాడుట యిందలి కల్పితేతివృత్తము. దీనిని ప్రేక్షకులను రంజించుట కుద్దేశింపబడిన రచనా పద్ధతిలో నాటకకర్త పెంపొందించి వ్రాసియున్నాడు.

---

115. (1) శ్రీ సంగీత కృష్ణలీల. శ్రీ సంపన్ముడుంబి పింగరాచార్యులు. కురుకూరి సుబ్బారావు. బుక్కుసెల్లరు, భీమడోలు. 1923. (2) శ్రీకృష్ణలీల. శ్రీమద్దూరి శ్రీరామమూర్తి. పుట్టెపు అప్పలస్వామి, బుక్కుసెల్లరు, గణపతి బుక్ డిపో, బెజవాడ. 1930 (3) రాధాకృష్ణలీల అను చంద్రముఖీ గర్వభంగము. కంచెర్ల వేంకట హనుమయ్య (ప్రచురణాది వివరములు లేవు)

ఈ మూడు నాటకములందున సామాన్యలక్షణము రచనా శిల్పమున సాధారణములై యుండుట. కథా కల్పనమున వీనిలో కొంత ప్రతిభాంశమున్నను, నిర్వహణ సామర్థ్యము తక్కువ. వీనిలో నెడనెడ భక్తిభావ స్ఫురణమును కలదు. మొత్తము మీద రాధాకృష్ణ కథాంశములు నాటక వాఙ్మయమున పర్యవసించిన మార్గమునకు మాత్రమే యివి యుదాహరణ ప్రాయములు.

ఈ విధముగ ఆంధ్ర సాహిత్యమున ప్రబంధయుగము నందు ప్రథమముగ నవతరించిన రాధాకృష్ణ కథా వృత్తాంతము భిన్న భిన్న సాహిత్య యుగములందు, ప్రక్రియల యందు కాలానుగుణమైన పరిణామము నంది సాగివచ్చినది.

# 7. కల్పనా సాహితి

మూలగ్రంథములైన పురాణేతిహాసములందలి వృత్తాంతముల నుత్తేజకములుగఁ గైకొని, తన్మార్గమున నూతనకథా కల్పన మొనరించు పద్ధతి యన్ని వాఙ్మయము లందును ప్రసిద్ధమైనది. ఇట్టి కల్పనముల వలన మూలగ్రంథము లందలి కొన్ని యంశముల వ్యాఖ్యానించుటయో, అభూతవిషయ ప్రతిపాదనము వలన పాఠకులకు చిత్తవికాసము కల్పించుటయో సాధారణముగ నీ మార్గము నకు ధ్యేయమై యుండును. ఇందులకు చక్కని కాల్పనిక శిల్పమును, నిర్వహణ దక్షతయు వలయును. కల్పిత వృత్తాంతము మూలకథల యందలి భావమార్గమునకు వ్యతిరేకముగ భాసించినచో నవి పాఠకుల హృదయ ములందు పరంపరాగతమైన విశ్వాసములకు, అభిప్రాయ ములకు భంజకమై పారమ్యమును కోల్పోవును. సాధారణముగ కాల్పనిక సాహిత్యమును పరిశీలించు నెడ నివి నిర్దేశక సూత్రములుగ గమ నింపదగినవి.

ఆంధ్ర వాఙ్మయమున కృష్ణకథా విషయమై కొన్ని కాల్పనిక వృత్తాంతములు వ్యాపించి యున్నవి. వీని మూలము లెక్కడనున్నవో నిర్ధరించి చెప్పుట సాధ్యముకాదు. కొన్నిటి కసలు మూలములే లేక పోవచ్చును. అట్టి కొన్నిగ్రంథముల యనుశీలన మీ శీర్షికయం దుద్దిష్టము.

### విష్ణుమాయా నాటకము

మున్ముగ పరిశీలింపదగినది చింతలపూడి ఎల్లనార్య కృతి విష్ణు మాయానాటకము.[116] ఇందు విభిన్న పురాణములందు కీర్తింపబడిన విష్ణుమాయాప్రభావమును నిరూపించుట ప్రధానాశయముగ కన్పించు చున్నది. అందులకై చక్కని కల్పనాశిల్పము నాధారముగ నీతడు

---

116. మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణము. 1934

కథా నిర్వహణ మొనర్చియున్నాడు. ప్రధానాశయమును నెరవేర్చు టతోఁబాటు ప్రాస్తావికముగ కొన్ని సందర్భము లందికవి కృష్ణ తత్త్వాంశముల మనోహర మార్గమున ప్రతిపాదించుట, ఉత్తమస్థాయి రచనాశిల్పము వెలార్చుట గమనింప దగియున్నది. ఆంధ్ర వాఙ్మయ మున ననంతర కాలమందీ వృత్తాంతములు రూపాంతరము నందినవో, యథాతథముగనో వ్యాపించుట ఎల్లనార్యుని ప్రతిభా విశేషములకు, ఆంధ్రకవుల గతానుగతిక పద్ధతికి నిదర్శనములు. స్థలాంతరమున సూచితములైన రచనావిశేషములు చింతలపూడి ఎల్లన యీ కావ్యము నందును గమనింపదగి యున్నవి.

ఇందు కథావతరణమే యొక విశిష్ట రమ్యమార్గమున నున్నది. ధర్మజుని సభ కొకనాడు వేదవ్యాసులు వచ్చిరి. ధర్మజు డాయన కర్హ సత్క్రియల నొనర్చి యున్నపుడు, వ్యాసులు పాండవుల యెడ స్వామి వాత్సల్యాది విశేషములను, అందుల కర్హమైన పాండవుల గుణసంప త్తిని కీర్తించిరి. ప్రాస్తావికముగ స్వామి తత్త్వము నందలి భిన్నాంశ ముల ప్రతిపాదించిరి. వ్యాసముఖోద్గత కృష్ణ తత్త్వము సభయందున్న ధౌమ్యాది విద్వజ్జనములకు, భీమాదులకు, ఇతరులకు అమందానంద మును చేకూర్చినవి. ఆ సభయంతయు "...భృంగ సంగీతంబులతోఁ జెంగల్వకొలను మెలంగిన చందంబున నందంబయ్యె." (1-67) ధర్మ నందను డొక విశిష్ట యోగానుభూతి నందినాడు. తానును తనకు ప్రసన్నమైన రీతిలో కృష్ణ తత్త్వాంశముల నభివర్ణించి తన్మయత్వము నందినాడు. అటుపై స్వామి సత్యస్వరూపమును దివ్యదృష్టిచే పరామ ర్శించి తనకు వివరింపుడని వ్యాసులను ధర్మజు డర్థించెను. ఆయన నిష్కంపనిస్తరంగ మాలికవలె కొంతతడవుండి, సృష్టిసర్గమును విష్ణు మాయావిలాసమనియు, దానిని తరించుట కెవ్వనికిని తరము కాద నియు, దేవతలకైనను, మునిబృందములకైనను అహంకరించియున్న స్థితిలో విష్ణుమాయ నవగత మొనర్చుకొనుటయే దుర్లభమనియు, దాని తరించుట స్వామి కృపావిశేషముపై నాధారపడియుండు ననియు

చెప్పి, తన్నిరూపకములైన కొన్ని కథా వృత్తాంతముల తెలుప నుపక్రమించుచుండెను. ఇంతలో ద్వారక నుండి గోవిందశర్మ నామధేయుడైన వటూత్తముడు సనకసనందనాది మహర్షిబృందముతోను, నారదునితోను సభకు వచ్చెను. ఆతని యాగమనమును వ్యాఖ్యానించుచు వ్యాసులు సకలకథాప్రవీణుడు, మహాతపస్వియు అగు గోవిందశర్మను స్వామి తన దివ్యచిత్తమున నిక్కడ ప్రవర్తిల్లిన దివ్యకథా ప్రసక్తి నెరిగి పంపినాడని చెప్పెను. ఇంతలో విష్ణుకథా వృత్తాంత ప్రసంగ రంగమైన ఆసభకు అసంఖ్యాక మునీంద్ర బృందము శ్రవణ కుతూహలమున వచ్చిరి. సనత్కుమారుడు గోవింద శర్మను ధర్మజునికి పరిచయ మొనర్చెను. తామెల్లరు ద్వారకకుపోయి యాతని వలన కృష్ణకథా శ్రవణకుతూహలమును వ్యక్తముచేయగా, స్వామి ధర్మజుని సభయందు ప్రవర్తిల్లిన వృత్తాంతముల గ్రహించి తన కథా ప్రవచనము ధర్మజుని సభయందే జరుగునట్లు నిర్దేశించి పంపెనను వృత్తాంతమును చెప్పెను. అటుపై ధర్మజ పృచ్ఛితుడైన గోవిందశర్మ స్వామిమాయా నాటక నిరూపకములైన వృత్తాంతములను ప్రవచించెను. ఈ కథావతరణ వృత్తాంతము నందు ఎల్లనార్యుడొక అంతర్దర్శనమును ప్రతిపాదించినాడు. భాగవతము నందు స్వామి కథాశ్రవణము తత్సన్నిధిహేతువను విషయము పలుతావుల కలదు. స్వామికథ లెక్కడ గానము చేయబడునో యక్కడ స్వామి వసించును. తన కథలను వినవలెనను పూనికతో మహర్షిబృందము, ధర్మజుడు నున్న తావున స్వామి మందిర మార్గమున సన్నిధిని ప్రసాదించి, గోవిందశర్మ ముఖమున తన దివ్యకథా గానమును వెల్లివిరియించెను. గోవిందశర్మ కథాప్రవచన మార్గమును వర్ణించిన పద్ధతి యిందుకు కుపస్కారకము. "అమ్మహామునులకున్ మహాస్త్రాబ్జముల్ మోెచ్చి నితాంతక్రియ గోపకాంత మురళీ గీత ప్రబంధ ధ్వనిన్" (131) ప్రవచించెను. కథావతరణ శిల్పము తత్త్వార్థ స్ఫోరకమగుట యిందలి విశేషములలో నొకటి.

ఈ గోవిందశర్మ సాందీపని యగ్రపుత్త్రుడైన ధర్మశీలుని పుత్త్రుడు. బాల్యమున ఆకాశవాణి యీతడు శాస్త్రవేది, విశ్రుతకీర్తి, స్వామి మిత్త్రము నగునని యాశాసించెను. అప్పటినుండి స్వామి నగరు నందే నివసించుచు రాణివాసపు స్త్రీలకు నూత్నకథా నిర్మాణము నొనర్చి వినిపించుచు, స్వామి సన్నిధి కృపావిశేషమునకు భాజనుడై యుండినవాడు. ఈతని మెడయందున్న పారిజాత కుసుమదామమును గూర్చి ధర్మజుడు ప్రశ్నించినపు డీతడు చెప్పిన కథా వృత్తాంతము ఈ అనుశీలనమున ప్రసక్తము.

పారిజాత వృక్షమును సత్యభామ పెరటియందు నిల్పిన స్వామి యామె చిత్తవృత్తిని పరీక్షించుటకై రుక్మిణ్యాది మహిషుల యొక్కయు, షోడశ సహస్రాంగనల యొక్కయు గృహములందట్టి వృక్షములనే తన మాయాచాతుర్యము వలన సృష్టించినాడు. ఇది స్వామి అనంత విలాస వైభవ చిహ్నము. నిరూపణమందున్న దక్షిణ నాయకత్వమునకు బీజము.

స్వామి యాదృతివలన రూపయౌవనాదుల వలన గర్వించిన సత్య స్వామి తనకే వశుడని భావించి తన యౌన్నత్యము నితర మహిషులకడ నిరూపింప దలచి, పారిజాత కుసుమముల వేరు వేరు పూల సెజ్జలనుంచి వారికి కానుకలుగ చెలులచేత పంపెను. ఇందు ముఖ్యముగ రుక్మిణీ గృహమున కేగిన చెలి వృత్తాంతము, ఆమె యనుభవములు ప్రసక్తము లైనవి. రుక్మిణీ మందిరమున స్వామి యుండుట, రుక్మిణియు సత్యభామవలెనే పారిజాత కుసుమముల నితరులకు పంప నుండుట, యీ వృత్తాంతమును గాంచిన సత్యభామా దూతిక యెట్లో తన్ను తాను నిలువరించుకొని యీ వైనమును సత్యభామకు చెప్పవచ్చినపుడు స్వామి యందే యుండుట, సర్వ వృత్తాంతముల నెరిగి సత్యభామ యహంకరించి స్వామిని తూలనాడి విముఖ యగుట మున్నగు వృత్తాంతములు ప్రవర్తిల్లినవి. సత్యభామను ప్రసన్ననొనర్చు కార్యమును స్వామి గోవిందశర్మ కప్పజెప్పి

నాడు. ఇతడు సత్యభామను తన తేజము చేతను, వచోధోరణి చేతను మెప్పించి యీ సర్వ వృత్తాంతము స్వామి సత్యయొక్క ధైర్య ప్రవృత్తిని పరీక్షించుటకై కల్పించిన యింద్రజాలమనియు, స్వామి మాయ యట్టిదనియు చెప్పి యామె నాశ్వాసించెను. ప్రీతయైన సత్య పారిజాత కుసుమ దామముచే గోవిందశర్మను సత్కరించి స్వామి యెడ యథాపూర్వముగ ననురక్తయయ్యెను. (ఇటుపైనున్న వృత్తాంతములు సాక్షాత్ కృష్ణ సంబంధులుకావు.) ఈ వృత్తాంత మును ఎల్లన మహత్తర వర్ణనా శిల్పముతోను, ఉజ్జ్వల శిల్పము తోను తీర్చిదిద్దినాడు. అర్వాచీన కాలమునందు కంకంటి పాపరాజు, కంకంటి నారసింహకవి, రోసనూరి వెంకటపతి రచనములు దీని కను కరణ ప్రాయములు.[117] పౌర్వా పర్యములు నిర్ణయింప వీలుకాకు న్నను స్త్రీల పాటలయం దిట్టి వృత్తాంతములు నెలకొనియున్నవి. మొత్తముమీద ఎల్లనార్య డాంధ్ర వాఙ్మయమునందు రాధాకృష్ణ సాహిత్యమున కాద్యుడైనట్లే కాల్పనిక సాహిత్యము నందును ఆద్యుడు. కృష్ణ తత్త్వాది విషయములందీతడు పురాణ ప్రోక్తము లైన యనేకాంశములను రమ్య ప్రబంధ మార్గమున చెప్పుటయు గమనార్హమైన విషయము.

## కృష్ణార్జున సంబంధము

పిమ్మట ఆంధ్ర వాఙ్మయమున నధికముగ వ్యాపించిన కాల్ప నిక వృత్తాంతము కృష్ణార్జున సంబంధమైనది. ఇది ముఖ్యముగ గయోపాఖ్యాన వృత్తాంతమును పురస్కరించుకొని వ్యాపించినది. తత్క్రమ పరిణామానుశీలన మిట్లుండును.

117. కంకంటి పాపరాజు యక్షగానము. వావిళ్ళ ప్రచురణము. నారసింహకవి ద్విపద పాలపర్తి నాగేశ్వర శాస్త్రిలుగారిచే పరిష్కృతమై విద్వన్మనోరంజనీ ముద్రాక్షర శాలయందు ముద్రితమై 1865 లో ప్రకటితము. రోసనూరు వేంకటపతి గ్రంథము నాకు లభింపలేదు. దీనికి సంబంధించిన వృత్తాంతములను, చారిత్రక విషయములను డా॥ నేలటూరి వేంకట రమణయ్యగారు పాపరాజు యక్షగానము పీఠికయందు నిరూపించి యున్నారు.

గయోపాఖ్యానము వృత్తాంతమొక విచిత్ర కల్పనము. శరణాగత రక్షణము క్షత్రియుల కెంతటి ప్రాణప్రదమైన ధర్మమో నిరూపించుటయే దీని ధ్యేయము. అందుల కాకరముగ కృష్ణార్జునుల మధ్య సనూహ్యమైన యొక కలహ వృత్తాంత మిందుండుటచేత దీని ప్రశస్తి యనన్యము. ఏకాత్ములు, నరనారాయణులు అగు కృష్ణార్జునుల మధ్య కలహమును కల్పించుట యిందలి పరమాకర్షకతత్త్వమునకు కారణము. స్వామిచే భగవద్గీతోపదేశము నంది యభ్యుత్థానము నందియున్న నరజాతికి ప్రాతినిధ్యము వహింప గల్గిన అర్జునుడు శరణాగత ధర్మమున బద్ధుడగుట, ఆశ్రిత భక్త వత్సలుడైన స్వామి తనకు తెలియక యొనర్చిన ప్రతిన నెల్లని నెరవేర్ప యత్నించుట, కడకు గయు డాధారముగ నరనారాయణ తత్త్వము లోకమునకు నిరూపితమగుట- యిందలి ప్రధానాంశములు. కృష్ణకథా గతములైన కాల్పనికాంశములలో మహోన్నతమైన యీ వృత్తాంతముయొక్క క్రమ వికాసము నిట్లు నిర్దేశింపవచ్చును.

### కృష్ణార్జున సంవాదము

గయోపాఖ్యాన కథా వృత్తాంత మీనా డెల్లరకు పరిచయమున్న స్వరూపమున మొదట కన్పించునది నాదెండ్ల గోపమంత్రి కృష్ణార్జున సంవాదమునందు.[118] ఈ కథా వృత్తాంతము నాతడు మధురమైన ద్విపదగ రచించినాడు. సుపరిష్కృత రూపము నంది యున్న యీ కథా వృత్తాంతమున కాకరములు పరిశీలించునపుడు చరిగొండ ధర్మన చిత్ర భారతము ప్రసక్తమైన గ్రంథము. అందు బ్రహ్మాండ పురాణోక్తమైన యొక కథా వృత్తాంతము ప్రస్తుత కథతో నధిక సామ్యమును కల్గియుండుట చేత గోపమంత్రి కథా నిర్మాణమున కది మూలమై యుండవచ్చునను భావము కల్గుట కవకాశమున్నది. అట్లే విమర్శక లోకము భావించినది కూడ. ఆ కథాం

118. వావిళ్ళ ప్రచురణము 1949.

శము లిట్లున్నవి: చతుర్ధనుడను రాజు వేటకేగి యొక విచిత్రాశ్వముచు గాంచి, దానిని తన నగరమునకు తీసికొనిపోయి దానిపై నధిరోహించి సమస్త లోకములను పర్యటించెను. ఆ గుర్రపు నోటి నురుగు సూర్యున కర్ఘ్య ప్రదానము చేయుచున్న స్వామి చేతి యందు పడుట, స్వామి యాతని సంహరింప ప్రతిన యొనర్చుట, నారదుని సూచనము ప్రకార మాతడు వివిధ దేవతల నాశ్రయించి విఫలు డగుట, పార్థుని శరణమందుట, మున్నగు ప్రధానాంశము లిందున్నవి. కథాంతమందు స్వామి చక్రయుధము వలన ధర్మజుడు తప్ప నితర పాండవులు సంహరింపబడిరి. స్వామి ధర్మజునితో మృతులైన వారిలో నెవ్వరిని బ్రదికింపనుందు వని యడుగ, ధర్మజుడు తమ శరణాగత రక్షణ చిహ్నముగ చతుర్ధనుని ప్రాణముల నర్థింప, స్వామి ప్రీతుడై యెల్లర పునర్జీవితుల నొనర్చెను. ఈ వృత్తాంతములందు స్వల్ప భేదము లటుంచి గయోపాఖ్యాన కథా కల్పనమునకు వలసిన యంశము లన్నియు నున్నవి. కావున నాదెండ్ల గోపమంత్రి కల్పనమున కీ వృత్తాంతమే కారణమని గాని, తత్ప్రభావమున నాతడే యిట్టి సర్వాంగ సుందరమైన కల్పన మొనర్చెనని గాని చెప్పుట కెట్టి యభ్యంతరము నుండదు. అర్వాచీ నాంధ్ర సాహిత్యము నందు వెలువడిన మరికొన్ని కల్పనాత్మక వృత్తాంతములను గమనించినచో (అర్జున గర్వభంగ మట్టిది. ఈ శీర్షికలో ననంతర భాగమున తద్వివేచన మున్నది.) కృష్ణార్జున సంబంధములైన వివిధ కథానకములు దేశమున జానపద స్వరూపము లందును, జనశ్రుతు లందును వ్యాపించి యుండి నట్లును, వానిలో కొన్ని మహారాష్ట్రము నుండి మన రాష్ట్రమునకు వచ్చినట్లును నూహింప వీలగుచున్నది. అట్టి వానిలో నే వృత్తాంతమైనను గోపమంత్రి యీ కథా నిర్మాణమునకు దోహదము చేసి యుండవచ్చును. అట్టి యవకాశము లేకున్నను స్వయముగ నొక నూతన కథా నిర్మాణమునకు పూనుకొన్న ప్రతిభాశాలియైన కవికి పూర్వోక్తమైన సిద్ధ కథా సామగ్రియే చాలును. స్వామి కోపము

నకు కారణముగ నొక మానవ పాత్రను కల్పించుట, యాదవ పాండవ సంబంధులైన యితర పాత్రల కిందు ప్రమేయము కల్పించుట, యన్న మాత్రపు వైవిధ్యముల యారోపణము గోపమంత్రి చేయజాలనివాడు కాడని నిగ్రహ పూర్వకము, గంభీరమునైన యాతని కవిత్వ పద్ధతియే నిరూపించు చున్నది. చివరి వృత్తాంతమును పరిహరించుటలో కూడ గోపమంత్రి యౌచిత్యమును ప్రదర్శించినాడు. ఈ వృత్తాంతమునకు యక్ష ప్రశ్నముల కథతోడి సామ్యమున్నది. ఇది ధర్మజుని ధర్మవివేచనా శక్తికి నిదర్శనము. కథా నాయకుడగు పార్థుని మృతిగాని, యాతని ప్రాణములు స్వామి దయచేత సంపాదింపబడుట గాని ఉత్కర్షా పాదకములు కావు. మొత్తము మీద గయోపాఖ్యానమును గోపనోపజ్ఞముగనే విమర్శక లోకము గురుతెరిగినది. ప్రస్తుతాను శీలనమున నంత కన్న సూక్ష్మ వివేచన మక్కరలేదు. అటుపై నీ వృత్తాంతము ననేకులు రచించిరి. అందు రామనామాత్య కృతమైన గయోపాఖ్యానము కొంత ప్రతిష్ఠ కల కావ్యము.[119] ఇందలి వృత్తాంతము లన్నియు గోపమంత్రి ద్విపదనే యనుసరించుచున్నవి. రామనామాత్యుడు పద్యరచనము నందును, పాత్రల మనస్తత్త్వమును సూక్ష్మముగ వివేచించుట యందును నైపుణ్యము గలవాడు.

## గయోపాఖ్యానము

ఇవియన్నియు నిట్లుండ నాంధ్రవాఙ్మయమున నవ్యయుగమున శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము రచించిన గయోపాఖ్యానము మిక్కిలి ప్రజారంజకమైన నాటకము.[120] సాహిత్య విమర్శనా దృష్టితోను, పరిశోధనాసక్తితోను పూర్వోక్తగ్రంథముల వివేచనము చేయవలసినదే గాని, యసలు గయోపాఖ్యాన మన్నపుడు పండిత పామరులెల్ల వారికిని మనస్సున మెదలున దీ గయోపాఖ్యానమే. ఇది

119. వావిళ్ళ ప్రచురణము. 1934.
120. కొండపల్లి వీరవెంకయ్య ప్రచురణము, రాజమండ్రి. పునర్ముద్రణ. 1945.

యాంధ్ర నాటక వాఙ్మయమున నగ్రశ్రేణికి చెందిన కొలది రచనము లలో నొకటి. ఇన్ని పర్యాయములు పునర్ముద్రిణ భాగ్యము, అసంఖ్యాక ప్రదర్శనములు పొందిన నాటకము లెన్నియో లేవు. ఇంతటి విజయమును సాధించిన యీ నాటకమునందలి పద్యములు నోట బట్టని యక్షరాస్యులైన యాంధ్రులు లేరనుట వింత కాదు. ఇది యొక నాటి నాటకరంగమున నొక వెలుగు వెలిగినది. నేటికిని ఆ వెలుగు మలగిపోలేదు. నాటకమొకటి యింతటి విజయమును సాధించుటకు కేవలమందలి పద్య రచనా సౌష్టవము, నటుల సామర్థ్యము కారణమై యుండ జాలదు. ఆ యంశములకు తోడుగ శాశ్వతమైన సాహిత్యాంశ మందు నెలకొని యుండవలెను. సాహిత్య నాటక వినియోగము సమానముగ నున్న యే కొలది నాటకములకో యిట్టి వ్యాప్తి లభించును. పూర్వోక్తమైన కావ్యముల ప్రభావమునకీ నాటకము కొంత లొంగిన మాట నిజమైనను అందున్న సర్వాంశములను నితోధిక స్ఫూర్తితో నజరామర మొనర్చుట సాధారణ విషయము కాదు. కావున నీ తరగతి కాల్పనిక కథా వృత్తాంతములలో జనసామాన్యమున వ్యాప్తివలనను, సాహిత్య గౌరవమునను శిఖరాగ్రప్రాయమైన యీ నాటకము నించుక విపులముగ ననుశీలింప దగును. ఎన్ని మాటలను విమర్శక ప్రమాణముల నుట్టంకించుచు చెప్పినను నుత్తమ సాహిత్యమునకు ప్రజాహృదయమే రంగము. ఆ రంగమున నీ నాటకమారని జ్యోతి.

నాందినుండి నాటకాంతము వరకు చిలకమర్తి వారి ప్రతిభా విశేషములు గమ్యమానము లగుచున్నవి. "అణువున యందు శతగిరి యంతరమందును సూక్ష్మమైన వాఃకణమున యందు వారినిధి గర్భమునం జలిచీమ యందు భీషణగజరాజమందు నొక చందమున న్వసియించు సర్వకారణముల కారణం బయిన బ్రహ్మము...;" "పురుషున కకాంచనంబైన భూషణంబు వరయశస్సౌధమునకు సోపాన పంక్తి ప్రాణభీతార్తులకును వజ్రాంగి జోడు లైన శరణాగత త్రాణము..." (నాంది భాగము) నని చెప్పుట వలన, నీ నాటముక

నందు సర్వకారణ కారణమైన బ్రహ్మము యొక్క ప్రత్యక్ష లీలా కృతియైన కృష్ణుని కృప శరణాగత తాత్రితమైన పార్థునియందు ప్రస రించుట సారభూతమైన విషయమని వ్యక్తము. నాందిని బట్టి యిందలి రసనిర్ణయము చేయవలసి వచ్చినచో నది శాంతము. దీనికి నాటకాంత మున సర్వభావ శమనమువలన ప్రాపించిన వినియోగము వినా స్థానము లేదు. నర్తకి ఋతుగానమును బట్టి శృంగారము ధ్వనింప బడినది. నాటకమునకు ప్రచండయాదవమను పర్యాయ నామమును బట్టియు, ప్రసక్తాంశములను బట్టియు వీరము పోషింపబడి ధర్మ, త్యాగాది రూపముల పర్యవసించినది. ఇట్లీ నాటకము నందలి రస వ్యవస్థ సువ్యవస్థితమై కన్పించుట లేదు. లాక్షణిక నియమముల నాధారముగ గొనక సంప్రదాయ గౌరవముచేత మాత్రమే యీతడు నాంద్యాదుల రచించె ననవలసి వచ్చును.

పద్యగద్య రచనాదుల యందీ మహా నాటకకర్త సామర్థ్య మనన్యము. "వసుమతీ దేవి భర్తయే వాసుదేవు దర్శనము చేయ లజ్జించి తాల్చినట్టి తెల్ల పట్టు మేల్ముసుంగట్టు తేజరిల్లు నీ యుమః కాల చంద్రిక లింపు లలర!" (పుట 5) వంటి యాలంకారికోహ విశేషము లిందున్నవి. "నిను ధ్యానించి విముక్తులౌటకు మహానిష్ఠా గరిష్ఠాత్ములై చనుచున్నారు మునీంద్రులీ యమునలో స్నానంబు గావింపగా నిను సేవించి కృతార్థులౌటకును క్షోణీనాథు లిందందుఁ జేరిన వారీ వనమందు మేలుకొనవే! కృష్ణా జగన్నాయకా!" (6) వంటి భక్తి భావ విలసితమైన రచనమును కలదు. "నీచ ముచ్చము నాక రాచపాడి దొరంగి బిడియ మించుక లేక బిచ్చమెత్త జన విరుద్ధంబుగ సైదోడు లేవురు వెలది యొకర్తునే పెండ్లియాడ"... (108) వంటి యధిక్షేపాత్మకమైన రచనా ధోరణి, 'అల్లుడా! రమ్మని యాదరంబునఁ బిల్వఁబంపు మామనుఁ బట్టి చంపఁ గలమె! జలకేళి సవరించు జవరాండ్ర కోకల నెత్తుకపోయి చెట్లెక్క గలమె?' (109) మున్నైన వ్యావహారిక సంవాద వచోవిలాసములు నీ నాటక

మున కొల్లలు. నాటకాంతర్గతమైన భావప్రపంచము నిట్టి మృదు మధుర రచనా విధానముచే ప్రజలలో వ్యాపింప జేయుట యిందలి మెరుగులలో నొకటి.

పాత్రలు సజీవములు. పాఠకుల కన్నులముందు శాశ్వతముగ నిలుచునట్టివి. సన్ని వేశగతముగ, సంభాషణ వశమున, ఈ పాత్రల నాయన చిరంజీవము లొనర్చినాడు. పాత్రల సంభాషణములు, వారు భిన్న సందర్భములలో చెప్పిన వాక్యములు తెలుగు ప్రజల వ్యవహారమునందు చోటు చేసుకొన్నవని చెప్పినచో నాతని సిద్ధ హస్తత యెట్టిదో తెలియును.

ఇట్టి రచనాశిల్ప విశేషములకంటె ప్రధానమైన విషయ మీ నాటక కర్త ప్రాస్తావికముగ కథాంతర్గతమైన కృష్ణతత్త్వమును నిరూపించిన పద్ధతి. ఉత్తమ సాధకుడు, దానధర్మాద్యనుష్ఠాన పరుడు నైన గయుడు బ్రహ్మను మెప్పించి వరములను గొన్న యుత్తమ గంధర్వుడు. బ్రహ్మ రజస్తత్త్వమునకు ప్రతీక. ఆయనను మెప్పించి వరములను గొన్న యీ గయుని మనస్తత్త్వమున నొక యచంచలమైన యాత్మ విశ్వాస మున్నది. ఆ విషయము నీతడు స్వామి ప్రతిజ్ఞ ప్రవర్తిల్లక పూర్వము ఘంటా పథముగ జెప్పికొని నాడు. కావున నిట్టి రజోమయ సంస్కారమును కలిగియున్న గయు డుద్ధరింప బడుటకు మరికొన్ని సంస్కారములు కావలసి వచ్చు చున్నవి. అనన్య శరణాగతి, భక్తి తత్త్వములు. వానిచే నుద్ధరింప బడుటకు పూర్వ మీతడొనర్చిన ప్రయత్నము లన్నియు బ్రహ్మ రూపమున శివుని రూపమున (వీరు రజస్తమః ప్రతీకలు) వైఫల్యము నందినవి. జీవునియొక్క యీ యానమునకే యీ కథా వృత్తాంతము ప్రతీక. సత్త్వగుణ ప్రధానుడైన స్వామి కటాక్షమునసే యీ యానము గమ్యమును చేరునన్న విషయము కథా వృత్తాంతము నందలి మహార్థము. ఇందు దేవర్షి గురుస్థానముగ, నరు డాదర్శ ప్రాయమైన నరతత్త్వముగ నీ యానమును ఫలవంత మొనర్చిరి.

ఈ యర్థమును భిత్తికగ నుంచి నాటకమును పరిశీలించినచో నిందలి గంభీరార్థ గౌరవము భాసించును. బ్రహ్మ, శివుడు తన కథయు మాయని స్థితిలో గయుని వెన్నాడినది సుదర్శనము (సు-దర్శనము). దాని వలన భీతితో నీతడు మున్నుగ భావింప గల్గినది, స్వామి యొక్క సర్వాంతర్యామిత. "పాతాళమున కేగి బ్రతుక వచ్చు నటన్న బలిచక్రవర్తి నన్బట్టి యిచ్చు, మర్త్యలోకముఁ జేరి మనవచ్చు ననుకొన్న నా లోకమునఁ గృష్ణుఁ డవతరించె..." (41) మున్నగు వర్ణనము లీ విషయమునే నిరూపించును. ఇట్లు స్వామి లక్షణమును గమనించుకొన్న గయుడు శరణాగతియే మార్గమని తెలిసికొనిన వాడై స్వామి నిట్లు శరణమనినాడు.

"అకలంకాత్మజుఁడంచు నెంచక మహాహంకార బుద్ధిన్ శమం
తక రత్నాప హారాపవాద మిడు సత్రాజిత్తుఁ జేపట్టు వా
నికిఁ బ్రహ్లాద విభీషణాది దనుజానీకంబునుం గాచు వా
నికి నన్బ్రోచుట భారమైనయదె తండ్రీ! దేవకీ నందనా!" (42)

నాటక ఫలాగమ సందర్భమున నిట్టి మహత్తర భక్త్యావేశమునకే యాతడు గురియైనాడు. అది శివకేశవుల తత్త్వమును ప్రతిపాదించు సందర్భము. ఇట్లీ కథయం దంతర్లీనముగ సాగివచ్చిన భావధార జీవాత్మ యానము. ఇట్లీ గయోపాఖ్యాన నాటకము పూర్వ పూర్వ కవికృత కావ్యము లందలి మెరుగులను తనలో జీర్ణించుకొని యితోఽధిక దీప్తితో నుజ్జ్వల సాహిత్యనాటక శిల్పమార్గములో రూపొందిన మహత్తర సృష్టి. బహుశః కృష్ణకథా గతమైన కాల్పనిక సాహిత్యమున నింతటి సమగ్ర సృష్టి లేదు.

ఉత్తమ పాత్రల కొకానొక లోపము నాపాదించి వారి యహంకారాద్యంశముల నిరూపించి తత్ఫలితముగ వారి గర్వము భంగమైనట్లు చిత్రించు సంప్రదాయ మొకటి భారతీయ వాఙ్మయములం దన్నిట నెలకొని యున్నది. ఈ భావ సంస్కారము యొక్క పుట్టుక, ప్రచారము మొదలైన విశేషములను చారిత్రిక

నిష్కర్షతో నిరూపించుట సాధ్యముకాదు. కాని వీని యందొక అంతస్తత్త్వమున్నది. బహుశః యీ యంశమును నిరూపించుటకే యీ తరగతి కథ లన్నియు సృష్టింప బడి యుండును. ఏ కారణము చేత నైనను మానవుడొక యుత్తమ కృత్యమును జేరుట యనగా నాత నిపై స్వామి కృపా కటాక్షము ప్రసరించినదని యర్థము. ఆత డెంత యున్నతు డైనను, నేదో యొక స్థితిలో నహంకార మమకారముల విక్షేపములకు గురియగును. అట్లగుట తన హృదయాంతర్గతుడైన స్వామి యౌన్నత్యము నాతడు విస్మరించి తన గొప్పదనమునే లెక్కించుకొనెనని యర్థము. అట్టి స్థితిలో స్వామి యీ యహంకృతి విశేషములను లయించి సన్మార్గము నుపదేశించును. ఇట్టి యాంతర విషయమునకు నిరూపకములే యీ గర్వభంగ వృత్తాంతములు. ఇట్టి నాటకములు కొల్లలుగ నున్నవి. వీనిలో నర్జుననే మానవ పాత్రగ గ్రహించుటకు నరనారాయణ తత్త్వమే కారణము. ఇట్టి యన్వయ మన్ని కథలయందును నొనర్ప బడియుండుట గమ నార్హము. మహోదార భక్తుడైన హనుమంతునితో రామునికి కల్పించిన సంగ్రామ వృత్తాంతము లన్నియు నిట్టివే.

అర్జున గర్వభంగము

ఈ యన్వయమును నిరూపించు నాటకములలో మున్నుగ శ్రీ శేషాద్రిరమణ కవులు రచించిన అర్జున గర్వభంగము[121] పరిశీల నార్హము. ఇందలి కథా వృత్తాంతమును గూర్చి "ఈ నాటకము నందలి కథ మహారాష్ట్ర భారతములోనిదట. నిజాము మండలములో నీకథ మిగుల వ్యాపకముగ నున్నది. ఈ కథకు భిన్నము రాకుండ నాటక సంప్రదాయముల ననుసరించి యీ నాటకమున నందందు మార్పు లొనర్చితిమి" (పీఠిక) అనినారు నాటక కర్తలు. మూల స్వరూప మెట్టిదో యందు వీరొనర్చిన మార్పు లెట్టివో వీరు వివరముగ చెప్పిరి కారు. కథాంశము లిట్లున్నవి.

---

121 చంద్రికా ప్రెస్, గుంటూరు-1916.

వైనమును చూచి యీమె స్వామిని వలచినదట! వలచినదే తడవుగ విరాళినందినది. చెలికత్తెలు చేతనైనంత వరకామె నుపచారములచే తేర్ప యత్నించుచుండిరి. ఇదీ కథ. స్వామి విని తప్పునదే మున్నది, కానిమ్మన్నట్లు చెలులను పంపివైచి (వారిలో కొందరు తామే సర్దుకొనిరి) మదన సామ్రాజ్యమునేల దొరకొనినాడు. మంచి 'రసపట్టు'న సత్యభామ దూతిక వచ్చినది. గుట్టు రట్టుకాక మున్నే స్వామి సత్య కడకేగినాడు. మిగతా వృత్తాంతము పూర్వోక్తము. అసలు కథలకు కాళ్ళుండవు. కల్పనములకు నడుము లుండవు. కాకరపర్తి వారి కథలకు గన్ను లున్నట్లు లేవు! అచ్చమైన ప్రబంధ శైలిలో నీ కావ్యము క్షీణయుగపు ధోరణులను తలపించును. ఇంతకన్న చెప్పదగిన యంశములు లేవు.

## వసుంధరా పరిణయము

నెల్లూరి వీరరాఘవకవి వసుంధరా పరిణయమును రచించినాడు.[125] సత్యభామ ధరాంశ సంభూతిని పురస్కరించుకొని సత్యభామా పూర్వభవ వృత్తాంతమిందు వివృతమైనది. పురాణ ప్రసిద్ధి విషయములకు హేతుభూతమైన కల్పన మిందు గోచరించును. లేక యిది యప్రతీతమైన యేపురాణమునుండి యైన గృహీతమేమో! వైలక్షణ్యమును బట్టి యిందుదాహృతమైనది.) ప్రథమాశ్వాసమున ప్రబంధ ప్రసిద్ధ మార్గమున పురవర్ణన మున్నది. ద్వితీయాశ్వాసమున కృష్ణకథాంశము లనేకములు గచ్ఛనార్గమున చెప్పబడినవి. నారదుడు వచ్చి స్వామిని స్తుతించెను. (ఇది సుదీర్ఘమై భిన్న సంస్కృతాంధ్ర ఛందములలో నున్నది.) అటుపై ప్రాస్తావికముగ నారదుడు సత్యభామ వృత్తాంతమును తెలుప స్వామి యిట్లనెను. "క్షితి తపముఁజేసి సాత్రాజితియై జన్మించెననుచుఁ జెప్పితిరి మహా

యాతని నాకర్షించి వలలో వేసికొన్నది. అటుపై సభాస్థలియందు పార్థునికి తటస్థించిన వృత్తాంతము లొకటొకటి వివృతములైనవి. నలువురు బిడ్డలతోడ పుణ్యజనస్త్రీ యొకర్తు సభాస్థలికి వచ్చి యరణ్యమునందు ప్రవర్తిల్లిన వృత్తాంతములను తెల్పి, యా బిడ్డలు పార్థుని సంతానమే యని నిరూపించినది. ఈ సందర్భమున సర్వము స్వామి మాయయని గుర్తెరిగిన యర్జునుడు తన గర్వమునకు చింతించి పశ్చాత్తప్తుడై, స్వామిని స్తుతించి శరణమందెను. ఈ వృత్తాంతమును సాహిత్యరంగమున లబ్ధప్రతిష్ఠులైన శ్రీ శేషాద్రి రమణకవు లుత్తమ రచనాశిల్పముచే చక్కగా తీర్చిదిద్ది యున్నారు. కాని నాటకము నందలి కథాబీజము గయోపాఖ్యానము వలె నుత్తమాదర్శమును బట్టి యైనది కాదు. అహంకారము, కామము మున్నగు నధమ భావ సంస్కారములు బీజములుగ ప్రవర్తిల్లినది. కృష్ణార్జున సంబంధమును నన్నయాది మహాకవులచే నొక విశిష్ట మార్గమున నాంధ్రసాహిత్యమున నీవరకే ప్రవచింపబడి, తన్మార్గమున ప్రచలితమైయున్నది. అందులకు నిర్హేతుకముగ విఘాతమును కల్పించు నెట్టి కల్పనమును, తెనుగువారి మనస్సున కెక్కదు. అందుచే నీ నాటకమునకు పఠన పాఠన విస్తృతి యటుంచి నాటకీయ వినియోగమున్నట్లు తోచదు. సాహితీ పరముగ నుత్తమ ప్రయత్నమనుటకు సందేహము లేదు.

### మరికొన్ని నాటకములు

ఇట్టివే మరిరెండు నాటకములున్నవి.[122] ఇందు మొదటి నాటకమైన గర్వభంజనము శ్రీ తాండ్ర సుబ్రహ్మణ్య కవి రచించిన శ్రీకృష్ణాంజనేయ యుద్ధము ననుసరించునది. రెండవనాటకమైన గర్వభంగము చాలవరకీ రెండునాటకములను పోలియున్నది. నాటక శిల్పా

122. 1, గర్వ భంజనము. శ్రీగండికోట బాబూరావు, మారుతీ గ్రంథమాల, విజయ నగరము. 1926.

2. గర్వ భంగము. శ్రీ అయినాపురపు సుందర రామయ్య. ప్రచురణకర్త: నీల కంటి భావనారాయణరావు. రాయవరము శ్రీ మేరీ ముద్రాక్షర శాల యందు మల్లిడి సత్తిరెడ్డిగారిచే ముద్రితము. ప్రథమ ముద్రణము: 1923.

దులందీ రెండు నాటకములలో ప్రముఖముగ చెప్పదగిన యంశములు లేవు. కథా వృత్తాంతమున రామ కృష్ణావతారముల సమ్మేళనము, పరివర్తనము నున్నవి. ప్రధానాంశము లిట్లున్నవి : బలరామునికి తాను స్వామికన్న గొప్పవాడనను గర్వము కలిగి స్వామిని సభకు రాకుండునట్లు నిషేధము నొనర్చెను. కృష్ణుడీ వార్తను విని చింతించెను. సత్యభామ యంతఃపురమునకుపోయిన స్వామిని గుపిత నాయికయైన సత్య యవమానించినది. ఈ స్థితిలో నారదుడు వచ్చి సత్యా బలరాములతో పాటు గరుత్మంతునికి కూడ నొక గుణపాఠము నేర్పవలెనని యెంచి యందుల కొక చక్కని యుపాయమును కల్పించి నిర్వహించినాడు. ఇందుల కాంజనేయ పాత్ర కీలకముగ వినియోగింపబడినది. నగరమును చెల్లాచెదరు చేయుచున్న హనుమంతుని సభకు తీసికొనిరాఁ జాలక గరుత్మంతుడు, నారదవచన ప్రేరితుడై యాతనితోడి యుద్ధమున నోడిపోయిన బలరాముడు, హనుమంతునికి సీతారూపమున దర్శన మిచ్చుటకు ప్రయత్నించి విఫలమైన సత్యభామ యవమానితులై సంస్కృతులైరి. ఇట్టి కథా వృత్తాంతములకు నాటకీయ వినియోగము కొలదిగ నున్నట్లు తోచును. మొత్తముమీద కాల్పనిక సాహిత్యమున నీ గర్వభంగవృత్తాంతములు ప్రముఖస్థానమునే యాక్రమించి యున్నవి. వీని మౌలికత, సాహిత్యప్రమాణములు నట్లుండ నొక వర్గమునకు చెందిన ప్రేక్షక పాఠకవర్గముల కిది తృప్తిని గల్గించి యుండవచ్చును.

## శృంగార కల్పనలు

కృష్ణ శృంగార విషయమున నొక కొంత కాల్పనిక సాహిత్యము వ్యాపించియున్నది. అందుల కుదాహరణ ప్రాయములుగ కొన్ని కావ్యముల నీ యనుశీలనమున నెన్నదగి యున్నది. అట్లొనర్చుటకు మున్నీ వృత్తాంతముల తత్త్వము నించుక యరయుట మేలు. వీనిలో కల్పనాశక్తి ప్రతిభావంతమై భాసించుటలేదన్నది మొదటి విషయము. పూర్వకావ్యములందున్న యే యేక దేశాంశమునో యించుక విస్తృత మొనర్చి భాసింపజేయు యత్నమే వీనియందు ప్రాయికముగ వ్యక్త

మగు చున్నది. వీనిలో మొదటి గ్రంథమున మాత్రము పరభాషా ప్రభావము స్ఫురించు చున్నది. ఆయా ప్రక్రియలకు చెందిన సాంప్రదాయిక మార్గముల నీ కవులు జాగ్రత్తగ ననుసరించి యున్నారు. కావ్యశిల్పాదులయందు విసూత్నములైన యంశములు కూడ లేవు.

### పంచకన్యా పరిణయము

వీనిలో మొదటిది బాలకవి సుబ్బన్న ప్రణీతమైన పంచకన్యా పరిణయ యక్షగానము.[123] ఇందలి యుత్పాద్య వస్తువునకు పోషకములైన యాధారములుగాని, కల్పనలోని విశిష్టతగాని గన్యమాన మగుటలేదు. శహాజీ (బాలకవి సుబ్బన్న యీ మహారాష్ట్రప్రభువు యొక్క యాస్థానకవి) కవి నిట్లు కోరినాడు. "...పంచకన్యల పెండ్లి బాలకవీంద్రాంధ్ర భాషలో నీవు మేలిమిగస్పట్టు మెరయ నీ వేళ మాకంకితంబుగా మంచి నాటకము జోకతో రచియింపు సుకవీంద్రు డెన్న..." (పుట 98) నని చెప్పుట వలన నీ వృత్తాంత మితర భాషలయందు, బహుశః మహారాష్ట్రమునందు వ్యాపించి యుండ వచ్చునని యూహింప వీలగుచున్నది. అట్టిచో నీ కథ కొక ఆంతరంగికార్థ స్ఫూర్తి యుండవలెను. ఇందు స్వామి వివాహమాడిన పంచకన్యలు పంచేంద్రియ ప్రతీకలుగ, స్వామి వారిని వివాహమాడుట తచ్ఛక్తులు స్వామి యందు న్యస్తమగుటగ నూహింప వీలగు చున్నది. కేళినాయకుని హాస్యముతో నీ యక్షగానము ప్రారంభము. తన ప్రియువు యువకులతో క్రీడాలోలుండై యున్న స్వామి కొక ముఖ్య మిత్రుడు సుదాముడు. అతనితో స్వామి తాను ప్రోథసఖితో నరుగుచున్న మహాసౌందర్యవతులైన పంచకన్యలనుఁ గాంచితి ననియు, సుదామuఁ డెట్లేని తనకు కూర్చనిచో మన్మథ బాణములకు తాను గురియగుదు ననియు చెప్పెను. ఆ కన్యల యునికిపట్టు నరసి వచ్చుటకై స్వామి యొక బాలు నంపియుండెను. ఆ బాలుడు వచ్చిన పిమ్మట

123. యక్షగానములు, (తంజావూరు) సంపుటము-2 ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రచురణము 1957.

సుబాహుడు స్వామికార్యమును నెరవేర్చుటకు పూనుకొనెను. సుదామడు కన్యల యొక్క ప్రౌఢసఖితో పరిచయము కల్పించుకొని స్వామి కార్యమును తెలిపినాడు. ఆమె యంగీకరించి తాను పంచకన్యల నుపవనమునకు తెత్తునని చెప్పి స్వామిని కూడ నచటికి తెచ్చునట్లాతని నాదేశించెను. అట్లే యైనది. పంచకన్యలకును స్వామికిని పరస్పరానురాగ మేర్పడినది. ప్రౌఢసఖి వారికి స్వామి యౌన్నత్యము నభివర్ణించి చెప్పి, వారి మనస్సులు స్వామి యందు లగ్నమగునట్లు చేసినది. పిమ్మట పంచకన్యలతో స్వామి విహారము ప్రసక్తమైనది. వారు జలకము లాడుచున్నప్పుడు స్వామి వారితో విహరించి యులరించుటయే గాక వలువల నెత్తుకొని పోయెను. వారు స్వామిని వస్త్రములకై ప్రార్థించిరి. స్వామి వారిని తనయం దాసక్తితో వలరాచకేళి తగులవలెనని కోరెను. అందులకు వారి సమాధాన మిట్లున్నది.

"బాలగోపాల మమ్మొక్క సారి నీవు
గలయు నెవ్వరు మరి బొట్టు గట్టఁ బోరు
గాన నొల్లము సంసారహానియైన
యిట్టి పనిసేయు, వలువల నిమ్ము దయను" (పుట 126)

ఈ కన్యల గడుసుదన మిందు గమనార్హము. వీరు తక్కువ వారుకారు. 'చెన్నొంది తెనుఁగు సంస్కృత మహారాష్ట్ర కన్నడ ద్రావిడ కబ్బంబు లందుఁ గదలక కనకాంగి, కలకంఠి, యిందువదన, మనోరమ, వరచిత్రరేఖలను నామములఁ జాల నవనీతలంబుననుఁ గీర్తి గాంచిన యంగనా మణులు' (పుట 116). ఇది స్వామికి పచ్చివెలగ కాయయైనది. స్వామి శృంగార చరిత్రలో నాయన నిట్లు టొకాయించిన వారు లేరు. ఈ కల్పనము నందలి ప్రత్యేకత యిది. తాత్త్వికార్థమున పూర్వోక్తాభిప్రాయము ననుసంధించినచో, పంచేంద్రియ, పంచతత్త్వములకు స్వామితోడి న్యాసపూర్వకమైన సంయోగము మంగళ లక్షితమై శాశ్వతముగ నుండవలెను గాని తాత్కాలికమైన భౌతికస్థితియం దుండరాదని వారి యభిప్రాయము. సర్వాత్మనా

శాశ్వతమైన సమర్పణము వారి ధ్యేయమని స్వామి గమనించి వారిని వివాహమాడినాడు. ఈ విధముగ తాత్త్వికాన్వయ మొనర్పనిచో నీ కల్పనమునకు పారమ్యము లేదు. సర్వభువనములను కేకైక శృంగార నాయకుడై యసంఖ్యాక స్త్రీమూర్తుల నాకర్షించిన స్వామి తానై యీ పంచకన్యల వలచి, వారికై ప్రయత్నించి, విరహమునంది, వివాహమాడుట యిందలి ప్రత్యేకత. స్వామి కథలో నేయంశమును చేర్చినను చెల్లిపోవుననుట యిట్లుండునేమో!

### సత్యభామా కృష్ణసంవాదము

ఈ మాత్రము మాహాత్మ్యశాలిత్వమును లేని మరియొక కావ్యము (ప్రబంధ మనవలెనేమో! లేదా వీర ప్రబంధము!) కాకరపర్తి తిరుపతి పాత్రి కృతమైన సత్యభామా కృష్ణ సంవాదము[124] ఇందలి కథ స్వల్పము. ప్రబంధోచిత వర్ణనము లం, చమత్కారములు నెక్కువ. గ్రంథ నామమును బట్టి సత్యభామా కృష్ణుల శృంగార మిందు ప్రవర్తిల్లినదను విషయము వ్యక్తము. కుపిత ప్రౌఢ నాయిక యైన సత్యభామను ప్రసన్న నొనర్చుటకు స్వామి పడిన కష్టములు ప్రసిద్ధములే. కాని యిందన్ని బాధలు పడలేదు. ఆమెయెడ తన తమకమును ప్రబంధపు పట్టులో గట్టిగా నుపన్యసించి నంత, నాయిక మనస్సు కరగి యంతకుమున్ను మూసియున్న తలుపులు తెరచి కౌగిట లాలించుకొన్నది. ఇంతమాత్రపు చిరుకోప మీ నాయికకు వచ్చుటకు కారణమెన్నవలసి యున్నది. వసంత ర్తువునం దుద్యాన మున విహరించుచున్న స్వామి యొక త్రిలోకాద్భుత సౌందర్యవతి యైన కన్నెను కాంచినాడు. ఆమె పరిస్థితి స్వామి చూచునప్పటికే యట్టిట్టుగా నున్నది. కథ శీతలోపచారమున వరకు వచ్చి యున్నది. చెలికత్తెలను ప్రశ్నించి స్వామి యామె వృత్తాంతము నెరింగికొని నాడు. ఆమె శశిరేఖ యను పేరుగల యాదవాంగన. తన సౌధము నందున్న సాలభంజికల యందును స్వామి శృంగార విహారముల

124. చెన్నపురి శారదాంబా విలాస ముద్రాక్షర శాల. ద్వితీయ ముద్రణము. 1893.

వైనమును చూచి యీామె స్వామిని వలచినదట! వలచినదే తడ వుగ విరాళినందినది. చెలికత్తెలు చేతనైనంత వరకామె నుపచార ములచే తేర్ప యత్నించు చుండిరి. ఇదీ కథ. స్వామి విని తప్పనదే మున్నది, కానిమ్మన్నట్లు చెలులను పంపివైచి (వారిలో కొందరు తామే సర్దుకొనిరి) మదన సామ్రాజ్యమునేల దొరకొని నాడు. మంచి 'రసపట్టు'న సత్యభామ దూతిక వచ్చినది. గుట్టు రట్టుకాక మున్నే స్వామి సత్య కడకేగినాడు. మిగతా వృత్తాంతము పూర్వోక్తము. అసలు కథలకు కాళ్ళుండవు. కల్పనములకు నడుము లుండవు. కాకరపర్తి వారి కథలకు గన్ను లున్నట్లు లేవు! అచ్చమైన ప్రబంధ శైలిలో నీ కావ్యము క్షీణయుగపు ధోరణులను తలపించును. ఇంత కన్న చెప్పదగిన యంశములు లేవు.

### వసుంధరా పరిణయము

నెల్లూరి వీరరాఘవకవి వసుంధరా పరిణయమును రచించి నాడు.[125] సత్యభామ ధరాంశ సంభూతిని పురస్కరించుకొని సత్య భామా పూర్వభవ వృత్తాంతమిందు వివృతమైనది. పురాణ ప్రసిద్ధి విషయములకు హేతుభూతమైన కల్పన మిందు గోచరించును. లేక యిది యప్రతీతమైన యేపురాణమునుండి యైన గృహీతమేమో! వైలక్షణ్యమును బట్టి యిందుదాహృతమైనది.) ప్రథమాశ్వాస మున ప్రబంధ ప్రసిద్ధ మార్గమున పురవర్ణన మున్నది. ద్వితీయా శ్వాసమున కృష్ణకథాంశము లనేకములు గచ్ఛనార్గమున చెప్పబడి నవి. నారదుడు వచ్చి స్వామిని స్తుతించెను. (ఇది సుదీర్ఘమై భిన్న సంస్కృతాంధ్ర ఛందములలో నున్నది.) అటుపై ప్రాస్తావికముగ నారదుడు సత్యభామ వృత్తాంతమును తెలుప స్వామి యిట్లనెను. "క్షితి తపముఁజేసి సాత్రాజితియై జన్మించెననుచుఁ జెప్పితిరి మహా

125. అముద్రిత గ్రంథ చింతామణి జీర్ణ సంపుటముల నుండి గృహీతము.

మతి దద్వృత్తాంతము మా కతులితగతిఁ దెలియఁ బలుకు మాద్యం తమునన్" (ద్వి-125) అని తన సభాస్థలి యందీ కథాప్రసంగము నకు స్వామి యవకాశమును కల్పించెను. ఆ కథ యందలి ప్రధా నాంశము లిట్లున్నవి. వరాహావతార మెత్తి నపుడు స్వామి వసుంధ రతో క్రీడించెను. ఆమె గర్భవతియై నరకుని కన్నది. స్వామి దయ వలన నామె యెరిగిన వైష్ణవాస్త్రమును సప్రయోగ రహస్యముగ తన పుత్రుడైన నరకుని కామె యుపదేశించెను. అతడు ప్రాగ్జ్యోతిష మున కధిపతి. స్వామి పరమపదవి నందిన పిమ్మట నాతనితోడి సౌఖ్యమున తృప్తి గాంచిన వసుంధర తీవ్రతప మొనర్చెను. ఇంది రకు స్వామి పత్నీత్వ-కారణభూతములైన మంత్రాధి దేవతలీ యుగ్రతపమున బాధ నంది యామె కడకేగి యీ వృత్తాంతమును విన్నవించిరి. ఆమె కుపితయై వసుంధర తనకు సపత్ని కాకుండుటకై ప్రయత్న మొనర్చినది. అందు మన్మథుడు, జయంతుడు ముఖ్య పాత్రను వహించిరి. ధరణీదేవి తపస్సు తీవ్రస్థాయి నందుకొనినపుడు మన్మథ జయంతాదులు తపస్విను కేగిరి. మన్మథుడు బాణప్రయోగ మొనర్చెను. జయంతుడు కుహనా కృష్ణరూపధరుడై స్వామి రాస క్రీడాదుల నభినయించి యామె నాకర్షించెను. ఈ దృశ్యమును కాంచిన వసుంధర ధ్యాన స్థిమితయై కలరూపెరింగి, తనకడకు వచ్చి ప్రణయ హృదయమును నివేదించుకొన్న జయంతుని కాకరూపము నందునట్లు శపించెను. అతడు వసుంధర కంస నిషూదనుని దెలిసి పుత్ర మరణమునకును కారణ మగునట్లు ప్రతిశాప మొసగెను. పిమ్మట ధరణీ దేవియొక్క తీవ్రతపమునకు మెచ్చి బ్రహ్మ యామెకు వర ముల నీయవచ్చెను. ఆమె తన వాంఛితమును వ్యక్తము చేయుగా బ్రహ్మ యామెను సత్రాజిత్తనయయై జన్మించి స్వామిని పెండ్లి యాడున ట్లనుగ్రహించెను. (ప్రకటింపబడిన భాగమునందలి కథా

వృత్తాంత మింతవరకే యున్నది. అటుపై పరివర్తిల్లిన వృత్తాంతము ప్రసిద్ధ మార్గమునే యనుసరించి యుండవచ్చును.) ఈ కావ్య రచనమున ప్రబంధ ధోరణి తప్ప చెప్పదగిన యంశములు లేవు.

పై పరిశీలనము వలన కృష్ణకథా సంబంధియగు కాల్పనిక సాహిత్యము గుణము నందును, పరిమాణమునందును నల్పమే యని వ్యక్త మగుచున్నది.

# 8. కుటుంబ కథాసాహితి

కుటుంబకథా వృత్తాంతములు

కృష్ణకథ యందలి యితర వృత్తాంతముల వలెనే స్వామి కౌటుంబిక జీవితము, అందలి భిన్న వృత్తాంతములు గంభీరములై బహ్వర్థ భాసమానములై యున్నవి. ఇవి స్వామికి సహజమైన మాధుర్య తత్త్వదర్శనముల కాలవాలమై యున్నవి. ఈ శీర్షిక క్రింద రెండు విభిన్నాంశము లనుశీలన మొనర్పబడును. అందు మొదటిది స్వామి కుటుంబము నందలి వివిధాంశములను, దృక్పథములను నిరూపించునది. రెండవటి యాగమ ప్రసిద్ధమైన విషయము. ఆగమము లందు స్వామి యొక్క చతుర్వ్యూహములు ప్రతిపాదింప బడినవి. అందు స్వామి వాసుదేవ తత్త్వమునకు సాక్షాత్ప్రతీకగ భావించినచో, మిగతమూడువ్యూహములు ముగ్గురిచేత గమ్యమానములైనవి. వారు బలరామ, ప్రద్యుమ్నానిరుద్ధులు. తత్త్వతః సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధ వ్యూహములు. ఇవి కావ్య పౌరాణిక వ్యూహములందు వ్యక్తి స్వరూపములై భిన్న కథాంశములకు కేంద్రము లైనవి. ఆగమము లందు దివ్యతత్త్వమునకు భిన్నస్వరూపములై యారాధనా మార్గ గమ్యములైనవి. రెంటియందును స్వామి దివ్యత్వ దర్శనమే ధ్యేయ వస్తువు. ఈ నలుగురి వృత్తాంతములలో వాసుదేవ తత్త్వ మీ యా సందర్భములందు గమ్యమానమైన మార్గమున నిరూపితమైనది. మిగత వారికి సంబంధించిన వృత్తాంతము లాంధ్ర వాఙ్మయమున నధిక విస్తృతి నొంది యున్నవి. తదనుశీలనము ప్రస్తుతాధ్యాయమున రెండవ భాగము. ఈ రెండంశములును తాత్పర్యతః స్వామియొక్క తత్త్వమునకే నిర్దేశకములై యున్నవి. నామరూపాద్యంశముల బాహ్యముగ గోచరించు భిన్నతయే యీ వర్గీకరణమునకు కారణము.

సాక్షాన్మార్గమున ప్రసక్తములైన కౌటుంబిక వృత్తాంతములు మున్నుగ పరిశీలనార్హములు. స్వామి జననీ జనకులైన దేవకీ వసుదేవుల యెడ, పెంపుడు తల్లి దండ్రులైన యశోదా నందుల యెడను నెట్టి దృక్పథము కలిగి యుండెనో వారి నెట్టి ప్రవర్తనా మార్గమున రంజించెనో యన్న విషయమొక రమ్య దర్శనము. తదనుశీలనమునకును మున్నుగ కొన్ని యంశములను ప్రతిపదికా ప్రాయములుగ మనస్సున నుంచుకొనవలెను. దేవకీ వసుదేవులకు స్వామి దివ్యత్వము సాక్షాత్తుగ తెలిసియున్న విషయమే. బ్రహ్మాది దేవతల స్తుతులు, కంసుని పగ మున్నగునవి యీ యంశమును నిస్సందేహమున వారికి నిరూపించినవి. కాని యీ యంశమే సర్వేసర్వత్ర వారి మనములందు నిలిచియుండుటకు స్వామి సమ్మతింపక, భిన్న సందర్భములలో వారికి తనయందు పుత్ర భ్రాంతియే నెలకొనియుండునట్లు వర్తించినాడు. యశోదా నందులకీ వృత్తాంతము (స్వామి దివ్యత్వము) గర్గుని స్పష్టాస్పష్ట వాక్యముల వలన కొంత యనుమేయమైనది. కొంత భాగమును వారు స్వామి శిశువుగ బాల్యమూర్తిగ తమ కన్నుల ముందే యొనర్చిన యద్భుత కృత్యముల వలన గమనింపగలిగిరి. వారికి నీ సాక్షాద్దైవత్వ జ్ఞానమును స్వామి సర్వకాలములందును నిలుచుట కంగీకరింపక భిన్న సందర్భములందు తన మాయాలక్షణమును ప్రసరించి, పుత్రత్వ, దైవత్వజ్ఞానముల సంధి సీమలలో వారి చిత్తవృత్తులను మసలునట్లొనరించినాడు. వీరు స్వామి యొక్క పుత్రత్వము నందియుండుటకు హేతువులు, వాత్సల్య మార్గమున వారు తరించిన వైనము ప్రసిద్ధములే. కాగా మధురకు తిరిగి వచ్చిన పిమ్మట స్వామి వారియందెట్టి పద్ధతిని ప్రదర్శించెను? ఆ పద్ధతివలన స్వామి నిరూపించిన పుత్రత్వ రీతి యెట్టిది? అను విషయము పరిశీలనార్హమై యున్నది.

కంస వధానంతరము రామకృష్ణులు జననీ జనకుల బంధములను విడిపించి వారలకు ప్రణామంబు లాచరించిరి. అప్పటివారి పరిస్థితి యిట్లున్నది :

"కని లోకేశులుగాని వీరుగొడుకుల్ గారంచుఁ జిత్తంబులన్
జనయిత్రీ జనకుల్ విచారపరులై శంకింపఁ గృష్ణుండు దా
జనసమ్మోహినియైన మాయఁ దదభిజ్ఞానంబు వారించి యి
ట్లనియెన్ సాగ్రజుఁడై మహావినతుఁడై యానంద సంధాయియై"
(భాగ, దశమ-పూర్వ. 45-1387)

దివ్యత్వ స్ఫురణము వారికి కల్గినపుడు తన మాయచేత వారి యభిజ్ఞానమును (లోక పరివర్తనము దృష్ట్యా వారించిన వైనముతో పాటు తల్లి దండ్రులయెడ చరింపవలసిన పద్ధతిలో నిరంతర వినయము, ఆనందాను సంధాన లక్షణము స్వామి యాదర్శ ప్రాయముగ నిర్వర్తించి లోకమునకు నిరూపించినాడు. జననమునుండి యిప్పటి వరకు ప్రవర్తిల్లిన వృత్తాంతముల ఫలితముగ మీరిట్టి యిడుములను గంటిరి గాని, మా బాల్య పౌగండ కైశోర ప్రాయములందు మమ్ము మన్నించెడి సౌభాగ్యమును పొందరైతిరి. తల్లిదండ్రుల కడనుండి వారల నుపచరించు భాగ్యము దైవవియోగమున ( ఆతడెవ్వరు? ) మా కింతవరకు లభ్యము కాలేదు. నిఖలపురుషార్థ హేతువైన దేహ స్థితికి కారణభూతులైన మీ ఋణమును నూరేండ్లకైన తీర్చుట సాధ్యముకాదు. చెల్లుబడి కలిగి దేహ ధనముల వృత్తులను తల్లి దండ్రులకు చెల్లింపని వాడు కష్టుడు. ప్రిల్లదుడు, ఆత్మపలలాశి; వృద్ధ జననీ జనకులను, తనయులను, గురు విప్ర సాధు దారాదులను నెవ్వడు రక్షింపడో వాడు జీవన్మృతుడు. మీరు మా నిమిత్తమై కారాగార వాసాది కష్టముల ననుభవించితిరి. మేము వానిని వారింప సమర్థులమయ్యు నిష్కారుణ్యముగ ప్రవర్తించిన క్రూరులము- మమ్ము మన్నింపుడు- ఇది స్వామి యీ సందర్భమున చెప్పిన మాటల సారము. ఇది యాదర్శ పుత్ర ధర్మము ను నిరూపించు చున్నది. నిరంతరము జననీ జనకాదుల సేవించుట తరించుటకు మార్గముగ స్వామి యిందు నిరూపించి యున్నాడు. జీవులకు సంసారమన్నది మాయా రూపమైన బంధము కానక్కర లేదనియు,

నందు నిర్దిష్టములైన వివిధ విధులను నిర్వర్తించి లౌకికము గ భాసించు బంధములనే మోక్ష కారణములుగ మనః పరిణతి వలన తీర్చి దిద్దుకొన వచ్చుననియు, ఇట్టి సార్వకాలిక కౌటుంబిక బంధ మీ భారతావని యందు విశ్వమున కాదర్శ ప్రాయముగ స్వామి సంకల్ప వశమున నిర్మితమైన మహావ్యవస్థ యనియు నీ ఘట్టము నిరూపించు చున్నది. సర్వాను బంధముల యందలి యంతస్తత్వము నిట్లు భిన్న సందర్భములలో నిరూపించుట స్వామి ప్రత్యేకత. లౌకిక స్థాయిలో వీనిచే గమ్యమానమైన యార్ద్ర భావ ప్రపంచ మెంత రసమంతియో తత్త్వస్థితి యందు వీని పారమ్య మంత గంభీరము.

ఇట్టి సన్ని వేశమే యశోదానందులకును స్వామి కల్పించినాడు. ఉత్తరహరి వంశమున నాచన సోమనాథుడా భావ ప్రపంచమును పరమార్ద్రముగ చిత్రించెను. హంసడిభకుల వధానంతర మీ వృత్తాంతము ప్రవర్తిల్లినది. రామకృష్ణులు గోవర్ధ నాధిత్యకల యందు విహరించు చున్నారను వార్తను నందయశోదలు విని భృత్యులచే కానుకలను మోయించుకొని వచ్చిరి. వారిని దర్శించి నంతమాత్రమున స్వామికి బాల్యలీలావృత్తాంతములు స్మృతి పథమున మెరిసినవి. అప్పుటి స్వామి మరల నందగోప కిశోరుడైనాడు. నందవ్రజము నందలి యావులను పేరు పేరున పలుకరించి వాని సుఖస్థితి నరసినాడు. మిత్రులను పరామర్శించి నాడు. పూర్వస్మృతి పూర్వకమైన యొక మహత్తర భావార్ద్ర స్థితిలో వర్తిల్లి నాడు. నందుడు స్వామిని కన్నులార కాంచని దుఃఖము తప్ప స్వామి యాదరమున నన్ని విషయములు తమకు మోదావహములై యున్నవనినాడు. స్వామి యశోదతో (నందునికి నిదియే సమాధానము కావున) నిట్లనెను :

"తల్లీ! నిన్నుఁ గనుం గొన బడయుటన్ ధన్యుండ నైతిన్ జగం
బెల్ల న్నిన్ను నుతించి మ్రొక్కిన ధనాధీశోన్నతిన్ నిత్యమై

చెల్లున్నాకుఁ బ్రియంబు చేయుసది యై చెన్నొందు నావారు ని
న్నుల్లం బారఁ దలంచువారు పరమాయుః ప్రాప్తితారోగ్యులన్."
(4-313)

ఆంధ్ర వాఙ్మయమున నింతటి మహార్థవంతములైన పద్యములు కొలదియే యున్నవి. యశోదా నందులు తనకు పెంపుడు తల్లి దండ్రిలు. వారి జీవితములు వాత్సల్యభావ సాగరములై పొంగెత్తు నట్లు సాగినది స్వామి వ్రజ జీవితము. అందలి యనుబంధము లన్నియు నట్టివే. వానికి తాత్త్విక స్థితియుం దౌన్నత్య మెక్కువ. అందలి బాల్య లీలలు, గో, గోపి గోపీ వృత్తాంతములు, దుష్ట శిక్షణాదులు ప్రత్యేకముగ భావించి మననము చేయుదగిన మహత్త్వమును కలవి. ఆ కథ ముగిసిన వెనుక స్వామి వ్రజమున కాలిడ లేదు. అట్లొనర్పుటలో ధ్యేయ మేమన తన ప్రత్యక్ష సన్నిధి ఫలిత మైన శాశ్వత సన్నిధి తత్త్వము వారికి ప్రసాదించుట. గోపికల కీ ప్రసాదము గ్రహణ స్నాన సందర్భమున కటాక్షించినాడు స్వామి. తల్లి దండ్రిలతో నట్టి సమావేశము భాగవతమున మరి రెండు పర్యాయములు జరిగినది. వారికిని నిట్టి పద్ధతినే వ్యంగ్యముగ స్వామి నిర్దేశించి యున్నాడు. ఇందు విశేషించి యశోద కొక దివ్యత్వ స్థితిని స్వామి కల్పించినాడు. యశోదను ధ్యానించినవారు తనవారై పరమాయుః ప్రాప్తితారోగ్యులై వర్ధిల్లునట్లు స్వామి వర మొసంగినాడు. ఇట్టి మహా భాగ్యమును స్వామిని పెంచిన యీ మాతృమూర్తి యందుకొన్నది. ఆమెను దర్శించి మ్రొక్కుట తన భాగ్యమని చెప్పుట మున్నగునవి ఆదర్శ ప్రాయ ప్రవర్తనమునకు నిరూపకములు. బాల్య స్మృతులతో తలమునుకలైన స్వామి ఆజన్మాంతరము నిలుపుకొనవలసిన మైత్రీ సంస్కారములకు, భూత దయాది కారుణిక ప్రవృత్తులకు కేంద్రము. ఇట్టి సందర్భమున నుత్తమార్ద్ర భావ సంపత్తితో పాటు యశోదకు స్వామి కటాక్షించిన దివ్యత్వము

నిరూపింపబడినది. కౌటుంబిక ధర్మముల యందలి తాత్త్వికదర్శన మునకీ ఘట్ట ముదాహృతి.

ఇటు పైనింటి పెద్దగ, గృహస్థుగ స్వామి వర్తనము పరిశీల నాంశము. స్వామి బహ్వాంగనాసక్తి యందలి ఆంతర్యము, తత్త్వము ఇందను సంధింప దగినవి. అష్టమహిషుల యందును, నితరాంగనల యందును స్వామి సమత్వమును ప్రదర్శించి యుండ, వారెల్లరును స్వామియం దనురక్తలై ప్రవర్తించిరి. వారికి బహువిధ సౌఖ్యముల ప్రసాదించుటయేగాక స్వామి సతీపతుల పారస్పర్యము నందలి మాధు ర్యాంశమును చక్కగ నవగత మొనర్చినాడు. పదారువేలయంగనలకు సంబంధించిన యీ క్రింది వైనము భాగవతోక్తము గమనార్హము.

"ఇంటికి వచ్చిన నెదురేగు దెంచుచు
నానీత వస్తువులందుకొనుచు
సౌవర్ణమణి మయాసనములు వెట్టుచుఁ
బదములు గడుగుచు భక్తితోడ
సంవాసిత స్నానజలము లందించుచు
సద్గంధవస్త్ర భూషణము లొసఁగి
యిష్టపదార్థంబు లిడుచుఁ దాంబూలాదు
లొసఁగుచు విసరుచు నోజమెఱసి
శిరము దువ్వుచు శయ్యపైఁ జెలువుమిగుల
నడుగులొత్తుచు దాసీ సహస్రయుక్త
లయ్యుఁ గొలిచిరి దాసులై హరినిఁ దారు
దారకాధిప వదసలు తారు తగిలి (దశమోత్తర-59-22శి)

స్వామిని వారందరు గాఢపతివ్రతాభావము చేతను, పరిచర్యా పూర్వక మైన భక్తియోగము చేతను సేవించుట గార్హస్థ్య శృంగార మార్గ మున నిరూపింప బడినది. గృహస్థ జీవనమున పండిపోయినప్పటి దృక్ప థము, అందలి తత్త్వము గమనార్హమై యున్నది. కురుక్షేత్ర సంగ్రామా నంతరము ధర్మసంస్థాపన మొనర్చియున్న తృప్తితో స్వామి ద్వారకకు

తిరిగివచ్చిన యనంతర మీ వృత్తాంతము ప్రసక్తమైనది. ద్వారకకు వచ్చినదే తడవుగ స్వామి మున్నుగ దేవకీ ప్రముఖులైన తల్లుల నేడ్వురను దర్శించి మ్రొక్కినాడు. ఇందు మాతృభక్తి స్వామి నిరూపించుచున్నాడు. అదియట్లుండ స్వామి వచ్చి నమస్కరింపగనే వారందరు మాతృభావము యొక్క స్పందనమును పొంది క్షీరధారలచేతను, అశ్రుధారల చేతనుతద్భావమును ప్రకటించిరి. ఇందు వారి మాతృత్వధర్మమునకు రూపకల్పనమేగాక స్వామిశాశ్వత శిశుత్వము(The Child Eternal) ధ్వనింపబడినది. తన పత్నులను చూచునప్పుడు యథాపూర్వకముగనే స్వామి యేక కాలమునందు బహురూపధారియై మెలంగుట యిందును కలదు. స్వామి కెదురేగునపుడు వారి యాకృతి విశేషము లిట్లున్నవి. "శిశువులం జంకలనిడి తనుకృశతలు విరహాగ్నిం దెలుప గృహ గేహాళులన్ రశనలు జారగ సిగ్గుల శశిముఖు లెదురేగిరపుడు జలజాక్షునకున్ (ప్రథమ-11-262). ఇందు కౌంటుబిక ధర్మమునందలి పరిణతమైన రెండవదశ వ్యక్తమగుచున్నది. వీరు ధర్మమోక్షమార్గమున పండిపోయి సంతాన వతులైనను శాశ్వత మాధుర్యత్రపాభావమునకు ప్రతీకలు. గృహస్థ ధర్మమునందు తొలిపొంగగు శృంగార విహారముల ఫలితమున ప్రజావంతులగుట ధర్మముయొక్క క్రమపర్యవసానమనియు, నిందేదశయందైనను సతీపతుల సంబంధము నందలి మాధుర్యాంశము విస్మృతము కాదనియు, స్వామి యీ శవితఘట్టము నిరూపించుచున్నది. ఇందే మరియొక యంశము నిరూపబడినది, విశ్వకుటుంబియైన స్వామికి కుటుంబ భారమును పెద్దదేంంటి కిన్ని నాళ్లకు తిరిగివచ్చిన స్వామి వారినెట్టి ప్రశ్నలు వేసినాడో!

"కొడుకుల్ భక్తి విధేయులౌదురు గదా! కోడండ్రు మీ వాక్యముల్
కడవం బారక యుందురా? విబుధ సత్కారంబుఁగావింతురా?
తొడవుల్ వస్త్రములుం బదార్థ రస సందోహంబులుం జాలునా?
కడమల్ గావుగదా? భవన్నిలయముల్ గల్యాణ యుక్తంబులే?"
(265).

ఇందు కుటుంబనిర్వహణము నందున్న సాధక బాధకములు, కలిమి లేములు, మున్నగు నంశములు సామాన్యగృహస్థ దృక్పథము నుండి ప్రతిపాదింప బడినవి. అయినా బాధ్యతల నానంద దృష్టితో నెదుర్కొనుచు గమ్యము చేరుటయే సంసారము నందలి మూలతత్త్వము. చంకల బిడ్డలనుండి కొడుకులు కోడండ్రవరకు అభివృద్ధి నందియున్న కుటుంబములందు విబుధ సత్కారాదులు గావింప బడుచు తామరతంపరలై వర్ధిల్లు టాదర్శ ప్రాయమైన గృహస్థితి. అట్టివి కల్యాణ యుక్తములైన గృహసీమలు. వానిని స్వామి యాదర్శ కుటుంబ తత్త్వమునకు ప్రతీకలుగఁ జిత్రించు టీ సందర్భమున గమనార్హము. ప్రతిగృహమునిట్లే కలకల లాడుచుండ వలె ననుట శాశ్వతమైన భారతీయాదర్శము. అట్టి ప్రశ్నముల వలన వారికి ధర్మ స్వరూపమును స్వామి తెలివిడి చేసినాడు. ఏ పరిస్థితి యందును మాధుర్య లీలాంశముల విస్మరింపని భగవంతుడు వారిని వెంటనే మాధుర్య కక్ష్యకు తీసికొనివచ్చి, యాలంకారిక వైభవముతో (ఇది యొక సరసము కాబోలును!) నిట్లు ప్రశ్నించినాడు. "తిలక మేటికి లేదు? తిలకమ తిలకమ! పువ్వులు దురుమువా? పువ్వుఁబోఁడి! కస్తూరియలఁదవా? కస్తూరికాగంధి......" (266). ఆ ప్రశ్నములు వారి రూపాది లక్షణములనుఁ బట్టి ప్రయుక్తమైనవి. హరి యింట లేనప్పుడు వారు సంస్కారముల నొల్లక స్వామికై నిరంతర నిరీక్షణ మొనర్చు చుండిరి. స్వామి యాపద్ధతిని మెచ్చడు. కావుననే సంస్కార విహీనములైన రూపరేఖలను నిరూపరేఖలను నిరూపించి మరియు నధిక్షేపించినాడు. సర్వకాల సర్వావస్థలయందును సమయోచితములై యుదాత్త భావనాభిరుచుల కాలవాలములై యుండునట్టి యుచిత వేష భూషాలంకృతులను స్వామిమెచ్చును; తానట్లే ధరియించి యున్నట్లు పురాణములన్నిట సాక్ష్య మున్నది. ఆ విషయము నన్యాపదేశముగ వారి సౌందర్యము నందు దృష్టి నిలిపిన వానివలె స్వామి హెచ్చరించినాడు. ఆ యాంతర్యమును గమనింపక

పరముడైన స్వామి తమ దేహయష్టికలందు లగ్న మనస్కుడయ్యె నను భ్రాంతితో "...నట్టిపరమున్ బుద్ధిన్ విలోకంబులం గరయుగ్మంబుల గాఁగిలించిరి సతుల్ కల్యాణ బాష్పంబు లాభరణశ్రేణులు గాఁ బ్రతిష్ఠిత నవప్రాప్తానురాగంబులన్." (268) ఇట్టి కౌగిలింతలు స్వామి కెంతయో ప్రీతికరములు. కాని యిప్పట్టున నిరూపింప బడిన స్థితి వేరు. "...కాంతలు దంభచేష్టల మాధవున్ సంచరింపఁగఁ జేయ నేమియు జాలరైరి". (269.) పరిణత గార్హస్థ్యస్థితియందీ పరిరంభణాదులు దంబప్రాయములే. వీని వినియోగము పూర్వస్థితి చెందినది. ఇట్లీ పరమరమ్య గంభీర ఘట్టమున పోతన తొలిదశయందలి శృంగారమెట్లు ధర్మముగ పర్యవసింప వలెనో, యిందు భారతీయాదర్శమెట్టిదో నిరూపించి యున్నాడు. స్వామి కుటుంబధర్మము నందలి మహత్తర దర్శనమిది. కాని యింతలో నీ ప్రస్థానము ముగియలేదు. స్వామి యీ యంగనలతో ప్రవర్తించిన పద్ధతియందలి యాంతర్యమును మహాకవి యిట్లు వ్యాఖ్యానించినాడు. "సంగరహితుండైన కంసారి సంసారియై వడి విహరింప నజ్ఞాన విలోకులైన లోకులు లోకసామాన్య మనుష్యుండని తలంతురు. ఆత్మాశ్రయుడైన బుద్ధి యాత్మ యందున్న యానందాదుల తోడం గూడని తెరంగున నీశ్వరుండు ప్రకృతితోడం గూడియు నా ప్రకృతి గుణంబులైన సుఖ దుఃఖంబులం జెందకయుండు" (270), ఇందు నిరూపింప బడిన యర్థమున స్వామి స్థితి మొదటి విషయము. అతడు ప్రకృతి బద్ధునివలె చరించినను ప్రకృతి బద్ధుడుకాడు. అందలి సుఖదుఃఖముల కతీతుడు. రెండవ విషయ మీ యాదర్శమే గృహస్థుల కనుసరణయోగ్యమనుట. మానవ జీవితమునందలి సుఖదుఃఖాదుల కొక స్థితి దాటినవెనుక వినియోగము లేదు. ఆ యీ విలసనములన్నియు యోగికి సాధనామార్గములు. అట్లు సుఖదుఃఖాతీతమైన పరమస్థితి భగవత్తత్త్వ ప్రతీక. దాని ననుసంధానము చేయుటకీ కుటుంబమొక చక్కని సాధనా రంగము.

ఇక స్వామి సంతానమును గూర్చిన వివేచన. ఇది బహు సంఖ్యాకమైనది. దీనిని గూర్చి భిన్నపురాణము లందు భిన్న ప్రసక్తు లున్నవి. అన్నిటియందు సామాన్యముగ నిది గణనాతీతమైన యంశ మున శ్లాఘింప బడినది. స్వామియొక్క పత్నీసంఖ్యవలెనే యిదియు ప్రతీకాత్మకము. బహురూప భావాత్మలతోడి భగవానుని సంబంధము నందలి మాధుర్యాంశమునకు పత్నులెట్లు ప్రతీకలో, తత్సంయోగ ఫలితమైన భిన్న భిన్న భావ సంస్కార ప్రాదుర్భావమునకు పుత్రులట్లే ప్రతీకలు. ఇవి విశ్వమునందలి ప్రవృత్తుల వలెనే అసంఖ్యాకములు. చక్రనేమి క్రమమున ప్రవర్తిల్లుచున్న విశ్వమున పుట్టి గిట్టుచుండు బహువిధ భావప్రపంచమున కెంత స్థితి యున్నదో వీరికిని నంతియే. ఈ యాంతర్యమే యదువంశ వినాశన ఘట్టమున నిరూపితమైనది. పురాణములందు ముఖ్య పుత్రుల నామాద్యంశములు మాత్రము చెప్ప బడి, తత్పుత్ర పౌత్ర పారంపర్యస్థితి యసంఖ్యాకమని చెప్పబడుటలో నిదే రహస్యము. ఆ యీ యంశములు సమయమున నుద్బుద్ధములై పర్యవసానమున విశ్వమునందు లీనమగునవే. అది యట్లుండ సంతా నార్థమై స్వామి కైలాసమున కేగి పరమేశ్వరుని గూర్చి తపమొనర్చిన వృత్తాంత మొకటి హరివంశము నందున్నది. అందలి ముఖ్యాంశములు: రుక్మిణి ప్రద్యుమ్నాది పుత్రుల జననమువలన 'నాత్మతృప్తి' నందక స్వామిని పుత్రార్థినియై ప్రార్థించినది. స్వామి పుత్ర ప్రాధాన్యమును వేదోక్త మార్గమున నిరూపించి తానంతకు పూర్వమే తపమాచ రించి ప్రద్యుమ్నుని బడసితిననియు, మరల తపస్సుచే జగన్నాథుడైన శివుని మెప్పించి పుత్రునందుదు ననియు చెప్పెను. దీనికి తోడుగ నితర ప్రయోజనములు కూడ ననుసరించి (వీనిలో ముఖ్యమైనది శంకర కేశ వాత్మక స్ఫురదురుతత్త్వ నిరూపణము) స్వామి బయలుదేరెను. తపస్సు సిద్ధించినపుడు పరమేశ్వరుడు ప్రత్యక్షమై స్వామితో "నీవు పూర్వంబునందును నధిక తపంబొనర్చి తిప్పుడు పరమతపోఽనుష్ఠాన నిర్వాహకుండవునైతి. నీవైన యీ భవిష్యత్తపో విభవంబు నెరిగి

యింత వట్టునకును ఫలరూపంబుగా గొడుకు మున్న యిచ్చుట నిట్లు నువ్యక్తంబు సేయవలసె" (ఉత్తర 6-74) ననెను. దీనివలన గమ్యమానమైన యంశము- తత్సంతానప్రాప్తి దైవకృపవలన, దీక్షాపూర్వకమైన తపస్సువలన సిద్ధించునదేగాని దైహికక్రియా ఫలితము గాదనుట. ప్రజార్థమైన గృహమేధిత్వమున నిది పరాకాష్ఠయైన ధర్మస్థితి. దీనిని నిరూపించుటకే స్వామి తపశ్చర్యాది వృత్తాంతము లుద్దిష్టములైనవి.

ఈ పరిశీలనము వలన జననీ జనకుల యెడల, యావనవతులైన భార్యల యెడల, బహు ప్రజావంతులైన గర్భిణుల యెడల నెట్టి కౌటుంబిక ధర్మ నిర్వహణమ్ము మానవులకు శ్రేయః స్థేయముల నొసంగునో, సంతాన ప్రాప్తి సందర్భముగ వైదిక మార్గమును, స్వామి యెట్లు భావించి, యనుష్ఠించి లోకమునకు నిరూపించెనో వ్యక్తమగుచున్నది. ఈ మహార్థ దర్శనము నాంధ్ర వాఙ్మయమున పురాణ కవులు నిరూపించి యున్నారు. అర్వాచీనులలో నెక్కువ మందికీ చూపులేదు. వారి నాకర్షించినవి లౌకిక స్థితియందలి కొన్ని వృత్తాంతములు- అవియు స్వామి కుటుంబమ్మునకు చెందిన వ్యక్తులకు సంబంధించినవి. కాని, యందు నిరూపితార్థము లీ కక్ష్యకు చెందినవి కావు.

సాంబోపాఖ్యానము :

వాని నుదాహరణ ప్రాయముగ నించెన్నవలసి యున్నది. అట్టి వానిలో రామరంగప్ప రాజకవి ప్రణీతమైన సాంబోపాఖ్యానము ముఖ్యమైనది.[126] ఇది కవిత్వ విషయమున మిక్కిలి సంభావనార్హమైన గ్రంథము. వసుచరిత్రము, కళాపూర్ణోదయము మున్నగు గ్రంథములకంటె మున్నుగ రచింపబడినది యీ సాంబోపాఖ్యానము. (కవికాలము 1550 ప్రాంతమని పీఠికా కర్తలైన

126. ఆంధ్ర సాహిత్యపరిషత్ప్రచురణము, కాకినాడ, 1932.

(శ్రీ కరిర సాంబమూర్తి శాస్త్రి నిరూపించినారు.) ఇది కథా వృత్తాంతమున వైపుల్యమును సాధించినది. శ్రీకృష్ణుని బాల్య క్రీడలు మొదలు సాంబునికి లక్షణతో జరిగిన వివాహము వరకున్న వివిధాంశములను పూర్వ పురాణముల నుండి గ్రహించియు, నెడనెడ కొన్ని కల్పనములు చేర్చియు నీ కవి తీర్చినాడు. కథ కేకోన్ముఖత్వముగాని, కల్పనల యందు స్వారస్యము గాని లేదు. మహత్తరమైన శైలి యొక్క పరిపాక మీతని కున్నది. లక్షణా సాంబులకు శృంగార సంధాతగ వ్యవహరించిన సిద్ధాంత ధర్పణ గురుని పాత్ర యీ కావ్యమున చెప్ప దగిన సృష్టి. ఈ కవి ప్రకటింప దలచిన వైష్ణవాగమ సాంప్రోక్తులకీ పాత్ర వాహిక వంటిది. ఈ శీర్షిక యందీ కావ్యము ప్రసక్తమగుటకు హేతువు జాంబవతికి సాంబుడు జన్మించిన వైనము. జాంబవతి పుత్రార్థినియై స్వామిని ప్రార్థింప నాతడు తొల్లిటి యట్లే కైలాసమున కేగి శివుని గూర్చి తపమొనర్చి, పుత్ర ప్రాప్తికై వరము నందుట, సాంబుని జననము, లక్షణతో నాతని వివాహము మున్నగు వృత్తాంతములు. వీనినీ కవి నిర్వహించుటలో పూర్వ కావ్యముల ప్రభావము వ్యక్తమగుచున్నది,

చంద్రభాను చరిత్రము :

ఇందరు నాయకులు స్వామిని పుత్రార్థినులై తపశ్చర్యకు పంప తానేమి తక్కువ తినెనా యని సత్యభామ భావించి యుండ వచ్చును. తానును స్వామికి పుత్ర విషయమున నొక సమస్య తెచ్చి పెట్టినది. ఈ వృత్తాంతము తరిగొప్పుల మల్లన మంత్రి రచించిన చంద్రభాను చరిత్రమున నున్నది.[127] సామ్యము పుత్ర గతమైన వాంఛ వరకే. రుక్మిణికి సంతానము కల్గిన దన్న వృత్తాంతమును వినిన సత్యభామ యసూయనంది (తెలుగు కవులకామె యసూయాది గుణము లందే మక్కువ!) తనకు నొక పుత్త్రు నిమ్మని కోరినది. స్వామి యనుగ్రహించినాడు ఆ పుత్త్రుడే చంద్ర భానుడు.

127. ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణమే, 1922.

ఆతని చుట్టును నొక కల్పితేతి వృత్తము నారదాది పాత్రల సాహాయ్యమున నిర్వహింప బడినది. అట్టి వృత్తాంతము ప్రబంధ మార్గమున వ్యాపించిన పద్ధతికి కావ్య మాకరము. ఇంతకు మించిన ప్రసక్త విశేషములు లేవు.

మొత్తము మీాద కృష్ణ కుటుంబ వృత్తాంతములు లౌకిక శృంగారేతర మార్గమున నాంధ్ర వాఙ్మయమున వ్యాపింప లేదు. ఉన్న కొలదియు నిట్లున్నవి.

## చతుర్వ్యూహములు

ఆంధ్ర వాఙ్మయమున విశేష వ్యాప్తి నార్జించుకొన్న వృత్తాంతములు బలరామ, ప్రద్యుమ్న, అనిరుద్ధులకు సంబంధించినవి. అవి సాక్షాన్మార్గమున కృష్ణ కథాంశములని చెప్పుటకు వీలులేదు. కాని యందలి యంతస్తత్త్వము మాత్రము స్వామి ప్రమేయమును లౌకిక, తాత్త్విక కక్ష్యలందు కల్గినవి. అందులకు హేతువైనది వ్యూహ సిద్ధాంతము. ఇది ఆగమోక్తము. ఆగమముల యొక్క ప్రభావము భాగవతాది గ్రంథములపై నెక్కువ. ఏతదంశముల నాంధ్ర కవులలో నెకొలది మందియో ప్రతిబింబించిరి. లౌకిక తాత్త్విక కక్ష్యలందీ యనుశీలన మొనర్చుటకు మున్నుగ వ్యూహ సిద్ధాంతమును గూర్చి కొన్ని ప్రాథమికాభి ప్రాయముల నేర్పరించు టవసరము.

పాంచ రాత్రాగమములోని పరవాసుదు- వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ- అను వ్యూహములుగ నాగమమున నర్చా విధానములందు నిరూపింప బడగా భాగవతమునందు సృష్టి ప్రక్రియా నిరూపణ సందర్భమున నవి ప్రసక్తము లైనవి. ఆ వ్యూహముల లక్షణ మిట్లున్నది.

వాసుదేవ వ్యూహము :

శాంతోదితుడగు వాసుదేవుడు, నిత్యోదితు డగు పరవాసుదేవుడు, మహత్తత్త్వము నధిష్ఠించినపుడు, అనగా పనిలో నుపయో

గించుటకై ప్రేరేపించినప్పుడు వాసుదేవ వ్యూహ నామమున పిలువ బడును. ఇది మొదటిది. మరకతగిరివలె శ్యామలము. క్షీర సాగరము నివాస స్థానము. ఇది షాడ్గుణ్య పరిపూర్ణము. ఆధ్యాత్మికాధి భౌతి కాధి దైవికము లందు వేరు వేరుగ గ్రహింప బడినది. ఆధ్యాత్మిక రూపమున చిత్తము. అధి భౌతికమున మహత్తు. అధి దైవికము వాసుదేవుడు. అధిష్ఠాత క్షేత్రజ్ఞుడు. దీనివలన జీవులయొక్క కర్మల పరిపాకదశ వలన నీ మహాత్మునికి సృష్టింపవలెనని తలపు గల్గి మహా తత్త్వమును ప్రేరేచునని యర్థము. సత్త్వ గుణ ప్రధానమై, దోష రహితమై నిత్యమై శాంతమై యూర్మి షట్క రహితమై, అరిషడ్వర్గ దూరమై యుండునని భక్తులు దీనిని సేవింతురు.

సంకర్షణ వ్యూహము :

ఇది వాసుదేవ వ్యూహము నుండి యేర్పడినది. ఆరు గుణము లలో విజ్ఞానము శక్తియను రెండు గుణములు ప్రధానములు. తెల్లగా నమృతపు నురుగువలె నున్న దేహము, నల్లని వస్త్రమును, గలిగి హాలమును ధరించి యుండును. ఈ గుర్తుల వలననే బల రాముడు సంకర్షణునిగ నిర్దేశింపబడెను. జీవుల నందరను సంకర్షిం చుట వలన నీ వ్యూహమున కా పేరు వచ్చినది. కంసభీతులై చెదరిన యాదవుల నందర నొక చోటికి సంకర్షించుట వలన బలరాముడు సంకర్షణు డాయెను. సకల జీవుల కిత డధిష్ఠాత. అధిష్ఠాన మహం కారము. ఈ వ్యూహమునకు భూతేంద్రియ మానస మయుడు; కర్తృత్వ, కారణత్వ, కార్యత్వ, శాంతత్వ, ఘోరత్వ, మూఢత్వ లక్షణములు కలిగినట్టి వాడైన రుద్రుడే యధిష్ఠాత. పాతాళము నివాసము, ముప్పవేల యామడ వెడల్పున లోకను చుట్ట చుట్టుకొని మహోగ్ర శరీరముతో ననంతుడను సర్పాకారముతో విలసిల్లెడు నాది శేషుడతడు. ఈతని వేయి పడగలం దావగింజవలె భూమండల ముండును. శాంతుడుగ నున్నను సంహార సంకల్పము కల్గినపుడు రుద్రుడై రౌద్రము గలవారు, త్రినేత్రులు, త్రిశూల ధారులునైన

యేకాదశ రుద్రులను సృజించును. ఇతడు పాతాళమునందలి నాగేం ద్రులచే నిరంతరము సేవా నమస్కృతులను పొందుచుండును. నాగ కన్య లగురు చందన కుంకుమాదుల మైపూతల నీతనికి సమర్పింతురు. దర్శన స్పర్శనాదులవలన మదనావేశమునంది సాభిలాషలై సవ్రీడలై చూచుచుందురు. అనంత గుణుడైన యీ యనంతు డపుడు క్రోధ మును వీడి శాంతుడై లోక క్షేమమును కోరును. సుర, నర, గరు డోరగాదులు స్తుతించినపు డీతడు ప్రీతుడై మాన్నిగన్ను వెట్టి కూర్కును. నారదుడు తుంబురాదులతో కూడి బ్రహ్మదేవుని సభ యందీతనిని కీర్తించును.

ప్రద్యుమ్న వ్యూహము :

సంకర్షణ వ్యూహము నుండి యేర్పడినది. పూర్వోక్తములైన షడ్గుణములలో బలైశ్వర్యములు ప్రధానములు. తాపించము శరీర చ్ఛాయ. కావున శ్యామలవర్ణ సుందరుడైన ప్రద్యుమ్నుని వ్యూహ ముగ గుర్తింప బడినది. అధిష్ఠానము బుద్ధి. సకల ప్రాణి హృద యము నందీతని నివాసము. అధిష్ఠాత బ్రహ్మ దేవుడు.

అనిరుద్ధ వ్యూహము :

ప్రద్యుమ్న వ్యూహము నుండి యేర్పడినది. వీర్య తేజస్సులు ప్రధాన గుణములు. ఇతడు శరత్కాల వికసిత నీలోత్పలచ్ఛాయ వాడు. అధిష్ఠాత చంద్రుడు. హృషీకము (వస్తువును గోచరించు నంతరింద్రియము), మనస్సు అధిష్ఠానము. కావున నీతడు హృషీ కేశుడు. ఇతడును పరవాసు దేవుడే. కనుక నితని వలెనే యతనికిని హృషీకేశుడని పేరువచ్చినది. అనిరుద్ధ వ్యూహమే సమస్త జగదుత్ప త్తిని నిర్వహించును.[128]

128. చతుర్వ్యూహములకు సంబంధించిన యీ వివేచనమును శ్రీ వేదాల తిరువేంగళా చార్యుల యుపన్యాసము నుండి గ్రహించితిని. చూ: వాసుదేవతత్త్వము- అవతారములు- భాగవత వైష్ణవము- ఆంధ్ర భాగవతోపన్యాసములు- ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్డు, హైదరాబాదు- 1957.

ఇట్లు చతుర్వ్యూహముల నున్నది పరవాసు దేవుడే. పరవాసు దేవ తత్త్వమున నాతడు స్వాయముగ సూక్ష్మ మనబడును. వాసు దేవాదులైన నాల్గు వ్యూహములు, మత్స్య కూర్మాద్యవతారములు విభవము; ఇట్టిది పరతత్త్వ స్థితి. ఈ విభవమును (రామకృష్ణాద్యవ తారములను) భక్తి శ్రద్ధలతో నర్చించి క్రమాభివృద్ధి చేత వ్యూహ ముల నందుటయు, నా వ్యూహములను కూడ భక్తి వృద్ధితో ధ్యానార్చనాది విధానమున సేవించి సూక్ష్మమును (పరవాసుదేవ తత్త్వమును) పొందవచ్చునని పాంచరాత్రాగమ ప్రక్రియ చెప్పు చున్నది. ఇట్టి యర్చనను "చతుర పాంచరాత్రోక్త హరిసమా రాధన క్రియలను" అను మాటలచే పోతన చెప్పెను.

## బలరాముడు

ఈ విషయములు భిన్నకవులు ప్రతిపాదించిన కథావృత్తాంత ముల ననుసంధేయములు. మున్నుగ బలరామ సంబంధులైన వృత్తాంతములను పరిశీలింప జెల్లును. భారతము నంపతనికి సంబంధించిన యంశములలో ముఖ్యమైనదిగ కురుపాండవ వృత్తాంత ముక్తము కాదగినది. యుద్ధాత్పూర్వము ప్రవర్తిల్లిన సందర్భము లందీతడు మున్నుగ కృష్ణోక్త మార్గము ననుసరించి నట్లును, అటుపై దుర్యోధ నుడు వచ్చి దర్శించినపు డాతనిపై ప్రీతిని, శిష్యవాత్సల్యమును ప్రద ర్శించి నట్లును, యుద్ధ సందర్భమున తాటస్థ్యము వహించి తీర్థయాత్రా చరణ మొనర్చి నట్లును, భీమదుర్యోధన గదా యుద్ధసందర్భమున నధ ర్మము జరిగినదని స్వామితో సంవదించి, తుదకు దుర్యోధనునకు నుత్తమ లోక ప్రాప్తి యగు ట్లాశీర్వదించి నట్లును వ్యక్తమగుచున్నది. ఆయా సందర్భములంటు బలరాముడు స్వామి ధర్మ నిరూపణమున రెండవ యంచువలె, పూరకాంశమువలె భాసిల్లినాడు. పురాణోక్త ములైన బలరామ వృత్తాంతములు మరింత సమగ్రములై యున్నవి.

ఈ భేదము పురాణేతిహాసము లందలి ప్రణాళికా భేదమువలన వచ్చినది. హరివంశమునందును, భాగవతమునందును బలరాము మాహాత్మ్యమును నిరూపించుట యొక ప్రత్యేకాంశముగ భాసిల్లినది. వివిధ ఘట్టముల యందు బలరాముని తత్త్వము వ్యక్తమైనదియు వీనియందే. కొన్ని యుదాహరణములు: బలరాముడు స్వామితో పాటు మధురను వీడి, పరశురామునికడ నుపదేశమునంది, జరాసంధుని తోడి యుద్ధమునకు పూర్వము దివ్యాయుధాది విభూతి ప్రాప్తినంది యున్నాడు. వ్రేపల్లెకు పోయి యందు వివిధ క్రీడావిశేషములు నొనర్చుట ప్రత్యేకించి గమనింప దగిన యంశము. అందతడు మున్నుగ పెద్దలను దర్శించినాడు. స్వామివలె వివిధ సందర్భముల కుచితమైన వేషము నీతడు ధరించునో లేదో గాని యెక్కువ భాగ ముజ్జ్వల వేష ధరుడై యుండును. అది యీతనికి ప్రీతికరమైన యంశము. పూర్వో క్తాగమ వృత్తాంతము లందీ యంశమున్నది. నందాది వృద్ధుల నీతడు దర్శించినపుడు వారీతని యాదవకుల రాగవివర్ధను డనియు, మహాత్ము డనియు, సుఖశ్రీ భాగియనియు సంబోధించినారు. (హరివంశము-ఉత్తర-2-78.) స్వామితోడి యీతని సంబంధమును, భిన్న సందర్భ ముల నీతఁడు వ్యక్తమొనరించిన పరాక్రమమును జెప్పి యదువృద్ధు లీతని శ్లాఘించినపు డీతడు హ్రీరమ్యుడు, వినతుడు-ఇట్లు పలికినాడు-

"... అక్కట! యింతనేల మీరు గూర్మినెరయఁ బెంపఁగాఁ బెరిగి మీ చిరశిక్షఁ జరించి మీ గృహంబున సరసాన్నములు గుడిచి బుద్ధిఁ దనర్చిన మాకు నెందు శోభన మగుటేమి సందియము బాంధవు లెవ్వరు మిమ్ముఁబోలఁగన్" (82) అనియు, 'రాచసిరి యుండియును మది యాచవికిం జొరదునాకు హరికి నిచటి బాల్యాచరణముపై మక్కువ...' (83) యనియు చెప్పుట యీతని దృక్పథమును, స్వామి దృక్పథమును వ్యాఖ్యానించు చున్నది. రాముని జీవితమున భోగలాలసత, స్త్రీ పరిచర్యాభిగమ్యత్వము నెక్కువ. ఇవి సంకర్షణ వ్యూహ మునందు చెప్పబడిన యంశములే. ఆయీ లక్షణములకు నగరవాసము

నందంత యానుకూల్యము సిద్ధించి యుండ దేమో! (అందును స్వామి యావహార్గముల పారము చూచు చున్నపుడు) వ్రజమునకు వచ్చినాడు. ఇట్టి భోగానుభవమును, బాల్యవృత్తాంతస్మృతిలోని మాధుర్యమును నన్వేషించు కొనుచు బలరాముడు వజమునకు కాని, మరెచ్చటికి గాని పోయిన దిది యొక్కటే యుదాహృతి. ఇందాతని భోగమునకు తావలమైన విషయములు వ్రజయువతులతోడి క్రీడలు, నిరంతర మద్యపానము. ఈ మద్యపాన వృత్తాంతమునకు సంబంధించిన వారుణి తత్త్వము స్థలాంతరమున నిరూపితము. (చూ: సమగ్ర కృష్ణ కథ.) నిరంతరము స్త్రీ జనసంగతి యందీతడు సుగంధాద్యర్చనల భాసించిన వైనము లాగ మోక్తములు. మాగన్ను వెట్టి యున్న తన్మయ స్థితికి మద్యపానము విభూతి సూచకమైన సంకేతముగ పురాణములందు దర్శింపబడినది. ఆయా వృత్తాంతములను యాదృచ్ఛికముగ పసికట్టి నట్లున్నారు వ్రజ వాసులు. రామస్వామికి సంప్రీణనార్థమై "మాధుర్య హృద్యంబులగు మద్యంబులున్ సమధికాపేక్ష్యంబులగు భక్ష్యంబులును, భావాను రూపంబులగు ననులేపనంబులును, దేజో విలాస కల్యాణంబులగు మాల్యంబులును" (84) కల్యాణమూర్తియైన బలరామునికి సమర్పించిరి. వాని నుద్దీపితమైన మోహమునకు పరతంత్రమైన మనస్సుతో నీత డనుభవించెను. ఈ ఘట్టమున బలరాముని రూప సంపద మహత్తరమై ప్రతిపాదింపబడి, యాగమోక్త విషయమునకు భంగ్యంతరావృత్తి వలె నున్నది.

"కనకపు మోగ్రికునఁ దనరెడు సురదంతి
మాడ్కి నుత్ఫుల్ల దామమున నమరి
నిండు వెన్నెల పర్వ నెఱయు కైలాసాద్రి
లీలఁ జందన సాంద్రలిప్తి మెఱసి
చలదుల్కమగు శరజ్జలదంబు క్రియ నేక
కుండల మణిదీప్తిఁ గొమరు మిగిలి
ఘనభోగి యుక్తమై తనరు పటీరంబు
గతిఁ జేతి హాలమున నతిశయిల్లి

తారకలలోఁ గలంక విస్ఫారుఁడగుచు
నలరు పూర్ణేందు విధమున నతివపిండు
నడుమ నీలాంబర ద్యుతి బెడఁగు కాఁగ
నధిక ధవళాంగ రుచినొప్పె నవ్విభుండు." (87)

ఇట్లే భోగ, విభూత్యంశముల యనంతరము క్రోధ, సంకర్షణాంశముల నిరూపించుట కుద్దిష్టమైనది కాళిందీ జలాకర్షణము. సంకర్షణాంశ మిందు నదీ స్వరూపమునందలి స్త్రీత్వాకర్షణముగ వర్ణించినా డెఱ్ఱన. విసృస్త ఫేనదుకూల, విహ్వల విహంగరుతాక్రంద, వికల కలహంస గమన- మున్నగు విశేషము లిందు ప్రయుక్తములైనవి. సాకారయై వచ్చి స్తుతించిన కాళిందీనది నీతడు మన్నించి మనుచుట యిట్టి పొంగి, యిట్టి కుంగు సంకర్షణ తత్త్వము. ఇదియు నాగవ ముల నున్నదియే. ఇట్లీ ఘట్టమంతయు పూర్వోక్త వృత్తాంతము లందలి యాగమాంశకు నిరూపకమై యున్నది.

ఇట్లే బలరామ మాహాత్మ్య కథన సందర్భమునను నెఱ్ఱన యా యీ వృత్తాంతముల స్మరింప జేయు రచనము నే వెలయించినాడు. శ్రోతయైన జనమేజయుడు బలరామ వృత్తాంతమును గూర్చి ప్రశ్నించు నప్పుడీ యంశమును బీజప్రాయముగ నుల్లేఖించినాడు. ఆ వృత్తాంతము యొక్క- వివృతియే యనంతర కథా వృత్తాంతమైన లక్షణా పరిణయము- అందు బలరాముడు నిర్వహించిన పాత్ర.

"జగతీ చక్రము శేషముం బృథు ఫణా చక్రంబునం దాల్చి దై
త్యగణోన్మర్దనుఁడా జనార్దనుండు దానై మానసీ యోన్నతిన్
నిగమాంతస్తుతిఁ బేర్చు శేషుఁడు భువిన్ లీలాకృతిం దాల్చెనాఁ
దగు నీలాంబరు పేర్మియే వినుటకున్ ధన్యుండఁ బుణ్యవ్రతా!"
(హరివంశోత్తర-1-3)

ఇందు హస్తినను సీరంబున పెల్లగించ బూనిన బలరామతత్త్వము జగద్భారవహ మనియు, నిగమాంతస్తుత్య మనియు నిరూపితము.

పూర్వఘట్టమునందు వలెనే సంకర్షణ విలాసమును, కీర్తింపబడినప్పుడు ప్రసన్నత వహించుటయు నిరూపింప బడినవి.

నాచనసోమనాథుడీ తత్త్వమును సంక్షిప్తముగ సమగ్రార్థ స్ఫూర్తితో వ్యక్తీకరించినాడు.

"పాతాళాధిపుఁడైన శేషుఁడు ప్రలంబఘ్నుండు నారాయణ
ప్రీతిం బుట్టెను శంకరుండని జనుల్ పేర్కొన్నచో నంధకో
ద్ఘాతస్నేహమునఁ గామపాలతయుఁ దప్పుందప్పుఁ గాకేమి ప్ర
ఖ్యాతిం బొందఁడె పాండురాంగమహిమన్ హాలాహలస్వీకృతిన్"
(ఉ. హ. వం. 1-7)

ఇందు రుద్రాంశమును పురస్కరించుకొని శంకరునితో నభేదమును ప్రతిపాదించి హాలాహలస్వీకృతి, పాండురాంగ మహిమ యను నంశముల శ్లేషపూర్వమున నిరూపించినాడీ మహాకవి. ఆగమ దర్శనము నందలి రుద్రాంశ కిది సమగ్రమైన చిత్రణము.

భాగవతమునందు గూడ భిన్న సందర్భములందీ యంశము ప్రతిపాదితమైనది. కురుపాండవ సంగ్రామమునకు మున్నితడు తీర్థయాత్రల నొనర్చిన వృత్తాంతమును పోతనార్యుడు సర్వాంగ సుందరముగ తీర్చియున్నాడు. సూతమహర్షిని సంహరించుట, మునీశ్వర ప్రార్థితుడై యాతనిని పునర్జీవితు నొనర్చుట, రాక్షసులవలన మహర్షి బృందముల కేర్పడిన యువరోధముల తొలగించుట మున్నగు వృత్తాంతము లిందు వర్ణితములై ప్రాయికముగ పూర్వోక్తాంశములనే నిరూపించుచున్నవి. అందు బలరామమూర్తి వైభవ మిట్లున్నది.

"విలసిత మాల్య చందన నవీన విభూషణ రత్న వస్త్రముల్
పొలుపుగఁ దాల్చి యంచిత విభూతిఁ దలిర్చెను బూర్ణచంద్రికా
కలిత సుధాంశురేఖ యెసకం బెసఁగ న్నిజ బంధులోచనో
త్పలచయ ముల్లసిల్లఁ బరిపాండుర చారు యశోవిలాసుఁడై"
(దశమోత్తర, 78-954)

పూర్వ మీ ఘట్టమున రాముఁ డొనర్చిన ఋషి సంహార రూపమైన పాపము శమింప, నీతఁడు పరమ ప్రసన్న మూర్తియై తీర్థ యాత్రల యొక్కయు, బ్రాహ్మణోపాస్తి యొక్కయు పుణ్య తేజ మును తనలో నాహరించుకొన్నట్టి యితోఁ ధికార్థస్ఫూర్తి యొక్క సమ్మేళనము పోతనార్యుని రచనము నందలి విశేషము. రుక్మిణీ హరణ సందర్భమున స్వామి రుక్మి నవమానించి నపుడు రాముఁ డొక తత్త్వోపదేశమును కావించెను. క్షత్రియునికి మానహాని ప్రాణహాని కన్న తీవ్రమైనదని చెప్పి స్వామిని మందలించి రుక్మి నాశ్వాసిం చెను. అట్టి యీ బలరాముఁడు అనిరుద్ధ వివాహ సందర్భమున ద్యూతము నందలి యసత్య వచనము కారణముగ రుక్మిని చంపెను. ఆ చంపుటయు పరమ భయంకరముగ "...దంతములు మున్ను డులిచి తను వగలింపగ..." (దశమోత్తర-41-302) జరిగినది. ఇందాతని సంహారాంశము భాసింప స్వామియుఁ మిన్నకుండినాడు. రేవతితో బలరామ వివాహము ప్రసిద్ధ పురాణము లందు ప్రాయిక ముగ సంక్షిప్తము. విశిష్టములైన గర్గాదులందు విస్తృతమై పూర్వోక్తాంశములనే నిరూపించినది. సుభద్రా వివాహ సందర్భ మున స్వామితో నేర్పడిన వైమనస్యము పురాణోక్త ప్రకారముగ నర్వాచీన వాఙ్మయమున విస్తృతి నందినది. ఈ వృత్తాంతము నాక రముగనే శశిరేఖా పరిణయాది కల్పిత వృత్తాంతములు తెనుగు వాఙ్మయమున బాగుగ నాటకాది స్వరూపము లందును, జానపద వాఙ్మయ స్వరూపము లందును విస్తృతములైనవి. ఇవి మహా రాష్ట్రాది భాషలందును ప్రసిద్ధములు.

అర్వాచీన వాఙ్మయమున బలరామ వృత్తాంత మొక ప్రత్యేక స్థానమై సాగివచ్చినది తక్కువ. అసలు లేదనియే చెప్పవచ్చును. స్వామి యొక్క మాధుర్య లీలాంశముల యుద్దీప్తి నుండి తప్పించి, యీ వృత్తాంతము నొక ప్రత్యేక కావ్యముగ గాని, నాటకముగ గాని నిర్మించు టన్నది సామాన్య కవులు చేయగలిగిన పని కాదు. కావున

సమగ్ర బలరామ తత్త్వ ప్రతిపాదకమైన కావ్య ముత్పన్నము కాలేదు. పూర్వము చెప్పబడిన సుభద్రాహరణ, శశిరేఖా పరిణయ వృత్తాంతములు ఏకదేశతత్త్వ నిరూపకములై కథివయములు సృష్టింప బడినవి. కాని యందు స్వామి నిర్వహణ దక్షత, లీలా విలాసములే ప్రముఖములైనవి.

దశావతార చరిత్రము

అయినను సమగ్రముగ పరమ శిల్ప సమ్మితముగ బలరామ వృత్తాంతముల నన్నిటి నేక ఖండమున ప్రదర్శించిన ఘనత ధరణి దేవుల రామయ్య మంత్రికి చెందవలసి యున్నది. ఈతని దశావతార చరిత్రమున నేకదేశ భాగమైన బలరామావతార కథ యీ శీర్షిక క్రింద ప్రసక్తము. (ఈ గ్రంథము రాధాకృష్ణ సాహితి యందు ప్రసక్తము.)

వివిధ పురాణేతిహాసము లందున్న కథాంశముల నొకచో జేర్చి రచించుటకువలసిన సమగ్రావగాహనము, సంధాన చాతుర్యము రామయ్యమంత్రి కున్నది. సాధారణముగ నిట్టి ప్రయత్నములు విజయ వంతములుగావు. ఏలన భిన్న కథాంశములు క్రోడీకరించునప్పుడు వాని నేకోన్ముఖత్వము సాధించుట కష్టము. ఆ యంశము నీతడు జాగ్రత్తగ నిర్వహించినాడు. అందులకై యీతడు గైకొన్న జాగ్రత్త, సాధ్యమైనంత వరకు కృష్ణ ప్రసక్తిని తగ్గించుట, బలరాముని వృత్తాంతమున కొన్ని నూతనాంశముల నారోపించి యీ వృత్తాంతము యొక్క సమగ్రస్ఫూర్తికి దోహదము కల్పించుట.

బాల్యక్రీడలయందు బలరాముడు స్వామితో భాగస్వామి. గోపికల గృహములకేగి పాలు పెరుగులను కొల్లలాడుట, వారి వృత్త వక్షోజములను జీరుట, కౌగిళ్ళ జొక్కించుట మున్నగు వంశము లిట్టివి. ప్రలంబాసుర సంహార ఘట్టమున స్వామి బలరాముని తెలిపిన వృత్తాంతమును రామయ్య యించుక వివరించి మనోహరముగ బ్రవచించినాడు.

"గగనాది సృష్టి గల్గక ముందు వెల్గొందు
నిర్మల బ్రహ్మంబు నీవ కావె
ప్రభవించు వెనుక ప్రపంచ స్వరూపమై
నెగడు విరాణ్మూర్తి నీవ కావె
జన్మాది రహితుఁడై సత్త్వగుణంబు వ
హించు నారాయణుం డీవ కావె
వేయు ఫణంబుల విశ్వంభర భరింప
నిపుణుఁడౌ ఫణిరాజు నీవ కావె
యేను నీవయె కాదె నీ వేనుగాదె
యవని రక్షింప నిరువుర మైతి మింత
తలపు నిజమూర్తి మానుషత్వంబు నిలుపు
మరువ నేటికి యన్న నీ మహిమలన్న." (8-22)

అటుపై బలరాము డొనర్చిన వివిధాసుర వధావృత్తాంతములు వివృతము లైనవి. గోమంతమున రాముడు విశ్రాంతి నంది యున్నప్పుడు వారుణితో నీతని సమాగమము పరమ శృంగార ప్రధానముగ చిత్రింప బడినది.

"మదిరా రసము గబ్బు మాటల తబ్బిబ్బు
గొదమ గుబ్బలయుబ్బు నిదుర మబ్బు
తొలఁగుఁ బమ్మెద కప్పు దూసి యాడెడి కొప్పు..."
(835-35)

వంటి వర్ణన లీకావ్యమున యుగప్రభావ ఫలితముగ చోటుచేసికొని యున్నవి. బలరాముని మాటకారితనము నీతడు జరాసంధునితో నెదుర్కొన్నపుడు చక్కగా చిత్రించియున్నాడు. అందు బలరామ పాత్రయందు ప్రతీయమానము కావలసిన పోడిమి యున్నది. జరాసంధు డిట్లనెను. "హలమున వచ్చు ధాన్యముల నప్పటి కప్పుడు దంచుకొంగ రోకలి గయికొంటి వౌరయిటు గామిని గూలికి ధాన్యమెత్తి..." (59) రాముని సమాధానమిది. "క్షితినాథత్వము లేదు

గావున పరక్షేత్రింబులన్ మున్ని లోహితథారం బదనిచ్చి రాజ మకుటీ హీరావళిన్ బీజసంతతులన్ జల్లితిఁ గీర్తిసస్యములకై..."(61). అటుపై రేవతీ వివాహ వృత్తాంతము నీతడు ప్రపంచించినాడు. రేవతి "అచ్చన గండ్లు దోయాడును డాగిలిమూతలు నాలుగుమూలలాట గుజగుజ రేకులు గుజ్జన గూండ్లును బొమ్మల పెండ్లిళ్లు నమ్మసములు...' (85) నాడుట భాగవతోక్తప్రకారమై తెలుగుకన్నెల యాట పాటల సమాజముగ చిత్రించుచున్నది. రేవతితో బలరాముని విహారములు 'కులుకున్ ముత్యపు గుచ్చుసౌధముల సింగారంపు బూదోటలన్ జలధిప్రాంతర కాంతసైకతములన్ సౌవర్ణగేహంబులన్ నెలరా కిన్నెలు దూగుటుయ్యెలల' (112) వర్ణింప బడినది. బలరాముని వ్రజ విహార ఘట్టము ఉజ్జ్వల శృంగారమున కాకరము, అందు చక్కని చమత్కృతులు పోషింప బడినవి.

'కాదమ గుబ్బలతావి కుంకుమము పూత
విభుఁడు చెంగావి రవికంచు విడువఁ బోవఁ
గోసరుఁ జూపులఁ దప్పించుకొనుచు నొక్క
కలికి వెన్నెలబైటగా గప్పుకొనియె' (128)

కాళిందీ వృత్తాంతాదులు మూలవిధేయములై యించుకంత ప్రబంధ వర్ణనోజ్జ్వల్యముకంది యున్నవి. బలరాముని తీర్థయాత్రావర్ణనము మనోహరము. అందు రాముడు దర్శించిన వేంకటేశ్వరుని వైభవ మిట్లున్నది:

"జాతికిరీటి పచ్చని కిరీటము డాలు
ఖంజరీటంబుల పుంజి తెలుప
మకరకుండల మరీచిక గండ మండలి
మండలీ నాట్య సంభ్రమముఁ జూపఁ
గరశంఖ చక్రముల్ వరచక్ర తిమిర వా
రణ చక్రి రిపుహిత ప్రౌఢి మెఱయ

రమణీయ పీతాంబర ప్రభాడంబర
మంబరంబునకు హేమంబు నెఱప
వక్షమునఁ గౌస్తుభంబు శ్రీవత్సతులసి
దామముల కాంతియును సముద్దామలీలఁ
గలిసికుంకుమ కస్తూరికల ఘటింప
మెఱసి కొలువుండు వేంకటేశ్వరునిఁ గాంచి." (152)

లీలాప్రాయముగా భీమునితో విద్యాపరీక్షార్థము జరిపిన యుద్ధమునందు భీముని ప్రాణములు కడబట్టినవి. స్వామి తన వాఖ్యామృత ధారలచేత రాముని దెలుప నాతడు మరుక్షణమే శాంతించి భీముని కౌగిలించెను. ఇట్టి పట్టులు సంకర్షణ తత్త్వ నిరూపకములు. పూర్వగ్రంథములలో బలరామునికి శృంగారనాయకునిగ నెట్టి ప్రశస్తియు లేదు. ఆ లోపము నీతడు ప్రబంధ కవి గావున తీర్చినాడు. రాముని జీవితమున ప్రథమ శృంగారానుభవ కేంద్రములుగ హరివంశాదులందు వర్ణింపబడిన వారుణి, కాంతి, అబ్జసదనలను నాయికలు తత్త్వతః సంకేతములు, రామయమంత్రి వారికి నాయికాత్వమును స్పష్టపరచి భిన్న ప్రవృత్తి కల ముగ్గురు నాయికలుగ తీర్చి దిద్దుట మహత్తరమైన శిల్పము. "బలితంపున్ వలి గుబ్బచన్ను మెరయం బైవ్రాలు, బంగారపుం దళుకుం జెక్కిలి ముద్దులెట్టుకొను సింగారపు గెమ్మోవి కెందలిరుం దేనెలు గ్రోలు సోలు మొనపంటన్నొక్కు సొక్కున్ ముదాకులమై లూనరగంట గాంతునురమెక్కున్ హాల ప్రౌఢకిక్రియన్" (40) ప్రౌఢనాయిక తీరు స్పష్టము. అట్లే కాంతిమధ్య నాయిక. వనజకేళిని ముగ్ధ. ఇట్లు సమగ్రమైన బలరాముని శృంగారేతి వృత్తమునందు రేవతి గార్హస్థ్య శృంగారమునకును, గోపికలు, వారుణ్యాదులు దక్షిణ నాయకత్వమునకును కేంద్రములు, కాళిందీ వృత్తాంతమున స్త్రీత్వ మారోపించినపు డది కేవల క్రీడావిషయము. ఆమెను మన్నించుట సంకర్షణ తత్త్వము నందలి యౌచిత్య పాలనము. ఇట్లు క్రీడాశక్తి అనురక్తి, గార్హస్థ్యము, దాక్షిణ్యము లను నాలుగంశముల సమ్మే

శనముగ బలరాముని శృంగార నాయకత్వ మాంధ్రవాఙ్మయమున నభూతో న భవిష్యతి. ఈ యన్నియు నొకయెత్తు. రామయమంత్రి రూపించిన సంకర్షణ విభూతి యొక యెత్తు :

"ఎలవంకన్ వలవంకఁ జక్రధరుఁడున్ వృష్ణ్యాదులౌ బాంధవుల్
నలువంకన్ మడివంకఁ జేతులిడి నానాభూపతుల్ గొల్వఁగాఁ
దలవంకన్ నెలవంకఁ గల్గు దొరచందానన్ బ్రభావాఢ్యుఁడై
కొలువయ్యెన్ నలువై హలాయుధుఁడుఁ దళ్కున్ గొల్వుకూటంబునన్. (66)

రుద్రతేజః ప్రతిరూపమైన సంకర్షణ వ్యూహమున కిది రమ్య చిత్రణము. ఈ విధముగ రామయమంత్రి బలరాముని శృంగార వీర శాంతరసాధినేతగ, నారాయణ ప్రతి రూపముగ సంకర్షణ వ్యూహ ప్రతీకగ చిత్రించినాడు. రామయమంత్రి శైలి, భావనాపద్ధతి పరమ సుకుమారములైనవి. దానికి తోడిందు చక్కని కథా నిర్వహణశిల్ప మలవడినది. ప్రబంధోచితములైన యుద్వేల శృంగార వర్ణనల తొలగించి చూచినచో నిది చక్కని సృష్టి. ప్రస్తుత శీర్షిక యందలి విషయమునుఁ బట్టి యనన్యము.

సాంబ విలాసము :

అటుపై సాగివచ్చిన యాంధ్ర వాఙ్మయమున నీ వృత్తాంత మెక్కువగ ప్రచలితము కాలేదనియే చెప్పవలెను. సాంబ విలాస మను నాటకము నొకదానిని శ్రీ అయినాపురపు సుందరరామయ్య రచించిరి.[129] (దీనికే ప్రతిజ్ఞాయాదవమనియు పేరు) ఇందు పురాణేతిహాసోక్త ప్రకారము లక్షణా వివాహ వృత్తాంతమున్నది. కథా కల్పనము నందు కాని, రచనా కౌశలమునందుగాని ప్రత్యేకత లేదు. బలరామ వృత్తాంత ప్రచారమునకే యిది యుదాహరణప్రాయము.

129. వి. పి. చంద్ అండ్ కో, బెజవాడ, ప్రథమ ముద్రణము. 1923.

# ప్రద్యుమ్నుడు

పిమ్మట పరిశీలింప దగినది ప్రద్యుమ్న వృత్తాంతము. ప్రసిద్ధ పురాణములందు ప్రద్యుమ్న జననము, శంబరాసుర సంహారము, వివాహాది వృత్తాంతములు నుక్తములైనవి. విశిష్టములైన గ్రంథాదులందు పరాక్రమ స్ఫోరకములైన యనేకాంశములు విస్తృతములై యున్నవి.

పరమేశ్వరుని కంటి మంటచే నశించిన మన్మథుడు స్వామి తపః ఫలితముగ ప్రద్యుమ్నుడై జన్మించిన వృత్తాంతము పురాణము లందన్నిట నొకేరీతిలో నున్నది. ప్రద్యుమ్నుని తేజము, బలము, సౌందర్యము నిరూపించుట—యీ కథనమునకు ధ్యేయమై యున్నది. భాగవతమున వాని సౌందర్య మిట్లు ప్రతిపాదింప బడినది.

" చక్కని వారల చక్కదనంబున
  నుపమింప నెవ్వాడు యోగ్యుడయ్యె
మిక్కిలి తపమున మెరయునంబికకునై
  శంకరు నెవ్వాడు సగము సేసె
బ్రహ్మమునుం బొంది పరంగు విధా తను
  వాణికై యెవ్వాడు వాడి చెఱచె
వేయుడాంగులతోడి విబుధలోకేశుని
  మూర్తికి నెవ్వాడు మూలమయ్యె
మునులు తాలిమి కెవ్వాడు ముల్లుసూపు
  మగలమగువల నెవ్వాడు మరులుకొలుపు
కుసుమ ధనువున నెవ్వాడుంగొను విజయము
  చిగురువాలున నెవ్వాండు చిక్కుపఱుచు "

( దశమోత్తర - 55-10 )

ఇందాతని మన్మథ మూర్తి వర్ణితమైనది. ప్రద్యుమ్న స్వరూపమున నున్నకృష్ణ సామ్యము వలన నంతః పురాంగన లాతనిని స్వామిగ

భ్రమించి భావించినట్లున్న వైనము ప్రద్యుమ్నును సౌందర్యమునకు, పూర్వోక్తమైన యోగమహోద్రిక్త లక్షణమునకు నిదర్శనము. రుక్మి పుత్రికతో నీతని వివాహము ప్రసిద్ధమైన వృత్తాంతమే. మొత్తము మీద నీ వీర శృంగారాంశములకే పురాణ ప్రణాళిక ననుసరించి యథావకాశమైన స్థానము లభించినది.

అటుపై పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్న మొక ప్రసిద్ధ కావ్యము. ఇందు స్వామి నిర్వహణ సామర్థ్యము, ప్రద్యుమ్నుని వీర శృంగారాంశములు ప్రధానముగ గ్రహించి యుత్తమశిల్పియైన సూరనార్యుడు మహానాటక లక్షణములతో కూడిన యద్భుత రచనా దక్షతను ప్రదర్శించి యున్నాడు. ఇందు కృష్ణప్రమేయముచే ప్రవర్తితమైన వీరనాయకత్వము, స్వాంశచే సాధింపబడిన శృంగారనాయకత్వము ప్రధాన విషయములు. కథావస్తు మూలములు, వానివికాసము మున్నగు నంశములను గూర్చిన వివేచనము ప్రస్తుతశీర్షికను బట్టి ప్రసక్తములు కావు. శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు దీనిని గూర్చిన విమర్శనము సాకల్యముగ నొనర్చియున్నారు.[130] ఇందు ప్రత్యక్ష, పరోక్ష మార్గముల నాగమోక్త ప్రసక్తిలేదు. ఆంధ్రలోకమున నుత్తమ నాటకీయ ప్రబంధముగనే దీనికి ప్రశస్తి యున్నది.

### రుక్మవతీ పరిణయము :

ఇట్టి మార్గముననే మరికొంతగ నీ ప్రద్యుమ్న కథా వృత్తాంతము వ్యాపించినది. అర్వాచీన ప్రబంధ కర్తలలో నొకడగు రేకపల్లి సోమనాథకవి రుక్మవతీ పరిణయమను ప్రబంధము రచించినాడు.[131] ఇందు ప్రద్యుమ్న జననము మొదలాతడు తన మేనమామయగు రుక్మి పుత్రికయైన రుక్మవతిని స్వయంవరము నందు రాజుల నోడించి

130. చూ: గౌతమ వ్యాసములు; తెలుగు భాషాసమితివారి విజ్ఞాన సర్వస్వము. తృతీయ సంపుటము. పుట 1216.

131. ఆంధ్రవిజ్ఞాన సమితి ప్రచురణము. విజయనగరము, 1940.

వివాహమాడుట వరకు కల కథం వృత్తాంతము నిరూపితమైనది. ప్రబంధ లక్షణ విధేయతతో పాటిందు గమనార్హమైన యంశ మొకటి యున్నది. ప్రభావతీ ప్రద్యుమ్నము మున్నగు కథలలోవలె నిందే దశలోను కథావృత్త నిర్వహణమునందు స్వామి ప్రమేయము లేదు.

ప్రద్యుమ్నోపాఖ్యానము :

ఈ వరుసలో నవీన యుగమునకు చెందిన రెండు కావ్యములు ప్రత్యేకముగ గమనార్హములగుచున్నవి. అందు మొదటిది శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి రచించిన ప్రద్యుమ్నోపాఖ్యానము.[132] ప్రద్యుమ్న వృత్తాంతము నందు సాక్షాత్కృష్ణ సంబంధ మున్నది యాతని జన్మవృత్తాంతము. ఆటుపై శంబరాసుర దమనము, వజ్రనాభ వధ లను సంశములలో స్వామి ప్రమేయము పరోక్షమార్గముననే ప్రవర్తిల్లి యున్నది. ప్రద్యుమ్న జననము, స్వామితపశ్చర్య, శివ కేశవ తత్త్వాభేదము మున్నగు సంశములతో ననుసంధింప బడియున్న కథను కావ్యకర్త గ్రహించి విపులీకరించి యున్నారు. కావ్యరచనా దృష్టిని గూర్చిన యీక్రింది వాక్యములు గమనార్హములు. "నేనీ గ్రంథము నందు లేని దేమియుం దెచ్చిపెట్టలేదుగాని నానా గ్రంథంబులం బరిశోధించి యందందుంగల సారస్యము నెల్ల గ్రహించి క్రొత్తమార్గ మవలంబించి మాత్రము గ్రంథము చేసితినని చెప్పం గలను... నాకు మొదటి నుండియుం గథా భాగము పెంచవలయుననియే గాని వర్ణనా భాగము పెంపవలయునని యిష్టము తక్కువ." (అవతారిక) శ్రీశాస్త్రిగారి కవిత్వమును గూర్చి ప్రాయికముగ నొక యభిప్రాయము వ్యాప్తిలోనున్నది. వారి సాహిత్యము పరిమాణమున ననల్పమనియు, గుణమున నల్పమనియు. అందలి సత్యాసత్యముల నిరూపించుట యీ యనుశీలనమున ముఖ్యము కాదు. కాని శ్రీ ప్రద్యుమ్నోపాఖ్యానము కవిసార్వభౌముల యుత్తమ రచనములలో నొకటి యనియు. ఇందు కథాకథనశిల్పము, రసపోషణము, పాత్ర చిత్రణము

132. ఆనంద ముద్రాక్షరశాల, చెన్నపురి. 1906.

మున్నగు మహాకావ్య లక్షణములు, అచ్చపు తెలుగు పలుకుబడిలోని యందములు, వ్యంగ్యవైభవము గలవనియు మాత్రము నిస్సందేహముగ చెప్పవచ్చును. కొన్ని కావ్య సందర్భములు పరిశీలనార్హములు. స్వామి రుక్మిణీ రమణితో విహరించునపుడేవియో మాటలను చెప్పుచుండెను. ఆమె మొగము వాంచి కాలిబొటన వ్రేల నేల రాయుచున్నది. ఈ యన్యాసక్త మనస్కతను స్వామి వ్యంగ్యముగ విమర్శించినాడు.

"మనమింటలేదు నీకు వినుమా! యబలల్ చపలాత్మలన్యులన్
గనిపెడ ద్రొక్కఁ జూచెదరుగాని సుమంతయుఁ బాపభీతిమై
జనరిది కొంతమంది సహజం బిహిహీ! మును నీవు చైద్యునం
టునుఁ దలపోయు దాడ కిపుడున్ నడనెంచితివేమొ కామినీ"
(1-18)

ఈ మాటలకామె దుఃఖించి పశ్చాత్తప్తయై పుత్రవాంఛను వ్యక్తీకరించినది. "గజ్జలునందియల్ పదయుగంబున ఘల్లనిమ్రోయ మెట్టుచుం బుజ్జవమారఁ బొత్తములఁ బూని" (1-32) చదువుకొనెడు పుత్రుని బొందవలెనని యామె కోరిక. స్వామి కడకు నారదుడు వచ్చి యీ వృత్తాంతమును విని పూర్వాపరముల ననుసంధించి బదరికా వనమున తపోవృత్తి యిందులకు పరిష్కారమార్గముగ సూచించినాడు. ఈ సందర్భముననే యాతడు కృష్ణతత్త్వమును చక్కగ గానము చేసినాడు. అందలి ప్రసక్తి వశమున రుక్మిణితో,

"అమ్మా! పుట్టియెరుంగవీ విటులు, కల్యాణంబునంబొల్తు, సౌ
ఖ్యమ్మ్ంబుట్టని చోటఁ బుట్టితివి, నీళ్ళా! పాల! తోడౌనె? రు
క్మమ్మేపాటిది? రేవెలుంగగునె లోకంబంతకడ్డంకియే
నమ్మా! మంగళదేవతా! యెరుగవావంతైన నీ మర్మమున్
(1-58)

పూర్వము ప్రవర్తిల్లిన వృత్తాంతమును బట్టియు, రుక్మిణి యవతారాంశమును బట్టియు గమనించినచో, హృదయమును కదల్చివై చు

నట్టి భావార్ద్రతను కలిగినదీ ఋషివాక్కు. స్వామి తత్త్వమును ప్రతిపాదించు నెడ నీకావ్యకర్త మహత్తరమైన సమన్వయదృష్టిని కల్గి చక్కని రచనమును ప్రదర్శించినాడు. తపశ్చర్యానంతరము శివుడు స్వామిని సాధారణముగ స్తుతించుటయే గాక తత్త్వమును వ్యాఖ్యానించినాడు. "వ్యవహారంబులు రాజకీయములు కామాదిక్రియాయోగముల్ దవులన్ వచ్చియు నిన్నులోఁ గొని కులాలఖ్యాత కీటంబుఁ బంకవిధంబటని రీతి నంటక చెడున్..." (3-94) అనియు, "మనమగు రాధవృత్తులు సమస్తము గోపికసంఘమందులో ననయము వెల్గుటన్ ప్రకృతికైన వికారమె కాని దేవ! యీ జనము దలంచుఁ జందమున సత్యముగా వ్యభిచారదోషముల్ ఘనుఁడగు నిన్నుఁ బొందన నఁగానగు దోషము విద్యపెంపునన్" (3-96) అనియు జెప్పుట గమనార్హము. రుక్మిణీ కృష్ణులు విహరించు సందర్భమున సముద్రమును కాంచినపుడు స్వామి యిట్లనెను.

"కడలి చూచినంతఁ గడు సంతసింతులోఁ
బద్మగంధి నీకుఁ బ్రాక్తనంపు
జన్మమందు దవులు సంస్కారలేశముల్
గలుగ కుండునోటు తెలిసికొనఁగ" (3-138)

లక్ష్మీదేవి క్షీరసాగర పుత్రికయను నంశము ననుసంధానము చేసి నప్పుడీ వ్యంగ్య వైభవము స్పష్టమగును. దీనినే కొనసాగించి రుక్మిణీ కృష్ణుల శృంగార క్రీడకు వర్షర్తువు నాలంబన మొనర్చి యున్నారు. ప్రద్యుమ్నరూప వైభవము నిట్లు చిత్రించినారు. "కాలాంబుదశ్యాముఁ గాంతిచ్ఛటాధాము నాజానుబాహు దివ్యాబ్రదేహు, సంపూర్ణ పూర్ణిమా చంద్రవదనుఁ గళాసదను మహోవక్షుసారసాక్షు నీలవక్రాలకు లీలావిశాలకు వనితాహృదయలోలుఁ గనకచేలు..." (6-67). ఇందు ప్రద్యుమ్నరూప మాగమోక్త మార్గమును ధ్వనించుచున్నది. ఇట్లు ప్రద్యుమ్నోపాఖ్యానము ప్రస్తుతాను శీలనమున

జనన సందర్భమునకు నితరాంశములకు ప్రముఖోదాహరణమై యొప్పుచున్న విశిష్ట కావ్యము.

ప్రద్యుమ్నోదయము :

కాఁగా ప్రద్యుమ్న వ్యూహమునందలి వివిధాంశములను సర్వాంగీణ శిల్పాకృతిగ నావిష్కరించిన యుత్తమ కావ్యము శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రచించిన ప్రద్యుమ్నోదయము. (ఈ కావ్యము స్థలాంతరమున ప్రసక్తము. అందలి యేకదేశ భాగమిీ శీర్షిక యందు చేర్చబడినది.) ప్రసక్త కథాంశము లన్నియు పూర్వ గ్రంథములందున్న మార్గమున కాక కావ్య ప్రణాళిక కను గుణమున తీర్చిదిద్దుట యిందలి ప్రత్యేకత. వెచ్చనైన బూది నొక చోట ప్రోవుచేసి తన చీర కొంగున ముడివైచుకొని, రతీదేవి మన్మ థుని యాజ్ఞచే కొండంత దుఃఖమును గుండెలో నింపుకొని కామినీ కాముకుల పని నిర్వర్తించుచు హృదయమున శివావరము నూహించు కొనుచు రుక్మిణి జన్మమును ప్రతీక్షించి తుదకామె కడకు వచ్చి "...నేను గాని పూవమ్ముల వాని భార్యను గదమ్మ నిజంబుగ నీకుఁ గోడలం గొమ్మ ననున్ దిలోచనుని కోపము వమ్ముగ దుగ్ధ యాజ్ఞగా" (4-5) అని ప్రార్థించుటయు, రుక్మిణి యామె నాదరించు టయు జరిగినది. "ఒనరన్ రుక్మిణి పోయి తెచ్చెఁదన గర్భాధానపున్ నాటి చీరెనుత్క్మాదీరిచి బూది పొట్లము నమర్పంజేసి నీవింక నోసి నెలంతా మఱి చీరపైట చెరఁగున్ జేర్పించుకోవే బుజంబున నంచా డిఃఁ గాము పెండ్లము మొగమ్ముంబోల్చెఁ గొంబావిగా" (4-13) ఇచట నుండి రుక్మిణి యాదరమున రతీదేవి మసలుట, రుక్మిణీ కృష్ణుల పరస్పరానురాగ మభివృద్ధి జెందుట జరిగినది. కడకు రుక్మిణి స్వామితో "కోడలింగోజక నీవు గైకొనవె గోపవధూ నవసుందరా! పరివ్రాజకు రాలి గోడలిని రాపికి పొందెను భస్మ పుత్త్రినిన్" (4-44) యని నివేదించుటయు, తత్ఫలితముగ స్వామి మనసున చతుర్వ్యూహ

సృష్టి భాసించుటయు చెప్పబడినది. తరువాత స్వామి కాషాయవస్త్ర ధారియై "జనితానేక మహానిశాచర వధూసంతానకతాత్రసమున్ విన మన్మస్తక యోగి భక్త పరిమద్విద్యాధరోల్లాసమున్..." (5-2) అగు కైలాసమును కాంచి శివ స్వామిని దర్శించుట మున్నగు వృత్తాంతము లున్నవి. వారిరువురి సమావేశము మహాద్భుత సృష్టి. స్వామి తన యనంత తపస్సునుండి పండ్రెండేళ్ళ తపస్సును గ్రహించి బిల్వ దళమున నుంచి పరమేశ్వరునికి సమర్పించి గరళకంఠుడు, త్రిపుర దాహకుడు, శ్మశానవాసి యైన శివస్వామిని స్తుతించినాడు. పరమేశ్వరుడు తులసీ దళమును కోసి స్వామి కిచ్చెను. ఆ తులసిదళము అనురాగముచేత గంగను చూచుటకు కృష్ణుని వెన్నంటి వచ్చిన యమునా నదీతీరమున తులసి తోటలోనిది. శివుడు మన్మథ సంబంధ మైన పూర్వ వృత్తాంతమును వ్యాఖ్యానించి స్వామితో నిట్లు చెప్పెను. 'నీ కొడుకు నేనొసంగితి నీకుంగై కొమ్ము రుక్మిణీ హృదయేశా! నా కెలనఁ గరుణఁ దప్పకునీ కొడుకుల బోలెఁగామినీ కుసుమేషూ!' (5-17) పిమ్మట శివుడు స్వామి యొనర్పనున్న వ్యూహరచనమును ప్రస్తావించి పంపించెను. తరువాతి భాగమున ప్రద్యుమ్న జననము, వానికి బాల్యముననే రతీదేవితోడి వివాహము, అనిరుద్ధ సృష్టి శీఘ్రకథా కథన మార్గమున వివృతములు. ఒకనాటిరాత్రి ప్రద్యుమ్నుడు రతీ దేవితో నిట్లు చెప్పెను. "నాథుఁడు వాసుదేవుఁడే బీజము సర్వసృష్టికిఁ గల పీటము వహ్నియు వాయువు నాకసంబాజగదీశుఁ కూర్చినవి" (5-53) "ఏను మనోభవుండ ననఁగా మనస్సును నేన మనోఽధికారిని నేనుం నీకొడు కహంకారము తదధిదేవత మేమిద్దరము సృష్టి కర్తలము. బలరామదేవుడు లయాకృతి. ఆయన శివాకృతి, శ్రీకృష్ణుండు వాసుదేవుండు. షాడ్గుణ్యమూర్తి. ఇవి నాల్గు వ్యూహములు. ఇదియొక యుపాసనా మార్గము." (5-54) ఇట్లు చతుర్వ్యూహములను వివరించి రానున్న కాలమున తపోయోగాదులు వ్యాప్తినందవనియు, సర్వజీవ కోటికి నంతర్యామియగు వాసుదేవుడు భద్రముల కల్పించుటకై

మనోధికారియైనతన్ను, నహంకార సర్వస్వము పాండిత్యరాశియునైన యనిరుద్ధుని సృజించె ననియు, కలియుగమున సాత్త్వత, భాగవత మధుర చైతన్యాది భక్తి మతములనేకములుద్భవించు ననియు, కలి యుగమున జ్ఞానము మృగ్యమనియు నుపదేశించెను. ఈ ఘట్టము వ్యూహ సిద్ధాంత పారమ్యమును కూలంకషముగ చర్చించి స్థాపించు చున్నది. కథలో శంబర వృత్తాంతాదులు లేకుండుట, భర్తృ ప్రాణాభి లాషిణియైన రతీదేవి చిత్రణము, శివకృష్ణ పారస్పర్యము నను విషయము లీకావ్యములోని వ్యూహ సిద్ధాంత ప్రతిపాదనోన్ముఖముగ సాగివచ్చినవి. అనగా తొలికాలపు పురాణకర్తల రచనములందంత ర్లీనమైయున్న వ్యూహ వృత్తాంతమును ప్రద్యుమ్నోపాఖ్యాన మాధారముగ నిరూపించుటయే యిందలి ధ్యేయమని వ్యక్తము.

విశ్వనాథవారి సర్వతోముఖకావ్యశిల్ప వైభవము ప్రసిద్ధము. ఈ కావ్యమున ప్రత్యేకించి కథానుసంధానము, తత్త్వార్థ నిరూపణము జోడు గుఱ్ఱములవలె పందెము వేసికొని పరువులెత్తినవి. చతుర్వ్యూహ ప్రతిపాదక కృష్ణకథా కావ్యములలో నిదియగ్రగణ్యము.

ప్రద్యుమ్న కథకు నాటకోచితములైన కల్పనలచేతను, నుత్తమ గద్య పద్య రచనావైశద్యముచేతను దోహదమొనర్చి యుత్తమనాటకముగ తీర్చి దిద్దిన యెన్నికి నారాయణం రామాను జాచార్యులవారికి చెందవలసి యున్నది. వీరిమాయావిత్ విజయ నాటకము రమణీయమైన [133] సంస్కృత నాటక శిల్పప్రభావమును వ్యక్తముచేయుచున్నది.

ఈ పరిశీలనము వలన ప్రద్యుమ్న వృత్తాంత మాంధ్ర వాఙ్మయమున నొక రమ్యాదర్శనముగ, శృంగార వీర రస మార్గమున కొన్నికావ్యములందు ప్రముఖమై వ్యాపించినవనియు, పురాణకర్త

133 సాహితీసమితి. రేపల్లె. 1962.

లిందలియంశములను గంభీర మార్గమున ధ్వనింప నర్వాచీను లాయా యంశముల వ్యాఖ్యానించిరనియు తేలినది.

## అనిరుద్ధుడు:

ఆంధ్రవాఙ్మయమున నత్యధిక ప్రచారమును కాంచిన వృత్తాంతములలో ననిరుద్ధ చరిత్రమొకటి. ఇందేకైక ఘట్టము షాని రుద్ధుల వివాహము. ఇందు వ్యూహలక్షణములను, శివకేశ సంబంధములను, స్వామి పరాక్రమ విజృంభణమును ప్రతిపదికలుగ నొనర్చి పురాణకవులు గంభీరార్థ ప్రతిపాదన మొనర్చుచు రచించియున్నారు. అర్వాచీన వాఙ్మయమున దీని విస్కృతికొక కారణముగ నిందలి శృంగార వైభవము నెన్నవచ్చును. రాక్షసేంద్రునితనయ, దుర్గాప్రసాదమున జన్మించినదియు నైన యుషకును, స్వామి పౌతుృడు, జగన్మోహన కరుడునైన యనిరుద్ధునికి ప్రణయమిందు ప్రసక్తమై కళ్యాణముగ పర్యవసించి, స్వామి దుష్టదమనమునకు, శివకేశవ పారస్పర్యమునకు నిరూపకమై యుండు టీ కథ యందలి యాంతర్యము. దీని ప్రశస్తికి మరియొక హేతువు జానపద, నృత్యకథా వస్తువుగ దీని వినియోగము. కూచిపూడివారు ప్రదర్శించు నృత్య నాటకమును, వివిధ జానపద గేయములును నిందుల కుదాహరణములు. హరివంశ భాగవతములం దీ వృత్తాంతము స్వల్ప భేదములతో కన్పట్టుచున్నది. మొత్తము మీద పై కారణముల వలన నిది భిన్నమార్గము లందు ముఖ్యముగ ప్రబంధ, యక్షగాన నాటక వాఙ్మయములందు అర్వాచీన విస్తృతిని కాంచినది. రంగాజమ్మ మొదలుకొని కనుపర్తి అబ్బయామాత్యుని వరకును, వేదమువారు మొదలుకొని పైడిపాటి వారు వఱకును నీ కథను భిన్నమార్గములలో దర్శించిరి. కాని పురాణ కవుల నతిశయించి వెడలిన వైనము లీ గ్రంథములలో కనవచ్చుట లేదు. ఈ యభిప్రాయము కల్గుట కాకరమైన గ్రంథము లీ క్రింద

నుల్లేఖింపబడినవి.[134] ఒక్కటొవుస మెరుపువలె నాగమోక్షమైన స్వరూప ప్రతిపాదనము గమనార్హమై యున్నది.

"నీలాభంబును వర్తులాకృతియుఁ జిహ్వోద్భూత రాజీవ ప్ర
షా లంకారము పార్శ్వచక్రము త్రిరేఖాంచన్ముఖో పాంతమై
సాలగ్రామ సమాకృతిం బొడమి పూజల్ గాంచి యుచ్చుంగ్రపా
శలుండై యనిరుద్ధమూర్తి సకలశ్రీలుం బుధశ్రేణికిన్."

(కనుపర్తి అబ్బయ-అనిరుద్ధ చరిత్రము-5-107)

అనిరుద్ధ వృత్తాంతమును స్వామినిర్వహణ దక్షతకును, ఉషా నిరుద్ధుల శృంగారమునకును, శివకేశవ సంబంధమునకును మాత్రమే ప్రతీకగ నెక్కువమంది యాంధ్రకవులు రచించిరి. అంతర్లీనమైన యాగమ తాత్త్వికాంశముల నెక్కువ మంది గమనించి ప్రవచింప లేదు. ఈ కథలో అంతర్లీనముగ నొక తాత్త్విక సమన్వయము స్ఫురించును. బాణుడు తమోమయమైన తత్త్వమునకు సహస్రభా వికసించిన (సహస్ర బాహుత్వము) గర్వాహంకారముల విలసనమునకు

---

134. 1. ఉషాపరిణయము-రంగాజమ్మ. తంజావూరు సరస్వతీ మహల్ ప్రచురణము-సంఖ్య 69.

2. అనిరుద్ధ చరిత్రము-కనుపర్తి అబ్బయామాత్యుడు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య 'అకాడమి' హైదరాబాదు—1967

3. ఉషాహరణము-శ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు. శ్రీపూర్ణ ప్రజ్ఞ గ్రంథమాల-గుంటూరు-1949.

4. ఉషానాటకము-శ్రీవేదం వెంకటరాయ శాస్త్రి. కలారత్న ముద్రాక్షరశాల ముద్రణము- ఊ. పుష్పరథసెట్టి అండ్ కంపెనీ ప్రచురణము. 1901.

5. శృంగార ఉషాకల్యాణము-నాగినేని వెంకటకవి. ప్రబోధినీ ముద్రణశాల దుగ్గిరాల 1914.

6. ఉషాపరిణయము-భోగరాజు సత్యనారాయణమూర్తి. రచన-1909. జీర్ణప్రతి గావున ముద్రణాదులు లభింపలేదు.

7. ఉషాసుందరి- పైడిపాటి సుబ్బరామశాస్త్రి. మారుతీనగర్ - విజయవాడ-4. 1970.

బ్రతీక. వాని జీవితమున కలుగనున్న కాంత్యావిష్కరణమునకు మున్నుగ పొడమిన యుషోరేఖయే ఉష. ఆ యుష యొక్క పుట్టుక ప్రకృతి విలాసములకు కేంద్రము. తత్త్వరూపమైన పార్వతీదేవి కటాక్షమున జరిగినది. ఈ శక్తియే సర్వతారిణి గావున నామె వల ననే యుషకు కల్యాణ నిర్దేశము. అనిరుద్ధడన నే శక్తిచేతను నిరుద్ధ మగుటకు వీలులేని జ్ఞాన ప్రతీక. దాని కింద్రజాల మార్గమున, క్షుద్ర శక్తులచేత తాత్కాలికముగ (మాయాశక్తి విలాసములు నేర్చిన చిత్రలేఖ యందులకు వాహిక) నాచ్ఛాదనము కల్గుట, మోహాదులను మాత్రమే ప్రతీయమాన మొనర్చు ఉషానిరుద్ధుల శృంగారము. అటుపై ననిరుద్ధుడు నాగపాశబంధితు డగుట- కుండలిని యందలి యధస్సీమలందు వైజ్ఞానికమైన తేజము చిక్కు కొనుట, సహస్రాక్షుడు, సహస్ర పాదుడునైన స్వామి యవతరణము వలన నిరుద్ధమైన ప్రజ్ఞ యనిరుద్ధమై భాసించినది. ఈ కార్య క్రమమున శివాదులను జయించుట, శీతలాది దేవతల దూర మొనర్చుట, జ్వరా దుల దమనము, తుదకు బాణాసుర దమనము మొదలగునవి యన్నియు స్వామి సన్నిధివలన భంజితములగు వివిధ సంస్కారములు తమస్సు, క్షుద్ర శక్తులు మున్నగునవి. తత్ఫలితముగ భాసించునది ఉషా కల్యాణము. ఉషస్సు కరిగిపోయి (కామమోహాది వాంఛలు నశించి) యనిరుద్ధ తేజమున (సహస్ర కిరణుని పరమోచ్చ కేంద్ర మున) లయించి కల్యాణమయ మగుటయే యీ కల్యాణగాథ. ఇట్టి సమన్వయము లెన్నియో చేయుటకు వీలుగ వైదిక సంకేత సంప్ర దాయమున ప్రాచీన మహర్షులీ కథానకముల సృజించి యున్నారు. ఇట్టి యర్థములను ముట్టిన సాహిత్యము వేదనాదము. కానిది కేవల కావ్యము, నాటకము- ఇట్లైదైన కావచ్చును.

ఇట్లు వ్యాప్తి చెందిన స్వామి కుటుంబ కథా సాహితి యందు పూర్వ మార్గ మాదర్శ వ్యక్తి, కుటుంబ ధర్మములకును, పర భాగము

వివిధాంశముల నిర్వహణ దక్షతకును, ఆగమోక్తమైన యారాధనా మార్గమునకును సాక్షాన్నిరూపకమై యొప్పినది. స్వామి కథాంశము లందలి లౌకిక పారలౌకిక కత్యల సమ్మేళనములకును, నాదర్శ ప్రాయమైన వర్తనమునకును నిది చక్కని యుదాహరణము. ఈ యంశము నందర్వాచీన యుగములందు భాసించిన యే కొలది ప్రముఖ కావ్యములో తప్ప తాత్త్విక పారమ్యము నందును, గంభీ రార్థ ప్రతిపాదక రచనా శిల్పము నందును పురాణ కవులదే పై చేయి.

# 9. తాత్త్విక విభూతి - అవతార సమాప్తి

## తాత్త్విక విభూతి - వివిధ ఘట్టములు :

స్వామి తాత్త్విక విభూతిని నిరూపించుటయే సర్వవాఙ్మయ ధ్యేయము. వాక్కునకు, మనస్సునకు నతీతమైన తాత్త్విక స్థితి పరస్థాయి నుండి వైఖరీ వాక్కువరకు వ్యాపించి యెట్టి యక్షరమైన తత్త్వమును నిర్దేశించునో యట్టితత్త్వమునకు లీలా ప్రాయమైన ప్రతీక సర్వవాఙ్మయ స్వరూపము. తద్విలసనములు ఋషులచే దర్శింపబడిన వైదిక వాఙ్మయముగ, ఋషితుల్యులైన కవులచే లౌకిక వాఙ్మయముగ, కాలకాలములందు వ్యక్తమగు చుండును. వేదోక్త దివ్యతత్త్వమును, మహర్షులైన వ్యాసాదులు లోకానుగ్రహబుద్ధిచేత పురాణేతిహాస మార్గమున ప్రవచించి యుండిరి. ఆంధ్ర వాఙ్మయమునకు సంబంధించినంతవరకు స్వామి సమగ్రతత్త్వము పురాణేతిహాసములందే ప్రముఖముగ వ్యాపించియున్నది. విశిష్టపురాణములు పోను భారత, హరివంశ, భాగవతములందిది పరివ్యాప్తమైయున్నది. ఈయనుశీలనమున పూర్వప్రకరణములందు యథావకాశముగ నందలి ప్రముఖాంశము లుక్తములైనవి. వానికేకోన్ముఖత్వము కల్పించుట, కతిపయ శేషాంశముల క్రోడీకరించుట యీ శీర్షిక ప్రథమ భాగమునను, ద్వితీయభాగమున స్వామి యవతార సమాప్తికి చెందిన సాహిత్యాను శీలనము ప్రసక్తమునది.

స్వామితత్త్వము ప్రాయికముగ నితిహాసపురాణము లందు మూడు మార్గముల వ్యక్తమగు చుండును. 1. కథాగతములైన పాత్రలస్తుత్యాదులచే గమ్యమానమైనది. 2. భిన్నసందర్భము లందు

స్వామి స్వయముగ చెప్పినది. 3. స్వామి ప్రవర్తనము వలన నిరూపితార్థముగ ప్రసక్త పాత్రలకు గమ్యమానమైనది. ఇందు స్వామి తత్త్వ సంగ్రహణమున నీ మూడంశముల గమనిక యున్నది.

అందు మున్ముగ భారతప్రోక్తములైన యంశముల నిట్లు గమనింప వచ్చును: ధర్మజు డరణ్యావాసము చేయుచున్నపుడు మార్కండేయ మహర్షి పాండవులకడకు వచ్చి తాను దర్శించిన స్వామి తత్త్వమును ప్రవచించినాడు. అందు చిరంజీవియైన మార్కండేయుడు కల్పాంత వేళ కమనీయ జలదవర్ణుండైన బాలుని గని, యాతని వదన గహ్వరమున ప్రవేశించి, బాహ్యసృష్టివలెనే భాసించుచున్న యంతర్లోక దర్శనము నందెను. శాశ్వతము, సమస్త దేవతా స్వరూపము, చరాచర వస్తు బీజము, వేదగేయము, కాల స్వరూపమునైన పరతత్త్వ మాతనికి నారాయణ స్వరూపముగ దర్శన మొసగినది. ఈ స్వరూపమే లౌకిక జగత్తున మసలుచున్న కృష్ణ స్వరూపముగ నాతడు సమన్వయించి పాండవుల కుపదేశించినాడు. పురాణేతిహాసములం దన్నిటి యందును నిట్టి సమన్వయము జీవగఱ్ఱయై భాసించు చున్నది. ఈ భాగమును మహత్తర రచనా శిల్పముతో నావిష్కరించి తాత్త్విక ప్రతిపత్తిని పదిల పరచినది ప్రబంధ పరమేశ్వరుడు.

తిక్కన రచించిన భారత భాగము నందు వివిధ సందర్భముల నిట్టి తత్త్వ నిర్దేశక ఘట్టము లున్నవి. సంజయుని రాయబారము ముగిసి యాతడు హస్తినకు వచ్చిన పిమ్మట ధృతరాష్ట్రుని గోష్ఠి యందు భిన్న పాత్రలచేత స్వామితత్త్వ ముక్తమైనది. భీష్ముడు నరనారాయణ తత్త్వమును ప్రవచించెను. ఒకప్పుడు నలువ కొలువున నిరువురు మహా తేజస్వంతులైన పురుషులు సంచరింప నందున్న బృహస్పతి వారెవ్వరని బ్రహ్మను ప్రశ్నింప, నాతడు "... తపము పెంపును బలశౌర్య దర్పములునుం గలిగి లోకహితార్థంబుగాం జలింతురే యుగంబుల నరుండు నారాయణుండు నన ప్రసిద్ధికి నెక్కిన మునులు

సుమ్ము" (ఉద్యోగ-1-147). ఈ లోకహితము దనుజనాశనము, ధర్మ పరులను గెలిపించుట యను రూపముల నుండును. ఒకే తేజ మీ రెండు తెరగుల వెలుంగును. వారే కృష్ణార్జునులని భీష్ముని సమున్వయము. వేదవ్యాసులు, ధృతరాష్ట్రుడు ధ్యానింప నాతని గోష్ఠి యందు సన్నిధి చేసిరి. వారి యాదేశమున సంజయుండు కృష్ణార్జున తత్త్వ మును వివరించెను. అందు స్వామి దుష్కరకార్యములను క్రీడా ప్రాయముగ నిర్వహించు ననియు, నాతని చక్రము పాండవుల సమర సాధనములందు సూక్ష్మరూపమున నావేశించి యుండు ననియు, ధర్మమున్న తావున స్వామి చరించుననియు, దుష్ట నిగ్రహ, శిష్టరక్షణార్థియై లీలామానవాకృతి నాతడు చరించుచు పాండవుల నిమిత్తులుగ ధర్మబాహ్యులైన కౌరవుల చంప నున్నాడనియు సంజయుడు చెప్పగా, నులికి పడిన ధృతరాష్ట్రుడు విద్యావిద్యలను గూర్చిన వృత్తాంతములను వినెను. అటుపై వ్యాసులు స్వామి తన నేకాగ్రచిత్తులై యారాధించిన వారికి ప్రసన్నుడు కావున నాతని జొచ్చి బ్రదుకుమని చెప్పి "ఎల్ల యందునుఁ దావసియించు నెల్ల యదియుఁ దనయందు వసియించు టండ్రు వాసుదేవుఁ డను పేరి కర్థంబు"... (326) అని వాసుదేవ తత్త్వ నిర్వచన మొనర్చి, యంతరంగ నిగ్రహ పూర్వకమైన యేకాత్మక సంసేవనమే స్వామి ప్రసన్నతకు మార్గమని యుపదేశించెను. తత్కాలమునకు స్వామి తత్త్వము ధృతరాష్ట్రు నాకర్షించినది. అటుపై స్వామి రాయ బారము ఘట్టమున మహర్షులు కొందరు వివిధ వృత్తాంతములను వివ రించి స్వామి తత్త్వము నుపదేశించిరి- జామదగ్న్య మహాముని దంభోద్భవ వృత్తాంతము వలన నర నారాయణ తత్త్వమును, కణ్వుడు గరుత్మంతుని వృత్తాంతము వలన స్వామి దుస్సంస్కార దమన శీలమును, నారదుడు గాలవుని కథ వలన నిర్బంధ దుర్మానాతీతమై ధర్మమార్గాచరణజ్ఞేయమైన స్వామి కటాక్షమును నిరూపించెను. పిమ్మట సౌప్తిక పర్వమున నశ్వత్థామకు ప్రత్యక్షమైన శివుడు

స్వామి యొక్క శివభక్తిని, శివకేశవ పరస్పర గౌరవమును ప్రవచించినాడు. అటుపై శాంతి పర్వమునందు భీష్మకృతమైన స్తవాదుల యందు స్వామితత్త్వము బహుముఖములుగ ప్రతిబింబించి యున్నది. స్వామి శుచి, హంసుడు, శుచిషత్తునైన పరమేష్ఠి. ముని దేవతా బృందముల కగమ్యుడైన వేదమయుడు, సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు. భక్తిగమ్యుడైన సత్యస్వరూపుడు, విశ్వాత్మకుడు. అటుపై స్వామి తత్త్వము నందలి భిన్న భిన్నాంశముల కథాగత మార్గమున భీష్ముడు నిరూపించెను. నృగమహారాజు చరిత్రము వలన స్వామి బ్రహ్మణ్యత్వము, తపోదీక్షితుడై యున్నపుడు ప్రభవించిన యగ్నిని తనలో లీనము చేసికొనుట వలన దుష్టసంహారకళ, దూర్వాసుని సేవించుటలో నెట్టి కష్టముల నైనను స్వామి భరించుట వలన బ్రాహ్మణ సేవాసక్తి గమ్యమానము లగుచున్నవి. ఇట్లే యితర సందర్భము లందు భారతమున భిన్న పాత్రలచే కృష్ణతత్త్వము ప్రవచింప బడినది.

భారతమున స్వామి స్వయముగ చెప్పిన తత్త్వము మూడు సందర్భము లందు గమ్యమాన మగుచున్నది. అందు మొదటిది పార్థున కొనర్చిన జగత్ప్రసిద్ధమైన భగవద్గీతోపదేశము. విశ్వ విఖ్యాతము, శాశ్వతము, సర్వతాత్త్విక మార్గ సమన్వయాత్మకము నైన యీ దివ్యగీతమును ప్రధానాంశములు వీడక యుదాత్త గంభీర మార్గమున తిక్కన సోమయాజి యనువదించి యున్నాడు. పార్థుని విషాదయోగము సద్గతికి, ఉదాత్తాశయమునకు వ్యతిరేకము కావున 'మనస్సు పేదరిమి, పెంటితనమును వదలవలె'నన్నది మొదటి యంశము. పూజార్హులైన వారిని జంపుటకు వెనుకాడిన యర్జునుని శిష్యునిగ స్వీకరించి అవశ్యవిధేయమైన జన్మమృత్యువుల చలించుట ప్రదీప్త వివేకము కాదనియు, దేహాత్మ లక్షణ వివేచనము పరమ జ్ఞానమునకు కారణమనియు స్వామి నిరూపించి తనపురుషోత్తమ తత్త్వమును ప్రతిపాదించెను. ఆత్మునకు బాధ్య బాధకత్వములు లేవు. అహంకారము

కృపాశోకములకు కారణము. దానిని వారించుటకు స్వకర్మావలంబ నము ప్రధానమార్గము. రాజులకు ధర్మార్థమైన సమరము అపావృత స్వర్గద్వారము. ఫలములయందు బ్రహ్మార్పణ బుద్ధితో కార్యముల నాచరింపవలెను. తత్త్వజ్ఞానము నెలకొనినపుడు కర్మశమము తనంతట తానే కల్గును. అతిగుహ్యమైన యిట్టి తత్త్వమును విన్నపిదప స్వామి పార్థునికి దివ్యరూప సందర్శనము నొసగినాడు. ఆ స్వరూపము నందలి వివిధాంశముల వ్యాఖ్యానించి చెప్పినాడు. సర్వధర్మ వికల్పముల నెడల విడిచి తననే శరణముగ నాశ్రయింప వలెననియు, తానే సకల దురిత ముల కాతని తొలగింతుననియు, నీ మార్గము సర్వసాధనలకన్న మిన్న యనియు, తన కర్మనుచేయు వాడు, తనకు భక్తుడైన వాడు తనను పొందుననియు స్వామి చెప్పి పార్థుని యజ్ఞాన సమ్మోహములను బాపి యాతనిని బోధ సన్నాహ నిరామయ స్థిరమనఃస్థితి నందునట్లు చేసి యున్నాడు. అటుపై భీష్మ మరణానంతరము స్వామి యాందోళితు డైన ధర్మజునికి వివిధ ధర్మముల నుపదేశించెను. అందు మానవుని వక్ర సంకల్పములు మృత్యుపదము లనియు, ఆర్జవాన్వితములు బ్రహ్మ పదమనియు, నిర్మలభావ మూరమైన కర్మానుష్ఠానము మనీషులకు లక్షణము కాదనియు, నంతశ్శత్రు దమనముచే పరమ శాంతిని సాధింప వలెననియు నుపదేశించెను. కురుక్షేత్ర సంగ్రామము మిథ్యాయుద్ధమనియు, సత్యయుద్ధ మనగా నంతరాత్మను మాత్రమే తోడుగా గలిగి మనంబనెడు శత్రువును జయించి శాంతినందుట యనియు, రెండక్షరములు కల 'మమ' యను పదమున మృత్యువు, మూడక్షరములు కల 'నమమ' యను పదమున బ్రహ్మమున్న దనియు స్వామి బోధించెను. అంతశ్శత్రు దమన మొనర్చి జీవించుటయే మోక్ష మని చెప్పెను. కామగీతల నుపదేశించి తొల్లి కాముడు శమదమ సాధనపరులైన మహర్షులను సైతము తాను తపఃఫల రూపమున నున్న కామముచేత జయింతునని చెప్పెననియు, కావున నిష్కామ మార్గమున ఫలాభిసంధి లేక కార్యాచరణ మొనర్చి సనాతనుడైన

తన్నాశ్రయించుటయే ముక్తిమార్గ మనియు నిరూపించెను. పిమ్మట నర్జునునికి తత్త్వజ్ఞానమును స్థిరీకరణ మొనర్చుటకు సర్వవేదాంత తత్త్వసారము నుపదేశించెను. అందు ధర్మ సాధనముగ శరీర ప్రతిపత్తి, మోక్షస్థితికి కారణములైన వివిధ కారణములు, అందలి సూక్ష్మ ధర్మములు, అంతర్యాగ బహిర్యాగ పద్ధతులు, జీవాత్మ పరమాత్మ తత్త్వము మున్నగునెన్నియో యంశము లున్నవి. భారతము నందున్న సర్వతత్త్వముల నవగత మొనర్చుకొనుటకిది యుపకారకమైన తత్త్వ సూత్ర బృంహణమని చెప్పవచ్చును.

భిన్న సందర్భములందు స్వామి సన్నిధి విశేషము వలనగాని, ప్రవర్తనమువలన గాని తత్త్వపారమ్య మితరులకు గమ్యమానమైన పద్ధతికి ధర్మజుడు దర్శించిన స్వామి యోగవైభవము నుదాహరణముగ గొనవచ్చును. ఈ వృత్తాంతము శాంతి పర్వ ద్వితీయాధ్యాయమున నున్నది. ధర్మరాజు రాజ్యము చేయుచున్నప్పుడొకనాటి ప్రాతఃకాలమున కృష్ణమందిరమునకు పోయి యాతని దర్శించెను. అపుడు స్వామి ధవ్యధ్యాన నిరతుడై యుండెను. ఆ స్థితిని ధర్మజుడిట్లు వ్యాఖ్యానించెను. "పంచాత్మకంబైన పవనంబు నిగృహీతమైనది భవదింద్రియములు మనమునందాఁగఁ బడ్డవి యవియును, నదియును, బుద్ధియందొదిఁగించి శుద్ధమైన నాలవ తెరువునలోలతా రహితముల్ గాఁగనిన్నియును సంకలితములుగ నంచిత క్షేత్రజ్ఞునందుఁ గూర్చిన వాఁడవీ పరమ ధ్యాన మేమికతమున నొలసెనొకో! ..." (2-8). స్వామి యొక్క ధ్యానస్వరూప ప్రతిపాదనమున నాంధ్రవాఙ్మయము నందే యెన్నదగిన పద్యమిది. భీష్ముని యెడ కారుణ్య ప్రదర్శనమునకు ప్రాతిపదికగ స్వామి యిట్టి యౌగిక స్థితినంది ధర్మజునికి తత్సన్నిధి ప్రసాదించినాడు. ఇట్లు భారతాంతర్గత తాత్త్విక విభూతి సంగృహీతము.

ఇటుపై పౌరాణిక వాఙ్మయము నందలి భిన్నసందర్భముల పూర్వోక్త మార్గముననే సంగ్రహింపదగును. ఇందు భాగవత మెక్కువ ప్రాధాన్యము వహించును. ఈ యనుశీలనమున యథోచిత

ముగ హరివంశ సందర్భములు కూడ జేర్పబడినవి. పౌరాణికానుశీలనమునకు ప్రాతిపదికగ భాగవత పరిచయ భాగము నెన్నవచ్చును. అది యిట్లున్నది : కార్యవర్గమును కారణ సంఘమును నధికరించి చరించు నాత్మతత్త్వమే యధ్యాత్మము. దానిని తెలియజేయు దీపము పౌరాణిక విజ్ఞానము. నిర్హేతుకమైన హరిభక్తి యేరూపమున కల్గునో యదియే పురుషధర్మము. వాసుదేవుని యందు ప్రయోగింప బడిన భక్తియోగము వైరాగ్య విజ్ఞానములను పుట్టించును. తత్త్వజిజ్ఞాసచే గమ్యమానమైన జ్ఞానము పరమము. ఔపనిషదులు బ్రహ్మమనియు, సాత్త్వతులు భగవంతుడనియు, హైరణ్యగర్భులు పరమాత్ముడనియు, భిన్నమార్గముల దీనిని ప్రవచింతురు. వేదాంతి శ్రవణము వలన గ్రహింప బడిన జ్ఞాన వైరాగ్యాత్మక భక్తివలన పెద్దలు క్షేత్రజ్ఞుడైన యాత్మయందు పరమాత్మను చూతురు. ధర్మాచరణమునకు భక్తి ఫలితము. మాధవుని సంతసము సిద్ధి. కృష్ణకథా శ్రవణ కీర్తన పరులైన వారి హృదయముల స్వామి నిలిచియుండి శుభము లొడగూర్చును — ఇది భాగవతార్థము.

భిన్న సందర్భములందు భిన్న పాత్రలొనర్చిన స్తుతులను గమనించుటలో రుక్మిణీకల్యాణ సందర్భమున నారదోక్త కృష్ణస్తవము హరివంశ గతమైనవి గమనార్హము. ఆతడు స్వామి పాదములను నిత్య సంసేవన మొనర్చు వారికి సర్వక్షేమములు కలుగుననియు, స్వామి నిత్యశుద్ధ బుద్ధానంద నిర్మల స్వభావుడనియు, ప్రతిపాదించి స్వామి కథా వృత్తాంతముల గానము చేసెను. యదుసభ యందుద్గీతార్థ సరస్వతిని నృత్యము చేయించినాడు. అట్లే పారిజాతాపహరణానంతరము యదుసభకు వచ్చి యదుసమాజ పూజితుడై, యాదిపురుషుడైన స్వామి కథల జరిగిన వానిని, జరుగనున్న వానిని వ్యాఖ్యానించి యిట్లు ప్రతిపాదించినాడు.

"అనుపముఁడ ప్రతర్క్యుఁడజరామరుఁడాద్యుఁడనంతుఁడచ్యుతుం
డనఘుఁడపేతదోషుఁడనపాస్తగుణుండతి వాఙ్మనః ప్రవ
ర్తనుఁడు నితాంత భక్తి కలితస్థితిఁ దన్ భజియించు పుణ్యుల
న్ననుచు సమస్త సంపద సమానులుగాఁ బరికించు సత్కృపన్."
( హరివంశోత్తర-4-265 )

స్వామి శాశ్వతతత్త్వము, భక్తి గమ్యత గమనార్హములు. బాణాసుర దమనానంతరము వరుణుడు స్వామిని శరణు జొచ్చి స్వామి త్రిగుణాత్మక తత్త్వమును, ప్రకృతి పురుష సమ్మేళనమును, సర్వభూతాధిపత్యమును స్తుతించి ప్రతిపాదించినాడు. నాచనసోముని ఉత్తర హరివంశమున నరకపరిభూతులైన ఋషి బృందము స్వామి విభూతిని చమత్కార మార్గమున నిట్లు ప్రతిపాదించినారు.

"పన్నగంబుల రాజుఁ బగవాఁడుఁ గూడి నీ
శయనంబు బయనంబు సంతరింప
దుగ్ధవారాశి కూఁతురు నాలుఁ గూడి నీ
శరణంబు జరణంబు సవదరింపఁ
దామర పగవాఁడు దయితుండుఁ గూడి నీ
బడిచూపుఁ గుడిచూపుఁ బరిఢవింపఁ
జందురు చెలికాఁడు సయిదోడు గూడి నీ
యుల్లంబు మొల్లంబు నుపచరింపఁ
గంపమాన మనోధ్యానగతులు మాన
కేకతంబున్న మునులకు నేకతంబు
లేక పొడ గానవచ్చు నీలీలగాన
నన్యులేనాఁట ధన్యులే యంబుజాక్ష!"(119-ప్రథమ)

అట్లే స్వామి తపస్సు ముగిసిన పిదప మహర్షులాతనిని శివకేశవ కల్ప ప్రతీకగను, హంసడిభక వధానంతరము విశ్వస్వరూపునిగను స్తుతించినారు. భాగవతమున బ్రహ్మ స్వామి తత్త్వమును సాక్షాత్తుగ గమనించి మిక్కిలి విపుల మార్గమున ప్రతిపాదించినాడు. స్వామి తత్త్వము

విక్రియా శూన్యము, విషయత్వదూరము. స్వామి యోగిరాజ వాగ్గేయుడు. సృష్టిలోని సమస్తాండములును నసంఖ్యాక రోమ వివరముల యందు కలిగి పరివర్తించువాడు. జగములయందు తాను, తనయందు జగములు నను వాసుదేవతత్త్వ ప్రతీక. విశ్వమంతయు నాతని మాయ. అట్లే కేశి వధానంతరము నారదుడు స్వామి సాక్షీభూత స్థితిని, నిఖిల భూతాంతర్యామిత్వమును ప్రశంసించి గతాగత వృత్తాంతముల వ్యాఖ్యానించినాడు. కుంతీదేవి స్వామి తత్త్వమును కూలంకషముగ గమనించిన మహా భక్తురాలు. ఆమె దృష్టిలో స్వామి ప్రకృతికి పరుడై, యవ్యయుడై సమస్తభూత బహిరంతరము లందు భాసించువాడు. జవనిక వెనుక నాట్యము చేయు మహానటుని వలె మాయా పరిచ్ఛన్నుడై పరమహంసలకు సైత మతీతమైన దివ్య తత్త్వము కలవాడు, సకల భూత నిగ్రహానుగ్రహ సమర్థుడు. ఇట్లు ప్రతిపాదించి భక్తి తన్మయత్వమున నామె స్వామిని స్తుతించినది.

"శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగార రత్నాకరా!
లోకద్రోహి నరేంద్రవంశ దహనా! లోకేశ్వరా! దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా! నిర్వాణ సంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ"
(1-8-199)

ఇందు కృష్ణతత్త్వము నందలి సర్వాంశములు సంక్షిప్తముగ నున్నవి. నరకాసురుని వధానంతరము భూదేవి స్వామిని వాసుదేవతత్త్వ మూర్తిగను, పరమాత్మునిగను, త్రిగుణ స్వరూపునిగను, భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము- మున్నగు భూత తన్మాత్రలకు, యింద్రియములకు, దేవతలకు, మనస్సునకు, మహత్తత్త్వమునకు- వీనిచే గమ్యమానమైన చరాచర విశ్వమునకు, సృష్టి స్థానముగ నిర్దేశించినది. భాగవతమునందే వాసుదేవకృత యజ్ఞసందర్భమున సమస్తమునులు స్వామిని సాంఖ్య మార్గమున పూర్వ రీతినే స్తుతించి స్వామి లీలావతార మాహాత్మ్యమును, వేదగమ్య స్థితిని,

బ్రహ్మణ్యత్వమును, స్తుతించిరి. అట్లే స్వామి మృతులైన దేవకీ పుత్త్రులను తెచ్చుటకు సుతలమున కేగినపుడు ఇంద్రసేనుడు స్వామి సముగ్ర సాంఖ్యరూపమును చెప్పుటయేగాక, వైర, కామ, దాస్య, సఖ్యాది భక్తి గమ్య స్థితిని నిరూపించినాడు. అవతార సమాప్తికి మున్ను సర్వదేవతలు వచ్చి స్వామి లోకేశత్వమును, సర్వేశ్వరత్వమును స్తుతించినారు. భాగవతమున భిన్న భిన్న సందర్భములందుద్వేలములై కూలంకషములుగ నున్న స్తుత్యాత్మక తత్త్వ నిరూపణ సందర్భములకిది దిఙ్మాత్ర నిర్దేశము.

హరివంశమున స్వామి విప్రకుమారులకు పునర్జీవితమును ప్రసాదించిన పిమ్మట పార్థునికొక తత్త్వోపదేశమును కావించినాడు. అందలి ప్రధానాంశము లిట్లున్నవి: చరాచర విశ్వమునకు సృష్టి స్థితిలయ కారకుడైన యప్రమేయ విభు డొకడు కలడు. అతడు ప్రకృతి పురుష నామములతో సర్వాశ్రయ కేంద్రమై యుండును. అతడే సాంఖ్యులకు, యోగులకు, నేకగమ్యము. ఆపరమేశ్వరుడు నన్ను దర్శింప దలచి నా బ్రహ్మణ్యత్వము నాధారముగ నీ వృత్తాంతమును ప్రవర్తిల్ల జేసెను. నేను మార్గమున నడ్డుపడిన సమస్త శక్తులను దమించి, యా పరబ్రహ్మమును దర్శించి నా దర్శనమున తదీయ కృతార్థత నాపాదించి తిరిగి వచ్చినది. పరమేశ్వరుడు, పరబ్రహ్మము, పరమాత్మ యను పేర్లను కల్గిన యాదిపురుషుడను నేనే. సముద్రములు, పర్వతములు, దిక్కులు, కాలము- నన్నియు నేనే. సృష్టి స్థితిలయ కారకుడను నేనే. చతుర్వేదములు, యజ్ఞములు, ప్రణవాది మంత్రములు, యమనియమములు, మేదినీ మారుతాంబు వహ్ని వియదిందు భాను జీవములు, నా స్థూలమూర్తులు. అన్నిట నా తేజమే పరాయణము. నా విజ్ఞానము వేదశాస్త్రమథనము వలన సిద్ధించెడు నవనీతము. బ్రహ్మము, బాహ్మణులు, అనుపమ సత్యము, నిత్య తపము, లోక స్థితికి ననంత ధర్మ హేతువులుగ నేను కల్పించితిని.

భాగవతమున స్వామి యుపదేశించిన శ్రుతిగీతలును, నవతార సమాప్తికి మున్ను గ నుద్ధవునికి ప్రసాదించిన విజ్ఞానమును సమస్త వేదాంత సారభూతములుగ చెప్పదగిన యంశములు.

వివిధ సందర్భములందు సన్నిధి విశేషమున స్వామి ప్రసాదించిన తత్త్వజ్ఞానమునకు పురాణములందు చక్కని యుదాహరణము లున్నవి. హరి వంశము నందలి వాసుదేవ భరద్వాజ మునుల వృత్తాంతము గమనింప దగినది. వారు తీర్థార్థులై వచ్చి స్వామి నెరిగి కొని, యాతనిని గోపాకృతిలో నున్న యచ్యుత స్వరూపముగ స్తుతించిరి. వారి చదువులు, వినుకులు, వివిధ విధులు కర్తృత్వ భర్తృత్వరూపుడైన స్వామి దర్శనమున ఫలించినవని చెప్పిరి. సూర్య చంద్రులు నేత్రములై, సరస్వతి రసనయై, పర్వతములు రదన పంక్తియై, సత్యలోకము శీర్షముగ, లక్ష్మీదేవి వక్షముగ, గణపతి స్కందులు వామ దక్షిణ భుజములుగ, కరశాఖ లబ్ధులుగ, కుక్షి యంబరముగ, దిక్కులు వివరములుగ, కేశాళి దేవతలుగ, పాతాళ లోక మంఘ్రితలముగ- భాసించు స్వామి విశ్వమూర్తిని స్తుతించి తరించిరి. హరివంశమునందే నరకుని యధర్మ ప్రవర్తనము వలన పరి భూతులైన వసిష్ఠాది మునులు స్వామిని దర్శింపవచ్చి యాతని సన్నిధి వలన తమకు పూర్వమున్న యజ్ఞ, జప, తపాద్యనుష్ఠానముల కతీత మైన భక్తి గమ్య సన్నిధి మహాత్త్యము ననుభవించి యానంద శీతల చేతస్కులైరి. దుర్యోధనాదులైన సమస్త రాజన్యలోకము యాదవసభకు వచ్చి యందు నారదునిచే స్వామి యజ్ఞ స్వరూపమును సృష్టియందలి సమస్త విశేషములకెల్ల నుత్తరస్థితిఁ గల యజ్ఞ దక్షిణా స్వరూపముగ వ్యాఖ్యానింపఁబడుట నాలకించిరి. ఈ యజ్ఞము రణ యజ్ఞ మనియు, ధర్మ సంస్థాపనము దక్షిణ మనియు నందు చెప్పఁ బడింది కవగతము కాలేదు.

భాగవతమున నుద్ధవునిచే గోపికలకంపిన సందేశమును, గ్రహణ స్నానసమయమున స్వామి వివిధ వ్యక్తులకు నొసంగిన

యనుభూతిని స్వామి శాశ్వత సన్నిధి యందలి మాధుర్య నిరూపణ ములకుఁ చిహ్నములుగ గమనింప దగినవి. భాగవత గ్రంథావ తారిక యందు వ్యాసనారదుల వృత్తాంతము పరమమనోహరమైనది. ఇందు వ్యాసుడు జటిలమైన విజ్ఞానమునకు ప్రతీక, నారదుడు పరతత్త్వమున సులభముగ కరగిపోవు భక్తి మాధుర్యమునకు బ్రతీక. నారదుని యుపదేశము వలన వ్యాసులు భాగవతము రచించిరనగా భక్తి గమ్యమైన స్వామితత్త్వమును లోకుల హృదయముల స్థిరీకరించిరని యర్థము. ఇట్టి ప్రబోధమునకు నారదుని యర్హతయేమన నాతడు జన్మ చక్రమునఁ గ్రమ వికసనమునంది స్వామిని ధ్యానార్చ నాదులచే బ్రసన్నునొనర్చు కొనవలెనను బ్రయత్న పూర్వక స్థితి నుండి సర్వాంతర్యామియగు స్వామి నెల్లెడలఁ గాంచగల్గి విశ్వంబు విష్ణుండు- అను ప్రవచనముఁ జేయగల స్థితికి వచ్చి యుండుటయే. అట్టి మహర్షి యాదేశమున నవతరించిన భాగవత మును విన్న పరీక్షిత్తు కూడ నిందుల కర్హుడే. ఏలన- పుట్టినప్పటి నుండి దన్ను రక్షించిన స్వామి యెవ్వరాయని పరీక్షించు స్థితి యందున్న పరీక్షిత్తు క్రమముగ నందటి యందును స్వామిని జూడగల స్థితికి భాగవత శ్రవణానంతరము చేరుకొనినాడు. ఇది సర్వ మాన వులు నాశింప దగిన స్థితిగా భాగవతము ప్రతిపాదించుట కీయవతరణ వ్యూహము నిదర్శనము. అట్టి తాత్త్విక విభూతియే స్వామిలక్షణ ముగ భక్తి సాహిత్యమునకు శిఖరాగ్ర ప్రాయమైన భాగవతము నిరూపించి యున్నది. ఇట్లు పురాణ ప్రోక్తమైన కృష్ణతత్త్వవిభూతి గమనార్హ మగుచున్నది.

స్వామి సమగ్ర విభూతిని గుర్తించుట కిందలి మరి యొక యంశము నెఱుగవలసి యున్నది. అది కేవలము తాత్త్వికము కాదు. అట్లని కాకపోదు. అది పురాణేతిహాసము లందు భిన్న కథ్యాలందు న్నది. అది స్వామి సౌందర్య విభూతి, కాల స్వరూప విభూతి, వివిధ వస్త్వాత్మకములైన యైశ్వర్యముల సంగ్రహించుట, మున్నగు ననేక

రూపములందుఁ బ్రపంచితమై యున్నది. లౌకిక పారలౌకిక కత్యములందు వ్యక్తమగు నీ రెండు విభూతుల సమగ్ర దర్శనమే స్వామి విభూతి సర్వస్వమునకు ఉద్దేశ ప్రాయమైన చిత్రణము. భగవద్గీత యందు స్వామి 'యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా, తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్' (10-41) యని చెప్పిన వాక్యములనుఁ బట్టి యీ యన్వయము సాధ్యము.

బాల్యము నుండియు దన విభూతిని సర్వకృత్యముల యందును విస్తరించుటకై స్వామి యొనర్చిన కృత్యము లీయంశమున కుపస్కారకములుగ మున్నుగ బరిశీలింప దగియున్నవి. అందు బాల్యకృత్యములలో నింద్రదమన ఫలితమైన గోపతిత్వమును స్వామి యార్జించుకొనుట గమనార్హమైనది. ఇంద్రుని యహంకరణమును బోనాడుటతో బాటు స్వామి గోలోకమున కిందుడ్రుడయ్యెను. అనంతరకథ యందు స్వామి పారిజాతమును దెచ్చుటయు నిట్టి యింద్రదమన పూర్వకమైన విభూతివిస్తరణమునకే చిహ్నముగ గమనింప దగియున్నది. ఇట్లే స్వామి గురుపుత్త్రుని ప్రాణముల నార్జించు ఘట్టమున జలనిధిని, యముని దనకు వశవర్తులుగ నొనర్చుకొనెను. ఇట్లాతడు పరాక్రమించి పొందదలచి పొందియుండని విభూతి సర్వపురాణములందు ఒక్కటియే కనుపించుచున్నది. అది వరుణుని నుండి బాణాసురుని గోవుల నందుకొనుట. స్వామి కా ఘట్టమున బ్రసన్నుడైన వరుణుడు ధర్మాధర్మ పూర్వకమైన చర్చచే మెప్పించి తన వాదమును స్వామి యంగీకరించునట్లు చేసికొనినాఁడు. ఆ పశుగణమును బాణుడు తన కప్పగించుచు బ్రాణత్యాగ పర్యంతము వానిని రక్షించునట్లు వాగ్దానముఁ గొనియుండెను. దానిని రక్షించుట తన కర్తవ్యమని వరుణుడు నివేదించుకొన స్వామి ప్రీతుడై యా ప్రయత్నమును విరమించెను. ద్వారవతి నిర్మాణ సందర్భము నందును, నరకాసుర వధానంతరము గ్రహించిన వివిధవస్తు సంగ్రహణము నందును స్వామి యట్టి విభూతి విస్తరణ ప్రణాళికనే యములు పరచినాడు.

ద్వారక యందు శంఖనిధి, సుధర్మ చేకూరుట, నరకుడు కొల్లఁగొట్టిన సార్వలౌకిక విభూతి స్వామినిఁ జెందుట- యందుల కుదాహరణ ప్రాయములు.

కృష్ణకథా విస్తృతిలో పౌరాణిక కవులొక రహస్యమును నిక్షిప్తమొనర్చియున్నారు. అది కాలస్వరూపముగ స్వామి తత్త్వమును వారు స్థాపించుట. భాగవత హరివంశములందీ సమన్వయము చక్కఁగ నిర్వహింప బడినది. వర్ణింపనున్న కథాఘట్టమునకు బ్రాతిపదికగ ఋతువర్ణనముల జేర్చియుండుట సర్వ సమన్వయాత్మకమైన స్వామి యొక్క విభూతి కొక యంచు. స్వామి శాశ్వత కాల స్వరూపము. ప్రస్తుతము దేశకాలాదులచే బరిచ్ఛిన్నమైన లక్షణమున బద్ధుడై వర్తించుచున్నాడు. ఆతని లీలా విశేషముల కనుగుణముగ శాశ్వత కాల స్వరూపము నందలి యేకదేశమైన యీకాలము, దేనిని మనము భూతభవిష్యద్వర్తమానములచే గణించుకొనుచు, వర్షర్తుమాస వారదినాదులచే గమ్యమాన మొనర్చుకొను చున్నామో యది, స్వామి విహారముల కనుగుణముగ విలసనములతో వర్తించి స్వామి స్వరూపమునకు వ్యాఖ్యాన ప్రాయము కావలెను. ఆ యర్థమును ఋషితుల్యులైన పౌరాణిక కవులు గమనించి భద్రపరచి యున్నారు. కాలస్వరూప విభూతి కేంద్రముగ స్వామిని వర్ణించు పద్ధతి కెక్కినవారాద్యుఁడు. (నీలా వివాహ సందర్భమున నాశిల్పము వ్యక్తమైనది.) అట్టి మార్గము నే పోతన మరింత భావోజ్జ్వల్యముతో నిరూపించినాడు.

"విశ్వమోహనమైన వేణునినాదంబు
 సరస గంభీరగర్జనముగాఁగ
మహనీయనిర్మల మందహాస ద్యుతి
 లలిత సౌదామి నీలతికగాఁగఁ
దలచుట్టుఁ బాగునఁ దనరు పింఛపు
 దండశైల భేదను శరాస నముగాఁగ

జూడనే తెంచు గోపాల జనమునిందరి
చాతకంబుల దురవస్థఁ జక్కఁ జేసి
కృష్ణ మేఘంబు బహుతర కీర్తినొప్పె
మలవి బృందావనాకాశ వీధియందు"

(దశమ పూర్వ 20-759)

ఇందు స్వామి స్వరూపమునకు వర్షర్తువుతోడి సామ్యముతోఁ బాటు పాంథజన సంతృప్తి యీ కాలస్వరూప ధ్యేయముగ నుక్తమైనది. ఇట్టిది స్వామి కాలస్వరూప విభూతి.

అన్నిటికన్న మిన్నమైనది స్వామి యొక్క సౌందర్య విభూతి. అది చూచువారికి మత్తెక్కించు సౌందర్యము కాదు. అంతరాంతరముల లోనికి మంద్రి మార్గమునఁ జొచ్చుకొని పోయి సన్నిధి ఫలితముగ మధుర భావ తరంగములను హృదయసాగరము నుండి పొంగెత్తు నట్లు చేయగల మహత్తర విషయము. దీనిని మహాకవులెవ్వరును విస్మరింపక తమ కావ్యములయందు బదిలపరచి కొనిరి. ఆ విభూతి బాహిరిల్లినది, స్వామి లీలామానుష మధురరూపమున ప్రతిబింబించి నది జీవాత్మ స్వరూపలైన యసంఖ్యాకస్త్రీ మూర్తుల హృదయ దర్ప ణమున. స్వామి భిన్న సందర్భములందు జరిపిన ప్రయాణముల సంద ర్భమున నేమి, యితర సందర్భముల నేమి యీ విభూతిని ప్రతిపాదించు నట్టి వర్ణనలను మహాకవు లొనర్చి యున్నారు. స్వామి మధుర కేగిన పుడు నగరకాంతల భావములను పోతన వర్ణించిన పద్ధతి యిందుల కాహారణముగ గ్రహింపవచ్చును.

చెలియా! గోపికలీ కుమారు తిలకున్ జంతింపుచున్ బాడుచున్
గలయం బల్కుచు నంటుచున్ నగుచు నాకర్షింపుచున్ హస్తగా
మలకక్రీడకుఁ దెచ్చి నిచ్చలును సమ్మానంబులం బొందఁగాఁ
దొలి జన్మంబుల నేమి నోఁచిరొ గదే మర్గప్రదేశంబులన్"

(దశమ పూర్వ 41-1249)

స్వామి విద్యాభ్యాసమును ముగించి మధురకు వచ్చినపుడు స్వామి రూపవిభూతిలోని మాధుర్యాంశమును ఎర్రన చిత్రించినాడు.

"వేత్రలు గరఁ గంగ వేడుకఁ బిల్లఁ గోల
 నయఁ జేర్చినదె యీ యనుఁగుమోవి!
మానంబు వీటిఁ బో మసఁగి వేత్రలఁ
 జిక్కు వఱచిన యణయె యీ కఱటిచూపు!
నింపారు వేత్రల యీఁ తకు మిక్కిలి
 లోతైన యదియె యీ లేఁత నవ్వు!
వేల సంఖ్యలు గల వేత్రల చనుదోయి
 బిగియనొత్తినదె యీ పేరురంబు!
పూని యితని దేవర యనికేనిఁ గాక!
 సోలిచక్కని వాఁడని చూచికేనిఁ
గడఁగి తివుట లుల్లంబునఁ గ్రిందుకొనఁగ
 నట్టి యీ లూవు టాండ్రమనెగ్గు పడరె?
(పూర్వ 9-224)

ఇట్టి మహాత్తర సౌందర్య విభవమును భగవత్కేంద్రముగ నారాధించుట శ్రేయమనియు, కేవల సౌందర్య దృష్టితో గాంచ రాదనియు నిందు సూచింప బడుటవలన స్వామి సౌందర్య విభూతి యారాధనా కేంద్రమేగాని లౌకికావేశ కేంద్రముకాదని ఎర్రన ధ్వనించి స్వామి విభూతిపై చక్కని వ్యాఖ్యాన మొనర్చి నాఁడు.

స్వామి కార్యక్రమములలో వైభవోపేతము కాని యంశమే లేదు. ఆయన ప్రయాణములు, వానియందలి యౌచిత్యము స్థలాంతర మందు సమీక్షింప బడినవి. కేవల విభూతి సూచకమైన ప్రయాణము భాగవతమునందు వర్ణింపబడినది. కురుక్షేత్ర సంగ్రామాదులు ముగిసిన వెనుక స్వామి ద్వారకకు వెడలినప్పటి వర్ణనమది. అదియే స్వామి హస్తినపురినుండి ద్వారకకొనర్చిన కట్టకడపటి ప్రయాణము. అందంతర్లీనముగ నొక గంభీర భావచ్ఛాయను పోతన వ్యాపింప జేసి

నాడు. స్వామి బయలు దేరి వెడలుట యందేదియో యాందోళన కరమైన భావరేఖ యెల్లర మనముల వ్యాపించినది. ఆయనను సాగ నంపుటకే వారిచ్చగింపరైరి. ఎట్లో బయలుదేరినాడు స్వామి.

'కనక సౌధములపైఁ గౌరవకాంతలు
  గుసుమవర్షంబులు గోరికురియ
మౌక్తిక దామ సమంచిత ధవళాత
  పత్రంబు విజయుండు పట్టుచుండ
నుద్ధవ సాత్యకు లుత్సాహవంతులై
  రత్నభూషిత చామరములువీవ
గగనాంతరాళంబుఁగప్పి కాహళ భేరి
  పణవశంఖాది శబ్దములు మొరయ
సకల విప్రజనులు సగుణ నిర్గుణరూప
  భద్ర భావణములు పలుకుచుండ
భువనమోహనుండు పుండరీకాక్షుండు
  పుణ్యరాశి హస్తిపురము వెడలె'-(1-10-233 ప్రథమ).

నగరకాంతలీఘట్టమును దాత్త్వికముగనే వ్యాఖ్యానించినారు. ద్వారక యందును మహోత్తమ వైభవములో స్వాగత సన్నాహములు జరిగినవి. ఇట్లు వివరింపబడిన స్వామి విభూతి యందలి సర్వాంశములు తాత్త్వికతత్త్వను బ్రత్యక్ష పరోక్ష మార్గములలో స్పృశించుట గమనార్హమైనది.

ఏవం విధమైన యీ యనన్య విభూతి సర్వమును గంభీర భావ విలసితమై యొక కేంద్రము దెసకున్ముఖమై ప్రస్థానము చేయుట గమనార్హమైన విషయము. ఆ కేంద్రమే యవతార సమాప్తి.

## అవతార సమాప్తి - అంతస్తత్త్వము :

అవతార సమాప్తిఘట్టము సాధారణ దృష్టితో బరిశీలించి నపుడు పరమ విషాద భరితమై గోచరించును. ఈ విషాదమునకు

కారణములైన యంశము లనేకములున్నవి. బాల్యము నుండి యనన్య సామాన్యమైన మహత్తర విభూతికిని, మాధుర్యలీలా తత్త్వమునకు కేంద్రమై, ధర్మ సంస్థాపనాద్యుత్తమ కర్మ కలాపములకు కారణమై, విశ్వ శ్రేయము నాధారముగ ప్రవర్తించిన యొక మహోదాత్త నాయకుని నిర్యాణమిందు వర్ణితమై యుండుట వలన విషాదము తప్పని సరియైన భాగముగ నీ ఘట్టమున బ్రతీయమాన మగును. సువిశాలమైన తన జీవితమున నీ మహనీయున కెన్ని బంధములు, ననుబంధము లున్నవో, యెందరి హృదయము లందీతడు వాత్సల్య, ప్రేమాది భావముల గీల్కొల్పెనో, యెందరి మనముల యందు బహువిధ భావములకు కేంద్రమై యొప్పెనో చెప్ప నలవికాదు. ఆ యీ సర్వభావ బంధములకు కేంద్రమై యొక యుగపు చరిత్రను దీర్చిదిద్దిన మహా నాయకుని యస్తమయ మన్నది మానవతా దృష్టితో పరికించినపు డందలి విషాదభావ గాంభీర్య మింతయని చెప్పనలవికాదు. దీనికొక పూరకాంశమున్నది. ఇది యాతని నిర్యాణ మొక్కటియే కాదు. ఆతనితో బాటు సర్వ యదువంశము సమూలముగ నాశనమైనది. తన వంశీయులైన వారందరియొక్క వినాశమును తాను కన్నులార చూచి మహా విషాదమున తానొక భాగస్వామియై యుండ వలసి వచ్చుటవలన నీ విషాదాంశము మరింత యుద్వేలమై భాసించినది. ఇట్లు మానవ దృక్పథమునుండి దర్శించినపుడు ప్రపంచ వాఙ్మయమునందే సాటిలేని మహా విషాద ఘట్టముగ నీ నిర్యాణ వృత్తాంతము నభివర్ణింప వీలగుచున్నది. ఇదియొక దృక్పథము.

రెండవ ధృక్పథమీ లౌకిక భావస్పర్శ కతీతమైనది. ఇందు మరణమునకు గాని, దాని వలన నుత్పన్నమగు విషాద భావమునకు గాని స్థానము లేదు. అవతరించిన యంశములు యథాపూర్వస్థితి నందుటయును తాత్త్విక భావస్థితియే దీని యాంతర్యము. కృష్ణునిగ నవతరించి లోకశ్రేయార్థము ప్రవర్తిల్లిన స్వామి విష్ణుత్వము నందుటయే

యందలి యసలు వృత్తాంతము. ప్రతి యుగమునందును శాశ్వతమైన తత్త్వ మిట్టి నామరూపాది విశిష్టమైన లీలావృత్తమును కొన్నినాళ్ళు మసలి పరంధామమును జేరుకొనుట సహజముగ ప్రవర్తిల్లునట్టి యంశమే. ఆ శాశ్వత తత్త్వమున కవతరణమెంత సహజమో యవతారోప సంహారణము నంతే సహజము. సాధారణ మానవుల విషయము ననే జననమరణములను లౌకికాంశములు పరిణామపేశలమైన శరీర గతములై పరివర్తించి విషాద భావ భాజకములైనను, వాని యందలి యసలు తత్త్వమిట్టిదే. దేహమునందు బద్ధమైన యాత్మ పరమాత్మ యందైక్యము నందుట మిక్కిలి సహజమైన వృత్తాంతము. అది జన్మము వలెనే సంసార చక్రము నందలి రెండవయంచు. అట్టిచో కేవల పర తత్త్వము యొక్క లీలా వృత్తాభినయమున లౌకికములైన విషాదాది భావముల కాకర మెక్కడ? అవతార వ్యూహమునందలి యితరుల వలెనే యాదవులును భిన్నభిన్నాంశములతో నవతరించిన వారు. అందు వారి కార్యకలాపములు నియమితమైన మార్గమున నిర్వహింపబడిన పిమ్మట యథా స్థానమును జేరుటయన్న యంశము పూర్వ నిర్దిష్టమైనదే. స్వామికి సంబంధించినంతవఱకు భూభార నిర్వాపణమున కౌరవాదుల యందెట్టి దృష్టి యున్నదో వీరియందు నంతియే. జరుగవలసిన యంశములు ప్రవర్తిల్లునప్పుడు స్వామి నహంకార మమకారములు బంధింప జాలవు. ఇట్టి దృక్పథ మాయన తత్త్వములోని భాగముగ భిన్న సందర్భములందు నిరూపితమైనది. కావున యాదవకుల వినాశనమును తాను గన్నులార గాంచి యుండుటన్నది స్వామికి సంబంధించినంతవర కెట్టి ప్రత్యేకతను గల్గినదికాదు. కావున నవతార సమాప్తి ఘట్టము అవతరణ వ్యూహము వలెనే మిక్కిలి సహజమైన విషయము. తాత్త్విక ప్రతిపత్తి తప్ప మరియొక యంశ మిందు గమ్యమానము కానక్కరలేదు. ఇది రెండవ దృక్పథము.

సాహిత్య దృష్టితో ననుశీలనము చేయునప్పుడీ రెండు దృక్పథములును బరస్పరపోషకములై వర్తిల్లును. ఏలన: అవాఙ్మానస

వేద్యమైన స్వామిచరిత్రము భాషాది ప్రాగల్భ్యములతో నిరూపించు నపు డందు చర్వణ యోగ్యమైన భావ ప్రపంచమున కాకరము గల్పించుట శిల్పులైన కవులు తప్పని సరిగ జేయవలసిన పని. తన్మార్గమున ప్రచలితమైన సాహిత్య సృష్టియంతయు నీ భావ రసభావ ప్రపంచముగ కవివాక్కున ప్రభవించి తీరును. ఎంతటి యుదాత్త తాత్త్విక చరిత్రమైనను నామరూపాద్యంశములచే ననుమేయ మాన మైనపుడు మానవ సహజమైన భావవ్యాప్తి కందు స్థానముండియే తీరును. స్వామి జీవితమున నీ లౌకిక భావ ప్రమేయము వర్తిల్లియే యున్నది. అది యంతయు దివ్యత్వమునకు ప్రతీకాత్మక నిర్దేశమన్నది వేరుమాట. దాని స్థితిని లౌకిక కక్ష్యయందు గుర్తెరుగక తీరదు. కావున సాహిత్య జగత్తున నీ వృత్తాంతము భావప్రపంచ విస్తృతికి తావలమై భాసించినది. ఇట్లు భాసించియుండుటే కథ యందలి యైతిహాసిక గాంభీర్యమునకు కారణము. స్వామి లీలావిలాసముల నాబాల్య మెరిగియున్న యుదాత్తవ్యక్తులే యిందలి విషాద గాంభీర్యమునకు లొంగిపోయి పలురీతుల దీని ననుభవించిన యనంతరమే సహజస్థితిమైన తత్త్వజ్ఞానము నందియున్నారు. విషాదేతివృత్తముల యనుశీలనము వలన నుల్లోల కల్లోల భావప్రపంచ ముద్బుద్ధమై చర్వణ యోగ్యమై భాసించి, క్షాళితమై తుద కుదాత్త గంభీరస్థితి నందవలసి యుండుట యాలంకారిక సంప్రదాయము. దానిని గూడ నీ యితివృత్త మనన్య మార్గమున ననుసంధించు చున్నది. అందు లౌకికమైన సాహిత్య ప్రతీకగ మున్నీ యితివృత్తమునం దుదాత్త రసభావపోషణము, అటుపై గంభీర తాత్త్విక కక్ష్య-యను రెండంశములు గలవు. ఇది యీ యనుశీలనమునకు ప్రాతిపదిక. ఇందుల కాకరములుగ భాగవత భారతములందలి ప్రసక్త వృత్తాంతములు గృహీతములైనవి.

ఈ వృత్తాంతమును విశదీకరించుపట్ల భాగవత మొక ప్రత్యేక మార్గము ననుసరించుచున్నది. శ్రీకృష్ణ నిర్యాణమునకు సంబంధిం

చిన తొలిప్రసక్తి విదురుని మూలమున సూచితమైనది. అతడు తీర్థ యాత్రలకేగి మున్ను గ నుద్ధవునితో సమావేశమునంది యటుపై మైత్రేయుని వలన నాధ్యాత్మిక ప్రబోధమునంది కృతార్థుడై హాస్తి నకు తిరిగివచ్చినాడు. అట్లు వచ్చునప్పటికే యతని కుద్ధవుని వలన యదువంశ వినాశనమును గూర్చి తెలిసినది. ధర్మనందను డాతని సత్కరించి కుశలప్రశ్నలు వేయుటలో యాదవుల క్షేమమును గూర్చియు నడిగెను. విదురుడు "... సమస్తలోక వర్తనము క్రమంబుతోడ విశదంబుగ జెప్పి యదుక్షయంబు సెప్పిన నతడుగ్ర శోకమున బెగ్గిలు చుండెడి నంచునేమియున్ వినుమని చెప్పడయ్యె యదువంశ నాశము..." (ప్రథమ-13-303). దీనివలన రాజర్షి వరే ణ్యుడు, కృష్ణునకు ముఖ్యాశ్రితుడు నైన ధర్మనందనునికి యాదవ కుల వినాశన వృత్తాంతము విదురునిచేత చెప్పబడకుండుటలో నౌచి త్యము వ్యక్తమగుచున్నది. కృష్ణునియెడ ధర్మజునికి గల యార్ద్ర చిత్త వృత్తి మున్నగు నంశములు విదురుడు గమనించి ప్రవర్తిల్లినాడు. అట్లైనను నీ వార్త మున్ను గ వ్యాపింపవలసిన ప్రదేశము ధర్మజుని హృదయాంతరంగమే యను నంశము భాగవతమున నంతర్లీన భావ స్ఫురణముగ వ్యాపించి, యాతని యమాంశమును స్ఫురింప జేయు చున్నది. అటుపై గాంధారీ ధృతరాష్ట్రులు విదురు నుపదేశంబున దేహత్యాగ మొనర్చినారు. ఇట్టి ఘట్టములు క్రమవశమున గృష్ణ నిర్యాణ వార్తా శ్రవణమున కనుకూలమైన విషాద గంభీర వాతా వరణసృష్టికి దోహదములుగ, భాగవత శ్రవణ రంగమునకు నిర్దేశక ములుగ నీ ప్రణాళిక యందు దర్శితములైనవి. అటుపై నారదాగ మనము ప్రస్తుత కథావిస్తృతియందొక ప్రముఖాంశము. అతడు గాంధారీధృతరాష్ట్రుల వృత్తాంతము నెరింగించి కొన్ని :తాత్త్విక ప్రవ చనములను జేసినాడు. వానిచే ధర్మజుని సంస్కారము నందలి మమ తాను బంధములు తొలగించుట యాతని యాశయము. "ఎంతకాలము కృష్ణుడీశ్వరు డిద్ధరిత్రిం జరించు మీరంత కాలము నుండుడందరు నవ్వ

లం బనిలేదు..." అని చెప్పెను. విదురుని మార్గమునే దేవర్షి మరి కొంత నిశిత మార్గమున నవలంబించుటకు, ధర్మజునికి వలసిన యాధ్యాత్మిక సంస్కారము నొసంగి కృష్ణనిర్యాణ వార్తాశ్రవణమున కనువైన మనః స్థితిని కల్పించుటకు ప్రయత్నించినాడు. ఇదియు పూర్వోక్తప్రకారము విషాదగాంభీర్యముల బరివ్యాప్తమొనరించుటకే యుద్దిష్టమైనది. ఆ యీ ప్రయత్నముల ఫలితము దుర్నిమిత్తరూపమున ధర్మరాజునకు భాసించి, అర్జునుడు వచ్చి యదువంశ వృత్తాంతము నెరిగించుటకు పూర్వమే యొకానొక యవ్యక్త దుఃఖమగ్న స్థితియందు ధర్మజుని నోటినుండి యసలు విషయము బాహిరిల్లునట్లు చేసినది. భీము నితో నాతడు "యవ పద్మాంకుశ చాప చక్ర ఝష రేఖా లంకృతం బైన మాధవు పాదద్వయమింక ముట్టెడుం బవిత్రత్వంబు నేడాదిగ నవనీకాంతకు లేదు వో!..." (14-341) యనునట్లు చేసినది. అటు పై నర్జునుడు ద్వారకనుండి వచ్చి సర్వవృత్తాంతములను విశదీకరించి నాడు. ఈ ఘట్టము విషాదభావ నిర్వహణమున బరమోచ్చస్థాయి నందుకొనినది. అర్జునుడు తన కవగతమైన మార్గమున నీ ఘట్టమును వ్యాఖ్యానించినాడు. ఆతని దృష్టిలో నీ వృత్తాంతము "ప్రకృతిం బాసి క్రమ్మర స్థూల శరీర ప్రాప్తుండు గాక పురుషుండు సమ్యగ్యోగం బున..." (378) నుండు స్థితికి నిదర్శనము. కథా వక్తలగు శ్రీ శుకులు స్వామి యవతార పరివర్తనా కేంద్రముగ దీనిని వ్యాఖ్యానించిరి. కాలగమనమునకు సంబంధించి "ఏ దినమున వైకుంఠుఁడు మేదినిపైఁ దాల్చినట్టి మేను విడిచినాఁడా దినమున నశుభ ప్రతిపాదకమగు కలియుగంబు ప్రాప్తంబయ్యెన్" (381) అన్నది వారి ప్రవచనము. తత్ఫలితముగ పాండవ మహా ప్రస్థానము వివృతమైనది. ఈ ఘట్టము నంతటిని హస్తినాపుర రంగమునకు సంబంధించి పాండవ కృష్ణుల యానముగ భాగవతకర్త దర్శించినాడు. ఇందే మరియొక యంశ మున్నది. పరీక్షిత్తు రాజ్యమునకు వచ్చినాడు. అప్పటికే కలియుగము ప్రాప్తించినది. తన రాజ్యమునందలి విజృంభణము నరికట్టుట కాతడు

యత్నించి కొంతవరకు సాఫల్యము నందినాడు. కాని యాతని జీవిత మున మునిశాపఫలితమైన మృత్యునియతి యొక్క ప్రముఖాంశమై యాత డుత్థానము నందుటకు భాగవత శ్రవణము మార్గమైనది. ప్రాయోప విష్టుడైన పరీక్షిత్తునకు శ్రీ శుకులు భాగవతము నుపదే శించిరి. ఈ ఘట్టముననే భాగవత ప్రణాళికయందలి మరియొక యర్థము నిక్షిప్తమొనర్ప బడినది. కలియుగమున స్వామి భౌతిక స్థితి లేకుండుటను గూర్చి పూర్వము చెప్పబడినది. భౌతికముగ స్థితి లేకుండుట యనగా స్వామి హృదయాంతర్యామియై మంద్ర మార్గమున నుత్థానోన్ముఖులైన జీవుల హృదయాంతరాళముల సన్నిధి చేసియుండు నని యర్థము. కథాశ్రవణ, మనన, ధ్యాన, ప్రవచన, రచనా, విమ ర్శాదులిట్టి సన్నిధి ఫలితములు. ఉద్ధరణమార్గములు, దానిని ప్రత్యే కించి దర్శించిన భాగవతము స్వామి మంద్రమార్గ గమ్య హృద యాంతర స్థితికి ప్రతీకయై యున్నది. ఇందు శ్రీ శుక ప్రోక్తమైన భాగ వతమును శ్రవణ మొనర్చెడు పరీక్షిత్తు ఉత్థానోన్ముఖమైన నరజాతి సమస్తమునకు ప్రాతినిధ్యము వహించును. ఇట్లు కలియుగమునందు భాగవతమునకు గల ప్రయోజనము ననుసంధించి యీ ఘట్టమును తీర్చియుండుట భాగవత ప్రణాళికయందలి విశేషము.

ఇటుపై ననంతరకథ యందు సంక్షిప్త మార్గమున యదువంశ వినాశనమును పోతన ప్రియశిష్యుడైన వెలిగందల నారాయణ రచించి, యందలి సాక్షాద్భావోద్దీప్తిచేత నీ పూర్వరంగమునకు రస సిద్ధాం తానుగుణమైన పారమ్యమును గల్పించినాడు.

ఈ వృత్తాంత మేకాదశ స్కంధమున నున్నది. కథా వృత్తాం తము విషాద తాత్త్విక భావముల కనుకూలమై యున్నది. ఇందు మున్నుగ ననన్యశూరులు, నధిక సంఖ్యాకులునైన యాదవుల పరి మార్చుటకు తాను వినా శక్తి చాలిన దైవము వేరొకడు లేడని తలంచిన స్వామి వేణుకాననమును వాయువశమున బుట్టిన యగ్నిచే

దహించినట్లు యాదవులకు బరస్పర కలహములు, విప్రశాపము కల్పించెనని నిరూపితమైనది. ఇట్టి ఘట్టమంతయు స్వామి సంకల్పవశమున ప్రవర్తితమైనదని సూచింపబడినది. ఈ స్కంధము నందలి రచనా నిర్వహణమున భాగవత మార్గమున కనుకూలముగ నందందు తత్త్వనిరూపకములైన గోష్ఠులు కొన్ని చోటుచేసికొన్నవి. వానిని యదువంశ వినాశనమునందలి విషాదభావ గాంభీర్యమునకు భిత్తికా ప్రాయములుగ భాగవత కర్త యుద్దేశించెను. స్వామిని దర్శించి స్తుతించిన మహర్షిబృందము "ఒక్క వేళను సూక్ష్మరూపము నొందు దీ వణుమాత్రమై యొక్క వేళను స్థూలరూపము నొందు దంతయు నీవయై పెక్కురూపులు దాల్తు..." ( 1-16 ) అని చెప్పుట వలన యవతార సమాప్తి యందలి యాంతర్యము గమ్యమానమైనది. శాప వృత్తాంతమును వినిన స్వామి దాని నాత్మకలిత మాయారూపంబగుట నెరింగిన స్వామి ధరణీసుర శాపమువలన హరిహర బ్రహ్మాదులైనను నిస్సహాయు లౌదురనియు, యతినిందా పరత్వమున యదువంశ నాశనంబగుననియు జెప్పి తదర్థమును ధ్రువీకరించినాడు. బ్రహ్మాది దేవతలు స్వామిని వైకుంఠహర్మ్యమునకు విచ్చేయుమని ప్రార్థించిరి. స్వామి యాదవుల కన్యోన్య వైరానుబంధముల గల్పించి వారల ఘాతంబు గావించి, భూభారంబడంచి వత్తునని చెప్పుట వలన నీకథ మొత్తమున నంతర్లీనమైయున్న లక్షణమును అవతారసమాప్తి వేళ ప్రవర్తిల్లిన ధర్మసంస్థాపనోదంతముగ స్వామి నిర్దేశించెనని వ్యక్తమగుచున్నది. పిమ్మట భయంకర దుర్నిమిత్తముల వర్ణనము, స్వామి యాదవుల బ్రభాస తీర్థమున కరుగ నియమించుట జరిగినది. ఉద్ధవుడు జ్ఞానమార్గమున స్వామి సంకల్పము నెరింగికొని విషాద భావమునకు గురియైనాడు. స్వామియాతనికి గలియుగప్రాప్తిని తల్లక్షణములను నిర్దేశించి, తత్త్వప్రవచన మొనర్చి దేహాత్మభ్రాంతిని తొలగించి సంతరణ మార్గమును నుపదేశించినాడు. ఈ యుపదేశమున శరణాగతి, భక్తితత్త్వము పూర్వోక్త మార్గమున గథాశ్రవణాదులు నిత

రాంశములతో పాటు గమనార్హములు. తరువాత యాదవుల పరస్పర కలహములు, నవతారసమాప్తి సంక్షిప్తముగ వర్ణింప బడినది. ఈ రీతిగ భాగవతమునందలి యవతార సమాప్తి వృత్తాంతము తాత్త్విక విషాద భావముల కాకరమై తత్త్వనిర్దేశనము పట్ల మిల్లు చూపు చున్నది.

## మౌసలపర్వము

ఈ వృత్తాంత మేకాశ్వాస పర్వమగు మౌసలమున భారతము నందు మహత్తరముగ తిక్కన సోమయాజిచే తీర్చిదిద్దబడినది. విషాద భావగాంభీర్యము లిందు ప్రాధాన్యమును వహించి, యీ ఘట్టము తిక్కనార్యుని సర్వతోముఖ కావ్యశిల్పమున కుదాహరణ ప్రాయముగ రూపొందియున్నది. అంతర్లీన తాత్త్విక భావసంపత్తి యిందు భాగవతమునకంటె యించుక తక్కువ స్థానము నాక్రమించి నది. కథా విషయమున నీ క్రింది యంశములు క్రమములు శిల్ప సమ్మతమైన విన్యాసము నంది యున్నవి. హస్తినాపురమున మహో త్పాతములు పుట్టి ధర్మజునకు మున్నుగ యదు వంశ నాశనవృత్తాం తములు తెలియుట, ముసల వృత్తాంతము, ద్వారకయందు మహో త్పాతములు, సాగర తీరమునకు యాదవుల తీర్థయాత్ర, అందు యాద వుల యంతఃకలహ విజృంభణము, తత్పర్యవసానము, వానిలో స్వామి కలుగ జేసికొని నిర్వహించిన యంశములు, రామకృష్ణావతార ములు పరిసమాప్తి. అటుపై నర్జును డొనర్చిన నిర్వహణము, వ్యాసు డర్జునుని కొనర్చిన తత్త్వబోధ గమనార్హమైన విషయములు. కథా కథనమున తిక్కన యొక ప్రత్యేక మార్గము నిందు పాటించినాడు. మహోవిషాద గాథయగు యదువంశ నాశనమున నంతర్లీనములై యున్న భిన్నాంశములను పొరలు పొరలుగా వివృత మొనర్చినాడు. మూలప్రాయమైన యవతార సమాప్తి విషయమున కటునిటు నీ పొరలు విచ్చుకొనుట యనెడు మనోహరమైన కథన శిల్పము

వలన పాఠకుని మనోభిత్తికలయందు ప్రసక్త కథాంశములు క్రమ వశమున ముద్రితములై రసభావావిష్కృతికి దోహద మొసంగును. ఈ కథన శిల్పము నన్నయోపజ్ఞమై తక్కిన భారత కవులిర్వురి చేత నవలంబింప బడినది. రచనమునందు సాధారణ సాహిత్య విమర్శనా ప్రమాణములను బట్టి యిందు శబ్దార్థ శక్తుల కనన్యమైన సమన్వ యము, తిక్కన పాత్ర చిత్రణాకౌశలము, రసభావ చాలనము నిందుదా త్తములై కుదురుకొన్నవి. ఇందలి లీల సర్వము మృత్యుమయము. అది యముని క్రీడ. తదంశ ధర్మజ నిష్ఠ మగుటవలన మున్ముగ నీ కథ యొక్క విషాదచ్ఛాయలు హస్తినాపురమునందు మహోత్పాతరూప మున వర్ణితములైనవి. ఈ యంశము భాగవతమునను ప్రతిబింబించి నది. ధర్మజుడు, సోదరులు యదువంశ వినాశ వార్తలను వినినపుడు దుఃఖించిన విషయము ప్రసక్తమైనదిగాని, సాకూత్తుగ రామకృష్ణుల యవతారసమాప్తి విన్నపుడిందు ధర్మజుని శోకప్రవృత్తియే వర్ణి తము కాలేదు. పై వర్ణనమునందలి యభిప్రాయమున కిది దోహద మొసంగుచున్నది. ఈ వెలితిని పూరించుటకు కాబోలును మహర్షి భాగవతమున నీ యంశము విశేషముగ వర్ణించినాడు. రచనా శిల్ప విన్యాసము మొత్తముపై నొక విశేషాంశ మిందు వెలసియున్నది. అదియే మిక్కిలి శక్తిమంతమైన వర్ణనా విన్యాసము. దీనికి తోడు తిక్కనార్యుని శబ్దశక్తి కలిసి విషాద భావముల నుచ్ఛస్థాయికి గొంపోయినది. ఇట్టి ఘట్టమున నొక విషాద కావ్యమునకు వలసిన శాంతగాంభీర్యములతో పాటు సర్వసమగ్ర రచనా విభూతిని మహా శిల్పి తిక్కన ప్రదర్శించినాడు. దివ్యత్వమున శాంతరసమునకును, మానుషత్వమున ప్రసక్త సర్వరసములకును కేంద్రమైన స్వామి యునికి వలన నెట్టి రసభావ ప్రపంచము నావిష్కరింప నవకాశ మున్నదో యట్టి రసభావ సర్వస్వమును మహాకవి యిందు పదిల పరచినాడు.

26)

మౌసల పర్వము నందలి వివిధాంశముల నిట్లనుశీలనము చేయ చేయవచ్చును: ముని శాప వృత్తాంతమును విన్న స్వామి పాత్ర యందు తత్క్షణ ప్రాప్తమైన యుపేక్షా భావమును, గాంభీర్యమును, నిర్లిప్తతను వర్ణించినాడు తిక్కన. "విని కాలవేదియగు నవ్వన జాక్షుడు నియతినగు నవస్థకుఁ దలఁపం జన దన్యథాత్వకరణంబని యూహించుచు నుపేక్షయాత్మ నాలయఁగన్"(12)బంధువులను కాంచి, తమవారల యొప్పని తనమున నీ స్థితి ప్రాప్తించినదని వంత తలపోయుడు డని నిర్దేశించి యభ్యంతర గృహమున కేగినాడు. ఈ సందర్భము వలన పూర్వోక్తాంశములు గమ్యమానము లగుచున్నవి. ద్వారక యందు పుట్టిన మహోత్పాతముల యందలి క్రమవికాసమును తిక్కన సాత్మన్మృత్యు లీలాప్రతిపాదకములుగ నభివర్ణించి యున్నాడు. అంత కుడు నగరమున చరించుచున్న భ్రాంతితో పౌరులందరు నరుణఘూర్ణి తమైన యాతని స్వరూపమును వర్ణించి చెప్పికొనుట, వివిధ భయం కర మృగారావములు, రామకృష్ణులు తప్ప యాదవు లందరు బ్రాహ్మ ణావమానమును జరుపుట మున్నగు నంశముల వలన నొక భయంకర మైన వాతావరణమును ప్రతిపాదించి, దీనిని తీర్థయాత్ర చాటింపు వేయువాని పెద్ద యెలుంగునకు ఘంటికా నిస్వనమును జోడించి యిందు లకు పరాకాష్ఠ స్థితిని గల్పించినాడు. నాటిరాత్రి యాదవులకు వచ్చిన స్వప్నము నందీ మృత్యులీల మరింత భాసమానమై యున్నది. పిమ్మట స్వామి యాయుధాదులు దివ్యపదవి నందుట- మున్నగు వృత్తాంత ములు ప్రవర్తిల్లినవి. రథము లేని స్వామికి దారుకు డొక రథమును తెచ్చినాడు. తీర్థమునకు బయలు దేరనున్న స్వామి "... వెడఁగై సేసిన కృష్ణుఁడు నిర్వికార చిత్తత వెడలెన్" (30). స్వామి యలంకర ణము లందెంత యుత్తమాభిరుచి పూర్వకమైన నిష్ఠ గలవాడో పూర్వోక్తము. వెడవెడ కై సేయుట స్వామి జీవితమున నిదే మొదలు తుదియును. సరిగా నిందులకు వ్యతిరేకమైన పద్ధతికి (ఉజ్జ్వలాలంకరణ మునకు) అలవాటుపడిన బలరాముడీ ఘట్టమున నలంకృతియందు మిక్కిలి యధికమైన జాగృతి నవలంబించు టాశ్చర్యకరము:

"తోడవు, చీర, పూఁత తొంటి యట్టులు గాఁగ నేమి వాహనంబు నెక్కఁడించుకేని వికృతిలేని హృదయంబు మిత్రి సంభాషణంబుఁ గలిగి బలుఁడు వెడలె" (31) సహజముగ సంకర్షణ తత్త్వము వలన నందవలసిన వికృతి కీతడు దూరమై యుండుట సమాప్తివేళ వచ్చిన విషాద పరిపాకము. అటుపై మహావిభవమున యాదవులు తీర్థయాత్రికు బయలుదేరు సందర్భమున స్వామి విషాద గాంభీర్యభావము మరింత గాఢమైనది. ఉద్ధవుడు వచ్చి తపోధన గమనమున కనుజ్ఞ నర్థింప కాలవేదియైన స్వామి యేమియు పలుకలేదు. బలరాము డాతని వీడ్కొల్పునట్టి కార్యక్రమమును నిర్వహించినాడు. వివిక్త ప్రదేశమునకు పోయి నిరస్త మోహాంధుడై బుద్ధిని జ్ఞేయ నిరూఢ మొనర్చియుండెను. పిమ్మట తీర్థమున యాదవుల విచిత్రవర్తనాంశములు, అంతః కలహములు వర్ణితములైనవి. ఆ సంఘటనము లన్నియు స్వామి పాత్రయను దర్పణమున తిక్కన చక్కగ ప్రతిబింబించినాడు. సాత్యకికిని కృతవర్మకును జరిగిన సంభాషణమున సత్రాజిత్తు మృతి విషయము ప్రసక్తమై వారిలో వారికి తీవ్ర సంఘర్షణము పొడమినపుడు, సత్యభామ కుపితయై "వనితా స్వభావోద్గతాశ్రు పూరయగుచు హరి యగ్రతలమున కరుగు" (45) దెంచినపుడు స్వామి కతికోపము వచ్చినది. ఈ దృశ్యమును కాంచిన సాత్యకి మఱింత విజృంభించి సత్యాకృష్ణులను సంతోషపరచుటకై యుగ్రుడై కృతవర్మను సంహరించెను. అంత నిలువక భోజకు లందరను చంప పరాక్రమించెను. ఈ యుద్యమమును స్వామి చూచుచునే యుండినాడు. నిలువరింప వలెనని సంకల్పము కలిగినది. భోజాంధక వీరులు పెల్లార్చి సాత్యకిని చుట్టుముట్టిన సంరంభము వలన వెనుకంజవేసినాడు! తమ్ముని కాచుకొన వలెనను సంకల్పము కలిగియు మిన్నకుండినాడు. ఈ ఘట్టమున నొక విషాదనాయకుని మనః ప్రవృత్తి యందలి నిర్వ్యాపారత, నిశ్చితార్థము లేని యాలోచనా వైఖరి స్వామియందు ప్రతిబింబించినవి. ( Tragic inaction and occilation ).

ఆ లక్షణముల తెరలను చీల్చుకొని స్వామి కడకు విజృంభించి "తీవ్రకోపాగ్ని తనదు చిత్తమున నుద్ధతిమై జనింపఁగ..." (యుద్ధమునందు చావక మిగిలిన ప్రతిభటాళిని దుంగలతో మొ నిరవశేష మొనర్చినాడు. ఇదియొక విచిత్రమైన ఘట్టము. ఇతః వలెనే స్వామి తానును కోపావేశములకు గురియై యీ దాః హింసాకాండకు పూనుకొనుట, యిట్టి సందర్భములందు సహజ విక పూర్వక విలసనముల నందు బలరాముఁడు యోగనిష్ఠితుడై యుండ గమనార్హములు. పరిణామ వేళ సంక్రమించిన భావవ్యత్యయ మి స్వామియు నితర యాదవులవలెనే కోపతాపములకు గురియగ కవియే చెప్పినట్లు పరమ మునీంద్ర శాపశక్తికి మానవతా ప్రతీకవై స్వామి సైతము లొంగక తప్పని దైనము, కాని స్వామి యంతర్మ త్వము, నడుమ నడుమ చెదరిపోవుచున్న నిష్పందస్థితి, విషాద గా ర్యము-అను భావములు పాతరలాడునట్లు తిక్కన కృష్ణపాత్ర నిం తీర్చి దిద్దినాడు. స్వామి తన మనస్సున గాంధారీ వృత్తా మును అనుసంధించుకొని సంగరావని యందొక్కఁడే నిల యుండెను. దారుక బభ్రులు వచ్చి స్వామిని తెలః తత్ఫలితముగ స్వామి మున్నుగ బలరాముని సందర్శించి, యటు దారుకుని కర్జునుని దెచ్చు కార్యమును నియమించి, సామజ తురగములను రామలను పురిజేర్చి తిరిగి వత్తుననియు, నఁ దనుక తన యాగమనమును నిరీక్షించుచుండు మనియు బలరాము నిర్దేశించి పురమున కేగినాడు. ఇందు స్వామి కడవరకు వీః మర్యాదోచిత ప్రవర్తనమును, జాగృతిని ప్రదర్శించినాః వసుదేవునితో స్వామి యిట్లు చెప్పినాడు. "...తొల్లి కౌరవక్ష యము సూచితి, నేఁడు సకల యాదవుల నాశమునుఁ గంటి నలః తేజోధన, యఖిల బాంధవ హీనమయిన యచటి మనువున వర్తిఁ మనసు గొల్పుచు మున్న యన్న కాననమున కరిగినాఁడు. భవ్యః మున నా బలభద్రుఁగూఁడి యేనుఁదప మాచరించెదనింక మీర లః

కొనుఁడు, సర్వంబును. నరుఁడు వచ్చు మీ పెంపు సేతకై యెల్లి నేఁడు..." (69) అని చెప్పి తాత్పర్యముతో నతని పాదముల తన ఫాలమున స్పృశించి, దుఃఖితులైన వారి నోదార్చి, బలరాముని కడకు వచ్చి యకుంఠిత భక్తితో నమస్కరించి 'మన జనకుని యనుమతి వచ్చితి మహాత్మా' (74) యనినాడు. ఈ ఘట్టము స్వామి పాత్రను సర్వభావ కేంద్రముగ నిరూపించుచున్నది. బలరాముని యందీతడు నెరపినట్టి భక్తి తాత్పర్యములు రామకేశవ సంబంధముల యందలి మహత్తర భావగౌరవమును, వసుదేవునికడ స్వామి ప్రవర్తనము వినయ విధేయతలకు, వనితా జనాదుల కాపాడు యత్నమున రక్షణాంశమును నిరూపించుచున్నవి. తాను నిర్మించిన మహా సామ్రాజ్యము తన కన్నులముందే కూలిపోవుచున్నప్పుడు చూచియు వికృతి నందక, తొల్లింటి కౌరవక్షయముతో దీనిని పోల్చుకొని సమన్వయించుకొని యట్లే వసుదేవునికి చెప్పి, యీ సర్వము నందలి యంతర్దర్శనమును నిరూపించినాడు. ఈ సంఘటనముతో స్వామి యొక్క యుదాత్త తాత్త్విక స్థితి నందుకొని దానినే కడవరకు నిలుపుకొనినాడు. పాత్రచిత్రణమున మొదట నిష్పంద విషాద గాంభీర్యము, పిమ్మట ముని శాపఫలితమైన వికృతి, తుద కుదాత్త తాత్త్విక స్థితి యను క్రమమును తిక్కన పోషించినాడు. బలరాముని యవతార సమాప్తి సంకర్షణ వ్యూహమున కనుగుణముగ నిర్వహింపబడినది. దీనిని స్వామి సాక్షీభూతుడై తిలకించినాడు. అటుపై స్వామి యవతార సమాప్తి వర్ణితమైనది. అందులకు మున్నుగ దేవతల పక్షమున దేవపతి స్వామి యవతారోద్దేశాదుల నభివర్ణించి స్వామిని "అమృతం బజరం బవ్యయ మమలం బవితర్క్య మచల మాగమగమ్యంబు మహాత్మ! భవత్పద మయ్యామేయ తత్త్వంబు బొందు మని రూప్యగతిన్" (88) అని ప్రార్థించినాడు. బ్రహ్మ వచ్చి స్వామి నాగమోక్త సూక్తులతో స్తుతించెను. స్వామి కరుణార్ద్రమైన యీక్షణములతో దేవతల కిట్లు ప్రవచించినాడు. "...అనిరుద్ధ

నామంబైన యదియు బ్రద్యుమ్నతా భాసమానమును, సంకర్షణ భావవికాసితంబు, వాసుదేవాత్మక వరరూపమున నేకతావి భవత్స మాధాన సిద్ధి నొందించుకొంటి, నానంద బోధ నిరంజనామేయ మత్పద ప్రాప్తి పరమ మంగళానుభూతి నంగీకరించెద..." (92) ఇందు పరమ సంక్షిప్త రమ్యమార్గమున చతుర్వ్యూహములు ప్రతిపాదింప బడుట యొక విశేషము. రెండవది యీ యవతార సమాప్తి యెట్టి యమృతత్వమునకు సంకేతమో నిరూపింప బడుట. ఇట్టి ఘట్టమును తిక్కన చరమ భాగమునందు పరమశాంత భావవిలసితముగ తీర్చి దిద్దినాడు. పూర్వోక్తమైన రసపోషణా కౌశలమున కిది యుదాహరణము. ఇట్టి భావవిశేషమును పురస్కరించుకొనియే వ్యాసు లర్జును నికి జెప్పిన యీ మాటలును ప్రవర్తిల్లినవి. ఇవి యవతార సమాప్తి ఘట్టమును సంపూర్ణముగ సమీకరించునట్టివి.

"ధరణి భరంబు వాప నవతారము నందిన విష్ణుఁడత్తెఱం
గరుదుగ నిర్వహించి యజరామర నిష్కల నిర్వికార భా
స్వర నిజసత్పదంబు నుపశాంతి పరుండయి పొందె దానికిం
గురుకులవర్య! శోకమునఁగుందుదురే మిము బోటి బోధనుల్."
(219)

దీనిచే వ్యంగ్యముగ స్వామి వలన గీతోపదేశమునందియు తాత్త్వి కానుసంధాన మొనర్చుకొనలేని పార్థుని బోధనత్వమును వ్యాసులు స్పృశించుట గమనార్హము. అది యట్లుండె. ఈ యభిప్రాయ మాకర ముగ తిక్కనార్యుని కావ్యకళా సిద్ధాంతము వ్యాఖ్యానింప వీలగు చున్నది. ప్రతి పర్వ రసోదయమైన భారతమున కథావశమున ప్రాప్తించు రసభావముల యథావసరముగ పోషించి, తుదకు వానిని శాంతమున లీనమొనర్చుటయను పద్ధతి నాతడు ప్రతి పర్వము నందును ప్రదర్శించి యున్నాడు. స్వామి యునికి వలన నీ పర్వమున నా మార్గము సర్వాతిశాయియైన శిల్ప గౌరవము నందినది.

ఈ విధముగ మౌసల పర్వము వృత్తాంతమునకు సంబంధించిన యుజ్జ్వల రసవత్సృష్టి అంతర్లీనముగ తత్త్వరేఖను భాసింప జేయు మహత్తర కావ్యశిల్ప ఖండము.

యాదవ ప్రళయము

ఈ యంశ మర్వాచీన వాఙ్మయమున కొలది విస్తృతిని మాత్రమే యంది యున్నది. అందుల కుదాహరణ ప్రాయముగ డా. జి. వి. కృష్ణారావు రచించిన యాదవ ప్రళయ మను నాటికను గమనింపవచ్చును.[135] ఈయన లబ్ధప్రతిష్ఠుడైన రచయిత, కవి, విమర్శకుడు. అవతార సమాప్తి ఘట్టమును వినూత్న దృష్టితో నీ నాటికయం దతడు వ్యాఖ్యానించినాడు. నాటకమున చక్కని రచనా శిల్పమున్నది. కావున నిది నిర్ణీత పరిశీలన నపేక్షించును.

సముద్ర ఘోష, తజ్జలమున కందియుండని తావున శిలావేదిక, దానిచుట్టు నున్న ముమ్మొన తుంగ పట్టె. ఇది దృశ్యము. ఇందు మూడు ఘట్టములుగ కథా వృత్తాంతము వివృతము. మొదటి ఘట్టమున స్వామి మురళీనాదము వ్యాహృతమై నిలిచిపోయినది. ఉపవిష్టులైయున్న సత్యా కృష్ణులకడకు దారుకుడు వచ్చి, స్వామి రథాశ్వము లదృశ్యము లైనవని చెప్ప, స్వామి గూఢముగ నన్వేషింపు మని యానతిచ్చెను. అట్లే స్వామి చక్రమదృశ్యమయ్యె ననియు, నా వార్తను స్వామికి నివేదింప జాలక పరిజన మాందోళితమై యున్నదనియు చెప్పెను. స్వామి విచారించి ప్రయోజనము లేదని చెప్పి, వసుదేవునకు పరిపాలనా పద్ధతి నిర్దేశించుచు నొక చీటి వ్రాసి పంపెను. యదువృష్ణి భోజాంధక సాత్వతులకు కీడు మూడనున్నదని సత్యభామ యాశంకించునంతలో సాత్యకి వచ్చెను. కృష్ణుడు సాత్యకితో సత్యభామ స్వప్న వృత్తాంతమును చెప్పెను. అందు ద్వారక

135. ఆదర్శ శిఖరాలు. (నాటికల సంపుటి.) ప్రజా ప్రచురణలు. పవరుపేట ఏలూరు - 1963.

రక్త సముద్రమున మునిగి నట్లును, తామందు కొట్టుకొని పోయి నట్లును భాసించినది. సాత్యకి యది యసంభావ్యమనెను. సాత్యకి చేత తన యన్న నెన్నడు నొంటరిగ వదలి యుండనట్లు సత్య మాట తీసి కొని యున్నది. సోదరులిరువురకు రాజకీయ చర్చకవకాశము కల్పించి యామె నిష్క్రమించినది. సాత్యకి ద్వారకయందలి దుర్నిమిత్త ములను వివరించి చెప్పెను. స్వామి కర్తవ్య మాలోచించుచుండ కృతవర్మ వచ్చెను. ఇతడు సాత్త్విక ప్రక్రియానంతరము పరిణామము చెంది స్వామియం దపారభక్తి 'ప్రదర్శించెడి వానిగ' నిందు తొలి భాగమున చిత్రింపబడినాడు, త్రికాలముల స్వామికి ప్రణమిల్లనిదే యాతనికి తోచదు. స్వామి ద్వారక యందలి యంతఃకలహ ములను, తమ రాజ్యమును కబళించుటకు నిషాదులొనర్చెడు యత్నములను గూర్చియు రథ, అశ్వ, చక్ర నష్టమును గూర్చియు చెప్పి, సాత్యకి సూచనపై నాతని నిషాద భూముల ముట్టడింప నియమించెను. అందుల కాతడు స్వామిని వీడియుండుట తనకు సాధ్యము కాదని భక్తి భావమును ప్రదర్శిం చెను. కృష్ణ సాత్యకుల నిష్క్రమణానంతరము శతధన్వ కృతవర్మల సంభాషణము వలన ద్వారకయందలి స్థితి వివృతమైనది. స్త్రీ పురు షులు ధర్మాధర్మ విచక్షణ లేక తాగి తందనాలాడుచుండ దోషు లకు శూలారోపణము శిక్షగ స్వామి విధించెననియు, నీ కారణమున వృష్ణి భోజాంధక సాత్వతు లాతనిపై కత్తులు నూరుచుండి రనియు, నధికార మంతయు కృష్ణాయత్తమైనదనియు, కృష్ణు డధర్మ ప్రవర్తకు డనియు, కురుక్షేత్రము నందలి యాతని నడవడి దీనిని నిరూపించు ననియు చెప్పి శతధన్వుడు కృతవర్మను కృష్ణ వ్యతిరేకిగా మార్ప యత్నించెను. కృతవర్మ "...కృష్ణుడు కూడా ఎన్ని అన్యాయాలు చేసినా జాతికి మేలు చేశాడు. అద్వితీయ మేధావి, తత్త్వవేత్త, ఘటనాఘటన సమర్థుడు. అలాంటి వాని కెగ్గు తలపెట్టి జాతి ద్రోహ

నికి పూనుకోవడమా?" (పుట 86) అని సందేహింపగా, కృష్ణుడార్జించిన గౌరవమునకు యాదవ వార్ష్ణేయులర్హులనియు, కృతవర్మ కార్యకారియై కృష్ణుని వ్యతిరేకించి వినాశమును తప్పింప వలెననియు, శతధ్వనుడు సూచించెను. అచటనున్న తుంగ విషలిప్తమని గ్రహించి వారు వెడలిపోయిరి. తరువాతి దృశ్యమున దూరారణ్యమున నున్న బలరాముని కృష్ణుడు కలిసికొని తన్ను మన్నింపుమని కోరెను. ద్వారకకు రమ్మని ప్రార్థించెను. కృష్ణకృత మద్యపాన నిషేధ శాసనము వలన నగరము వీడి వచ్చిన రాముడు కొంత యాత్మ విమర్శతో, మరికొంత వైముఖ్యముతో వ్యవహరించుచుండ వసుదేవుడు వచ్చి రామకృష్ణులను రాజ్యమున నిలిపి తాను తపోనిరతుడై పోవనున్నట్లు సంభాషించుచుండెను. అప్పుడు దారుకుడు వచ్చి యాదవ కలహమును వివరించెను. అందు సముద్ర తీరమున మద్యమత్తులైన వారెల్లరు చేరి యాదవ వార్ష్ణేయులొక పక్షముగ, భోజాంధక సాత్వతులొక పక్షముగ కలహించుట, యందు కృతవర్మ, గద, సాంబ, ప్రద్యుమ్న, సాత్యకులు మరణించుట ప్రధానాంశములు. స్వామి వారము పైబడి ద్వారక నిలువదని చెప్పి, స్త్రీ బాల వృద్ధ జనమును హస్తినకు చేర్పవలసినదిగ నర్జునునకు దారుకుని చేత వర్తమానమంపెను. ఇది రెండవ దృశ్యమునందలి వృత్తాంతము. మూడవ దృశ్యమున సత్యభామ పరిస్థితులనెల్ల గమనించి దుఃఖించుట, బలరాముని మరణమును గుర్తెరిగి కృష్ణుని కొరకై కేకపెట్టుచు వెడలుట జరిగినది. అటుపై కృష్ణుని స్వగతము. అందు ప్రధాన విషయము లిట్లున్నవి. "రాజుల కిరీటాలతో బంతులాడాను, తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మిని చేశాను. ఈ నాటకమంతా ఎందు కాడాను? ఏమి జరిగింది? రసనిష్పత్తియైనా జరిగిందా? ...పాపము ఆ అర్జునుడు...జాతి సాంకర్యం, ధర్మచ్యుతి, కర్మహాని జరుగుతుందని భయపడ్డాడు. అంతా జరిగింది. యాదవ ప్రళయము జరుగుతుందని

ముందుగానే గ్రహించాను. కాని లాభమేముంది, చేసిన ప్రయత్నా లన్నీ వమ్మైపోయాయి..." పిమ్మట నిషాద బాణమున బాధ పడు చున్న కృష్ణుడు "ఇప్పుడు అంగలార్చి ప్రయోజనమేముంది ? కేవలాధికారోన్మత్తులకు ఇంతకన్న ఉత్తమ సత్కారమేముంది?" అని కన్ను మూసెను. (పుట 95). పిమ్మట నీ వృత్తాంతము నెరిగి యంతఃపురాంగనలు నిషాదుల పాలగుటకు వీలులేదని చెప్పి సత్య భామ స్వామి ననుగమించెను.

సన్నివేశముల నిర్వహణము, సజీవ సంభాషణములు, సాంకేతిక నైపుణ్యము, ఉత్తమ పాత్ర చిత్రణము, నీ నాటకమున చక్కగ పోషింపబడినవి. అదియట్లుండ నీ నాటక కర్త కృష్ణ పాత్రను, తత్త్వ మును ప్రాథమిక స్థాయిలో నేని అవగాహనము చేసికొనజాలక, నవీనత పేరిట చలామణి యగుచున్న కొన్ని యవిచారమూలక దృక్పథములను నాటికయందు జొప్పింప యత్నించి విఫలుడైనాడు. కృష్ణుడవతార మూర్తి యనియు, ధర్మసంస్థాపకుడనియు విశ్వసించుటటుండి రెంక మానవ మూర్తిగనైనను నాయన పాత్ర నీత డర్థము చేసికొనలేదు. "యుద్ధప్రారంభముతో ధర్మాధర్మ విచక్షణ పోయింది అన్యాయము జరిగింది. నేను ఒప్పుకొంటాను" (పుట. 79) అను మాటలు కృష్ణుడే కాదు, చిత్తశుద్ధిగల యే కార్యవాదియు ననజాలనివి. కృష్ణుడన్యాయ ములు చేసియు జాతికి మేలు చేయుట యెట్టిదో, యద్వితీయ మేధావి, తత్త్వవేత్తయునై యుండుట యెట్టిదో కృతవర్మకు తెలియకున్న మానె నాటక కర్తకు కూడ నవగతమైనట్లు లేదు. ఈ రెండును పరస్పరము పొసగనివి. అది యట్లుండ భారతేతిహాసమున స్వామి నిర్వహించిన కృత్యములు, తత్ప్రయోజనము వీరూహించినంత తేలిక సంగతులు కావు. ఆ మహేతిహాసమున స్వామి ప్రణాళిక వలన కనీసము రస నిష్పత్తియైనను జరుగనిచో నిట్టి నాటికలకు చదువరుల చేత పట్టి చదువబడుట కర్హతయే లభింపదు. ఈ నాటికయందలి రచనా గుణములలో సగపాలు వస్తు గౌరవము వలన వచ్చినవి. అర్జునుడు చెప్పిన జాతి సాంకర్యాదులు విషాద యోగమావరించిన క్షణమున

నర్జునున కెంత నిజమో, యట్టిదే యావరించిన మనఃస్థితిలో రచయితకు నంతే నిజము. శాశ్వత ధర్మ పద్ధతి యొక్క యుగీన పరిణామముల పరిశీలించిన భారతీయ సంస్కారమున కివి యెక్కవు. ఈ స్వగతమునందే స్వామి నధికారోన్మత్తుడని చిత్రించిన రచయిత యూహాకు ప్రసిద్ధ గ్రంథములం దాధారము లేదు. ఇది యొక వేళ కల్పనమన్నను ప్రస్తుత నాటక పరిధియందు కథాబీజ విస్తరోప సంహారములకు బొత్తిగా పొసగనిది. నాటికా రచనమను ముసుగులో కృష్ణ కథ నపభ్రంశ మొనరించు ప్రయత్నమిందు గోచరించును. తత్త్వరీత్యాకాని, తర్కరీత్యాకాని హేతుబద్ధమైన యంశము లున్నచో, కృష్ణ పాత్రయందలి గౌరవా గౌరవములతో నిమిత్తము లేక యెట్టి విషయము నైనను, తటస్థముగ స్వీకరించుట కభ్యంతరము లేదు. జీవితాంతము నింద నెదుర్కొనుచు, దుష్టులతో పోరాడుచు, శాశ్వత ధర్మమునకు దగ్గరగ నున్న సమకాలీనోత్తమ ధర్మమునకు స్థితి కల్పించి శాశ్వత ధర్మగోప్తయైన స్వామి జీవిత కథాంశములు కేవల సాహిత్య శిల్పుల రచనముల వలన నెట్టి విప్రతిపత్తిని పొందజాలవు. ఇట్టి అసత్ప్రయత్నముల నెన్నిటి నైనను తనలో జీర్ణము చేసికొనెడు మహారససాగరము కృష్ణకథ. కావున తమిళ భాషయందలి ద్రవిడ కజగము మున్నగువారి నాటకములకు, త్రిపుర నేని వారి కురుక్షేత్రము వంటి నాటకములకు, ముద్దుకృష్ణ అశోకము వంటి నాటకములకు, భారతీయ సాహిత్యమునందు సంస్కృతీ ప్రతీకలైన పౌరాణిక కథల ప్రత్యంగ వ్యూహములుగ నెట్టి స్థానము లభించునో యట్టిదే దీనికిని లభించును. పూర్వోక్త ప్రకారముగ విస్తృతియందు చిన్నదైనను నాలోచనల (సవ్యాపసవ్యములు) రేకెత్తించు గుణము, రచనా శిల్పము లను నంశముల మిన్నయగుట చేత నీ నాటికను గూర్చి యింత వ్రాయవలసి వచ్చినది.

ఈ విధముగ స్వామి యవతారసమాప్తి వృత్తాంత మాంధ్ర వాఙ్మయమున వ్యాపించినది. భారత, భాగవత కర్తల యుదాత్త గంభీరరచనము వినా యర్వాచీన కాలమున నీయంశమునకు చెప్పదగిన విస్తృతి లభింపలేదు. తాత్త్విక విభూతివలెనే యీయంశమును అర్వాచీనవాఙ్మయమున విస్తృతి విషయములో గాని, గుణమున గాని దాదాపు శూన్యమనియే చెప్పవచ్చును.

# 10. పరిశిష్ట ప్రక్రియానుశీలనము

పూర్వాధ్యాయమునందు భిన్న కథాంశముల యనుశీలనమున ప్రక్రియా వైవిధ్యము పాటింపబడలేదు. అందులకు కారణ మేమన, నే ప్రక్రియకు చెందిన కావ్యమైనను అందు కృష్ణ కథాంశము నిర్వహింప బడినచో నది యనుశీలనమున నొదుగుట. ఇటుపై పూర్వానుశీలన పద్ధతి కొదుగని సాహిత్య ప్రక్రియలు దిఙ్మాత్రముగ పరిశీలింప బడును. వీని నొక శీర్షిక క్రిందకు చేర్చుటకొక కారణ మున్నది. ఈ ప్రక్రియలలో కృష్ణ కథాంశములు నిర్వహణ పూర్వకముగ నావిష్కరింప బడలేదు. కాని, కతిపయ భావవిశేషముల ప్రసక్తి ననుసరించి భాసించు చున్నవి. కావున వీనియందలి భావవైచిత్ర్యమునకు, తన్మార్గమున సూచింపబడిన తాత్త్వికాంశములకు, వీనిచే గమ్యమానము లగుచున్న కృష్ణకథా రేఖలకు మాత్రమే ప్రాధాన్యము కలదు. ఈ ప్రక్రియల వలన వ్యాపించి యాంధ్ర వాఙ్మయమున నిలిచి యున్న భావ భాండారము ఎన్నదగి యున్నది. ఇట్టి వానిలో మున్ముగ పరిశీలింప దగినది పదవాఙ్మయము.

## పదవాఙ్మయము

సాహిత్య ప్రక్రియలలో పదవాఙ్మయమున కొక విశిష్టస్థాన మున్నది. ఇందు స్వచ్ఛంద సులభ సుందరమార్గమున పదకర్త హృదయగత సంస్కారము, భావనాపద్ధతి లయాత్మకమై భాసిల్లును. ఈ వాఙ్మయము ప్రాయికముగ పదకర్త యొక్క యంతర్దర్శనమును మార్గవాఙ్మయమునకన్న నెక్కువ స్పష్టముగ ప్రతీయమాన మొనర్చు చుండును. ఏదే నొక విశిష్ట కేంద్రమునకు చిత్తవృత్తుల

నున్ముఖమొనర్చు కొనిన యావిష్ట స్థితియందు పదవాఙ్మయము వెలువడి యుండుట యిందులకు కారణము. పదకర్త ధ్యానమునకు కేంద్రమైన వస్తువు యొక్క యుదాత్తానుదాత్తతలను బట్టియు, ఆతని రచనా కౌశలమును బట్టియు, ప్రతిపాదితమైన భావతత్త్వమును బట్టియు భిన్న పదకర్తల స్థానమును నిర్ణయించుటకు వీలున్నది. పదములు సంకీర్తనాది గోష్ఠుల యందును, నృత్య గోష్ఠులయందును వినియోగము గలవి యగుటచేతి, పదకర్త యొక్క బహుముఖీన ప్రతిభావిశేషములకు నిదర్శకములు. కావున నిందు ప్రసక్తిని బట్టి చెప్పబడిన భావములు భిన్నమార్గముల, భిన్న రూపముల వ్యాప్తినంది, కాలక్రమమున నొకజాతి యొక్క భావ సంస్కారమున భాగములై యుండును. ఇందు కొన్ని యుదాత్తరచనములు మనన శీలురకు సాధనా పాథేయములగును. ఎట్లు చూచినను వీని యుపాదేయత నిర్వివాదాంశము. ఆంధ్రపదవాఙ్మయము విశిష్ట స్వరూప గౌరవమునంది బాహిరిల్లినది అన్నమాచార్యుల వాఙ్మయమునందు. ఇతోఽధిక రస భావౌజ్జ్వల్యము నార్జించుకొని బహుముఖీన వినియోగము నందు కొన్నది క్షేత్రయ్యపదములందు. వీరిరువురే నకాలిక మార్గనిర్దేశకులుగ నీ యనుశీలనమున గ్రహింప బడినారు. అటుపై సారంగపాణి బహువిధ భావనిర్దేశనమున ప్రసక్తుడైనాడు. క్షేత్రయ్య మార్గము ననుసరించిన యర్వాచీన పదకర్తలుగాని, అన్నమాచార్యుని మార్గము ననుసరించిన యితర తాళ్లపాక పదకర్తలుగాని, భావప్రధానమైన యీ యనుశీలనమున జేరలేదు.

విశిష్ట భక్తి సంస్కార ఫలితముగ తన జీవితమును శ్రీ వేంకటేశ్వర సంకీర్తనమునకు వినియోగించి తరించిన అన్నమాచార్యులు పదకవితా పితామహుడు. వారి పద సందోహము విశిష్టాద్వైత మార్గమును ప్రతిపాదించుచు భక్తిభావ స్ఫోరకమై యున్నది. శ్రీ వేంకటేశ్వరుని పరముగ రచింపబడిన వీరి కీర్తనములందు ప్రసక్తిని బట్టి (అభేదభావ ఫలితముగ) కృష్ణతత్త్వ ప్రతిపాదనము, కృష్ణ

లీలావిశేషములపై వ్యాఖ్యానము పలుతావుల వ్యక్తమగుచున్నవి. ఇందు సహజాధ్యాత్మిక భావపరంపర, భక్తి ప్రపత్తులు ప్రధానముగ గమనింప దగిన యంశములు. వీనికితోడు అచ్చపు తెలుగు పలుకుబడితో, శబ్దార్థగత రమణీయశిల్పముతో, దివ్యభావ స్ఫూర్తితో, తొణికిసలాడు రచనా విశేషములతో నివి నిండియున్నవి. ఇవి ఆధ్యాత్మిక శృంగార మార్గములకు జెందినవి. [136] కొన్ని భావవిశేషముల నిట్లుల్లేఖింప వచ్చును: భక్త్యావిష్టమైన స్థితిలో అన్నమయ్య పూర్వభవమునందు భిన్నరూపముల తన్ను తా నూహించుకొని, యపుడు స్వామికృపకు తాను పాత్రుడనై యుందునని భావించినాడు. "... అలనాడు బాలుండవై ఆవులగాచు వేళ చిల్లరదూడనైతే చేరికాతువుగా, వల్లెగా విటుండవై రేపల్లెలో నుండేనాడు గొల్లెత నైనా నన్ను కూడుకొందుగా" (క్రింద నుల్లేఖింప బడిన సంపుటములలో మొదటిది. పుట-7. కీర్తన 12. అన్నమాచార్యుల కీర్తనల నుల్లేఖించునపుడు మున్ముందు సందర్భములలో మొదట క్రింద చెప్పబడిన వరుసలో గ్రంథము సంఖ్య 1, లేక 2, లేక 3. అటుపై పుట సంఖ్య, పిమ్మట సంకీర్తనముల సంఖ్య యీయబడును. వాని నీ క్రమములోనే గుర్తెరుగ దగును.) కర్మ ధర్మములు, స్వామి సమయానుకూలముగ జీవుల కంటగట్టినను నాతనిచే కల్పితములనియు, ఆతని సంకల్పమును బట్టి ప్రవర్తించు ననియు, పరీక్షిత్తును బ్రదికించుట, ద్రౌపదికి వలువలిచ్చుట మున్నగున విందుల కుదాహరణము లనియు నీయన

---

136. వివిధ మార్గములకు చెందిన యీ సంకీర్తనములు క్రింది గ్రంథములనుండి గృహీతములైనవి.

1. Tallapakam Telugu works. Vol 2 by Annamacharya, T. T. D. Publication-1936.
2. Tallapakam Telugu works-Vol 3 Sringara sankeerthanalu by Annamacharya T. T. D. Publication-1937.
3. Sringara Sankeerthanalu Ed. by Sri V Prabhakara Sastri-1947.

భావించెను. (1-9-12) స్వామి లీలా విలాసములను వ్యాజస్తుతి మార్గమున శరణాగతత్రాణ ధర్మములుగ నిరూపించినాడు. "... వెల్లి విరిగ రేపల్లెలోపలి వెన్నముచ్చిములు చెప్పుదునా...పాటించి నీసరి బావమరదికి బండిరొప్పినది చెప్పుదునా గాటపు సురకామినుల తోడ కల్లలాడినది చెప్పుదునా యీడువెట్టుకొని నీవు బోయదాని వెంగిలి దిన్నది చెప్పుదునా..." (1-23-15) వంటి సరసోక్తు లిట్టివి. మానవులు భ్రాంతిమజ్జీవులు. తమ కన్నుల యెదుట విన్యసింప బడిన దైవత్వమునే వారంగీకరించి విశ్వసింప జాలరు. అయినను స్వామి వారి యెడ బహువిధ కరుణావిశేషములను ప్రదర్శించును. ఈ విషయము కృష్ణకథ నాధారముగ నన్నమాచార్యులు నిరూపించినాడు. "... మరంది యనుచు ధర్మజుండు భీమసునట యెరుకతోడి వివేక మెవ్వరి యందున్నది? గరుడ వాహనమెక్కి ఘనబాణు నరికి తిరిగిన నమ్మరైరి దేవుండని నరకాసురుని జంపి నాతులం బదారువేల వెరసి పెండ్లాడినది వివేకించరైరి..." (1-15-27) స్వామి వెర్రిదనమును బాహ్యలక్షణముగ కరుణా పరత్వమును ప్రకటించును. "...వెన్నలు దొంగిలినాటి వెర్రివా నీవు విన్న కన్న జాడగాదు వెర్రివా నీవు... బంటులైన వారికెల్ల బరతంత్రుండవై వెంట వెంట దిరిగేవు వెర్రివానీవు అట్టి రెండు కుచేలుని యటుకులకే మెచ్చేవు వింటే మాకు నవ్వువచ్చె వెర్రివా నీవు..." (1-17-26) కృష్ణకథ యందు పరస్పర వ్యతిరేకత బాహ్యముగ ప్రతిబింబితమై యంతరంగమున దివ్యత్వ స్ఫోరకమైయున్న తత్త్వము నీతడు పలు తావుల పేర్కొనినాడు. "... ఎలమి గొల్లెతలను యిన్నాళ్ళు పొంది పొంది తొలగి మధురలోన దొర వైతివి కొలది యావుల గాచి గొల్లవాడై యుండి వలవంత నేడు రాచవాడ వైతివి వేడుకలకు నింటింట వెన్నలు దొంగిలి ఆడ ద్వారకలో సోమయాజి వైతివి వోడక రుక్మిణీదేవి నూరక యెత్తుకవచ్చి పాడితో నగ్రపూజకు బాత్రుండవైతివి..." (1-146-220) మున్నగున విట్టివి. స్వామి

మోహనాకృతి నిట్లభివర్ణించినాడు. "... మ్రొక్కేటి గోపాంగనల మోహనాకారము చిక్కని నవ్వులు నవ్వీ శ్రీ వేంకటేశ్వరుడు, సత్య భామ ఉరముపై చల్లని కస్తూరిపూత తత్తరించె రుక్మిణిచే తామర పూవు, హత్తిన భూకాంతకు అంగపు పయ్యెదకొంగు చిత్తగించరమ్మ వీడె శ్రీవేంకటేశుడు పంతపు పదారువేల బంగారు వుంగరము బంతి నే కుబ్జ గట్టిన పసిండి తాళి, వింతగా రాధాదేవి వేసిన కలువదండ చెంతలను వీడెయమ్మ శ్రీవేంకటేశుండు .." (1-153-230) అన్నమా చార్యుల శృంగార సంకీర్తనము లందు కూడ ననేకావతార ప్రతీక మైన శ్రీ వేంకటేశ్వరుడే నాయకుడు. క్షేత్రయాదులతో పోల్చి నపుడు రచనా ధ్యేయమును బట్టియు, కవియొక్క మనః ప్రవృత్తిని బట్టియు శృంగార భావస్ఫూర్తి తక్కువగనున్నదని తోచినను, లౌకిక శృంగార సంబంధమైన యావయవిక సౌందర్య ప్రతిపాదనము లేక పోలేదు. సంయోగ శృంగార వర్ణనమున నన్నమాచార్యుల మార్గ మున కీ సంకీర్తన ముదాహరణము. "...మదము తొలికెడి యట్టి మంచి వయసున మనకు తుదలేని వేడుకలు దొరకు చెన్నడురా, ఉదుటు జనుదోయి నీ వురముపై దనివార నదిమి మోమును మోము నలమి యలమి వదలైన నీవితో వాలుగన్నుల జక్కెలొద వని మీద నేనొరగు చెన్నడురా కలికి తనము నాదు కప్పురపు దమ్ములము కులికి నీ వదనమున గుమ్మరించి పలుచనగు గోళ్ళ నీపగడ వా తెరనొక్కి చెలువమగు నునుగంటి సేయు చెన్నడురా..." (2-37-54). కొన్ని కృష్ణ కథా ఘట్టములను రమణీయోక్తులతో చెప్పెను. "...సూడవమ్మ యశోదమ్మ వాడ వాడల వరదలవిగో పొంచి పులువాలం బెరుగు మించు మించు మీగడలు వంచి వారలం కట్టిన కంచపుటుట్ల కాగు లివిగో, పేరిం బేరని నేతులు చూరల వెన్నెల జున్నులును ఆరగించి బయట సగబాళ్ళు పారవేసిన బాన లివిగో..." (ద్వితీయ సంపుటము - కీర్తన 294) వంటి విందుల కుదాహరణములు. అన్నమయ్య బాలకృష్ణుని మోహనాకృతి పరమ

రమ్యము "... చిన్ని శిశువు చిన్ని శిశువు యెన్నడుం జూడవమ్మ యిటువంటి శిశువు, తోయపుం గురులతోడ దూగేటి శిరసు చింత కాయలవంటి జడలగమ్ములతోడ మోయుచున్న కనకంపు మువ్వల పాదాలతోడ పాటుక యశోదవెంటఁ బారాడు శిశువు ముద్దుల వ్రేళ్ళతోడ మొరవంక యుంగరాల నిద్దంపు జేతుల పైడి బొద్దులతోడ అద్దపుంజెక్కులతోడ నప్ప లప్ప లనినంత గద్దించి యశోద మేను కౌఁగలించు శిశువు" (మూడవ సంపుటము - కీర్తన-1). రాధను గూర్చిన ఈ క్రింది సంబోధనములు భావస్ఫోరకములై యున్నవి. "...అతిశోభితేయం రాధా, సతత విలాసవశా రాధా, దర్పక బలబోధా రాధా, తర్పణగంధ విధా రాధా, దర్పయుత క్రోధా రాధా, దర్పక రసవేతా రాధా,... తరుణీ మరుగాధా రాధా, తరణ సదను బోధా రాధా" (తృతీయ 48). ఈ విధముగ నన్నమాచార్యుల సంకీర్తనా వాఙ్మయము నందు కృష్ణ సందర్భములు భాసించి యున్నవి.

ఇటుపై క్షేత్రయ్య పదవాఙ్మయము పరిశీలనార్హ మగుచున్నది. ఆంధ్ర విమర్శక లోకమున నితని పదములు రక్తి ప్రధానములా? భక్తి ప్రధానములా? యను విషయముపై పండిత విమర్శక వరేణ్యులు సుదీర్ఘమైన చర్చ యొనర్చి యున్నారు. అందలి వివిధాంశముల నుల్లేఖించి నిరూపించుటకీ యనుశీలన ముద్దిష్టము కాదు. కాని, యవసరమైనంతవరకు ప్రధానాంశముల నిట్లు చెప్పవచ్చును. క్షేత్రయ్య యనేక క్షేత్రములు పర్యటించి యటనున్న వివిధ దేవతా స్వరూపముల యందు మువ్వగోపాల తత్త్వమును దర్శించినవాడై యనేక పదములను రచించెను. ఈ పదములందు నాన్యతో దర్శనీయమైన రచనా శిల్పము, భావనా సౌకుమార్యము, ఉజ్జ్వలమైన తెనుగు పదముల సొంపుహాళింపు కనుపించుచున్నవి. ఈ పదములకు మూడు విధముల వినియోగ మున్నది. నాట్య గోష్ఠులందును, సంగీత గోష్ఠులయందును, సాహిత్యానుశీలనము నందును

తనకాలము నందున్న యుద్వేల శృంగార పూరితమైన వాతావర ణము నంతటిని నతడు తన పదములయందు ప్రతిబింబించినాడు. అంగ వర్ణనములు, శృంగార క్రీడలు నిందు కొల్లలుగ నున్నవి. కాని వీనిని బట్టియే క్షేత్రయ్య పదముల పారమ్యము నిర్ణయింప రాదు. కవి తన రచనా కౌశలమును, భావనా సంస్కార మును యే ధ్యేయము దెస ప్రసరింప జేసినాడో దానిని బట్టి నిర్ణయింపవలెను. కవియైనవాడు సహృదయునిష్టమైన రససిద్ధిని సాధించుటకే జాగరూకత వహించి, తన సంస్కార బలమున చిగిర్చిన శబ్దార్థముల శక్తిచే పాఠకుల మానసిక సంస్కారముల నుత్తమ శృంగారమున కున్ముఖముగ చేయుటకు చేయూత నొసగ వలెను. ఈ ప్రయత్నము క్షేత్రయ్య రచనలో సిద్ధింపలేదు. అందు లకు కారణ మాతడు వివిధ దైవతా స్వరూపములయందు మానవ సహజ శృంగారకత్య్య నారోపించుటయు, తన కాశ్రయమొసంగిన విజయరాఘవ నాయకుని వంటి వారికి దైవత్వము నాపాదించుటకు ప్రయత్నించుటయు కారణములు. ఈ ప్రయత్నముల ఫలితముగ క్షేత్రయ్య పోషించిన గోపాలగత శృంగార మాధ్యాత్మిక కత్య్యలో తక్కువగను, మానసిక భౌతిక కత్య్యలతో నెక్కువగను వర్తించి, చదువరులలో నా విధమైన వాసనలనే స్పృశించుచున్నదని యంగీక రింపక తప్పదు. కాని, యాతని పదముల నన్నిటిని పరిశీలించినపుడు కృష్ణగత శృంగారము వలన సిద్ధింపవలసిన స్థాయి, వివిధ నాయికా రూప జీవాత్మల హృదయాధి వాసియైయున్న గోపాలదేవుని సర్వాం తర్యామిత, ప్రస్తావికముగా గమనార్హము లగుచున్నవి. అంతకు ంచి తాత్త్వికస్థాయి యిందన్వయింప వీలుకాదు. సాహిత్య కత్య్య యందు పదకర్తలలో నీత డనన్య శిల్పి. ఉజ్జ్వల భావచిత్రణము, అలంకారిక సమన్వయము (15వ శతాబ్దికి చెందిన భానుదత్తుడను నాలంకారికుడు రసతరంగిణి, రసమంజరి యను గ్రంథములను రచించి స్వీయ కృష్ణపర శ్లోకముల సమన్వయించినాడు. క్షేత్రయ్యకు పిమ్మట రెండు శతాబ్దములకు వెలసిన యజ్ఞాతాంధ్రాలంకారికు

డొకడు శృంగారమంజరి లక్ష్యములుగా క్షేత్రయ్య పదములను సమన్వయించినాడు.) మున్నగు ననేకాంశములు క్షేత్రయ్య విషయమున గమనార్హములు. విమర్శకులలో క్షేత్రయ్య పదములందు తాత్త్విక సమన్వయాభిలాష కలవారి వాక్యములన్నియు కేవల వాస్తవిక స్థితి నిరూపకములు గాక తిలతండుల న్యాయమున మాత్రమే సిద్ధించుట గమనార్హము. మొత్తము మీద సమకాలీనముగ ప్రచలితములై యున్న యభిరుచుల ప్రభావమునకు లొంగిన మహాసాహిత్య శిల్పిగ క్షేత్రయ్యను సంభావింపవచ్చును.

"...ఇక నిన్ను నమ్మరాదే ఓ యింతిరో మాటలేటికే, ఒక వేళ నవనీతమొక వేళ పాషాణ మకట నీ చిత్తమయ్యయ్యో చెలి...సరసుడని మెచ్చుకొందువు యేవేళ, నీ చక్కెర కెమ్మోవి యానమందువు తిరుగులేని కోపము తెచ్చుకొందువు నాదు సరసకు రావు యెంచ నన్ను దూరేవు..." (50)[137] అను పదము నందు కృష్ణుని దృష్టినుండి శృంగారము ప్రతిబింబింప బడినది. అంతకు మున్ను తనతో భోగించిన కాంత వైముఖ్యము వహింప స్వామి తన శక్తియుక్తుల నుపయోగించి యామెను వశమొనర్చుకొనుటకు యత్నించిన వైనము ప్రతిబింబించు చున్నది. మరియొక నాయిక కడ స్వామి యించుక యహంకరించి తన విటరాయని తనమును గొండాడు కొనుచున్నాడు. "...పలుకరించిన నీవు పలుకక పొయ్యేవు పణతి నీ గర్వమేమొ, తలంచితే వెయ్యారు తరుణులచేకొన్న కలికి గోపాలుండన వలెనటే నాపేరు...తీయని కెమ్మోవి తేనెలానుచును సయ్యాటమున ప్రొద్దు జరుప నొప్పవా..." (235) మున్నగున విందుల కుదాహరణములు. ఒక ముగ్ధనాయిక స్వామిని మొదటి తూరి దర్శించినపుడు పొందిన భావ వికృతి రమ్యముగ చిత్రింప బడినది."...అదరీనెమోవి

137. కీర్తనల సంఖ్య శ్రీ విస్సా అప్పారావు సంపాదకత్వమున వెలువడిన క్షేత్రయ్య పదములు అను గ్రంథము ననుసరించి యీయ బడినది. ఆంధ్రగాన కళా పరిషత్తు. రాజమండ్రి.

తనకుదానె వదలీనెసీవి మదిలోన వాఁడేమొ మంత్రించె గాబోలు సుదతిముద్వ గోపాలుఁ జూచిన మొదలు - ఇదియేమొ మాయా చిలుక వచ్చి బెదరించి పోయా నిదుర కంటికిరాక నిన్నటాలనుండి చెదరీన చిత్తము చెలియ యేమిసేతు..." (10) "ఇంత తెలిసియుండి యీగుణమేలరా వంతమా మువ్వ గోపాల నా సామి" (35) యను పదము నందు స్వామి యలిగినచో తన సందేశమును స్వామికి నివేదించు చెలికత్తె లెవ్వరును లేరనియు తనకు చెలియైనను, చెలువుడైనను, దైవమైనను తన నైపుణ్యము నందలి యే యంశమైనను స్వామియే యనియు నాయిక తన సర్వస్వమునకు స్వామియే కేంద్రమని నిరూపించెడు సమర్పణ భావమును వ్యక్తముచేయుచున్నది. అట్లే "ఇద్దరివలెనే గూడి యెవరున్నారు? తెల్పరా! ఒద్దికతో మనవలె నున్నారా? మువ్వగోపాల (60) అను పదమునందు నాయిక నాయకునితో దన దాంపత్యము ననేక రీతుల నలదమయంతులు, రుక్మిణీకృష్ణులు, సీతారాములు మున్నగు పౌరాణిక దంపతులతో పోల్చి చెప్పుకొన్నది. "...ఇద్దరి సందున బవ్వళించియున్న యింతి పేరేమిరా? గద్దరివగల మా మువ్వగోపాల, గాజుల చప్పుడు నేమింటి గదరా (61)అను పదమునం దుద్వేలమైన శృంగారమున్నది. దీని యందును "-ఇద్దరికి సరివలపులాయె యెవరికైన దెలుప వశమ ముద్దు తెల్ల గోవిందునికి మా మోహనాంగికి, విభుఁడు పాంచాల దేశాధిపతి వెలది పద్మిని వంశజాతి-" (62) అను పదమునందును తాత్త్విక ప్రతిపత్తి యున్నదని శ్రీ విస్సా అప్పారావు పూర్వోక్త గ్రంథమున నిరూపించియున్నారు. మొదటిదానిలో జీవాత్మ పరమాత్మల మధ్య నున్న మాయావరణముగ మరియొక యింతి యుండుటయు, రెండవదానియందు పురంజనోపాఖ్యాన మిమిడి యుండుటయు వారు గమనించిరి. ఇవి పూర్వోక్త తిలతండుల న్యాయమున కుదాహరణములు. 66 వ పదము నందు నాయకుడు తనకు నాయకను గూర్చినచో వ్రతములాచరింతునని చెప్పుట రమ్యార్థస్ఫురణము. ఇందు కన్నెమోమును కాంచ గల్గినపున్నమి యొక్క ప్రొద్దుండుట, కన్నుల ముద్దాడగల్గినచో

జంటకలువల పూజించుట, సన్ననూగారంట గల్గినచో నాగులచవితి వ్రతము లుండుట మున్నగు నంశము లిట్టివి. "...తరుణిరో పుణ్య పాపము తన చేతిది పరమాత్ముండౌ మువ్వగోపాలుతో విన్నవించ వలె, చేరదీసినా మంచిదే చేపట్టకున్నా మంచిదే ఆరుదూరు చేసి నన్నల యించినా మంచిదే..." (185) మున్నగు పదముల యందు సమర్పణ పూర్వకమైన యుక్తి విశేషము లున్నవి. "...పచ్చియొడలి దానర! పచ్చియొడలు దాన పావఁడు నిలువఁడు వచ్చికూడుటకు వేళ గాదు..." (232) మున్నగు చిత్రిణము నందలి యూహా శాలిత్వము, వర్ణనా వైచిత్రి గమనార్హములు. ఇట్టివి జానపద గీతములందున్నవి.

తాత్పర్యతః క్షేత్రయ్య వాఙ్మయము గోపాలస్వరూపమైన కృష్ణ శృంగారముతో నిండియున్నది. లౌకిక భావస్ఫూర్తి యందున్న యుద్వేగము, పచ్చిదనము సమకాలీన భావ సంస్కారముల వలనను పదములయొక్క త్రిమార్గ వినియోగము వలనను సంక్రమించినది. ఇందెచ్చటనో సకృత్తుగ తత్త్వపారమ్యము గమ్యమాన మగుచున్నను మొత్తము మీద క్షేత్రయ్య కృష్ణకథ సమకాలీన శృంగార కథ. లౌకిక భ్రాంతులను రెచ్చగొట్టి సహృదయ హృదయముల కృష్ణుని కేవల విటరాయునిగ చిత్రించు రసోపనిషత్తు.

ఈ కోవలో పరిశీలింప దగిన మరియొక ప్రముఖ పదకర్త సారంగపాణి. దేవాలయములందు "లాలనుచు ఊచేరు లలన లింపునను, శ్రీలచెన్నలరు నుయ్యాలపాన్పునను," అనియు, "హరినారాయణ గోవిందా యని స్మరణ సెయ్యవే వో మనసా" యనియు, "ఎంత పేద వాఁడే వేణుగోపాలుఁ డెంత పేదవాఁడే అంతపేద నాకుంటే అల నాఁడు కుచేలుని ఆటుకులకు చే సాచునా! ఓ చెలులారా ఎంత పేద వాడే!..." యనియు స్వామియొక్క భిన్నాంశములను సుకుమారముగ నూహించి సుందరముగ రచించిన పదకర్త సారంగపాణి.[138]

---

138. సారంగపాణి పదములు-సం. శ్రీ పురిపండా అప్పలస్వామి, ప్రాచీన గ్రంథావళి సరస్వతీ పవర్ ప్రెస్సు-రాజమండ్రి 1963.

ఇతని పదములను శృంగార, దేశీయ, జాతీయ, భక్తి, వైరాగ్యము లను నాల్గు భాగములలో నున్నవి. శృంగార భాగమున నెక్కువ భాగము వేశ్యావాటికల యందలి శృంగారమును వివిధ మార్గముల ప్రతిబింబించు చున్నది. ఈ సందర్భమున నీతడు ప్రాయికముగ క్షేత్రయ్య మార్గమునే యనుసరించినాడు. దేశీయ జాతీయ పదము లతో ప్రస్తుతానుశీలనమునకు పనిలేదు. సారంగపాణి సమగ్ర వ్యక్తిత్వము, భక్తి వైరాగ్యభావములు ప్రముఖముగ భాసించు చున్నది చతుర్థభాగమున. ఈతని సంస్కారమున లౌకిక పార లౌకిక విషయముల, సమ్మేళనా పూర్వకమైన సంకీర్ణ వ్యక్తిత్వ మను మేయ మానమగు చున్నది. ఒకదశలో సానివాడల గుట్టుమట్టులను, వేశ్యల యింగితములను నరసి శృంగార దేశీయ జాతీయ పదముల రచించిన యీతడు చతుర్థ భాగమున భాగవతోత్తమునిగ దర్శన మిచ్చుచున్నాడు. ఈ భాగముల వరుస యాను పూర్వికమని నిరూ పింపదగిన చారిత్రిక సామగ్రి మృగ్యము. ఒకవేళ లభించినను నీక్రమ పరిణామ మనేక సాహిత్యపరుల జీవితములందు సహజము. లేదా భక్తిరక్తులు రెండు నేకకాలమున హృదయస్తములై క్రమ పరిణామమున విరక్తికి దాకీయను వచ్చును. ఎట్లైనను పూర్వ భాగములందు విశిష్టత లేదు కావున జతుర్థ భాగానుశీలన మపేక్ష ణీయము. "... వేణుగోపాలుని విడువము, మరి వేరే ఒక్కని పేరు నుడువము, వీణుగ కాశికి నడువము, ఖలుల విత్తము కొంగున గట్టము..." (పదము 157) వంటి పదము లిందున్నవి. స్వామితో "మాటాడరా వేణుగోపాల, యింత మానమేమిరా వేణుగోపాల, ఇది యేటి మర్మము వేణుగోపాలా ఇకమాకెవరు దిక్కు వేణు 'పాలా...'' [158] వంటి పదములలో ప్రపత్తి వ్యక్తమగు న్నది. అట్లే "కరుణ నీకు నా మీద కలుగుటకు కారణమేమయ్యా? .రమాత్మ వేణుగోపాల నీదు నామ స్మరణైనఁ జేసితినే యేవగనైన న- అల కుచేలునివలె నటుకులు తెచ్చి మిమ్మారగించు మంటినే? చలువ గంధంబు కుబ్జవలె దేవర వక్షస్థలమున నలవితినే? విలసితముగ నా

విదురునివలె నీకు విందొనరించితినే? కులుకుచు నారదునివలె పారిజాత కుసుమ మర్పించితినే..." (161) యను పదము నందలి హృదయ నివేదనము గమనార్హము. స్వామి పదారువేల యబ్జముఖులుండ కుబ్జను పొందినవాడు. మొలను పీతాంబరము కల్గియు గోపికల చీర లందినవాడు. పాలకడలియందు పవ్వళించియు నుట్లైగ ప్రాకినవాడు. తేజోరాశియయ్యు నరసారథి. ఇక స్వామి బంధువుల నడతలన్నియు విచిత్రములైనవి. తల్లి రోలకట్టినది. తండ్రి యావుల మేప బంపినాడు. ఇల్లాలిల్లిల్లు విహరించినది. ఇట్టి భావములు కృష్ణకథాంశములపై చమత్కృతి పూర్వకమైన వ్యాఖ్యానములు. (162, 163). మానవ జీవిత ధ్యేయమును సారంగపాణి యిట్లు చెప్పియున్నాడు. "పట్టవలె నయ్యా! గట్టిగ మనసు పట్టవలెనయ్యా, పట్టవలె వేణుగోపాలు పదములు, కట్టవలెను వైకుంఠానికి మెట్లు, నెట్టవలెను సద్వృత్తితో దినములు, మెట్టవలె పుణ్యభూములు భక్తితో..." (164). ఇందలి విషయగౌరవముతో పాటు నవీన గేయ రచయితలకు సైత మాదర్శ ప్రాయమైన రచనాపద్ధతి గమనార్హము. వేణుగోపాలుని దివ్యదర్శనమును సారంగపాణి యిట్లు ప్రతిపాదించినాడు. "కదలివచ్చెను జూడరే వేణుగోపాలుఁడుఁ గనులపండుగ గాను పదిలుఁడై ఆ గరుడుని పై నెక్కి భక్తుల ముదమొందఁ జేయుచు ఇదిగో రాజమార్గమున— సురలు నుతింపను వేదము లవనీ సురులు పఠింపగను ధరణీశు లతిభక్తి తను సేవింపగాను సరసీ జాక్షులు నాట్య సరణి నభినయింపగాను..." (169). మానవ జీవితమునకు తరణోపాయములైన కొన్ని యుత్తమ ధర్మములను సారంగపాణి మరల మరల చెప్పినాడు. కులాచారమును వీడకుండుట, తలిదండ్రుల మాటలు మన్నించుట, మనః సంయమనము కఠినోక్తు లాడకుండుట-యిట్టివి. "కోపము చేసె నరనాథు కొలువు గాలిచేదొక రోత ఛీఛీ వలసిన భాగ్యము లుండి భుజించనివాని కలిమి రోత ఇంట్లో కులకాంతలుఁ ఉస్సురనగ వేశ్యలగూడే దొక రోత ఛీ ఛీ..." (173) అను వాక్యములు సారంగపాణి దృక్పథమునకు

నిదర్శకములు. స్వామికి భక్తిలేని పూజలు ప్రీతికరములు కావని భావము. "పన్నీళ్ళలో మునుగుటకంటె, చలిలో జపముచేసుట కంటె, మిన్ను జూసి ధ్యానించుటకంటె, వేదశాస్త్రములు చదువుట కంటె..." (182) హరినామస్మరణమే స్వామి సన్నిధి చేరుటకు సులభ మార్గమని యాతని ప్రతిపాదనము. స్వామిని స్తుతించుపట్ల సారంగ పాణి యొడలు మరచును. "శ్రీ రమారమణీ మనోహర చిరకృపా న్వయభూషణా, నారదాది మునీంద్ర వందిత నవ్యమణిగణ భూషణా, శారదాభ్రశరీర దానవ జన మందాంబుధి శోషణా, భారతాన్వయపాల, వేణుగోపాల దీనజనావనా..." (195) వంటి లయాత్మక రచనములు, హెచ్చరికలు, లాలిపాటలు, మంగళ గీతములు సారంగపాణి రచించినాడు. వీనిలో భక్త్యావేశము, ప్రపత్తి నిరంతరమైన స్వామి ధ్యానము వ్యక్తమగుచున్నది. వీని ఫలితముగ నాతడు స్వామి నర్థించినది నిరంతర సన్నిధానము. "నీ దివ్యమంగళ మూర్తి ధ్యానము భక్తినిత్యము కృపసేయవే, వేదోద్ధారకుడైన వేణు గోపాలుని పాదద్వంద్వము నా హృత్పద్మమందున జేర్చి-పుట్టినది మొదలుగ భూపాలకుల గొలిచి పట్టెడన్నానికై పరుగులెత్తి పొట్ట నించుక నింపి లోపొంగుచుంటిని గానీ పట్టుగ ఒకనాడు ప్రద్యుమ్న యననైతి..." (184) ఈ పదమునందే యాతడు పాపాచరణము, పరకాంతా వ్యామోహము, గురుభాగవత యతినింద మున్నగు దోషముల నాచరించినట్లు చెప్పుకొని స్వామి క్షమాభిక్ష నర్థించి నాడు. తన హృత్పద్మమునంచి శాశ్వతముగ నిలిచియుండుమని ప్రార్థించినాడు. సారంగపాణి ఆత్మ తత్త్వ ప్రస్థానమున నిదికడమెట్టు. ఇంతటి భక్తి వైరాగ్య సంస్కారములు హృదయమునుండి దూసుకొని వచ్చిన యీ వాగ్గేయకారుని జీవితములో పై దోషములన్నియు ప్రవర్తిల్లి యుండునా? ప్రవర్తిల్లి యున్నను ప్రపత్తికి పూర్వరంగమైన పశ్చాత్తాప ఘట్టములుగ వానిస్థానము వానికే యున్నది. మొదటి మూడు భాగములలో మోమోటముచేతనో, ప్రశస్తిని

గోరిరో; యౌవన సహజమైన లక్షణములవలనో యాతడొన
ర్చిన శృంగారాది పదరచనమునకన్న స్వచ్ఛందత, రచనా పాట
వము, హృదయావిష్కరణము, భక్తి వైరాగ్య భావములు నాల్గవ
భావముననే యధికముగ భాసించి కృష్ణకథాగత సద్భావ వ్యాప్తికి
తావలములై యున్నవి.

## స్త్రీల పాటలు-జానపద గేయములు

ఉత్తమ సంస్కారవంతులైన స్త్రీలు తమ విశ్రామ సమ
యమునందు భగవత్ప్రీతికై కల్పించి గానము చేసిన పాటలను స్త్రీల
పాటలని చెప్పవచ్చును. ఇట్టివే వివిధ కవులు రచించినవియు కలవు.
జానపదులు తమ యనుభవమునకందిన మేరకు భగవతత్త్వము నందలి
వివిధాంశముల నిరూపించుచు రచించిన గేయములను, గేయ
కథలను జానపదగేయ వాఙ్మయముగ నెన్నవచ్చును. ఈ మూడును
ప్రస్తుతానుశీలనమున కృష్ణకథా నిరూపణము నందలి యొకప్రత్యే
కాంశము నిరూపించుటకై గృహీతములైనవి. వానిలో పాండిత్య
సంస్కారము కల్గిన కవులు రచించిన గేయములు పోను మిగతవానిలో
నొక సామాన్య లక్షణము వ్యక్తమగుచున్నది. వీనిలో మార్గసాహిత్య
సహజమైన పాండిత్యాదులు కనుపింపవు. భావనామార్గము నిత్య
జీవితమునకు సన్నిహితమై సరళ సుందరమై యుండును. సాధారణ
ముగ నీ రచనములయందు కృతకమైన యాలంకారికత యుండదు.
భావభాషాడంబరములు లేక సెలయేటి జాలువలె నీసాహిత్యము
సాగివచ్చినది. ఇందు భిన్నభిన్న కథలలో ప్రతిబింబితమైన కృష్ణ
కథేతివృత్త సంగ్రహము, తద్గత తత్త్వనిరూపణము మిక్కిలి విశా
లమై యలరారుచున్నది. భిన్నగీతముల నొకచోట చేర్చినచో నది
మార్గ సాహిత్యమంతటి విస్తృతిని, భావగౌరవమును కలదియై
యుండును. ప్రస్తుతానుశీలనమున నీయంశములకు సంబంధించిన వివిధ

ముఖముల నీవరకే దర్శించుట జరిగినది. కాగా నీ తరగతి రచనము లందు ప్రతిపాదింపబడిన కథ, తత్త్వనిర్దేశాదుల దిఙ్మాత్రముగ నిరూపించుట యీ శీర్షిక ప్రయోజనము.[139]

వీనిలో స్వామి జననము మొదలు గీతోపదేశము వరకు వివిధ ఘట్టములు స్వచ్ఛంద రమణీయములై ప్రతిబింబించుచున్నవి. ప్రధానముగ బాల్యవృత్తాంతములు, శృంగార కథలు, వేరు వేరు భావముల నిరూపించు కల్పితేతి వృత్తములు ప్రాధాన్యమును వహించుచున్నవి. శ్రీకృష్ణ జననమును పేర 'కస్తూరి రంగరంగా నాయన్న కావేటిరంగ రంగా' యను పల్లవితో ప్రసిద్ధమైన పాట యొకటి కలదు. తర తరములుగ తెలుగు తల్లులు తమ బిడ్డలనీ పాటతో లాలించిరి, లాలింతురు. జననమని పేరున్నను నిందు బాల్యక్రీడలు కూడ జేరియున్నవి. సద్గురుడు (అవతార పురుషుల నిర్దేశించు నెడ నీ పదప్రయోగమును, భిన్నావతార సాంకర్యమును నిట్టి పాటలలో నున్నది.) కంసుని చంపుటకై యవతారమెత్తి నెత్తురుకందుగనున్న బాలుడు, తల్లికి నమస్కరించి తన్నెత్తుకొనుమని కోరినాడు. ఒళ్లెల్ల హీనములో నున్న దేవకి గంగను ప్రార్థింపనామె పొంగివచ్చెను. ఆమె జలకమాడినది. స్వామి మరల నెత్తుకొనుమన దేవకి కామధేనువును ప్రార్థించి బాలుని పాలతో తడిపి పొడి వస్త్రముల ధరించి బాలునెత్తుకొని యిట్లు స్తుతించి మురిసినది. "వసుదేవు పుత్రుడమ్మ యీబిడ్డ వైకుంఠ వాసుడమ్మ, నవనీత చోరుడమ్మ యీ బిడ్డ నందగోపాలుడమ్మ, సితపత్రనేత్రుడమ్మ యీ బిడ్డ శ్రీరామచంద్రుడమ్మ..." ఇట్లు వర్ణించి దివ్యలక్షణ లక్షితమైన బాలుని చక్కదనము కంసునివాత బడునని

139 ఈ యధ్యాయమునం దుల్లేఖింపబడిన రచనములు మూడు గ్రంథముల నుండి కృతజ్ఞతతో స్వీకరింపబడినవి. 1. జానపదగేయ వాఙ్మయ చరిత్రము-డా. బి. రామరాజు. 2. స్త్రీల పౌరాణికపు పాటలు-కృష్ణశ్రీ - ఆంధ్ర సారస్వత పరిషత్తు-హైదరాబాదు. 3. తెలంగాణా జానపద గేయాలు-శ్రీలక్ష్మీకాంత మోహన్ - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ - విజయవాడ-2.

దేవకి శోకించినది. మాధవుడు తంత్రము పన్నినాడు. తానే పెద్దగ బొబ్బలు పెట్టి యేడ్వసాగెను. ఆమె బాలు నోదార్చ జూచుట, బాలు డామె చెప్పిన మాటల కన్నిటికి బదులుపల్కుట జరిగినది. అటుపై బాలుని సూచనము మేరకు వసుదేవు డితనిని నందవ్రజము నకు చేర్చుట మున్నగు కథావృత్తాంతములు సంక్షిప్తముగ వేగముగ చెప్పబడినవి. కంసుడు వచ్చినపుడు "మగవాడు కాదురన్న యీ పిల్ల ఆడపిల్ల నమ్మరా, ఉపవాసముల నోములు నోచి యీ పుత్రికను గంటి రన్న, పుత్రిదానము చేయరా నాయన్న పుణ్యవంతుడవురన్న" యని జాలిగ ప్రార్థించి తన మాతృప్రేమను వ్యక్తీకరించినది. ఈ ప్రార్థనము పనిచేయు లేదు. కంసునిచే విసరివేయబడిన బాల "వన్నెల జంపెదవుర నీయబ్బ రేపల్లె వాడలోను పెరుగుతున్నాడు వినరా కృష్ణావతారమై జన్మించెను," అని చెప్పెను. ఇందు కంసు నుద్దేశించి పలుకుచున్న యోగమాయ పాత్రచాటున మాతృహృదయముయొక్క యక్కసు, కసి వ్యక్తమగుచున్నది. గోపికలు యశోదతో కృష్ణుని చిలిపితనములు చెప్పుచు "మగనివలె పనులుసేయ నీ సుతుడు మా యిండ్లలోకి వచ్చు ఇకనైన బుద్ధిచెప్పి యింటిలో పదిలమ్ముసేయు మమ్మ" మున్నగు మాటలను చెప్పిరి. ఇవియన్నియు ప్రసిద్ధ వృత్తాంతములయొక్క రమ్యపునరావృత్తులు. సహజసుందరమైన శైలి. దివ్యత్వ భావనములిందు నెలకొనియున్నవి. జోగివాడువచ్చి పట్టుకొనుననియు, పాము వచ్చెననియు తల్లి భయపెట్టినపుడు కృష్ణుడు "జోగిమందుల సంచులు ఏవేళ నా చంకనుండగాను జోగేమిసేయునమ్మ నా తల్లి జోగి నన్నెరుగునమ్మ" యనియు "పాములకు రాజైన శేషుండు పానుపై యుండగాను పామేమి సేయునమ్మ నా తల్లి భయము నాకేల నమ్మ"—అని చెప్పుటలో అవతార తత్త్వము నెలకొనియున్నది. కథాఘట్టములు మారుచున్నవన్న స్పృహ శ్రోతకు కల్గకయే కథ మారిపోవునట్టి విశిష్ట రచనా శిల్పముతో, మంద్ర గంభీరమైన గాన సరళిని మేళవించి, యీ పాట యాంధ్రమాతృ హృదయ సంస్కార

ములో నొకభాగమై యున్నది. ఇట్టి మహాత్త్వము కలదియే గుమ్మడు పాట. ముందొక పద్యమున మనోహరమైన వర్ణనా శైలిలో పెరుగు జిలుకుచున్న తరుణి వర్ణింప బడినది. అటుపై ముత్యాల సరమువంటి ఛందస్సులో నామె కవ్వమును పూనుట, కృష్ణుడు వచ్చి వెన్న నడుగుట, మాతా పుత్త్రిల సంవాదము, అందు దశావతార శ్రీహరి తత్త్వాదు లుక్తము లగుట, మాతృదేవికి విశ్వరూప సందర్శనము-నిందలి యంశములు. మహోత్తమమైన గీతరచనా శిల్పము, ఉదాత్త తత్త్వ ప్రతిపాదనము, నిందలి యంశములు. "వామహస్తము నణిచి పాదము వసుధమీదికి కాలుయెత్తుకు భూమి కదలక నవయవములు బొజ్జ కదలగను, కోమలీకంబైన చక్కని గునిసియాడెడు నడుము వంచుకు ప్రేమ లెన్నుచు చెయ్యి..." చాపిన బాలకృష్ణరూపము లోకోత్తరమై యున్నది. బాలకృష్ణుడు నవ్వుచు నోటు తెరచునపుడు "నందనందను నోటి లోపల నాతిపొడగనె చరాచరంబులు, చంద్ర సూర్యులు మొదలుగాగల సకలదేవతలు..." యీ దృశ్యమును జూచిన యశోద "వెరువ వలెనని గుమ్మడంటిని వెరచితిని తెరువానుమాయము, చిరుతలను వెరపించు చందము చేస్తినో తండ్రి, కన్న బలిమిని గుమ్మడంటిని కరుణజూడుము దేవమణినను..." అని శరణమొందినది. పురాణ ప్రసిద్ధమైన దధిమథన, విశ్వరూప వృత్తాంత మిందు రమణీయముగ ప్రతిపాదింప బడినది.

శ్రీకృష్ణ దేవుడు మిత్రులతో చల్దులను భుజించుట భాగవతమున నొక మనోహరఘట్టము. దాని నాకరముగ కల్గి వాస్తవిక వాత్సల్యభావ చిత్రణమును సాధించినది. శ్రీకృష్ణుని చల్దులను పాట. ఇందు మొదట స్తుతిపరముగ గొంతభాగమున్నది. గోప కుమారులు వేకువజామున కోలల చేతబట్టుకొని స్వామిని మేల్కొలిపిరి. అతడు తల్లిని మేల్కొల్పెను. అటుపై పలురకముల చల్దుల నామె కల్పించు ఆనందయోగ స్వరూపుడైన స్వామి దశావతారముల స్తుతించి మురిసినది. అటుపై స్వామి గోవుల కాచుట కేగినాడు. వేణుగాన మొనర్చి

నపుడు దేవతా గణము పుష్పవృష్టిని కురిపించి స్వామిని సేవించిరి. అటుపై స్వామి వివిధ రాగముల నాలపింప సనకాదులు అంజలి ఘటించిరి. ఈ ఘట్టముననే గోపికలు తమ పతులను వీడి వచ్చిరి. వారి రాక గొల్లవారికి చర్చనీయాంశ మయ్యెను. కులపు పెద్దలు సమావేశమై చర్చించినపుడు 'సతినై నాయిచ్చేగాని సావంగా నోపనని'యు, "సతినిచ్చే కష్టంకంటే చచ్చుండుట మేలని" యు భిన్నాభిప్రాయములు వెలువడినవి. వారిలో వివేకి యొకడు "మన మెవ్వరు, మన పతు లెవ్వరు? తల్లి, తండ్రి, కృష్ణుడు, దాత, దైవము, గురువు, అచ్యుతుఁడే. మనకందరకి నాత్మబంధుఁడని" పలికినాడు. ఇంతలో నొక చిన్నది కస్తూరిచుక్క చేతి కన్నుల కాటుక బెట్టవచ్చి స్వామిని నిలు నిలుమనుచు పల్కినది. కృష్ణు డామెకు కన్నుగీటి వశమొనర్చు కొని నాడు. ఇదివారి చర్చలయందలి సారాంశముఁను సోదాహరణ నిరూపణమైనది. "చల్లారబోసెను చల్ది దధిచాల సాంతి వేసి మృదువుగ కలి పెను చద్ది... వాక్కాయ, పతికాయ, ఒప్పైన మామిడికాయ, ఊరీన అల్లంతోను, ఉసిరకాయను ఉంచె..." మున్నగు రుచులతోను గోపీ కృష్ణ తత్త్వము నందలి యాంతర్యముతోను నిండియున్నదీపాట.

బాల్యవృత్తాంతములలో భేరీపండు పాట మరియొక రసవన్మనోహర సృష్టి. స్వామి క్రీడించువేళ బోయె పెద్దయను నొక వనిత యడవి నుండి పండ్లను దెచ్చి రేపల్లె యందమ్ము చుండెను. నడివీధి యందామె యమ్ముచుండగా నావాడ యందలి పడతు లనేకులువచ్చి పండ్లను గొని తినుచుండిరి. పేరైన పడుచొకతె పండ్లనుగొని బలరామ కృష్ణుల కడకువచ్చి యటునిటు చూచి తిరుగుచుండగ "పద్మాక్షి చేనున్న పసిడి కంకణము పద్మనాభుడు తీసి పళ్ళాపె కిచ్చె." అపుడామె రవ్వ చేసినది. "నగవార్ని యెరుఁగవా నాకు మీ యమ్మ రోటగట్టిన నాటి రోషమ్ము సిగ్గు నీలవర్ణుండ నీకు మనసందు లేదా అల్లదుగో కంసుండు హారిఁబట్టుమన్న గొల్లబోయెన వారు కూడియున్నారు– అనియు తనకు బలగ మధికమనియు జెప్పి బెదరించి జలజాక్షి కంకణ

మును తెచ్చియున్నానెను. అప్పుడు స్వామియామె దగ్గరకువచ్చి 'నీకు కంకణమెద్ది నీ వెవ్వరనుచు పోకిళ్ళ పోకుమని పొమ్మనీ తోసె''. అంతటితో నాగక స్వామి యాబాల నోటిలో నెంగిలి గింజలుమిసి యెంగిలి తింటివని యెకసక్కెమాడెను. ఆమె యీ వృత్తాంత మంతయు తన తల్లికిని, బంధుగులకును చెప్పికొనెను. వారు కుపితులై స్వామిని చల్లకంబమునకు కట్టివైతుమనిరి. యశోద స్వామి యద్భుత కృత్యముల వర్ణించి యాతని వైకుంఠ నిలయత్వమును బ్రతిపాదింపగా వారందరు పరివర్తనము నంది "హరియిచ్చు మోక్షములు అనుమానమేల... ప్రేమార పెంచిన బిడ్డలము మేము, దయ మరువక ఉండు తల్లివని'' మ్రొక్కె. ఫలశ్రుతి యందీ ముత్తైదువు "... యెక్కువగ కృష్ణ నిన్నేమడుగ లేదు చక్కంగ ముత్తైదు తనము నాకీయి..." యని ప్రార్థించినది. గోపిక మోహనకృష్ణ గుణమునకు లొంగని పడుచు. ఆమెను సంస్కరించుట స్వామి యుద్దేశము. అడవి నుండి శ్రమించి పండ్లను తెచ్చిన వృద్ధవనితకు స్వర్గదానము స్వామి కారుణికత్వమునకును. వస్తుస్వామ్యము తొలగించుకొని స్వామిని శరణమొందవలెనని గోపికకు నీతి గరపుటలోని నిశితత్వమునకును యీ గేయ మనోహర నిరూపకమై యున్నది. తాళ్ళపాక చిన్నన్న యష్టమహిషీ కల్యాణమున కూడ నీ వృత్తాంతమున్నది.

స్వామి శృంగార లీలా విశేషము లందలి దాక్షిణ్యము కొన్ని రచనము లందు ప్రతిబింబించియున్నది. రుక్మిణి శాంత గంభీర సౌజన్యము, సత్యభామ యహంకారము, రాధ సౌందర్యము వీనియందుపాదేయమై యున్నది. వీనిలో పారిజాతాపహరణ వృత్తాంతము మరికొంత పొడిగించి రమ్యమైన సృష్టిని గావించిన పారిజాత పల్లవి గమనార్హము. పారిజాతమును భూలోకమునకు దెచ్చిన పిమ్మట "పూచిన పూలన్నీ రుక్మిణికి పూడూ వెళ్లే తుమ్మెదలై పూలన్నీ రుక్మిణిపై వ్రాలే", ఈ సంఘటన వలన స్వామి సత్యభామను మందలించుచు "వేశ్య కాంతవు గనుక నీవు పూలన్నీ ముట్టరాదు, అంట

రాద"ని పలికినాడు. (వేశ్య యనుపదము నిందార్థమున నిందే గాక తులసీదళమను పాటలోగూడ సత్యభామ పరముగా వాడబడినది.) నారదుడు వచ్చి రుక్మిణి నభినందించుట, యామె స్వామిని స్తుతించుట యీ కల్పనమునందు విశేషాంశములు. దీనిచే రుక్మిణి ప్రతిపత్తిని, సత్యభామ యల్పత్వమును నిరూపించుట జరిగినది. తులసీదళమను పాటలో రుక్మిణి మహత్త్వమును, రుక్మిణీ విజయమను పాటలో నామె యహంకార దమనమును నిరూపింప బడినది.

రాధ పాత్రను గూడ ప్రవేశపెట్టి సవతుల సమస్యలను గార్హస్థ్య జీవితపు బరిధి మేరకు చిత్రించిన మరియొక మధుర గేయము 'రుక్మిణీదేవి ముచ్చట్లు' అనునది. పారిజాతపు శయ్యమీద పవ్వళించి యున్నప్పుడు స్వామి యామెను కౌగిట జేర్చుకొని యనురాగ పూర్వకముగ లాలించుచుండెను. ఇంతలో రాధవచ్చినది. ఆమెను గూర్చిన రుక్మిణి భావము లిట్లున్నవి "ఇది ఏడ సవతి తనకు కోమలీ యిది యెవ్వతే తనకును, పిలిచినను పలుకదు, నిలచినను, నిలువదు వంచినను వంగదు" దాని కళ్లు మింటనే యుండును. కృష్ణుడు దానికంత చనువిచ్చినాడు "...ఏమి జూచి వలచెనే కోమలీ అదియెంత సుందరమ్మా పాలిట్లు చూచి వలచేదాని మంచి పలువరుస జూచి వలచే". సత్యభామ యున్నదిగాని తమయిళ్ళ కెన్నడును రాదు. రాధ యిట్లు వచ్చినపుడు స్వామి దానిని కౌగిట జేర్చి కురులు దువ్వి సర్వాలంకారముల నొనర్చెను. రుక్మిణి కంఠమున జిక్కువడియున్న (రతిచే గాబోలును) పచ్చల పతకమును స్వామి రాధమెడలో వైచెను. ఆ పతకము తనది కాదు. సత్యభామది. ఇంతలో సత్యపతకము కొరకై కబురుపెట్టినది. అచ్యుతుని పెండ్లినా డరణ మిచ్చిన పతకమునకై సత్యభామ వర్తమాన మంపగా రుక్మిణి యామెకు ఎల్లుండి యీ పాటికి వచ్చి పతకమును కొనిపోచ్చునని సత్యకు సమాధానమంపినది. ఈ లోపుగ పతకమువంటి పతకమును తీరుగా జేయింపవలెనని యామె సంకల్పము. ఇంతలో వ్యధాకలితమైన రుక్మిణీ హృదయమున

పారిజాతాది వృత్తాంతములు మెరిసినవి. ఆమె దుఃఖ మిట్లున్నది "జారుఁడికిఁ దెచ్చిచ్చెనే మా తండ్రి చోరుఁడికిఁ దెచ్చిచ్చెనే తండ్రేమి చేసెనమ్మా తన్నిచ్చి తాను తెచ్చుకొంటెని". తనమందిర మంతయుఁ జిన్నవోయి యున్నది. (స్వామి మెల్లగాఁ దప్పుకొనె నన్నమాట!) రుక్మిణి స్వామికి సందేశ మంపినది. తన యింటికివచ్చి ప్రేమపూర్వక సౌఖ్యముల నందుమని ప్రార్థించినది. ఇందు రాధా రుక్మిణీ సత్యల మధ్య స్వామి శృంగార దాక్షిణ్యమును నిరూపించుటకై మనోహరమైన గార్హస్థ్యభావస్ఫోరక కల్పనము గమనార్హము.

అష్టమహిషుల గర్వరేఖల నడంచుటకై స్వామి వేట కేగినపుడు చెంచితను వరించి తెచ్చిన యొక కథ మిక్కిలి ప్రసిద్ధమైనది. ఇందు స్వామి శృంగార నాయకత్వమున నున్న చొరవ, యష్ట మహిషుల నాతడదుపులో నుంచిన వైనము మిక్కిలి రసవంతమైయున్నది.

స్వామిపాత్ర కేంద్రముగ వెలువడిన విశిష్ట కల్పన మొకటి పూర్వోక్త గ్రంథములలో మూడవదాని యందున్నది. దీనిని హరిజనస్త్రీల నుండి సేకరించినట్లు సంకలనకర్త చెప్పియున్నారు. ఇందు తెలంగాణపు జీవితము, నుడికారము, సాంఘిక వ్యవస్థ ప్రతిబింబించుచున్నవి. ఇది యిటీవలి కాలమునకు (భూస్వామ్య యుగమునకు) చెందియుండ వచ్చునని యందలి కథావస్తువును బట్టి యూహింప దగియున్నది. ఇది వుయ్యాలపాట. ఒకగోపి చక్కగ నలంకరించుకొని గృహకృత్యములు నిర్వహించి, ప్రాతః కాలమున తన యత్తదగ్గరకు బోయి, తాను పొలమునకు పోయి పశువులను చూచివత్తునని చెప్పినది. ఎర్రగొల్లల కులమువారు బయట కేగరాదనియు, కోటిమాయలవాడైన గోపాలకృష్ణుడు బుద్ధులు చెరుపుననియు, అష్టభార్యలున్నను తానుకంట బడినచో వదలడనియు, హెచ్చరించెను. గోపి వినలేదు. తన సౌందర్యస్ఫూర్తి నించుక సడలించి పోనే పోయెదనన్నది. అత్తాకోడళ్ళమధ్య సంభాషణము జరిగినది. "సీరసక్కానేమొ యిడిసేతు

నత్తా, రవిక సక్కా నేమె యిడిసేతునత్తా, సొమ్ముల సక్క నేమొ యిడిసేతు నత్తా" అని కోడలనెను. "సీరేమి సక్కన సిన్నాలు సక్కన, రవికేమి సక్కన రంగులు సక్కన, సొమ్మేమి సక్కన సొగసులు సక్కన" యని నదత్త. కడకామె వాడ వాడల తిరిగి పెరుగు లమ్ముకొని వచ్చుటకు బయలుదేరినది. మరల స్నానాదులు నిర్వహించి యలంకృతయైనది. "బంగారు కడ్డీల సీరగట్టినాది వెండి పట్టు రవిక ఎన్నులు మెఱియంగ పచ్చపట్టూ రవిక పక్కలు మెరియంగ..."బయలు దేరినది. తూర్పుగాలికి పడమటి గాలికి కురులు కదలుచుండగా కోటి సొమ్ములు పెట్టుకొనిన గోపి కలువ కన్నుల గాటుక బెట్టుకొని భోజనము చేసి గంప నెత్తుకొని తమలపాకు వంటి దరువాజదాటి చదువులు సెప్పు సాలలు బజారుదాటి, ఊరుదాటి బొడ్డురాయి దాటి పసువు కోటలు దాటి కారడవిని బడి పోవుచుండెను. కోటి మాయలాడైన కృష్ణస్వామి తనతోడి గొల్లలను, అష్ట భార్యలను విడిచి యామెను వెంబడించెను. గోపి కడ్డము వచ్చెను. గోపిని కన్నులలో చూచుకొనెను. గోపాల స్వామి యామెను నిలువరించి కోరి తన మాటకు బదులు చెప్పుమనెను. గోపి స్వామిని మాపటికి రమ్మనెను. అత్తమామ లెందు పోవుదురని, బావ లెందు పోదురని, మగ డెందు పోవునని స్వామి ప్రశ్నింప నామె యన్నిటికి సమాధానము చెప్పి తానుండు మేడ గుర్తు చెప్పెను. స్వామి తనపై మచ్చిక నిలుపుమని చెప్పి వెడలిపోయెను. పిమ్మట గోపి గంప యెత్తుకొని బావల కడకు పోవ, వారు రొమ్ములు బాదుకొని అంబలి గంపలు దించి యెట్టిగొల్ల కులమునకు చెందిన యామె యట్లు వచ్చుట తగదనిరి. వారును స్వామి వైనమునే హెచ్చరించి అంబలి త్రాగి జాగ్రత్తగా పొమ్మని హెచ్చరించిరి. మగడైన ఎరగ్రిన యట్లే చెప్పెను. తాను మేడకు వచ్చినది. ఇంతలో స్వామి తల్లికి తెలియకుండ తాళమందుకొని యత్తింటి కోడలి కొంగును బట్టెను గావున నామె కందగించు

సొమ్ములు, పువ్వులు మున్నగునవి మూటగట్టుకొని వచ్చి తలుపు తట్టినాడు. తాను తెచ్చిన వన్నియు నిచ్చినాడు. ఆమె సర్వాలంకృతయై "నిలువు టద్దంలో సూసుకొనే గోపి కిలకిలా తాను గోపి నవ్వినాది. నవ్వుకొనీ గోపి చిన్నబోయీనాది, పొన్న బంతీవోలె వాడి పోయీనాది, ఆడుమల్లీవోలె జారి పోయీనాది." ఆమె వెన్నదనము నకు స్వామి కారణ మడుగగా, నేడు వారముల సొమ్ములు ధరియించి నను వేలి ఉంగరము లేకపోయినదని చెప్పి యామె స్వామి చేతి యుంగరము తన చేతికి పెట్టుమనినది. తనది మాయ ఉంగరమనియు, నెవ్వరైన చూచినచో గుర్తింతురనియు స్వామి చెప్పెను. పొద్దుటి వరకు వేలికి పెట్టుకొని అటుపై దాచుకొందునని గోపి చెప్పినది. స్వామి యుంగర మిచ్చినపుడు గోపి నవ్వి చేతికి పెట్టుకొనినది. "ఆకునా గడిసేపు ఆటలాడినారు. పోకనా గడిసేపు పొంది వున్నారోయి, సున్నాన గడిసేపు జూదమాడినారు. కలిసి మెలసీ వారు కలె నిదరబోయినారు." తెల్లగా తెలవారినది. స్వామి వెడలుచు నుంగరము నడిగినాడు. ఆమె తన వారు చీరలను గూర్చియు, రవికలను గూర్చియు ప్రశ్నించినచో నేమి చెప్పుదు నన్నది. స్వామి రంకు నేర్చినది బొంకవచ్చుననినాడు. ఆభరణములను, సెల్లాలను నామె కిచ్చి బయలుదేరినాడు. ఆమె యాతని పోనీయక తలుపు మూసి యడ్డు నిలిచినది. స్వామి తలుపు తీయుమని యాప్ట పడుచుండగా, నామె కిలకిల నవ్వుచు నిలువబడి యెంత బ్రతిమాలినను తలుపు తీయలేదు. స్వామి యెల్లరకీ వృత్తాంతము చెప్పి యామె గుట్టు రట్టు చేతునని బెదిరింప నామె పూర్వము వలె చిన్నబోయి పొన్న బంతివలె నారిపోయినది. చక్కని స్వామి వేపల్లె వాడకు వచ్చి యలంకృతుడై పశేలు వేసమున గోపి మేడకు పోయి మందను తన కప్పగింపుమని కోరినాడు. అటుపై స్వామి పూనిక వలననే యుంగరపు వృత్తాంతము బయటపడుట, స్వామి గోపి బావలను, మగనిని కలుసుకొని వృత్తాంతమును చెప్పుట, గోపి విరక్తయై పరిభ్రమించు

చుండ స్వామి యామెనాయుకొని యామెను మరల పటేలు హోదాలో పంచాయితీ చేసి, అత్తమామలు, బావలు, మగడు సమాధానము పడునట్లు చేసి యామెను తిరిగి మేడకంపుట యిందలి వృత్తాంతము.

ఈ కథా వృత్తాంతమున ప్రత్యేకించి చెప్పదగిన యంశములు లేవు. వ్యంగ్య మార్గమున కృష్ణుని పారదారిక శృంగారము, హరిజన మహిళల యూహా పద్ధతి, గమ్యమాన మగుచున్నది. పటేలు వృత్తాంతమున స్వామి ప్రతిరూపము చక్కని కల్పనము. రచన మసంస్కృతమైనను రమ్యముగ నున్నది.

ఇట్లీ జానపద వాఙ్మయము, స్త్రీల పాటలు భిన్న భిన్న కక్ష్యలకు చెందిన వ్యక్తులచే దర్శితమైన కృష్ణ కథాంశములకు నిలయమై, ప్రాయికముగ మార్గ సాహిత్యము నందువలెనే యుచ్చనీచ దృక్పథములను ప్రతిబింబించు చున్నది. వీనిలో నెక్కువ రచనముల కర్తృత్వాదులు గమ్యమానములు గావు. అజ్ఞాత రచయితలచే నచ్ఛ మార్గమున సాగి వచ్చిన కృష్ణకథా నిరూపణ మెట్లుండునో పై పరిశీలనము వలన విశదమగుచున్నది. అందలి భావముల యౌన్నత్య నిమ్నత్వము లట్లుంచి యది స్వచ్ఛమైన సెలయేటి యూట వంటిది.

## శతకములు – అష్టకము

ఆంధ్ర వాఙ్మయమున శతక మొక సాహిత్య ప్రక్రియ. దీని కొక సువిశాల పరంపరాగతమైన చరిత్ర యున్నది. శతకము లనిబద్ధ కావ్య పరంపరలో జేరునట్టివి. అందుచే వీని యందలి క్రమ వికాస విస్తృతులను నిర్దేశించుట సాధ్యము కాదు. శతకములందు కొన్ని సామాన్య లక్షణములు గలవు. ఇవి ప్రాయికముగ తత్కర్తయొక్క హృదయాంతర్గత భావనా మార్గమునకు ప్రతిబింబములై యుండును. భిన్న దైవతముల స్తుతించు భక్తి శతకములు, నీతి వైరాగ్యాదుల

బ్రతిబింబించు శతకములు మున్నగు ననేక మార్గము లిందు గోచరించును. అన్నిటి యందును నాయా భావముల ప్రతీయమాన మొనర్చు నెడ నాత్మీయనివేదనము, సమకాలీన పరిస్థితులపై వ్యాఖ్యానము, కవికి ప్రీతి పాత్రములైన వివిధ భావముల ప్రవచనము సామాన్య లక్షణములై యుండును. ఆంధ్ర వాఙ్మయమున ప్రసిద్ధములైన శతకము లన్నియు ప్రాయికముగ నీ లక్షణములను ప్రతిబింబించును. ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర శతకమువలె నొక సువ్యవస్థితమైన శిల్ప స్వరూపము, నిబద్ధ కావ్యములతో తులదూగ గల కవిత్వ పరిపాకము, కొన్ని శతకము లందు మాత్రమే వ్యక్తమగుచుండును. ఇతరము లనేకములు కవి యొనర్చిన యిష్ట దేవతా స్తుతి పరముగనో, కవిత్వ సాధనాస్థితి నిరూపకములుగనో భాసించును. ప్రాచీన యుగము నుండి సవ్య యుగిమువర కవలోకనము చేసినచో వీని సంఖ్యయు నపారముగనే యున్నది.

ఇవి యనిబద్ధ ముక్తక ప్రాయము లగుటచే వీని యందలి యంశముల యనుశీలనము ప్రస్తుత దృష్టిలో మిక్కిలి పరిమితమైనదే. కృష్ణ సంబంధ శతకములు రచించినవారు సాధారణముగ నవతారాంశముల ప్రస్తావనము, వివిధ ఘట్టముల నుక్తి విశేషములతో వ్యాఖ్యానించుట, సమకాలీన విషయముల పైనను, తాత్త్విక విషయములపైనను భిన్న వ్యాఖ్యానములు చేయుట- అను ప్రణాళికను పాటించినారు. భిన్న కథా సందర్భముల వ్యాఖ్యానించుపట్ల వీరెల్లరు పురాణోక్త మార్గమునే యవలంబించినారు. కావున కృష్ణకథా విస్తృతి ననుశీలనము చేయునెడ నీ వాఙ్మయ ప్రక్రియ స్థానము మిక్కిలి పరిమితమై యున్నది. కాగా వివిధ సంస్కారములకు చెందిన కవుల హృదయములలో కృష్ణకథా గతములైన యంశము లెట్లు ప్రతిఫలించినవో, యందలి వైచిత్రు లెట్టివో ప్రముఖ శతకముల నాధారముగ గొని దిఙ్మాత్రముగ నిర్దేశించుటయే యీ శీర్షిక యందలి విషయము.

ఈ యనుశీలనమున నుల్లేఖింపబడిన శతకములు నాల్గు సంపుటముల నుండి గ్రహింప బడినవి.[140] ఈ శతక పరంపరలో పూర్వోక్త సాధారణ లక్షణములతోబాటు కతిపయ విశిష్టాంశములు కల్గిన శతకములు మాత్రమే ప్రసక్తములగు చున్నవి. వీనిలో మున్నుగ నెన్నదగినది వెన్నెలకంటి జన్నమంత్రి రచించిన దేవకీనందన శతకము. కృష్ణకథా సంబంధ శతకకర్తలలో నీతడు మొదటివాడు. ఇతని కవితా పద్ధతియు, భావనామార్గమును రమ్యగంభీరమై యున్నవి. అర్వాచీన కవుల కాదర్శప్రాయములైన యనేక శతక రచనారీతుల కీతడు ప్రారంభకుడైనాడు. తన శతక రచనా ధ్యేయమును ప్రస్తావించుచు "కొండల్వంటి కవీశ్వరుల్ శతకముల్ గూర్పంగఁ గోటానకోట్లుండన్ నీవునుఁ జెప్పఁ బూనితి వదేమో యంటివా వింటివా వండే నేర్పులఁ బెక్కురీతుల రుచుల్ వర్తింపవే శాకముల్ దండిన్ నా మన వాలకింపు మదిఁగృష్ణా దేవకీ నందనా" (10). కృష్ణ స్వరూప ప్రతిపాదనమున నీతడు పురాణ ప్రసిద్ధమైన మార్గమునే యవలంబించి యందు దృశ్యస్ఫోరకమైన శబ్దశక్తిని ప్రదర్శించినాడు. "నీడల్ దేరెడు చెక్కుటద్దములతో నిద్దంపుఁ గెమ్మోవితో కూడీకూడని చిన్నికూఁకటులతో గోపార్భక శ్రేణితో వ్రీడాశూన్య కటీర మండలముతో వేడ్కన్ వినోదించు..." (4) శైశవమూర్తి నీతడు దర్శించినాడు. స్వామిని వివిధమార్గముల వివిధ వ్యక్తులెట్లు ప్రసన్నునొనర్చుకొని ధన్యులైరో యను నంశము సమగ్రముగ నీతడు ప్రతిపాదించినాడు. "అమరుల్ మ్రొక్కులచే మునుల్ నుతులచే, నార్యుల్ మహానిష్ఠచే, సమరోత్సాహజనుల్ పునశ్చరణచే, సాధుల్ దయాబోధచే, నమితోదార కలాఘ్యులర్పణలచే వధ్యాత్మ్మలైక్యంబుచే సమతంగాంచిరి మీ పదాబ్జములు..." (7) అని చెప్పుట యిట్టిది. జప

140. భక్తిరస శతక సంపుటములు- వావిళ్ళవారిచే ప్రకటింపబడినవి. 1,2,3 సంపుటములు. శతక సముచ్చయము-ద్వితీయభాగము-కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు ప్రచురణము-1933.

వ్రతాదుల కన్న భక్తి మార్గమే స్వామికి ప్రీతికరమను నభిప్రాయము నీతడు ప్రకటించినాడు. కాళీయ మర్దనమును వర్ణించుపట్ల నీతడు ప్రౌఢోజ్జ్వలము, వస్తూచితమునైన శైలిని విన్యసించినాడు. "హాలాహాల శిరోధి హాళినయనోద్యద్భీమ ధూమధ్వజ జ్వాలాభీల కరాళరూక్ష విష నిశ్శ్వాసోష్ణ కృష్ణాన దాంభో లీలాస్పద కాళీయస్ఫుట నటద్భోగాగ్ర మధ్యంబునన్ హాళిన్ దాండవ మాడు నిన్ దలంతు..." (28). తుదకు ప్రపత్తి మార్గమున నించుక విమర్శను మేళవించి చెప్పిన యీ పద్యము మిక్కిలి ప్రసిద్ధమైనది. "కరి నేలింది హుళక్కి ద్రౌపదికిఁ గోకలే మెచ్చి యిచ్చింది దబ్బర, కాకాసురునిం గటాక్షమునఁ జేపట్టిం దబద్ధమ్ముహో, శరణన్నన్ బగవాని తమ్మునికి రాజ్యంబిచ్చుటల్ కల్ల; యుత్తరి నన్నేలిన నిక్కమీ కథలు కృష్ణా దేవకీ నందనా" (100).

పిమ్మట ఉన్నవ యోగానందకవి రచించిన రాజగోపాల శతకమున కొన్ని విశేషములున్నవి. ఇందు కృష్ణ కర్ణామృత ప్రభావము గమనార్హము. "అమ్మ! ఏమిర యాదవాగ్రణీ? గిన్నె దే; ఏలరా చమకంబు? పాలుఁ ద్రావ; నిపుడు దుగ్ధములు లే; వెప్పుడుఁ గల్గును? నంధకారపు వేళ..." (35) అనుమార్గమున తల్లితో స్వామి సంవదించినాడు. వెంటనే కన్నులు మూసి యర్ధరాత్రము వచ్చినది కావున పానపాత్రము నిమ్మని యశోదకడ గారా మొనర్చినాడు. ఇందు స్వామి సూర్యచంద్ర నేత్రుడు కావున తదున్మీలనమున నిశి ప్రాప్తించెనను రమ్యార్థ స్ఫురణము గమనార్హ మగుచున్నది. స్వామి నవరస ప్రతీక యెట్లో యీతడు రమ్యముగ నిరూపించినాడు. "సతులు శృంగారంబు, దితిజులు వరంబు, భూసురుల్ కరుణ, యద్భుతము జనులు, హాస్యంబు రుక్మికుండల, జరాసంధుండు భయము, పౌండ్రకుఁడు బీభత్సరసము, రౌద్రంబు భీష్ముండు రమణీయ శాంతబు శిశుపాలుఁ డెఱుఁగంగఁ జేయునట్టి నవరసాలంకార భవదీయ నామంబు..." (69). ఇందలి సమన్వయము సువ్యవస్థితమై యున్నది.

కరుణమను పదము మాత్రము శాస్త్ర నిష్కర్షను పాటింపక దయార్థమున ప్రయుక్తము.

ఈ కోవలో నెక్కువగ చమత్కారోక్తులను, వ్యాజస్తుత్యాదులను పాటించినది ఆంధ్రనాయక శతకము. "కన్నవారల మున్నె కారాగృహంబున విడిచి పారితివి నీకడిమియేమి? పగవాడు పురిటిలోఁ బట్టి నెత్తుకపోవ దమకించుచున్న నీ ధైర్యమేమి? ముద్దుమన్మని గోప్యముగ నొండు బంధింప దెలియనట్లున్న నీ తెగువయేమి...." (20) మున్నగు ప్రశ్నములు, "వ్రేపల్లెలో గొల్ల వెలఁదులు గొట్టరా దోడి దోడి యిల్లిల్లు దూరలేదా! రాసకేళికయందు రమణులా యెందరో చుట్టుపట్టిన బార జూడలేదా!..." (25) మున్నగు సూక్తి విశేషములిందు కొల్లలుగ నున్నవి. స్వామి దయారసము ప్రసరించుటలో జరుగు నాలస్యము నీతడు వ్యంగ్యముగ ప్రతిపాదించెను. "పక్షంబుఁ గలదండ్రు పాండుపుత్రుల యందుఁ బాండవుల్ పడినట్టి పాటులేమి... యల కుచేలునకు బాల్యస్నేహితుఁడవండ్రు నెరిఁ గుచేలుఁడు పడ్డ నెవ్వలేమి!" (43) మున్నగు భావము లిట్టివి. అటుపై రుక్మిణీపతి, ముకుంద, పార్థసారథి, మాధవ, వసుదేవనందన, శ్రీకృష్ణాది శతకములు పూర్వోక్త రచనా మార్గమునే ప్రతిబింబించు చున్నవి. కాగా పరమానంద యతీంద్రులు రచించిన శివముకుంద శతకమున హరిహరాద్వైత ప్రతిపాదనము, తాత్త్విక ప్రవచనము గమనార్హమై యున్నవి. "శతక సముచ్చయము"న పైడిపాటి వేంకటనృసింహ కవికృతమైన మన్నారు కృష్ణ శతకమున్నది. తక్కిన విషయములన్నియు పూర్వోక్త శతకరీతులనే గలిగియున్నను నిందొక విశిష్టమైన ప్రణాళికయున్నది. శతకమును మొత్తమును స్తుతి, దాససంగతి, పితృ, మాతృ, బాల, చోరత్వ, జారత్వ, గోపాలన, దుష్టనిగ్రహ, శిష్టప్రతిపాలక, అవతార, నీతి దశకములుగ విభజించి కృష్ణావతార కథాఘట్టముల నన్నిటిని మధురశైలిలో నీతడు రచించినాడు. "అజ్ఞానుసరణ గోపార్భక రాజితో రాజిలోత్ఫుల్ల వక్త్రంబు

తోడు గోధూళి ధూసరాంకుర కుంతశాలితో లాలితోజ్జ్వల నిటలంబు తోడఁ గలితదండన దండ కరతల పాళితోఁ బాలితోదార గోపతతి తోడఁ, బరిపంథి భంజన ప్రఖ్యాత కీర్తితోఁ గీర్తితోరు తరాంగ మూర్తితోడ...'' (69). మంద కేగునట్టి గోపాల స్వరూపము రమ్యమై యున్నది. ఈ విధముగ శతకవాఙ్మయము కృష్ణ కథాంశములను, కతిపయ తాత్త్విక విశేషములను ప్రతిబింబించుచున్నది.

ఇటుపై పరిశీలింప వలసినది యష్టకప్రక్రియ. అష్టకమనునది యెనిమిది పద్యములతో గూడిన యలతి రచనా విశేషము. ఇది మత్తకోకిలమునుగాని, రగడభేదములనుగాని, ఉత్పలమాలాది ఛందములను కలిగి మంగళ, శృంగార, నీతి, స్తుత్యాదిమార్గములలో నుండును. ఇదియు ముక్తక మార్గమునకు చెందియే యుండును. ఒకానొక నిర్దిష్టమైన యంశముపై కవియొక్క భావనా రచనా వ్యాపారములు పర్యాప్తములగుట యిందలి పద్ధతి. ప్రస్తుతానుశీలనమున గమనార్హమైనది. కందుకూరి రుద్రకవి రచించిన జనార్దనాష్టకము.[141]

ఇందు శతకములలో వలెనే కథానుశీలనమునకు తావులేదు. ఒక నాయిక, రాధగాని, గోపిక గాని కావచ్చును, శృంగార భావావిష్టమైన స్థితిలో స్వామిని గూర్చి తలపోయుట, స్వామి దాక్షిణ్య శృంగార మూర్తియై యామెకు సన్నిధి నొసంగినపు డామె భిన్ననాయికా లక్షణముల నిరూపించు భావప్రపంచమును ప్రకటించుట, యిందలి విషయము. జాను తెనుగు సోహాళింపులతో సుకుమార భావనా విశేషములతో నీయష్టకము మత్తకోకిలయందున్నది. "సిరులు మించిన పసిఁడి బంగరు జిలుగుదుప్పటి జాఁరగా చరణ పద్మముమీఁద దేహము చంద్రకాంతులు దేరగా, మురువుచూపుచు వచ్చినావో మోహనా

141. ఈ యష్టకములతో బాటు లభ్యములైన యితరాష్టకములను సేకరించి నిశిత పరిశీలనా పూర్వకమైన శ్రీ ఆరుద్ర పీఠికతో ఆనందమోహన కావ్యమాల వారు ప్రచురించిరి. ఊహ ఎంటర్ ప్రైజెస్ 1. పైక్రాఫ్ట్స్ గార్డెన్స్, మద్రాసు-6. మొదటి ముద్రణ 1966.

కృతి మీరఁగా గరుడవాహన, దనుజమర్దన కందుకూరి జనార్దనా” యనునదీ యష్టకమున ప్రారంభము. ఇట్లు వచ్చిన స్వామి వాలకమును జూచి నాయిక యించుక కుపితయైనది. తానాన పెట్టినను స్వామి యంతకు మున్ను రాలేదు. మొన్న పిలచినను వినిపించుకొనకయే పోయెను. అంతకుమున్నొక నాడు తాను చూచుచుండగనే గడిచి పోయెను. చిరుకోపమున కాని లేరా దనుజమర్దన యని తలయూపిన నాయిక స్వామి రూపమును నిశితముగ బరిశీలించి పెదవిపై మొలక కెంపులు, చెక్కిలిపై కత్తిగోరుల గీట్లు గమనించినది. ఆయన మరియొక చెలితో గూడి యున్న వైనమును పసికట్టినది. తానా వృత్తాంతము నొకతె వలన విన్నమాత్రమే కాదు. కన్నులార చూచినది కూడ. కావున పసుపంటిన జిలుగుదుప్పటి మున్నగు లక్షణముల పురస్కరించుకొని తెల్లవారిన దాక నాతడెక్కడ తిరిగెనో కల్లలాడక చెప్పుమని నిలదీసినది. ( స్వామి యామెను దగ్గరి బాసలుచేసి ప్రసన్న నొనర్చుకొనుటకు యత్నించుచున్నాడు.) “దబ్బులన్నియు తెలుసుకొంటిని. తప్పుబాసలు సేయకు మబ్బుఁ దేరెడి కన్నుగవతో మాటిమాటికి డాయకు ఉబ్బుచేసుక తత్తరంబున నొడలిపై చెయివేయకు” అని స్వామి గబ్బితనమును నిలువరించి, పూర్వము వారిరువురు కూడి యున్న వైనములు ఆయెబోయెననియు, మండి పడుటవలన లాభము లేదనియు ననుచునే నాయిక స్వామికి లొంగిపోయినది. స్వామి నాయికలను గుణములెరిగి యేలుకొనగలిగిన రసికుడు కావున మదనకేళికి జాణ కావున నూరునేమియు చేయజాలని నాయిక రుసరుసలాడుచునే స్వామికి వశవర్తిని యైనది. అప్పటి సంయోగ శృంగార ప్రతీకమైన యీ వర్ణనము లోకోత్తరభావ పారమ్యము నంది యున్నది! “జంట నేత్రము లంటి చూచితె జాజిపూవులు పూసెరా మింటి త్రోవనుఁ జూచుచుండఁగ మేఘవర్ణము గప్పెరా కంటిలో నొక పండు వెన్నెల కాయుచున్నవి యేమిరా కంటిలేరా దనుజమర్దన కందుకూరి జనార్దనా”. ఈ విధముగ స్వల్పావకాశమున స్వామి శృంగార భావ

చిత్రణమును వ్యంగ్యమార్గమున రసపర్యవసాయిగ చిత్రించిన జనార్దనాష్టక మీకోవలో ననన్యమైన రచన మగుటయే గాక శృంగార కృష్ణకథా కావ్యముల సముదాయమున గూడ నొకస్థాన మాక్రమింప గల విశిష్ట రచనము.

ఇట్లుగా శతకాష్టక వాఙ్మయముల కృష్ణకథాంశములు ప్రతీయ మానము లగుచున్నవి.

# ఖండ కావ్యములు

నవ్యాంధ్ర సాహిత్యమున ఖండకావ్యము లనునవి మిక్కిలి ప్రచారము నంది యున్నవి. ఇవి విశిష్ట సాహిత్య ప్రక్రియా స్వరూపములుగ ననేక నవ్య కవులచే రూపొందింపబడి యున్నవి. ఇవి యును సంఖ్యయం దధికములే. వీని కన్నిటి కొక సామాన్య లక్షణ మును గాని, క్రమ వికాస మార్గమును గాని నిర్దేశించుట సాధ్యము కాదు. కొన్ని స్థూలాంశములు మాత్రము ప్రస్తుతానుశీలనమున కవసరమైనంత వరకు నిర్దేశింప వీలగుచున్నది. వీనికి కథా వస్తు స్వీకృతి యందొక నియమ బద్ధమైన వ్యవస్థలేదు. సాంఘిక చారిత్రక పౌరాణికములలో నేదియైన స్వీకృతము కావచ్చును. అట్టి కథ మిక్కిలి సంక్షిప్తమై కవి యుద్దేశించిన మేరకు భావచాలనమున కవకాశము కల్పించునదియై యుండును. కొన్నిటియం దసలు కథా వస్తువుతో నిమిత్తము లేకయే చిన్న భావములయొక్క క్రమ విస్తృతి కాకరము లభించియుండును. ఈ రెండు పద్ధతులలో పూర్వ కావ్యములకన్న మిన్నగ కవియొక్క యాత్మీయతా నిరూపకము లైన భావములకు స్థాన ముండును. ఈ కారణముల వలననే ప్రాయి కముగ నవ్యఖండ కావ్యముల యందు భావుకత ప్రధానమై యుండును. కవులు తమ కిచ్చవచ్చిన సిద్ధాంతములను గాని, భావనా విశేషములను గాని యిందు స్వేచ్ఛగా ప్రచలితమొనరుచుట

కవకాశమున్నది. కథా వస్తువు స్వీకరింప బడిన వానిలోను, లేని వానిలోను స్వల్పావకాశమున సహృదయులకు రసభావ స్పందనము కలుగును. అట్టి లక్షణమును సాధించుటకై ఖండ కావ్యముల రచించు కవులు సాంద్రమైన భావనా మార్గమునకు, దీప్తి మంతమైన భావ పోషణమునకు ప్రాధాన్య మొసగుదురు.

ప్రస్తుతాను శీలనమున కృష్ణ కథాంశములను గాని, తద్గత భావనా విశేషములను గాని ప్రతిబింబించిన ఖండకావ్యములలో విశిష్ట లక్షణ లక్షితములైనవి కొన్ని గ్రహింప బడినవి. అసంఖ్యాకముగ నున్న యీ ఖండకావ్య సందోహములో నే కొన్నిటినో యెన్నుకొని యనుశీలన మొనర్చుట క్లేశముతో గూడిన విషయము. వాని యధిక సంఖ్యయే యిందులకు కారణము. చిన్నకవియైనను, పెద్ద కవియైనను నేదో సందర్భమున స్వామినిగూర్చి నాలుగు ముక్కలు వ్రాయక పోడు. వానిని పట్టికా ప్రాయముగ జేర్చినను అది ప్రస్తుత సిద్ధాంత వ్యాసమంత దీర్ఘమగును. కావున ప్రసిద్ధిని బట్టియు, గ్రంథము నందలి వైశిష్ట్యమును బట్టియు నెన్నుకొనుట యను పద్ధతి తక్కిన శీర్షికల వలెనే యిందును తప్పనిసరియైనది. ప్రస్తుత విషయమునందలి సర్వ భావములకు వీలైనంత యంగాంగీ భావకల్పనమును సాధించు ప్రయత్నమున నిదియొక భాగము. కావున నీడజ్ఞాతృ నిర్దేశమున స్వీకృతములైన ఖండికలే కాక యపారముగ నితరములు నున్నవి. ఏదేనొక పశిష్టత కాకరము లైనవే యిందు గృహీతములు. అవి యాయా మార్గముల రచనములకు ప్రాతినిధ్యము వహించుటన్న విషయము పూర్వ సందర్భములవలెనే యిందును అనుసంధేయము.

ఇట్టి ఖండ కావ్యసందోహమున మున్నుగ కథాస్వీకృతిని బట్టియు, రచనా శిల్పమును బట్టియు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రచించిన కావ్యఖండములు కొన్ని ప్రసక్తము లగుచున్నవి, అందొకటి భ్రమరగీతలు. ఇందు స్వామి యుద్ధవుని వ్రజమునకు రాయ

బారిగ సంపుట, వారాతనితో ప్రసంగించుట ప్రధానమైన యంశ ములు. ఇందు సాంప్రదాయిక మార్గమున భాగవతార్థము ప్రౌఢ కావ్యశిల్పముచే వ్యక్త మొనర్ప బడినది. మరియొకటి శృంగార వీధి (4) అను పేరుకల గోపికా గీతలు.[142] ఇందు గోపికలు స్వామికై యన్వేషించెడు ప్రసిద్ధ ఘట్టము చింత, అన్వేషణ, సాక్షాత్కార ఖండములను మూడు భాగములుగ రచింపబడినది. అన్వేషణము నందు గోపికలు స్వామియొక్క రూపవైభవమును పూర్వ వృత్తాంత ములను తలపోయుచు, సంచరించుట, సాక్షాత్కారము నందు స్వామి వాఙ్మనసాతీతమైన తత్త్వమును గోపికలు సన్నిధి పూర్వకముగ సాక్షాత్కారమునందుట ప్రధానాంశములు. వీనియందు ప్రసిద్ధమై యీ యనుశీలనమున పెక్కుతావుల ప్రసక్తినిబట్టి నిరూపింపబడిన విశ్వనాథవారి సాంప్రదాయిక భావనా రచనా శిల్పములు వ్యక్తమగు చున్నవి.

సాక్షాత్తుగ కృష్ణకథా ప్రసక్తి లేక పోయినను హృదయ నివేదనా పూర్వకమైన యార్తితో వాసుదేవ తత్త్వము నందలి యంతర్యామిత్వమును నారాధించిన మరియొక నవ్య కావ్యము (శ్రీ) నాయని సుబ్బారావు రచించిన వేదనా వాసుదేవము.[143] ఇందు భంగ్యంతరముగ శతక రచనా మార్గము ప్రతీయమాన మగుచున్నది. తన జీవితము నందు "ఏదో వేదన పుట్టి యెందు కొ అకో హృద్గర్భ మందార్త రక్షా దక్షున్ నినుఁ జుట్టి పట్టుకొని తీగల్ సాఁగి..." (పుట 39) రూపొందిన పద్యపుష్పచయమిది. ప్రాయికముగ జీవితము నందలి భిన్న భావ వ్యాప్తులను స్వామి లీలా పర్యవసానముగ భావించి, అన్నిటి యందును ఆయన యునికిని గమనించి పర మాస్తిక్య భావముతో ప్రసన్న గంభీర శైలితో రచింపబడిన

142. ఈ రెండును వి. యస్. యన్. అండ్‌సన్స్- మారుతీనగర్-విజయవాడ-4- ప్రచురణములు.

43. ఆంధ్ర సారస్వత పరిషత్తు - తిలక్‌రోడ్. హైదరాబాదు. 1. 1970

దీ కావ్యము. "నిను నిర్వాసితుఁ జేయ నేనెవరు తండ్రి! చీమవై బ్రహ్మవై యనిరుద్ధాకృతి విశ్వభూ భువనముల్ వ్యాపించి నీవుండఁగా మినహాయింపవు నేమి నా యెడద, స్వామీ! తప్పువచ్చెన్ బిగించనులే తల్పిశ సర్వజీవ హృదయస్థా! వాసుదేవ ప్రభూ!" (పుట. 12) వంటి భావతత్త్వ స్ఫోరకములైన పద్యము లిందున్నవి. "పుట్టిన కొట్టు కన్మొరగి పోయి నిశీథము నందు నేటి యాగట్టున గొల్లపల్లె నొక కాపురమై తదనంతరంబు చేపట్టిన పట్టణమ్మొకని బారికి నగ్గముగా పయోధిలో కట్టిన కొంపయే శరణుగా మను దేవుఁడ వేమిసేయవున్" (పుట 18) వంటి యుక్తి విశేషము లున్నవి. "అలుకా నాపయి నీదు గుర్తెరిఁగి నిన్నంతంత జిక్కించుకో నలయందిమ్మరు నాదు చిత్తమున దృశ్యాదృశ్య లీలా సమాకుల మాయా మిళితాకృతి ప్రభలు పోగుల్ వోసి మోసంపు దాగిలి మూతాటల దిమ్మొగొల్పెదవు పో గీతా రహస్యాకృతీ" (పుట. 20) వంటి కృష్ణ తత్త్వ నిర్దేశనాత్మక భావస్ఫూర్తి యీ కావ్యమున నెడనెడ గలదు. నవ్య యుగమునం దుదాత్త పద్యరచనా శిల్పమునను, భావ సౌకుమార్యమునను లబ్ధ ప్రతిష్ఠులైన నాయనివారి కవితా సంస్కారము వాసుదేవతత్త్వమున న్యస్తమై భాసించిన రమణీయ సృష్టి యిది.

శ్రీ మాధవపెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి రచించిన బృందావనము మహోదాత్త ఖండ కావ్యము.[144] నవ్య కవులలో మాధవపెద్ది వారిదొక ప్రత్యేక మార్గము. ఒక క్షణమున హాస్య స్ఫోరకత్వము చేతను, ఆంగ్ల భాషాపద ప్రయోగాది వైలక్షణ్యముల చేతను, సన్నివేశమును క్రొత్త కోణము నుండి దర్శించుట చేతను, పాఠకులను నవ్వింప జేయుగలడు. మఱుక్షణమున మానవతా ఘట్టమున లోతులను బట్టి వర్ణించి కంట తడి పెట్టింపగలడు. ఈ రెంటిలో సామాన్యమైనది యచ్చపు దెలుఁగు నుడికారముతోను, సుందర

144. ప్రచురణాది వివరము లిందు లేవు.

భావనా బలముతోను నిండి జాలువారు హృద్యశైలి. గుండె లోతుల నుండి దూసికొనివచ్చి పాఠకుల గుండె లోతులలో దూసికొనిపోవు భావసైశిత్యము గల కొలదిమంది నవ్య కవులలో నీతడొకడు. బృందావనమను ఖండకావ్య సంకలన మందు బృందావనమను శీర్షిక యిందు ప్రసక్తము. ఇది కవి హృదయ నివేదనాపూర్వక ప్రార్థనము. పద్య సంఖ్య యల్పమైనను నిండంతర్లీనముగ సాగి వచ్చిన భక్తి భావధార, తాత్త్విక సమన్వయము మహత్తరములై యున్నవి. "పరిమాణింప నశక్యమైనది భవత్ప్రాబల్య మిూ విశ్వ గోచరమే కాని దమోఘమైనవి భవత్సంకల్పముల్ ప్రేమలోఁ జరమ స్థాన మలంకరించినది నీ సత్య స్వరూపంబు మేమెఱుఁగం జాలుదుమే భవన్మహిమ తండ్రి! ఆర్త రక్షామణీ!" (పుట. 1). ఇందు మానవుల కగోచరమైన స్వామి సత్య స్వరూపము, ప్రేమతత్త్వము చెప్పబడి నది. స్వామి యాది కాలమున మునిరాట్టుల హృదయ స్థాన మలంక రించి ప్రతి తంత్రి యందలి సూక్ష్మాణువులను కదల్చి వీణాబ్రహ్మ గానమును వ్యాపింప జేసినాడట. దాని మాధుర్యము ననుభవించ వలెనని కవి తహతహ లాడుచున్నాడు. మునులకు లభ్యమైన యీ స్థితి లౌకిక వ్యావృతులతో కాలము గడుపు తనవంటి వారికి లభ్యముకాదు. ఇక మార్గమేమి? "తన యుచ్ఛ్వాసమె హంసలాగు హృదయ స్థానంబునన్ నిల్చి మెల్లన జోకొట్టుచు నిద్రఁబుచ్చు నటు లాలాపించు సంగీత నిస్వన మాధుర్యముఁ గోరి కేవలము జీవన్ము క్తుఁడై..." (పుట. 1) యుండుట. విశ్వవ్యాప్తమైన నాద బ్రహ్మ మును దహరాకాశమున ప్రత్యక్షీకరించుకొనెడు హంస గాయత్రి సాధన మిందు ధ్యానింపబడుచున్నది. స్వామి తత్త్వమును గూర్చిన యీ కవి యభిప్రాయములు పరమోదాత్తములు. మానవుడు మనస్సును వశపరచుకొని తన భ్రూమధ్యమున నివ్వరి ముల్లంత సూక్ష్మ రంధ్రమున నాపోజ్యోతియై యున్న పరమేశ్వరుని కాంచ జాలక శుక్తి రజత భ్రాంతి యందు కొట్టు మిట్టాడుచు నూరక

గ్రంథములను తిరుగవేయుచున్నాడు. ఈ మాటల వలన స్వామి చైతన్య మాజ్ఞా చక్రమున నాద స్వరూపమై ప్రవర్తిల్లునన్న యోగశాస్త్ర మర్యాద నీతడు ప్రతిపాదించినాడు. స్వామి పదవి సత్యము, శివము, సుందరము. దానిని పొందుటకు నిరహంకార నిర్మమత్వములు, నిత్య నైమిత్తిక కర్మాచరణము, శాంతిదాంతులు, యదృచ్ఛాలాభ సంతుష్టి, స్వామి చరణగతములైన ధ్యాన సమాధులు మార్గములు. ఇటుపై స్వామితత్త్వమున సూక్ష్మాంశ వ్యాపా మిట్లు నారదాది మహర్షులచేత దర్శింపబడిన రీతిగ సమన్వయింపబడినది. "తమయందుండిన యట్టి యష్టదళ పద్మంబష్ట భార్యా సమూహముగా నిన్ బరమాత్ముఁ గృష్ణునిగ దేహ ద్వారకన్ నారదాది మహర్షుల్ మిమ్ము నిర్వికల్పక సమాధిన్ గేళిఁగావించి నిత్యమునుం జెందరె యద్వితీయమగు నానంద మాత్మేశ్వరా" (పుట. 2) ఈ ఘట్టము నందే నారదుడు తన లోపల నున్న త్రివేణీ సంగమమున స్నాన మొనర్చి భక్తి మదిరను పానమొనర్చి, స్వామి యొక్క హంసాత్మక ప్రణవ నాద బ్రహ్మము నందియున్నట్లు చెప్పబడినది. ఇంద్రాది దేవతలు ఆనందరస స్వరూపమైన చిదాకాశము నధిష్ఠించిన ధన్యాత్ములు. దేహ ప్రయాగ యందు యమునయేగాక గంగా సరస్వతులుఁ గలవు. అందు స్వామి నాడీకా రూపములైన గోపీ జనముతో నిరంతరము స్నానము చేయును. ఇట్టి తాత్త్వికానుసంధాన మొనర్చిన పిమ్మట భక్త్యార్ద్ర చిత్తముతో కవి స్వామి నిట్లాహ్వానించుచున్నాడు. "వచ్చి యొకసారి నా ప్రాణ వాయువునందు హృదయ వేణువు నూది పోయెదవె కృష్ణా! ఆత్మ బృందావనంబు నీ యాగమమున కెదురెదురు చూచుచున్న దోయీ మహాత్మ!" (పుట 3) ఇట్లు తత్త్వ ప్రతిపాదనమునను, భక్తిభావమునను, రచనా శిల్పమునను బృందావన మనన్యము.

బృందావనమను పేర రచింపబడిన మరియొక ఖండ కావ్య

సంపుటియిందు పరిశీలనార్హము,[145] తత్కర్తయగు శ్రీ చామర్తి రాజశేఖరరావు భావోద్వేగముతోను, తీవ్రమైన యావేశముతోను కొలది ఖండకృతులను మాత్రమే రచించినాడు. అందు కృష్ణకథా సంబంధులు కొన్ని యున్నవి. తదనుశీలనము నిట్లు చేయవచ్చును.

బృందావనము కేంద్రముగ కవి మనస్సున నుప్పొంగిన భావ లహరియిందు ప్రస్తుతము. వనదేవతి నుద్దేశించి "......నవనవోత్పల కోమలనీలమూర్తి, వన్యావనిరుట్టుటీర సముపాంత సమస్తపథానువర్తి, లీలావిభవైకమూర్తి, సదలంకృత చారుశిరో విభాసి, బృందావన గోపబాలకుఁడు నందకుమారుడు..." (పుట, 25) కానరాని వృత్తాంతము మున్నుగ నిందు వర్ణితమైనది. అతడు సర్వాంతర్యామి. మావుల తోటలో, సంజలలో నెత్తావులలో, కప్రంపు దీవులలో వ్యక్తమగువాడు. చీకటిలో గోవులను వీడిపోయినాడు. గోవులను గాయునట్టి గొల్లడు లేకపోవుటవలన, మృగముల విజృంభణము వలన, గోవులు చెల్లాచెదరైనవి. దీనికి దోడు దేవేంద్రుడొనర్చిన శిలావర్షపాతాదుల నుండి తమ్ము రక్షించిన నేత లేకపోవుట, మరియు నాందోళనాకారణమైనది. అట్టి స్థితిలో స్వామి యెచ్చట నున్నాడని వనదేవతను ప్రియమార ప్రశ్నించుట, ప్రవర్తిల్లినది. కాని యీ యన్వేషణము బాహ్యమైనది. గోపకులందరు విషాదోద్రేక సంరంభములను వీడి శాంతి వహించి యాతనికై కానన సీమలందు వెదకుట మాని వేసినచో "...మీ నిలయాంతరాళముల మీ యిలవేల్పయి యున్నవాడు పొండో నిదురింపుఁడో, తెలియుఁడో యికనైనఁ బురాణపురుషున్" (పుట, 27) అని చెప్పుట కవిసందేశముగ గమనింప వచ్చును. ఈ ఖండమున ప్రధానముగ చెప్పదగినది యన్యాపదేశ వస్తు సూచనము. ఇందు పురాణ పురుషుడైన స్వామి భారతజాతినేత, గోవులు భారతీయులు. దేవేంద్రుడు పరదేశచక్రవర్తి. క్రూరమృగము లాతని సైన్యము. ఈ ప్రతీకల వలన స్వాతంత్ర్యోదయమునకు ముందున్న

145 శ్రీ చామర్తి రాజశేఖరరావు, సాహితీసమితి, రేపల్లె. 1954.

భారత దేశస్థితిని కవి ధ్వనింప జేయుచున్నాడు. సాంప్రదాయికమైన వస్తుగౌరవమును చెడకక సమకాలీన కథార్థస్ఫూర్తిని గల్గించుట కవి దేశభక్తికిని, దానిని నిరూపించుటలో నున్న నిగ్రహపూర్వక శిల్పమునకును నిదర్శనము.

'శరద్రాత్రి' యను ఖండిక యన్వేషణామయము. స్వామి పూర్ణిమా యామినులందు మరల గానము చేయవలెననియు, నట్టి యవకాశమునకై తాము తపించుచుంటిమనియు నెరిగిన గోపికలు యమున నుద్దేశించి యిట్లనుచున్నారు. "ఎంతటి పూర్వపుణ్యమున నీ యిలపై జనియింపఁ గంటివో! యెంత తపోమహత్త్వమున నవనిపై బ్రవహింపఁజాలితో! యెంత యదృష్టశాలినివో కృష్ణుని గానము నాలకించి యత్యంతముగాఁగ జన్మఫల మందితివో యమునా స్రవంతికా! (పుట. 29). స్వామి గానమును వినుటకు తాము వచ్చినపుడు స్వామి కనబడకపోవుటతో బాటు యమున సుప్తయై యుండెను. గోపీ హృదయగతమైన నిరాశాభావమునుఁ బోనాడుటకై కవి యిట్లు ప్రవచించుచున్నాడు- ఓ వ్రజకాంతలారా! అర్ధరాత్రిమున మురళీ కలవర మాలకించుట కిల్లు వీడిపోయితిరి. స్వామి గానరసము నుగ్గుపాలతో రంగరించి మీ పసికందుల కొసంగితిరి కాదా? మీరు బేలలై పొరపాటొనర్చితిరి- అని. ఇందు బాహ్యోద్రిక్తమైన యన్వేషణా భావమున కతీతముగ నొక చక్కని తాత్త్విక భావసమన్వయము గమ్యమాన మగుచున్నది. యమునా స్రోతస్విని శాశ్వత జీవన సంకేతము. మురళీ గాన ముగ్ధలైన గోపాంగనలు స్వామి యొక్క వ్యక్త చైతన్య స్పర్శకై పాతరలాడుచున్నారు. వారు జీవాత్మ సంకేతములు. తమకు లభింపలేదని భావించిన వ్యక్తి చైతన్యాతీతమైన యవ్యక్త చైతన్యము. వారి దేహప్రాణ స్తన్యములలో భాగమై యీ వరకే శాశ్వత శిశుత్వ ప్రతీకగ వారింట నెలకొని యున్నది. ఇంతకాలముగ వారి యారాధనములు ఫలించి ముంగిట

రూపొందియున్న స్వామిని వారు కనలేకపోవు రమ్యమైన భ్రాంతి జీవాత్మకు పరమాత్మానుసంధాన మార్గమున నడ్డుపొర. ఇట్లే వేణుగానమను ఖండికయు తాత్త్వికార్థ స్ఫోరకత్వమును కల్గినదే. పాంచాలీ సాంత్వనమను ఖండము పూర్వోక్త మార్గముననే దేశభక్త్యాదర్శమును ధ్వనించును. స్వామి తన యవతారమును భారతీయులాకాంక్షించు సందర్భమున ప్రతీక్ష యను శీర్షికలోని యీ పద్యము భావార్ద్రమైనది. "ఆయువు పట్టు దూలునటు లశ్రులు రాల్చిరి గొల్లవారు లేబ్రాయము వార లన్నమును బానముఁబాసి తపించినారు అంబా! యని మోరలెత్తుకొని యావులు దూడలు నంగలార్చె కృష్ణా! యికనైన గాని కరుణామతివై ప్రభవింప నొల్లవో! (పుట.40)

చామర్తి యూహాలలో వాడితనము, రచనలో పనివాడితనమున్నది. రమణీయమైన రచనముతో బాటు వ్యంగ్యార్థ స్ఫురణా కౌశలమున్నది. కృష్ణ కథా శకలముల కొన్నిటి నీతడు రమణీయముగ భావుకత్వ మార్గమున వెలార్చియున్నాడు.

నవ్యకవులలో ననేకులీ మార్గమున భావతత్త్వ వ్యాఖ్యానముల మేళవించి కృష్ణకథాంశముల రచించియున్నారు. వీనిలో కథాంశమెంత తక్కువో భావాంశమంత యెక్కువ. ఆంగ్ల, వంగ సాహిత్యముల పరోక్ష ప్రభావము వలన కృష్ణకథాంశముల యందు సనాతనముగ నున్నకొన్ని ప్రాథమిక భావములను నూతనమైన శబ్ద మార్దవముతో, దృశ్యప్రతిపాదనా వైభవముతో, నూహాశాలిత్వముతో ప్రపంచించి మొక భావాశ్రయత్వము నాపాదించి యందలి ప్రకృతిని పరమ రమణీయముగ చిత్రించిన నవ్యులకు ప్రతినిధిగ నీ యనుశీలనమున శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి నెన్నవచ్చును. ఆయన రచించిన 'యన్వేషణ'మిందు ప్రసక్తము.[146] నవ్యకవులలో హృదయ

146. చూ: నవనీతము. ఖండకావ్య సంపుటి. నవ్య సాహిత్య పరిషత్తు. గుంటూరు-1951.

మార్దవ సంకేతమైన శబ్దమార్దవమునకు, జిలుగు పనితనమునకు నిరూపకమైన శబ్దార్థములం జిలికి, ఒక తరము నుత్తేజ పరచిన విషాద ప్రణయభావ నిరూపణమునకు దేవులపల్లివారు పెట్టినది పేరు. ప్రస్తుత శీర్షికయందు ప్రసక్తమైన యన్వేషణ పర్యవసానమున పరమాత్మకై యన్వేషించు జీవాత్మయే యైనను, తద్భావమునకన్నమిన్నయై యీ రచనమునందు ప్రకృతి రామణీయక చిత్రణము, భావసౌకుమార్యము, శైలీ మాధుర్యము గమ్యమానములగుచున్నవి. పర్యవసానస్థితి యందీకవి యాత్మవాది. రచనాస్థితి యందు సౌందర్యవాది. ఒక గోపిక స్వామికై యన్వేషించునెడ నామె భావముల చిత్రించు టిందలి వస్తువు. శరద్రాత్రి యందు చల్లగా నిద్రపోవు వ్రేపల్లెవాడలో నొక గోపిక సాము సడలిన పతి పరిష్వంగమందున్నది. ఆమె సుషుప్తి సుఖ దుఃఖముల కతీతమై యున్నది. స్వప్నవశమున నామె మేను మరచియున్న స్థితిలో "మురళికా మంద మంద మాధురుల రుచు లామెను మేలుకొలిపినవి. ఆమె హృదయ మల్లే యాగానమున లీనమై పోయినది. ఇట్టి లీనస్థితిని ప్రతిపాదించుటకు కవి వాడిన యుపమా సామగ్రి పరమ రమణీయమై ప్రకృతి యందలి 'సుందర సీమలన్నిట' వ్యక్తమగుచున్న యైక్యతా స్ఫూర్తిని ప్రతిబింబించుచున్నది. దీనివలన నామె పిల్లనగ్రోవి పాటయ నెడు దివ్యాహ్వానమున నట్టి యైక్యభావమునే భజించినది. "ఎలదేటి చిఱుపాట సెలయేటి కెరటాల బడిపోవు విరికన్నెవలపువోలె, తీయని మల్లె పూదేనె సోనలపైని తూగాడు తలిరాకు దోనెవోలె, తొలి పొద్దు తెమ్మెర త్రోవలో బయనమై పరువెత్తు కోయెల పాటవోలె వెల్లువలై పారు వెలది వెన్నెలలోన మునిగిపోయిన మబ్బుతునుక వోలె..." (పుట. 15) ఆ గానమ్ము భాసించినది. ఈ చిత్రణము వలన గోపిక మేల్కొనుట యందలి భావస్ఫూర్తి సుప్తమైయున్న ప్రకృతియొక్క జాగృతిగ నిరూపితమై, యీ భావమే యనంతర చిత్రణమునం దుద్దీప్తమైనది. ప్రాణనాయకుని కౌగిలియొక్క పట్టును

తప్పించుకొని గోపిక యాత్మనాయకునికై వెడలినది. ఇల్లుదాటని ముగ్ధయైనను స్వామియొక్క వేణుగానమునందు ప్రతిబింబించిన యాహ్వానము నందుకొని విజనపథముల వెంట బయలుదేరి యమునా తీరమును చేరినది. అందామె హృదయగత భావస్రవంతి పొంగి పొరలి పూర్వకథాస్మృతి భాసిల్లినది. ఈ ఖండమునందు కండపట్టు పూర్వస్మృతి వర్ణనము. ఆ ప్రదేశమున నొక పొదరింటిలో, కడిమిచెట్టుక్రింద స్వామితో కలిసి సంచరించిన ప్రణయ భావాంకిత సీమలన్నియు నామె మనమున నృత్యమొనర్చినవి. "శారద శర్వరీ మధుర చంద్రిక సూర్య సుతా స్రవంతికా, చారు వినీల వీచిక ప్రశాంత నిశాపవనోర్మి మాలికా చారితనీప శాఖిక..." (పుట 17) వంటి మనోహర లయాత్మక దృశ్యము నిప్పట్టున కవియావిష్కరించినాడు. వస్తూచితమై, భావోజ్జ్వలమైన శబ్దవిన్యాసపు కులుకులు కలిగిన యిట్టి రచనము నవ్యులలో నెక్కువమంది కలవడ లేదు. ఇటుపై విశ్వమోహన వేణుగాన ప్రశస్తి యున్నది. బాల గోపాల గానము "...కరములోని మురళినేకాదు నాలోని మోటు పెడఁద నీ శిథిల జీవనమ్ము మ్రోయింప..." (పుట 18) గలది. స్వామి సుషిరాపగా తరంగ జాలములలో తారకా రవిచంద్రతతుల్ చిన్నగీతములై కలసిపోవునట. ఈ రెండు భావముల సమన్వయము వలన స్వామి సంగీతము బాహ్య ప్రకృతియందు భువనముల నన్నిటిని కదలించి కరగించు నాద ధారయనియు, నంతః ప్రకృతి యందు శిథిల హృదయ సంస్కార చణమైన యంతర్యామి తత్త్వమనియు స్ఫురించుచున్నది. "పెదవి చివురు సంజల నరవిచ్చు నవ్వు వెన్నెల, చరించు తుమ్మెద బెళుకు చూపు, లోల పవనచాలిత కుటిలాలకమ్ము, తరళచూడా కలాపమ్ము..." (పుటలు-18-19) నైన బాల కృష్ణుని స్వరూపము చిత్రకారుని కుంచియ కందనిదియై జిలుగు శబ్దముల చిత్రకారుడైన శ్రీ కృష్ణశాస్త్రి కందినది. అట్టి వేణుగానము, యిట్టి రూపవిభూతి గోపికకు సంబంధించి యిప్పుడు లేనివి. "లేవు

శరత్తమస్వినులు, లేవు మనోజ్ఞ సుధాంశు మాలికల్ లేవు వినీల నిర్మల కళింద సుతానవ నాట్యసంపదల్ లేవు మదీయగాత్రి లవలిం బులకాంకుర కోరకావళుల్ లేవు కుమార గోప మురళీ మృదుగీత ఝురీ విలాసముల్." (పుట 19). పిమ్మట గోపికా హృదయమ్మున చిక్కకొని త్రుళ్లింతలాడి బాహిరిల్లుట కవకాశము లేక కొట్టు మిట్టాడుచున్న విశ్వమోహన వేణునాదము పట్టుకొన్ననే నలిగిపోవు జిలిబిలి పలుకుల మూసకట్టులో కృష్ణశాస్త్రిగా రిట్లావిష్కరించిరి. "జిలిబిలి పట్టురేకుల వెనక దొంటిలు మల్లియ యెద దాగు మధుపరవము కనుచూపు దాటు నామనిఁ బాయు కోయిల గొంతులోఁ జిక్కు వసంతగీతి, విభువీడి శుష్కించు విరహిణి సెలయేటి కడుపులో నడగిన కడలిమోత, రేనికై వెదకెడు రెక్కచూపులలోన జరవడ్డ నిండు చందిరుని పాట..." (పుట 19). మల్లియ యెద యందలి మధుపరవము, కోయిల గొంతులోని వసంతగీతము, సెలయేటి కడుపులోని కడలిమోత మున్నగు నంశములు శాశ్వతైక్యభావ కేంద్రములై యొప్పునట్టి విషయములు. వానిచే గోపికా హృదయగతమైన నాదమును ప్రతీయమాన మొనర్చుట వలన నీ కవి యొక మహార్థస్ఫూర్తి సాధించినాడు. భిన్న భిన్న ఖండప్రకృతి కేంద్రముల క్షరస్థితినుండి యక్షరస్థితికి ప్రస్థాన మొనర్ప జేయు నాదమహత్తుకు స్వామి వేణువు సంకేతము. దానిచే నుత్థాన మొనర్పబడు జీవాత్మకే యీ గోపి ప్రతీక. ఈ విధముగ దేవులపల్లి వారి యన్వేషణ యను ఖండిక శ్రవణసుభగత్వము, చిత్తాహ్లాద కత్వము, హృదయ సంవాదిత్వము నను మూడంశముల సాధించిన రమణీయ కృతి.

ఈ కోవలో పరిశీలింప దగిన రెండు ఖండికలు శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రి రచించిన సంధ్యాన్వేషణము, రాధ, కరుణశ్రీ రచించిన కరుణామయి, పారవశ్యము అనునవి.[147]

147. 1. దీపావళి- నవ్య సాహిత్యపరిషత్తు- గుంటూరు-1940

2. ఉదయశ్రీ — రామా పబ్లిషర్స్-కందులవారి వీధి- విజయవాడ-1, 1962

వేదులవారి కవిత్వ మాంధ్ర నవ్య వాఙ్మయమున సుప్రసిద్ధము. ఆయన రచనా పద్ధతి ప్రసన్న గంభీరమైనది. ఛందశ్శిల్పముపై నధికారము, చిక్కని యూహాశాలిత్వము వీరి విషయమున జెప్పదగిన ప్రత్యేకాంశములు. ప్రసక్తమైన యంశము పరిమాణమున మిక్కిలి చిన్నదై యాదృచ్ఛిక భావనా మార్గమునకు మాత్రమే ప్రాతిసిధ్యము వహింపగల్గి యున్నది. సంధ్యాన్వేషణము ప్రకృష్ట భావబంధము కలిగిన రచనము. చంద్రాతప ప్రసన్న చారు శారద యామినీ సమయమందు వీధివీధుల స్వామికై వెదకి వెర్రియై పోయిన రాధ, తుదకాతని రమ్య స్వరూపమును దర్శించి యాతనిని మరియొక మారు మురళి వాయింపుమని కోరుట రాధయను ఖండిక యందలి విషయము. సంధ్యావేళ నొక గోపిక స్వామికై యొనర్చిన యన్వేషణము యొక్క భావమయ చిత్రణమే సంధ్యాన్వేషణము. ఇందలి భావరేఖ లిట్లున్నవి. శ్యామికా గోకులమున స్వామి జాడ లేకపోవుట వలన నందలి వాతావరణము విషాద రేఖచే నావృతమై యున్నది. "అంతరించెను బశ్చిమాశాంగణమున కుంకుమ రంగవల్లి నికుంజ శోభ, చిందువారెను దిన(శ్రీ) కాలకుంతల చ్ఛాయలో విరహ విషాద రేఖ... తడవాయెఁ దలఁగి వాత్సక ధేనుకాన్యోన్య సమ్మేళ నాహ్వాన సంభ్రమమ్ము..." (పుట. 77) మున్నగు చిత్రణము రమణీయమై వ్రజ వాతావరణమును కనులకు కట్టజేయుచున్నది. పిమ్మట స్వామి వేణుగాన మహత్త్వము, స్వామి యునికి వలన వ్రజమున నెలకొని యున్న యుత్తమ స్థితి, స్వామి లేనప్పుడు వ్యాపించిన దీనవిషాద స్థితి నిరూపింపబడినవి. ఈ మొత్తము భావ సంచయము నన్వేషణా పరముగ స్వామికి నివేదించుకొనిన చరణదాసి యొక్క ప్రార్థనము హృదయమును ద్రవింప జేయునట్టి భావార్ద్రతను కల్గి యున్నది. "తీవనో పూవునో వసుమతీజమనో, యమునాపగోర్మినో, గోవునో, మబ్బునో, వెదురు క్రోవినో, చుక్కనోయై జనించినం దావక వేణుగానము సదా విను

చుందుఁగదా యటంచు చింతా వివశాత్మయా చరణదాసికిఁ గన్పడ వేమి పాపమో!" (పుట. 80) చరణదాసి దృష్టిలో నచేతన వస్తు సముదాయము స్వామి స్పర్శచే పొందియున్న యదృష్టము నీతడు దర్శించిన మార్గము వలన నామె హృదయము నందలి యన్వేషణ భావ వ్యగ్రత వ్యక్తమగు చున్నవి.

నవ్యాంధ్ర వాఙ్మయమున కరుణశ్రీ రచనముల కొక ప్రత్యేకత యున్నది. ప్రజామోదమును, ప్రజారంజకత్వమును నింతటి స్థాయిలో సాధించిన నవ్యకవులెక్కువ మంది లేరనవచ్చును! అందులకు కారణ భూతమైన యంశములలో మొదటిది ముద్దుల మూట గట్టు సుకుమార శైలి. రెండవది యా శైలి కనుగుణమైన సరళార్ద్రభావనా మార్గము. కరుణశ్రీ శైలి రీతిని, గీతిని సాధించుకొన్నది. భావన పామరుల గుండెలకు సైతము సీటుగా, సూటిగా నాటునట్టిది. ఉదయశ్రీలోని ప్రసక్త ఖండిక లీయంశముల నిరూపించుచున్నవి. రాధాకృష్ణుల పరిణయమయ నూత్న దాంపత్యభావము సంయోగభావమున పర్య వసించుటకు మున్ను స్వామికై నిరీక్షించుచున్న రాధికా భావ చిత్రణము మనోహరమై యున్నది, ఇది మొదటి ఖండము. మహోజ్జ్వల రజనియందు రాధ స్వామికై నిరీక్షించుచు నిట్లనుకొన్నది. "చిచ్చు వలె చందురుఁడు పైకి వచ్చినాడు! పెచ్చరిలినాడు గాడుపు పిల్లవాడు! రాడు మోహన మురళీస్వరాల వాడు! తప్పకే తెంతునని మాటతప్పి నాడు!" (పుట. 45) నిరీక్షణాభావ వ్యగ్రమైన రాధిక కపోలముపై నొక్క బాష్పకణము పడినది. ఇంతలో స్వామి రానే వచ్చినాడు. వచ్చిరాని పేరలుకతో జీవితేశ్వరుని సజల నయనములతో కాంచిన రాధ, స్వామిని వినయపూర్వకార్ద్ర భావము తోడనే యాలస్యమును గూర్చి ప్రశ్నించినది. ఇటుపై "సరస సంగీత శృంగార చక్రవర్తి, సకల భువనైక మోహన చారుమూర్తి, రాధికా విహార రాజహంస, (పుట. 47) యైన స్వామి సరస శృంగారోక్తులతో నామెను బ్రసన్న నొనర్చుట ప్రవర్తిల్లినది. తన యదృష్ట విశేషమున స్వామి తనకు

దక్కినాడని భావించిన రాధ పారవశ్యమున మాధవుని వక్షముపై వ్రాలిపోవుట యీ ఘట్టమున పర్యవసానము. ఇందు రాధామాధవుల శృంగారము పరమ రమణీయ మార్గమున నాలంకారిక మర్యాదలను, ప్రకృతి చిత్రణా వైశద్యమును, సరసోక్తి చాతుర్యమును నాధారముగ కవి చిత్రించియున్నాడు. కరుణామయి యను ఖండము మరింత భావస్ఫోరకమై నిరీక్షణా భావముతో బాటు, రాధికా హృదయావిష్కరణమున గమనార్హమైయున్నది. ఇందలి వాతావరణ చిత్రణమొక ప్రత్యేకాంశము. తీతుని పాటలో గుండెకు కలుపు తీసెడు కోయిల, రాధ కడకళ్ళనుండి ప్రవహించుచున్న యమునా స్రవంతి, స్వామి పాదములచే స్పృశింప బడుదుమన్న యాశతో బచ్చపట్టు పరుపుల వలెనున్న శాద్వల స్థలులు-నిందులకు దోహద మొనర్చినవి. రాధా హృదయ ప్రవృత్తియు నిందుల కనుకూలమై "...సద్దులేని ఈ యద్దుమ రేయి ఒంటిగ -రహస్యముగ - తపియించు గుండెపై నద్దుకొనంగ వచ్చితి దయామయ! నీచరణారుణాబ్జముల్"(పుట.42) అను మాటలచే ననిపించినది. స్వామి వేణువు వినవలెననియు, నందు లీనము కావలెననియు కోరిన యామె మనస్సున "ఇది యది యంచు తేల్చి వచియింపగ రాని విషాదమేదియో హృదిఁ గదలించుచున్నది..."(పుట42). ఇదియొక పరమోదాత్త భావచిత్రణము. కాళిదాసు "...తచ్చేతసా స్మరతి నూన మబోధ పూర్వం భావస్థిరాణి జననాంతర సౌహృదాని" యన్న పరమోక్తినిఁ దలపింప జేయుచున్నది. ఇట్టి జననాంతర సౌహృదములు గోలోక వృత్తాంతములై యామె హృదయమునఁ గదలి "రాధనురా ప్రభూ నిరపరాధనురా! అనురాగ భావనా రాధన మగ్నమానసనురా! కనరా! కరుణింపరా! మనోవీథి పదే పదే కలక వేయుచునున్నవిరా పురారహో గాథలు- ఈదలేనిక అగాధ తమోమయ కాలవాహినిన్!" (పుట.43) అనిపించినవి. బ్రహ్మాండమునకు కేంద్రమై విశిష్ట పురాణము లందుక్తమైన రాధాకృష్ణపరతత్త్వమును కవి యిట్లు స్ఫురింప జేసినాడు. ఈ

విధముగ శబ్దమాధుర్యములచే గమ్యమానమైన యంతర్దర్శన విూ ఖండమునకు తాత్త్విక ప్రతిపత్తి నార్జించినది.

తిక్కనోపజ్ఞమైన శ్రీకృష్ణుని యుద్యోగ పర్వాంతర్గత స్థితిని, నుపప్లావ్యము నందలి నిర్వహణా చాతుర్యమును, రణరంగము నందలి యాచార్యకత్వమును విజయశ్రీయం దీయన పోడిమి గల తెలుగు పలుకుబడులతో నిరూపించి యున్నాడు. ఈ విధముగ కరుణశ్రీ సాహిత్యమునకు బ్రస్తుతాను శీలనమున ప్రసక్తియున్నది.

కృష్ణ సంబంధములైన వివిధాంశముల నేకదేశముగ గైకొని గేయములను, అలతి ఖండికలను రచించిన వార లనేకులున్నారు. వీనిలో నేకైక భావ ప్రాధాన్యము, దానిచుట్టు వ్యాపించిన విస్తృతి గమనార్హములు. అట్టివానిలో శ్రీ బసవరాజు అప్పారావు రచించిన గీతములు, శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ రచించిన గీతములు ప్రసక్తము లగుచున్నవి [148].

నవ్యకవులలో గీతికా రచయితగ శ్రీ బసవరాజు అప్పారావు ప్రసిద్ధుడు. తీవ్రమైన భావావేశముతో బాటు సూటియైన రచనా పద్ధతిని మేళవించి చిత్తశుద్ధితో పెక్కుగీతము లాయన రచించినాడు. అందు ప్రధానమైన లక్షణము పీఠికయందు కవియే చెప్పుకొనినట్లు "మా కవితా కన్య చిన్నతనము నుండియు రాగిణి, భావనోద్దీపిత, గానలోల రసజీవిన్నీ" యైయున్నది. ఈ శీర్షిక క్రింద నీ కవి రచించిన కొన్ని గీతములు ప్రసక్తము లైనవి. యమునా సాంత్వనమను గీతమున యమునా నది లీలామానవుడైన గోపాలునికై నిరీక్షించుచు "వెన్నెలకు తోడు మా వేణు గోపాలుడు కన్నుల పండువుగ కనుపించకుంటేనే" (పుట. 9) కడుపు చెరువై యమునా కల్యాణిని పాడ

148. 1. బసవరాజు అప్పారావు గీతాలు దేశకవితా మండలి, బెజవాడ, ఘంటసాల 1945.

2. కవితా కదంబము - మల్లవరపు ప్రచురణలు-విశాఖపట్టణము-1973.

జాలని యమున వేదన చిత్రింప బడినది. గోపికా గీతములలో స్వామికి తమ సర్వస్వము నంకితముచేసిన గోపికల భావోద్వేగములు "పతి నిద్దుర బోవలేదు మది సందియ మొందెనేమొ పతికి ఇనుకు పట్టగ లోపలకు వత్తుగాని తాళు తాళుము కృష్ణా" (పుట. 88) వంటి రచనములలో నున్నవి. దొంగ కృష్ణు డన్న పేరుననున్న నల్లవాడే గొల్ల పిల్లవాడే యను రాధికా గీతము మిక్కిలి ప్రసిద్ధము.

శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ కవిత్వము చిత్తశుద్ధితో పరిమిత ప్రతిభా వ్యుత్పత్తులతో భాసించినది. "నువు జనియించిన మధురానగరము, నువు పెరిగిన యా వ్రేపల్లెయు మరినీ వభివృద్ధినిం గాంచిన బృందయు నీ వేలిన యా ద్వారావతియును నేమిటి జేసెనో కో పుణ్యము లెన్ని భవంబులనో" (పుట. 17) వంటి భావసారమును ప్రసక్త రచనములు నిరూపించుచున్నవి.

శ్రీ గురజాడ రాఘవశర్మ రచించిన కల్పలత యను ఖండ కావ్యసంపుటి యందు ప్రత్యేక రచనా మార్గమున్నది.[149] పౌరాణిక కథా వృత్తాంతముల పరిధి మేరకు నూతన కథాంశముల కల్పించి రచించుట యిందున్నది. సుదర్శన మను ఖండమున శివకేశవ పారస్పర్యమునకు సంబంధించిన రమణీయ సన్నివేశము కలదు. ఒకనాటి ప్రాతఃకాలమున భిక్షుక వేషధారియై శివుడు వచ్చి పరబ్రహ్మ స్వరూపమైన బాలకృష్ణుని సందర్శింప గోరెను. యశోద యెవరి దృష్టి యెట్టిదో యెరుగ రాదు గావున మాయా భిక్షువు కోరికను నిరాకరించి పంపెను. పిదప బాలుడు కాలు, కేలు కదలింపక మాన్పడి విపరీతముగ పోరు పెట్టెను. బాలునికి నిజముగ దృష్టి దోషము కలిగినదని యశోద గృహదేవతలను ప్రార్థించి, భిక్షువృత్తాంతము స్ఫురణకు రాగా నాతనిని శివునిగ బోల్చుకొని శివుని ప్రార్థించెను. అతడు వచ్చి స్వామి మాహాత్మ్యము నుగ్గడించి, యశోద మాటను కాదన లేక పసికందునకు దురాయిగట్టుదు నని యిట్లు చెప్పెను. "శైశవలీల

149. బృందావన ప్రచురణములు - మచిలీపట్నము - 1964

సుమిన్నది విచారము మాను, దురాయిగా జటాకేశము గట్టనెత్తు మిరుకేల మదీయ శిరంబుపై నిదే నీ శిశు పాదమాన, జననీ భయ లేశము లేదు తీరె నా యాశయ మీవు నీ శిశువు హాయిగ నుండుడు పోయివచ్చెదన్" (పుట. 22) అని చెప్పి శివుడు వెడలిపోయెను. ఇందు సౌందర్యలీలచే దేవతలను సైత మాకర్షించిన బాలకృష్ణుని మోహన తత్త్వము, విష్ణుపాదోద్భవమైన గంగ శివ జటాజూట వాసినియను నంశములు నిరూపింపబడి, స్వల్పావకాశమున బహుభావ సంపత్తి ప్రతిపాదింప బడినది. అట్లే గోపికాహృదయమును ఖండిక కూడ శృంగార రసపారమ్యమునకు, జీవ బ్రహ్మైక్య రూపమైన తాత్త్విక స్థితికి నుపలక్షకమై రచింప బడినది. "...దేహము శాశ్వతంబ దియు దీరినచో ధరియించుటెట్లు" 'దాసోహ' మటంచు 'సోఽహ' మనుచును రమించెద నేకమై సదా (పుట. 53) వంటి తత్త్వోక్తులిందు న్నవి. శైలి సుకుమార సుందరమై పోతనా మాత్యుని ప్రభావ మును తలపించుచునే నవ్యగుణశోభితమై యలరారును. కల్పనము లందును, భావములందును విశిష్టతను కల్గినదీ ఖండకావ్యసంపుటి.

ఈ విధముగ ప్రచలితమైన ఖండకావ్యములందు బోల్చినపుడు నవీనభావనా మార్గములు, క్రొంగ్రొత్తలైన రచనా పద్ధతులు వ్యాపించి కృష్ణ కథయందలి భావైకప్రధానాంశమును నిరూపించు చున్నవి.

## వచన ప్రక్రియలు

నవీన యుగమున వచన వాఙ్మయ మొక సువిస్తృత స్వరూ పము. ప్రాచీన యుగములందు చంపూ కావ్యములందును, కతిపయ ప్రత్యేక గద్య రచనములందును వ్యక్తమగు చుండిన ఈ స్వరూ పము నవీన కాలమున సహస్రముఖమై విస్తరిల్లినది. నవీన యుగ మున నభిప్రాయ వ్యాప్తికి వాహికగ దీని స్థాన మనితరము. ఇందు ప్రాచీన పురాణాదుల యనువాదములు మొదలుకొని నవీనములైన

కథానికముల వరకు చేర్చదగిన యనేక రచనము లున్నవి. కృష్ణ కథాను శీలనమున గద్య వాఙ్మయ పరముగ గమనింపదగిన యంశ ములు కొన్ని కలవు. కేవలానువాదములతో గాని, కథల పునరా వృత్తులతోగాని యిందు నిమిత్తము లేదు. ప్రత్యేకాంశ ప్రతిపాదక ములై సృజనాత్మక రచనా ధోరణి నవలంబించునవే ప్రసక్తములు. సాధారణముగ నవలల యందీ లక్షణము గోచరించును. నవలలు నవ్యాంధ్ర వాఙ్మయమున నధికముగ విస్తృతి వైశద్యముల నార్జించు కొనలేదు. అందులకు రెండు కారణములున్నవి. దీనికి సంబంధించిన కావ్య వాఙ్మయము బాహుళ్యమును కలదియై పండిత వర్గమునకు కృష్ణకథపై గల యభిరుచ్యాసక్తులను తరతరములుగ తీర్చుచునే యున్నది. పామరు లనబడు నొక తరగతి యొక్క ప్రజలకు పురాణ ప్రవచనములు, హరికథా గానములు, నాట్య స్వరూపములు, దేశి ప్రక్రియలు మున్నగునవి వలసిన తృప్తిని గల్పించుచున్నవి. విద్యా వంతులైన మధ్య తరగతి చదువరుల పఠన పాఠన సంస్కారములకు ప్రాయికముగ తృప్తి గల్పించునవి నవలాది ప్రక్రియలు. ఏ కారణము చేతనో దీని యందు పౌరాణికాంశములు తక్కువగ బాహి రిల్లినవి. ఆంధ్ర వాఙ్మయమున నవలా ప్రక్రియ ప్రారంభమైన నాటి నుండియు సాంఘిక రాజకీయ చారిత్రక వృత్తాంతములకే ప్రాతి నిధ్యము చెల్లినది. రచయితల దృష్టి నుండి యీ యంశముల వ్యాప్తి యందున్న మమకారము, ప్రసిద్ధ పౌరాణికేతి వృత్తములకు ఉత్పాద్య కథా వస్తువులకువలె నవలా ప్రక్రియ తగి యుండదను నభిప్రాయము కారణములు గావచ్చును. ఇందు కొంత సత్యము లేకపోలేదు. ఈ యసౌకర్యమును సైతము త్రోసిపుచ్చి కొలది మంది మాత్రమే యీ కథా వస్తువును సృజనాత్మక వచన ప్రక్రియా నిర్వహణమున చేపట్టినారు.

ఇట్లు సిద్ధించిన యీ పరిమిత సాహిత్యమున భిన్న మార్గముల కుదాహరణ ప్రాయములుగ మూడు గ్రంథముల నీ యనుశీలనమున

జేర్చుట జరిగినది.[150] వీనిలో నాగమల్లిక స్వల్పమైన కల్పితేతి వృత్తమును గల్గి సుపరిష్కృతమైన రచనా శిల్పముతోను, చక్కని వచన శైలితోనుఁ దీర్చి దిద్దఁ బడినది. వ్రజవాసుల భావనా పద్ధతులు, గార్హస్థ్య రీతులు, జీవన విధానము దృగ్గోచరమగునట్టి రీతిలో గోచరమై పర్యవస్థాన స్థితియందు సతీపతుల దాంపత్య ధర్మాదులకు సైతము స్వామియే కేంద్రమై యుండుట, తద్గమ్యమైన యంతర్యామి తత్త్వము ప్రతీయమానము లగుట యందలి సారము. శృంగారేతి వృత్త మాధారముగ నుదాత్త స్థాయి యందు కృష్ణతత్త్వ ప్రతిపాదన మొనర్చిన నవలల కిది ప్రాతినిధ్యము వహింపగల యుత్తమ రచనము.

రెండవదైన మోహన వంశి యందు నవలా ప్రక్రియకు సంబంధించిగాని, తద్రచనా కౌశలమునకు సంబంధించిగాని వక్తవ్యాంశము లేవియును లేవు. రాధతోబాటు కొన్ని కల్పిత పాత్రము లిందున్నవి. కృష్ణుని వ్రజవాసము మొదలు గీతోపదేశము వరకు గల వివిధ కథాంశములు యెట్టి రచనా శిల్పము నపేక్షింపక గుది గ్రుచ్చ బడినవి. స్వామి దివ్యమానవ తత్త్వమును గూర్చియు, దృక్పథము గూర్చియు చిత్ర విచిత్ర వ్యాఖ్యానము లిందున్నవి. వాని యందాధిదాధికారికతగాని, దృక్పథ వైశిష్ట్యముగాని భాసింపదు. కృష్ణుని పేర నేది వ్రాసినను చెల్లుబడి యగునన్న భ్రాంతి కీ నవల నిదర్శనము.

మూడవది కల్పకము. కృష్ణ జీవిత మాధారముగ నొకటి రెండు కల్పితేతి వృత్తముల జోడించి దివ్యజ్ఞాన సమాజ దృక్పథము ప్రతిబింబింప బడినది. వాసుదేవ తత్త్వము శాశ్వత మంద్ర మార్గమున యుగ యుగముల ప్రవర్తిల్లి మానవజాతి నుద్ధరించు ననెడు

---

150. 1. నాగమల్లిక- శ్రీ పిలకా గణపతిశాస్త్రి- ఎమెస్కో- ప్రచురణము.

2. మోహనవంశి- లత- వంశీ ప్రచురణములు- విజయవాడ-3.

3. మంద్రజాలము. (కల్పకము)- డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య. మంద్ర ప్రచురణలు- విశాఖపట్టణం-4.

నుదాత్త భావమున కీశవల రూపకల్పనము. ఈ సంప్రదాయమున శాచార్యకత్వము వహింప గల్గిన గంభీర రచనా శిల్పము, ఉదాత్త భావ బోధ, శాశ్వత దివ్య సందేశము నిందు ప్రతీయమానమై యీ కల్పక మనన్య స్థాయి నందుకొనినది.

గేయ నాటికలలో, కథలలో, శ్రవ్య నాటికలలో కృష్ణకథాంశములు కొల్లలుగ వ్యాపించి యున్నవి. వానిని పేరు పేరున నెన్నుట చుక్కలను లెక్కించుట వంటిది. వానిలో భిన్న మార్గముల పూర్వాను శీలనమున ప్రసక్తములైన వివిధాంశములే భంగ్యంతరముగ పునరావృత్తములై భాసిల్లు చున్నవి.

ఇట్లు భిన్న ప్రక్రియలయందు కృష్ణ కథాంశములు ప్రతీయమానములై యాంధ్ర వాఙ్మయమున వ్యాపించి యున్నవి. ఇవి యన్నియు కలసి కృష్ణకథ యనెడు వినీలాకాశమున ప్రకాశించు తారకా సముదాయము వంటివి. వీనికి వలసిన యుత్తేజము నితిహాస పురాణాదు లనెడు సూర్య చంద్రులు ప్రసాదించిరి. ఈ మొత్తము వైభవము ఏ శాశ్వతాక్షర నాద తత్త్వమున ముద్రితమైనదో యది కృష్ణ కథాకాశము. ఇట్టి వెలుగు లెన్నియైన నందు పుట్టి ప్రకాశించి లీనము కాగల మహత్త్వ శాశ్వత సంకేతమది.

# 11. పరిశిష్ట గ్రంథ ప్రసక్తి

పూర్వాధ్యాయములందు పరిశీలింప బడిన కావ్యములు పోను మిగత వానికి సిద్ధాంత వ్యాసమున గల ప్రసక్తి యీ శీర్షిక యందలి విషయము. అట్టి కావ్యము లనేకము లున్నవి. వీనికి కొన్ని ప్రత్యేక లక్షణము లున్నవి. పూర్వ పురాణము అందలి కతిపయ భాగములకు అనువాదములు కొన్ని. అట్టి వానికి మడికి సింగన భాగవత దశమ స్కంధ ద్విపద యుదాహరణ ప్రాయముగ స్వీకరింప బడినది. విశిష్టమైన యితిహాసాంశముల రచించి యర్వాచీన కాలము నందలి బహుకావ్య సృష్టికి దోహద మొసగిన కావ్యముల కుదాహరణ ప్రాయముగ పిల్లలమర్రి పినవీరభద్రుని జైమిని భారతము గ్రహింప బడినది. నామ మేదైనను కృష్ణకథా స్వరూపము నను సమగ్రముగ నిబద్ధ మొనర్చిన కావ్య మార్గమున కుదాహరణముగ తాళ్ళపాక తిరువేంగళనాథుని అష్టమహిషీ కల్యాణము, మండపాక పారతీశ్వరకవి కృష్ణాభ్యుదయము గ్రహింప బడినవి. నవీన యుగమున సంపూర్ణ కృష్ణకథను సమగ్ర మార్గమున రచించిన బృహత్కావ్యముల కుదాహరణముగ శ్రీదివి రంగాచార్యులు రచించిన కృష్ణాతిమానుష తత్త్వము గ్రహింప బడినది. ప్రసిద్ధేతి వృత్తమును నూతన దృక్పథముతో దర్శించి యందలి కథా వస్తువు నాధారముగ కృష్ణ తత్త్వము నందలి సాంప్రదాయిక విషయముల బ్రవచించిన రసవత్కావ్య పద్ధతి కుదాహరణముగ శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య రచించిన గోదా వైభవము గ్రహింప బడినది. ఈ కావ్యముల స్వరూప స్వభావములను కూడ గలిపికొనినచో నాంధ్ర వాఙ్మయము నందలి కృష్ణకథా స్వరూపము యొక్క సమగ్రత భాసించును.

ద్విపద భాగవతము :

అందు మున్ముగ ననుశీలనము చేయదగినది మడికి సింగనార్యుని ద్విపద భాగవతము.[151] భాగవతము నందు కృష్ణకథా ప్రధానమైన దశమ స్కంధాంతర్గత వివిధ ఘట్టముల సందర్భోచితముగ విపృత మొనర్చిరో, సంక్షేపించిరో యాతడు రచించినాడు. గ్రంథము నందలి రచనా ప్రణాళికను బట్టి యాతడు దశమ స్కంధము నంతటిని రచించెనను మధురాకాండము, కల్యాణకాండము, జగదభిరక్షా కాండములను మూడు భాగములే లభించుచున్నవి. సంపూర్ణ గ్రంథము లభింప కుండుటయు, పోతన భాగవతముతో పోల్చినపుడు పఠన పారనాది విషయములం దవరమై యుండుటయు గమనార్హములు. జనరంజకమైన ద్విపదచ్ఛందము నవలంబించిన కావ్యముగ దీని స్థానము గుర్తింపక తీరదు.

సింగనార్యుని రచనమున మున్ముగ చెప్పదగినది యచ్చమైన తెనుగు దనము గల మధుర మనోహరమైన శైలి. మధురానగర ప్రవేశ మొనర్చుచున్న స్వామిని జూచి పౌరాంగనలం

"ఈతఁడే యెలనాగ! ఇసుమంతనాఁడు
పూతన పాల్ద్రావి పొరిగొన్నవాఁడు
సకియరో! ఈతఁడే శకటమై వచ్చు
ప్రకటదానవుఁ దుల్లిపడఁ దన్నినాఁడు
ముద్దియ యీతఁడే మొగిఱోలుద్రోచి
మద్దియలుడిపిన మహనీయ యశుఁడు...
కొమ్మ! యీతఁడె పిల్లగ్రోవూది వేత్రఁ
గొమ్మల గడువెర్రి గొలిపిన వాఁడు. (పుట. 3-4)

ఇట్టి రచనమునందు సారళ్య మాధుర్యములు గమనార్హములు. స్వామి "... మల్లుల కెల్ల కులిశమై ప్రజకు ధారుణీ నాథుఁడై తల్లి దండ్రులకు

---

151. తంజావూరు-సరస్వతీ మహల్ ప్రచురణము-23- 1950.

పసిబాలుఁడై యోప్పు పంకజాక్షులకు నసమాస్త్రుఁడై వల్లవావళి కెల్లఁబరమాప్తుఁడై యతిపతతికి నెల్లఁ బరతత్త్వ మూర్తియై బంధు సంతతికి దైవమై..." (పుట. 15) భాసించిన ప్రసిద్ధ ఘట్టమిందు రమణీయము, సంక్షిప్తమును నై యున్నది. దేవకీ వసుదేవులు కారాగృహ ముక్తినందిన పిదప వారు మున్నుగ రామకృష్ణులను దైవ స్వరూపులుగ భావించిరి. స్వామి వారికి మోహతమము కల్పించెను. వారు స్వామి పుత్త్రత్వమును భావించినపుడు శౌరి యుత్కట బాష్పుడగుచు "మా నిమిత్తముల దుర్మనుజులచేతఁ బూని బహుక్లేశములు మీకుఁగలిగె... యెప్పటప్పటికి మమ్మరసి మీరర్థిఁ జెప్పిన పని సేయ సిద్ధించదయ్యె..." (పుట. 25) అనియు, "తనయుఁడు జనియించి తల్లి దండ్రులకు ననుపమంబగు భక్తి వరయకుండినను తన యుండెడి? అతఁడు తల్లి యౌవనముఁ గొనకొని తెగఁజూచు గొడ్డలిగాక" (పుట. 26) అనియు చెప్పుట స్వామి దైవ మానుష చిత్త వృత్తుల విలాసము. స్వామి యుద్ధవునిచేత గోపికలకు పంపిన సందేశమునందు "సర్వేంద్రియంబులు సమతఁ బోషించు నిర్వికల్ప జ్ఞాన నిధి యైన నన్ను విరహాగ్ని నెపమున వెలుపల మరచి పరమయోగ ధ్యానపరుల చందమున పరమానురక్తి హృత్పద్మంబు లందు చిరలీల నిలిచి భజింపుటజేసి మీ తలంపుల యందు మెలఁగుదు గాని మీతో వియోగ మేమియు లేదు మాకు" (పుటలు 36,37) అని చెప్పుట గోపీకృష్ణ సంబంధమునకు చక్కని వ్యాఖ్యానము. కళ్యాణ కాండమున రుక్మిణీ దూతగా వెడలిన బ్రాహ్మణుడు స్వామికి తత్సౌందర్యమును వర్ణించి చెప్పునపుడు సందర్భోచితముగ ప్రధాన సౌందర్యాంశములను, సద్వంశ విభూతిని విస్తరించినాడు. గౌర్యాలయమున కరుగుచున్న రుక్మిణీ వర్ణనమునందు రూపచిత్రణా కౌశలము, సంప్రదాయ పరిజ్ఞానము గమనార్హములు. సింగనార్యుఁ డెందేని సూక్ష్మముగ నంగాంగ వర్ణనము చేసినను నది వస్తుధ్వని శోభితమై యుండును. రుక్మిణి నాభిని వర్ణించుచు "కామునికై పుత్త్రికా మేష్టి వేల్వ

హోమగుండము భంగి నొప్పారు నాభి" (పుట. 73) అని చెప్పినాడు. మన్మథ జన్మమును వ్యంగ్యముగ స్ఫురింప జేయునట్టి దీ వాక్యము. యుద్ధ వర్ణనావిషయమున సింగన తిక్కనాదుల మార్గము ననుసరించి తన వ్యక్తిత్వమును నిలుపుకొనినాడు. రుక్మిణీ హరణ సందర్భముగ రణ రంగమును వర్ణించుచు-

"కొడపంపు గంకాళి ఘోర నాదముల
వెడయాట లాడెడు వేతాళములును
వలనొప్పు భూతేశు వటుంబు వోలె
లలిత కపాల మాలాయుక్త మగుచు
సమధిక దానార్థ్య సరసంబు వోలె
కమనీయ మార్గణ ఘనఘోష మగుచు" (పుట. 80)

నని చెప్పుట యిందుల కుదాహరణము,

ఇట్లు మడికి సింగన దశమస్కంధము సమగ్ర కావ్య రచనా శిల్పమునకు నిదర్శనము. ద్విపద కావ్యముగ, ప్రథమ భాగవతానువాదముగ నిది యాంధ్ర వాఙ్మయమున నొక స్థానముగలది. కవి చెప్పినట్లు "...చెలువగ్గలించి సలలిత రసభావ శబ్దగుంభనల వల నొప్పు శ్రీ భాగవత పురాణమున మహా దాదియగు దశమస్కంధ సరణి" (పుట. 216).

## జైమినీ భారతము:

జైమినీ భారతము ఆంధ్రవాఙ్మయమున ప్రౌఢ గంభీరమైన కావ్యములలో నొకటి. [152] దాని నిట్లను శీలనము చేయవచ్చును: వ్యాసులు ధర్మజుని కడకు వచ్చి యాతని కశ్వమేధ యాగ మొనర్చ ననుజ్ఞనిచ్చి తద్విధానము నెరింగించిన పిమ్మట స్వామిప్రసక్తి ప్రథమముగ నిందు పొడమినది. శత్రుసంహార కారకుడైన స్వామి దూరముగ నుండ శ్రతువెట్లు చేయనగునని భావించిన ధర్మజుడు భీముని

152. వావిళ్ళ ప్రచురణము—1963.

దెసగాంచెను. అప్పుడాతడు "...విష్ణుఁడు నికటంబున లేఁడన నేటికి మనమునఁ దలఁచిన దురితి మడఁగిపుణ్యము దొరకున్''(1-82) అనిచెప్పి ధర్మజుని ప్రోత్సహించెను. ఈ సందర్భమున భీముడు స్వామితత్త్వము నవగాహనము చేసికొనిన యాత్మ విశ్వాసపరునివలె భాసించును. భీమ కృష్ణ సంబంధము లీ కావ్యమున సరసములై భాసించినవి. ధర్మజుడు స్వామిని దీనాతిదీన వాక్యముల బ్రస్తుతించి కౌరవ సభయందు ద్రౌపదిమానమును గాపాడిన స్వామి కృపా దృష్టి లేనిచో మఖమెట్లు నెరవేరునా యని చింతించు నంతలో "సమస్త భువన వ్యాపియు విశ్వరూపియు నగు గోపికారమణుండు" (1-108) వాకిట నిలిచి ప్రతీహారి వలన తన రాక నెరింగించెను. తన భక్తుడైన వానికి సాక్షాత్సన్నిధి యెప్పు డవసరమో యపుడు స్వామి కృపజేయు పద్ధతి యిందు నిరూపితము. అర్ధరాత్రిమున వచ్చిన స్వామి రాకను గూర్చి యబ్బురపడ వలదని చెప్పి ద్రౌపది "దాసజనుఁ డెందు నే యుపద్రవము జెందు నందులకు వచ్చి రక్షించు నచ్యుతుండు" ( 1-114 ) అని చెప్పి తన మానము స్వామి రక్షించిన వైనము నుదాహరించినది. ధర్మ నందనుని ఫలసిద్ధి యగున ట్లాశంసించి స్వామి హాస్యరసానుగుణ చిత్తవృత్తినంది భీము నిట్లనినాడు. "మందమతియు బహ్వాశియుఁ దుందిలుఁడున్, రాక్షసీ రతుఁడు, నిష్ఠుర వాక్సందర్భుఁడు..." (1-120) నగు భీముని సచివత్వము కార్యకారి యగునని. దీనితో కృష్ణ భీముల నడుమ సరసాలాపములు రగిలినవి. స్వామిని భీముడు కాముకు డనియు, నీచరతి శీలి యనియు, బహ్వాశి యనియు వ్యాజస్తుతి మార్గమున కొండాడి "...ముదము దైవార నుద్ధరింపు గాక పంకనిర్మగ్ను నన్ను గోపాల తిలక" (1-130) యని స్తుతించెను. అటుపై ధర్మరాజాదుల భక్తి, ద్రుపద నందన యాతిథ్యము రమ్యముగ వర్ణింపబడినవి. ఇట్లు ప్రథమాశ్వాసమున స్వామి భక్తానుగ్రహ తత్పరత, కౌటుంబిక సారస్య స్ఫూర్తి నిరూపింప బడినవి. యౌవనాశ్వుడు సైన్యముతో హస్తిపురమునకు వచ్చి పాండవులతో నెయ్యము నెరపు పర్యంతము స్వామి

యందే యుండి యశ్వమేధమునకు కాలము నిర్ణయించి ద్వారకకు బోయెను. యజ్ఞ సమయమున స్వామిని తోడి తెచ్చుటకు ధర్మజుడు భీముని ద్వారక కంపెను. ఆ సమయమున స్వామి రుక్మిణీ సత్యల యుపచారములు గొనుచు చతుర్విధాహారముల నారగించు చుండెను. స్వామి భీముని భోజనమున కాహ్వానింప నాతడు "తల్లి చన్నుల పాలుఁ ద్రావి యంతటఁబోక పూతనఁ బొరిగొంటి పురిటిలోన, జనని యుగ్గున దృష్టిఁ గనక నిన్నటిదాక వెఱఁజితి వ్రేపల్లె పెన్నె ల్లెల్ల... కడుపు లోపల సకల లోకములు వరుసఁ గూడుకొన్నప్పు డున్ నరఁగొఱఁతఁ గాని తుష్టుఁడవు కావు..." (3-53) అనెను. పూర్వోక్త సరసత్వమునకే యిది యుదాహృతి. భీము నాహ్వానము మేరకు మహావైభవముతో స్వామి హస్తినకు బయలుదేరెను. మార్గ మధ్యమున సరదడిగ నున్న వృద్ధ వేశ్యాజనమును పురస్కరించు కొని స్వామి భీమునితో "వీరిఁ బరిగ్రహింపు మిది వేళ సమానలు నీకు భీమణాకార కఠోర మన్మథ వికార గుణంబులనన్న, నవ్వి యమ్మారుతి పల్కె నిట్టి కొఱమాలిన జింతలఁ జక్కబెట్ట నీ భారము వన్నె కెక్కు దురవస్థలు నీ కరలాలనంబునన్" (3-67). ఇందు సరస వ్యాహారముతో బాటు కుబ్జా వృత్తాంత స్ఫురణ మున్నది. ఒక సరో వర తీరమున స్వామి విడిసి యుండి రుక్మిణితో నుత్త మాభిరుచి పూర్వకము, సాహితీ పరమునైన సరస సంభాషణము నెరపినాడు. "...కమలిని జూచితే ప్రియుఁడు గన్గొన రామి మరాళ సామజ భ్రమర కులమ్ముపైబడ గరంబు సుఖించెదుఁ గామ యెప్పుడున్ రమణుని కంటె నెన్మిది గుణంబులు గాదె లతాంగి కారయన్" అని నాడు. రుక్మిణి "తనయుని వాహనంబు హంసముఁ దన వాహన మేనుఁగు దేఁటులయెడఁ దనుజాహవమగు గానఁ దగదిటు పల్కన్" అని మరియు నిట్లు చెప్పినది. "తా మొదలం బద్మిని యుఁట గామిం చునె యన్య పురుషుఁ గలలోనైనన్ దామరస నేత్ర యంతర్యామివి నీవెఱుఁగనట్టి యర్థముఁ గలదే" అనినది. (3-67,68,69). పరిహాస

పల్లవితమైన యిట్టి శృంగార ప్రసంగము కృష్ణ పరముగ నాంధ్ర వాఙ్మయమున వసధని చెప్పవలెను. ఇందలి నర్మ గర్భితమైన యుక్తి విశేషమునకు నొక యెత్తిపొడుపు గూడ ననుసంధింపవచ్చును. ప్రద్యుమ్న దర్శనము వలన రుక్మిణి తప్ప మిగిలిన యంతః పురాంగనలు మానసిక వికృతి నందిరి. రుక్మిణికి మాతృత్వము పెల్లుబికెను. కమలినీ శబ్ద మాధారముగ స్వామి యాదు వారిని సాముదాయికముగ కామినులని యెత్తిపొడువ, రుక్మిణి పద్మినీజ శబ్దముచేత తన పరమాంశమును, స్వామి యంతర్యామి విష్ణుత్వమును జ్ఞప్తి కెలయించి త్నన్ను తాను సమర్థించుకొనినది. మహా వ్యంగ్య వైభవము కల్గిన సర్గస సాహిత్య చమత్కృతి యిది. పిమ్మట "తెల్లనిపట్టి నామములుఁ దీఁగెల నట్టెములున్ బదంబులన్ బిల్లం జెప్పులున్ జెవులఁ బింఛములున్, మొలనున్న క్రొత్త కంబళ్లును... (3-71) గల్గిన గొల్లలు వచ్చి స్వామికి కానుకలిచ్చి స్వామితో ముచ్చటలు దీర్చుకొనిరి. స్వామి స్వరూపము నందు వచ్చిన మార్పును మూఢ వాక్యములలో వారు వ్యాఖ్యానించిరి. ఈ సందర్భమున వాస్తవిక రూప వర్ణనా కౌశలము, పాత్రోచిత భాషా ప్రయోగమును పినవీరభద్రుడు వెలార్చినాడు. అటుపై యజ్ఞ నిర్వహణమున స్వామి సఖ్య భక్తుడగు పార్థుని యందును, ధర్మజునందును విభిన్న మార్గముల ననుగ్రహము నెరపినాడు. యజ్ఞాంతమున స్వామి పూజితుడయ్యెను. అంతకుమున్న నారదుఁడు సత్యభామ మందిరమున కేగి యజ్ఞకాండ యందు రుక్మిణికి లభించిన పెద్దరికమును జెప్పి "రాజన్యుల్ సకలతుర్లై యరుగుదేరన్ జామరచ్ఛత్ర విభ్రాజిష్ణుం డగుఁ గృష్ణుఁ గూడుకొని దాంపత్యంబునన్ రుక్మిణీ రాజీవానన యెగ నీ చనవు వ్యర్థంబయ్యె..." (8-180) నని పుల్ల పెట్టినాడు. ఆమె తన కేళీసౌధమున నున్న మురారినిఁ జూప ముని విస్మితుఁడై స్వామి సర్వాంతర్యామితను కీర్తించుచు వెడలినాడు. పిమ్మట నిరువురు విప్రులు తమలో తాము వృత్తి క్షేత్రముల విషయమున కలహించిన సందర్భమును

పురస్కరించుకొని స్వామి ప్రసిద్ధ మార్గమున గలియుగ ధర్మముల నుపన్యసించినాడు. కలియుగమునందు స్వామి 'సాళ్వ నారసింహుం డనై పుట్టి కుటిలురన్ శాసింతు' నని చెప్పుట (8-214) పినవీర భద్రునికి కృతి భర్తపై గల యతిమాత్ర గౌరవమును నిరూపించును.

ఈ విధముగ జైమినీ భారతము రచనా మార్గమున ప్రౌఢము రసవంతమునై కృష్ణ తత్త్వము నందలి భిన్నాంశముల నిరూపించుచు భారత భాగవతాదు లందలి కథా ఘట్టముల కు పూరకమై యున్నది. ఇందలి కథా వృత్తాంతము లనేకములు అర్వాచీన కాలమునఁ గావ్యనాటక హరికథా స్వరూపములలో నధిక విస్తృతి నందినవి.

## అష్టమహిషీ కళ్యాణము

తాళ్ళపాక తిరువేంగళ నాథుని అష్టమహిషీ కల్యాణ ముత్తమ ద్విపద కావ్యము.[153] భాగవతమునందలి యేక దేశ ఘట్టములను పలువు రర్వాచీనులు కావ్యములుగ రచించి యున్నారు. కాని వారిలో నొక తెగకు జెందిన కథా ఘట్టములను క్రోడీకరించి యుద్గ్రంథముగ రచించు సంప్రదాయమునకు తిరువేంగళ నాథు డాద్యుడు. "...జలజాక్షుఁడెట్లు జనియించె నేమేమి సలిపె లోకమున మహిమ మీరంగ నమ్మధువైరి యష్ట మహిషుల నేరీతి మహిఁ బెండ్లియాడె?..." (పుట. 9) ననెడు శ్రోతృ సంప్రశ్నము నందే కావ్య కథా వ్రణాళిక సూచింప బడినది. స్వామి యవతరణమునకు పూర్వ రంగముగ భూదేవి కష్టదశతో బ్రారంభమై, భద్రా కల్యాణముతో నంతమొందు కథా వృత్తాంత మంతయు ప్రాయికముగ భాగవతాను సారి. కాగా కొన్ని యెడల నూత్నకథా సంధానము, కొన్ని యెడల కథన నైపుణీ విశేషములు నిందున్నవి. జానపద సాహిత్య

153. తిరుమల తిరుపతి దేవస్థానము వారి ప్రచురణము-1937.

మున పండ్ల నమ్మెడు స్త్రీ కథ యొకటి భిన్న భిన్న రూపములలోఁ బ్రసిద్ధము. అందలి యొక పద్ధతిని గ్రహించి యిందు పొందుపరచుట యీ కవి దేశికవితా దృష్టికి నిదర్శనము. కాయజు మదదంతివలె నున్న యొక బోయెత వ్రజ వీధులయందు ఫలములఁ గొనుకొందు బాలురు రండు అని కేక లిడుచు వీధి వీధిలో దిరుగుచుండెను. స్వామి యామెకడ కేగి దోయిలి సాచి కొసరి కొసరి పండ్లను గొనినాడు. అందులకు బదులుగ గొలుచు వెట్టినాడు. ఇట్లు చేయుటలో పుడమిపై తలబ్రాలు పోసినట్లు కొలుచంతయు చింది పోయినది. బోయెత "...సితాయత కటాక్షంబు నందు జిప్పల జెప్పలద్దగింపగను" (పుట. 40) స్వామికి బండ్ల నర్పించినది. తత్ఫలితముగ శిష్టములెల్లను దివ్యరత్నములై శోభిల్లెను. మాధవుని కకలంకమతితో మర్త్యుఁడేమి యర్పించినను స్వామి సహస్రగుణముగ దానిని తిరిగి ప్రసాదించునను విషయమున కీ కథ నిదర్శనము. అట్లే గోపికలు స్వామికై విరహము నందు చున్నపుడు "...రాధననంగ మర్మకళా ప్రబోధ బోధించి యటఁ గొనిపోయి యొక్కెడను గేరుచు రతుల చొక్కించి తక్కించి..." (పుట. 100) అనుట వలనను, "...శౌరి నిచ్చలు విలాసప్రసూనముల నారాధనము సేయు నారాధ గదిసి యంచితగతిఁ బట్టినట్టి విపంచి పంచి పైచినరతి బరికించి తోడి జోడు గానముగా సొగసుగా గూడి..." (పుట. 107) యనుట వలనను రాధావృత్తాంతము ప్రసక్తమైనది. భాగవతమున గోపికల యనూయకు గురియై స్వామికి ప్రీతి పాత్రయైన యొక కాంతయే యర్వాచీన వాఙ్మయమున రాధగ రూపొందిన దని విమర్శకులు భావించిరి. తిరువేంగళ నాథుడీ యభిప్రాయముల కిచట దోహదము కల్పించినాడు. స్వామి మధురానగరమునందు నొనర్చిన కృత్యములలో కుబ్జ నుద్ధరించిన ఘట్టము లేదు. తరువాత స్వామి యామె కోర్కెను దీర్చిన వైనము వర్ణింప బడినది. అష్టమహిషీకల్యాణములలో భాగవత కథతో పోల్చినపుడు మిక్కిలి యలతులగు మార్పు లున్నవి. సత్యభామకు

వివాహ సందర్భమున సత్రాజిత్తు శమంతకము నరణమిచ్చిన ట్లిందు చెప్ప బడినది. ఇట్టివే యితరములును. మొత్తము మీాద కథా విష యమున నిందు ప్రత్యేకించి చెప్పదగిన మార్పులు లేవు.

ఈ కావ్యమున ప్రధానాంశము తిరువేంగళ నాథుని ద్విపద కావ్యరచనా వైభవము. ఆంధ్ర ద్విపద కావ్యములలో నిది యగ్ర గణ్యము. కథా కథనము, వర్ణనానైపుణియును విషయములపై కవి యూనిక నుంచినాడు. శ్వేతద్వీపము, "కమలజులైనట్టి కమలజముఖుల్ సకలయోగీంద్ర హృత్సత్వ గుణాంబు లొక రూపమై యిటనొప్పెనో యనగ, నమృతంబునై గట్టినట్టి మీాగడయో? కొమరారు వెన్నెల కుప్పయో యనగ మున్నీరు తరువగ మురిసైన వెన్న తిన్నయో యన నొప్పు" (పుటలు. 11, 12) అనుట సొగసైన రచనమునకు, నాధ్యా త్మిక సంస్కారమునకు నిరూపకము. అల్లే స్వామి "కలువ వల్లుల ఘనలవిత్రముగల యలపునఁ జింతకాయలు తూలియాడ గుంపులై చీఁకటి గుమురుల మూలదుంపలో యన జెడల్ తుంపెసలాడ గొదమ వెన్నెల పులుగుల గూటనిడిన చదురునఁ గేలలోచనములు మూసె" (పుట. 29) వంటి రమణీయ దృశ్యములు, "నందనందను వేణునా దేందు కాంతి" (పుట. 89) వంటి లోకోత్తర రూపచిత్రణారీతులు తిరువేంగళనాథు డలవోకగ వాడి యున్న వాడు. గోపికలు స్వామి నధిక్షేపించుచు "మిట్టి మీానంబవై మెరయుదు వచట వలసి యొల్లమి గాక వలసి యుండినను దలకొని కొండైన దలకెత్తు కొందు..." (పుట. 91) వంటి వర్ణనలు దశావతారకథా స్ఫురణమున భాగవత మార్గాను సారులు. రుక్మిణీ కల్యాణ ప్రతిపదికగ "...పుష్పకా ర్ముకు తండ్రి దలచి యతని సద్గుణ కీర్తులనెడి చంద్రికల శుభ్రతిచ కోరములచే జూరలాడుచును" (పుట. 174) నను రుక్మిణీ మనోగత మును చెప్పుట మహత్తరమైన వస్తుధ్వని. కులపురోహితునిచే రుక్మిణి తన యురమున నున్న హరిని దిద్దిన హోమ ముద్రిక నంపుట "హరికి నిమ్మని సీత హనుమంతునకు శిరము మానిక మంపు చెలు

వున నొసఁగ" (182) నని చెప్పుట వలన రామకథా గత గార్హస్థ్య ధర్మపరాకాష్ఠ రుక్మిణీ కృష్ణ సంబంధమున కు పా దే య ము గ సూచించుట సామాన్య కవులు చేయలేని పని. తిరువేంగళనాథుని శైలీ విశేషములు, పలుకుబడి సోయగములు ప్రత్యేకములు. ద్విపద లోనే యాతడు సంస్కృతాంధ్రములను సవ్యసాచి వలె నిర్వహించి నాడు. "సుదతీకదంబ యశోద యశోద శాతనఖాగ్ర సంజాత నరీన చేతన పూతన" మున్నగు నవి ప్రసిద్ధమైన కట్టు బడులు. అవి యట్లుండ "నగముల కేఁగి వానల దొప్పదోగి చిగురుల నమలి మించిన యొండగ మరి" (పుట-215) వంటి తెలుగు జిలుగుదనము పట్టు లనేకములు కలవు. అష్టమహిషీ కల్యాణముల వర్ణించుపట్ల నాటి వివాహ పద్ధతులు, వివాహములకు వచ్చెడు బ్రాహ్మణుల రీతులు, వారి భార్యల స్వరూప స్వభావములు సమకాలీన ముద్రతో పరమ రమణీయ ములు. బ్రాహ్మణులు "పనస చక్కఁగఁ జెప్ప పనస యటంచుఁ దనయ శిష్యులకు వేదముఁ జెప్పికొనుచుఁ జెవి నెరప్రోగుఁ దాల్చిన వారినెల్లఁ దవిలి వేడుచు నక్షతంబు లిచ్చుచును గ్రాస మిప్పింపుడు కాదేని యొక్క కాసైన దాన మీఁగదరే యటంచు" (పుట-230) వత్తురట. వారి భార్యలు ముదుక చీరలు కట్టి "చతురాస్యుఁడాస్య రసంబుల నిట్లు లతివగఁ గావించెనని జనులఁ బొగడఁ గన్న బిడ్డలఁ జంకల పెట్టి మున్ను మున్న చెంతలఁ బెనుమూకగా నడువ గుసి గొంపు నడకల కోడె బాపెతలు..." (పుట-232) వత్తురు. సైనికులు బహు భాషలలో మాటలాడుట, స్వామి యొక్కొక్క వివాహ మున నొక్కొక్క వేషమును ధరించుట మున్నగునవి సమకాలీన ముద్రలు. ఈ విధముగ అష్టమహిషీ కల్యాణము సర్వతోముఖ కావ్య గుణ భూయిష్ఠమై యున్నది. అనేక వృత్తాంతముల నొకచో చేర్చు పద్ధతి కిది యొజ్జబంతి.

35)

కృష్ణాభ్యుదయము :

ఇట్టిదే యర్వాచీన కాలమునకు చెందిన కృష్ణాభ్యుదయము.[154] కృష్ణకథాంశముల నొకచోఁ జేర్చి రచించు పద్ధతి పూర్వోక్తము. ఈ మార్గమునే ధరణిదేవుల రామయ మంత్రియు నవలంబించినాడు. వీని యందు సంపూర్ణ కృష్ణకథా ప్రకటనాభిరతి తత్సంక్షేపము పోను ప్రత్యేకత కనుపింపదు. వీని వినియోగ మిద మిత్థమని చెప్పజాలము. పరిధి స్వల్పమగుట వలన వీని యందు ప్రాయికముగ రసోల్బణాదులకు తావు లేదు. ఉక్తి విశేషములతోను, సందర్భానుసార వ్యాఖ్యానములతోను కవి కాలక్షేపము చేయ వలసి యుండును. కవి సమర్థుడుకానిచో నిట్టికావ్యములు సంక్షిప్త వార్తాచిత్రముల వలె భాసించు ప్రమాదమున్నది.

పార్వతీశ్వరకవి రచన ప్రౌఢమైనది. శైలియందు ధారాశుద్ధి, స్వాదుత కలవు. ప్రస్తుత కావ్యమున ప్రసిద్ధ పురాణేతివృత్త సంగ్రహామే కాక విశిష్ట పురాణములందలి వృత్తాంతములను సైతమును క్రోడీకరించినాడు. ఈ మార్గము విశిష్ట పురాణములం దున్నది. ఇందలి యసౌకర్య మేమన నాంధ్ర వాఙ్మయమున ప్రసిద్ధ పురాణ కథాంశములతో విశిష్ట పురాణ వృత్తాంతములు చక్కఁగ సమ్మేళనము నందవు. అట్టి యసౌకర్యమే యీ కావ్యమునకు పట్టినది. ఇందెడ నెడ తాత్త్విక సమన్వయములు గమనార్హములై యున్నవి. "మురళి ప్రణవంబు గోపికల్ ముక్తజనము, గోగణంబు చిరంతన గోగణంబు రాధ మూల ప్రకృతి, లక్ష్మి బ్రహ్మవిద్య, కృష్ణుం డానందమయ తత్త్వమిది నిజంబు" (7వ పద్యము.) ముదిగొండ కృత కృష్ణ స్తోత్రాదులు భక్తి భావ విలసితములు. (ఈ కవి గోపాలకృష్ణ శతకమును రచించి యా గ్రంథము నష్టమైపోవ నందలి పద్యముల కొన్నిటి నిందు జేర్చెనట. చూ: పూండ్ల రామకృష్ణయ్యగారి పీఠిక

154. మండపాక పార్వతీశ్వరకవి. అముద్రిత గ్రంథచింతామణి- రమా విలయ ముద్రాక్షరశాల, నెల్లూరు-1903.

పుట-2) "నేనీవాఁడ నటంటి వేడుకొనుచుంటిం బ్రోవు మంటిం గృపన్, నానేరంబులు సైపుమంటి, భవసంతానంబు నే నోర్వఁగా లేనంటిన్, నిను వంటి వేల్పు లెవరున్ లేరంటి, రక్షింపుమీ నానా మంగళ సంఘ సంఘటన తృష్ణా బాలకృష్ణా హరీ" (138) వంటి విందుల నుదాహరణములు. కథా క్లుప్తిని, విషయ సంగ్రహణమును నీతడు చక్కఁగ సాధించినాడు. గీతాసార సంగ్రహ మిట్లున్నది. "ఆత్మకు లేవు శాశ్వతయు బాధకతయు నని తెల్పుచు, విషాదమునకు దయకుఁ గారణంబులగు నహంకారంబు మమకార ముడిపించి సంగరోద్యోగమునకుఁ గారణంబైన స్వకర్మంబు విడువక ఫలకాంక్ష విడిచి నిచ్చలు నొనర్చి, క్రమముగా సర్వ ధర్మములను విడిచి నన్నే యాశ్రయింపుము. నే నశేష దోషములఁ బాపి యుద్ధరింతు వలవంత వలదటంచు వచించి విశ్వాసమునకు విశ్వ రూపంబు జూపి యవ్విశ్వభర్త పార్థుఁడు నిమిత్తముగ మహీభారముడిపె" (232). ఈ కావ్యమున నొక విశిష్ట వృత్తాంత మున్నది. స్వామి రామావతారమున శివగీతల తత్త్వమును గ్రహించి తత్సారమును గీతగ పార్థునికి ప్రవచించెను. ధ్వజస్థుడైన మారుతి దానిని విని యవతీర్ణుఁడై వచ్చి తన కృతార్థతను వెల్లడించెను. స్వామి యాతని పిశాచాకృతి నందునట్లు శపించి, పైశాచిక భాషయందు గీతాభాష్య మొనర్చినచోఁ బూర్వాకృతి నందునట్లు నిర్దేశించెను. నిరూపితార్థమే మన "పొత్తములం గనుగొనియుఁ బోవుచుఁ బోవుచు నాలకించియున్ జిత్తము తృప్తమయ్యెననఁ జెల్లదు చెల్ల గురూపదేశ సంపత్తి వినాకరించి పెరభంగి నెరింగిన విద్య విద్యగా దుత్తమ సంప్రదాయ విదులొప్పరు తప్పది బ్రహ్మవిద్యకున్" (237). ఇట్లీ కావ్యము సమగ్ర కృష్ణకథా ప్రతిపాదకమై, తత్త్వబోధకమై, ఉత్తమ రచనాశిల్ప శోభితమై యొప్పుచున్నది.

శ్రీమదాంధ్ర రుక్మిణీశ విజయము :

అనువాద కావ్యమైనను ప్రత్యేక భావ సంస్కారముల

కాకరమై కృష్ణకథా తత్త్వమున విచిత్ర భావముల నారోపించిన ఒక కావ్యము నీ యనుశీలనమునఁ జేర్పవచ్చును. అది శ్రీ పళ్ళె పూర్ణ ప్రజ్ఞాచార్య కృతమైన శ్రీమదాంధ్ర రుక్మిణీశ విజయము.[155] దీనికి మూలము మధ్వ సంప్రదాయమునఁ బ్రముఖాచార్యులైన శ్రీ వాదిరాజ తీర్థుల రచనము. అనువాద మొనర్చిన శ్రీ పూర్ణ ప్రజ్ఞాచార్యులు లబ్ధ ప్రతిష్ఠులైన విద్వత్కవులు. ఇందలి కథా వస్తువు కృష్ణ జననము మొదలు అష్టమహిషీ కల్యాణ పర్యంత మున్నది. మూలకర్తయు, ననువాద కర్తయు మాధ్వులగుటచేత నిందు మాధ్వ దర్శనాభిరతి భాసించుచున్నది. ధారాశుద్ధితోను, చక్కని తెనుగుతోను గంభీరమై సాగివచ్చిన యాచార్యుల రచనా పద్ధతికిది చక్కని నిదర్శనము. విశిష్ట కథాంశములఁ గొన్నింటి గమనింప వచ్చును. స్వామి యుగ్రసేనుని రాజ్యమున స్థాపించిన పిమ్మట నాతని పరిపాలనము వైష్ణవమత సమ్మతముగ జరిగి యుండుట, ఉగ్రసేనుడు స్వామికొక భక్తునివలె వ్యవహరించుట, స్వామి దేవకిని దర్శించినపుడు భక్తురాలివలె "తల్లి కవుంగలించి కరతామరసంబుల మాలలిచ్చె నుత్ఫుల్ల విలోచ నాంబువుల మూర్ధము నందభిషిక్తుఁజేసె బల్గొల్లగ నుద్భవిల్లు కుచకుంభ పయస్సు నివేద్యమిచ్చె దృగ్వల్లుల హారతిచ్చె..." (ద్వాదశ-19) నని చెప్పుటయు విశిష్ట వృత్తాంతములు, జరాసంధ సైన్యము లుపనిషద్విద్యవలె నుండుట, స్వామి రథము మధ్వగురూత్తంస మనోరథమువలె నుండుట, గదాయుధము మధ్వ గురువర్యుల వాగ్ధారవలె నుండుట కతిపయ విశేషోక్తులు. స్వామి బహు భార్యాత్వము నాతఁడు వారి యందలి శ్రీతత్త్వమునకు లొంగుటగఁ జెప్పఁబడినది. స్వామి సంతానార్థియై పరమేశ్వరు నర్చించిన విషయము బహురీతుల నిందు సాఁగదీయఁ బడినది. "కైలాసాధిక యాత్ర కృష్ణునకు వక్కాణించు న్యూనత్వ ముల్ గైలాసేశునకన్న నన్నసరె! మైక్యంబెట్టు లహ్వారికిన్ పీతా

155. శ్రీపూర్ణ ప్రజ్ఞ గ్రంథమాల. గుంటూరు. 1950-51.

సేవ్యుఁడు సేవకుండొకటియయా!..." (ఏకోన వింశతి–19) అనియు, "...ఆతని యనుగ్రహంబుననా! కుమారుఁబడసె మురవైరి! నమ్మరీ పల్కు బుధులు" (ఏకోన వింశతి– 26) అనియు చెప్పుట శివకృష్ణ పారస్పర్యమునకు సంబంధించిన విచిత్ర దృక్పథము. ఇట్లు కృష్ణకథా రచనమునఁ గతిపయ విశిష్ట విచిత్ర భావములతో నిండిన దా కావ్యము.

ఆంధ్ర సాహిత్యమున కవిత్రయము యొక్కయు. పోతనాదుల యొక్కయు వాఙ్మయ తపః ఫలితముగ హరిహర, రామకృష్ణాద్యభేద ప్రతిపత్తి బలవత్తరమై నెలకొని యుండుట వలన యిట్టి భావములకు వ్యాప్తి తక్కువనియే చెప్పవచ్చును. దృక్పథ వైవిధ్యమునకీ కావ్య ముదాహృతి.

శ్రీకృష్ణాతిమానుష తత్త్వము :

శ్రీధివి రంగాచార్యులు రచించిన శ్రీకృష్ణాతిమానుష తత్త్వము సమగ్ర కృష్ణకథా ప్రతిపాదకము.[156] ఈ కావ్యము బహు కవి పండిత జనామోదము నందినది. కృష్ణకథాంశములు బహువిధ కాల్పనికాంశములతో జోడింపఁబడి యిందుఁ జేర్పబడినవి. బహు పురాణ పరిశీలనా ఫలితమైన కథా దృక్పథము, బృహత్కావ్య రచనాను కూలములైన ప్రతిభా వ్యుత్పత్తులు, అవధాన విద్యా ఫలితమైన ధారాశుద్ధి యిందు ప్రధానముగఁ జెప్పఁదగిన యంశములు. నవ్య యుగమున నిట్టి సమగ్రతా స్ఫూర్తిగల కావ్యముల సంఖ్య స్వల్పము.

గోదావైభవము :

గోదావైభవము కథాకల్పనము, తాత్త్విక ప్రవచనము నను నంశముల చేత నిందుఁ బ్రసక్త మగుచున్నది.[157] ఇందలి కథాంశ మిట్లున్నది; యువతియైన గోదాదేవి గుడిలోని గోపాలుని దర్శించి

---

156. విద్యాపరిషత్ ప్రచురణ- గుంటూరు—2.

157. ది వరల్డ్ టీచర్ ట్రస్ట్- విశాఖపట్టణము—1. 1972.

మధురభావమునకు లోనై బృందావన గోపికల యనుభూతి నంది నది. ఒకనాడు వేకువ స్నానమాడి వచ్చుచున్న గోదాదేవికి నీల దేహుడైన దివ్యమూర్తి స్పర్శానుభూతి కల్గినది. అనుదినమట్లే జరుగుచుండ నామె యీ యనుభూతి సత్యమో, భ్రాంతి యో తెలిసికొనలేక పోయినది. తన వాలు జడలోని బంతిపూవు మాయమగుట, గుడిలోని స్వామి వేణువుపై నదియుండుట, తాను నిత్యము పొందుచున్న యనుభూతికిఁ గారణమైన వ్యక్తి గుడిలోని స్వామివలె నుండకపోవుట యను నంశములు గోదా హృదయమున నార్తికి దోహదమొనర్చినవి. గోద దీక్షితయై గోపికలవలె చెలులతో గూడి వ్రితానుష్ఠాన మొనర్చుట, యాలయమునందలి స్వామి యా దేశమున విష్ణుచిత్తుడు శ్రీరంగమున కేగి గోదను రంగేశ్వరునకు పెండ్లి చేయుట-మున్నగు కథాంశము లిందున్నవి. స్వామి వేణు గోపాలమూర్తియై యామె హృదయమున సన్నిధి జేసియుండి రంగే శ్వరునితో వివాహమునకు సంధాన కర్తయగుట యిందలి కల్పనలో నద్భుతమైన యంశము. ప్రస్తుతాను శీలనమునకే తత్కావ్య ప్రసక్తి కిని నదే కారణము. ఇటుపై రెండు మహత్తరాంశము లిందు ప్రిస క్తిని గలిగియున్నవి. అందొకటి గోద చెలికత్తెలలో నొక తెయగు హేమకు గల్గిన స్వప్నవృత్తాంతము. అందు పారిజాతాపహరణవృత్తాం తము ప్రవర్తిల్లినది. పారిజాత కుసుమ దామమును స్వామి మెడలోనే వైచి యామె మరియొకమాలిక గట్టబోవుచుండ స్వామి వారించి సత్య ధరించి యిచ్చిన మాలయే తనకు ప్రీతికరమనియు, నెన్ని జన్మముల కైన దానిని జ్ఞప్తియుంచుకొని యా మాలికను తాను కోరి ధరింతు ననియు చెప్పెను. దీనిని బట్టియు, ననంతర కథయందు శ్రీరంగేశ్వ రుడు గోదకు బోధచేసిన తత్త్వమును బట్టియు, నీమె భూదేవి యంశ మున జన్మించినదన్న సంప్రిదాయ విషయము స్థాపింపబడినది. గోదాదేవి స్వామిని తనకును స్వప్నానుభూతిని గల్గింపుమని ప్రార్థింప నామె కొక స్వప్నము వచ్చెను. అందుస్వామి రథసారథియై

గీతాచార్య స్వరూపమున నామెకు భాసించి శరణాగతి తత్త్వము నందలి సూక్ష్మ రహస్యముల నుపదేశించెను. "స్వామి కలిగించిన యనుభూతిని స్వీకరింపవలెనే గాని, యిట్టి యనుభూతిని కావలెనని కోరరాదు. భక్తి అనఁగా వ్యామోహము కాదు." (పరిచయము-పుట VII) అనునది యిందలి తాత్పర్యము. ఈ విధముగ కృష్ణ తత్త్వము నందలి ప్రముఖాంశములనే గాక శ్రీ భూ తత్త్వముల పార స్పర్య వివలనము కారణముగ స్వామి భిన్నావతారముల నైక్యసన్నై నముగూడ నిందు ప్రతిపాదితమైనది. ఇందలి తాత్త్విక గౌరవమునకు కారణమైన యంశములలో నిదియొకటి.

శ్రీ కృష్ణమాచార్యుల రచనా మార్గమీ కావ్యమున నద్భుత మైన తెనుగు దనమునకును, పరమ సాంప్రదాయిక రమ్యత్వము నాచికొన్న యూహాశాలిత్వమునకును, హృదయ మర్మముల సూటిగ దాకు స్వాదుత్వమునకును స్థానమై యున్నది. "కేళీకల్పిత నాభి పల్వల నటత్క్రీడా సరోజా నతవ్యాలోలాంబర బంభర శ్రుతిశిరః పాదద్వయీ కోమలా! శ్రీ లాక్షా చరణార్ద్ర లాస్యపదవీ చిద్దేహ వక్షస్థలీ ప్రాలంబి స్ఫుట వైజయంతి విలసద్భద్రాకృతీ కావవే" (పుట. 45) వంటి ప్రౌఢ రచనలు, "తెల తెలవారువేళ గురు తించెను, మించిన తేట వెన్నెలల్ చలి చలి తీఁగలై మనసు నందడి సేయఁగ నవ్వుకొంచు కన్గొలకుల మోద బాష్పములు గోట విదుర్చుచు నేదొ జ్ఞప్తిగాఁ జెలినిదురించు సెజ్జకడఁ జేరిపతించెను సుప్రభాతమున్." (పుట.6) వంటి సుకుమార భావచిత్రణములునిందు కొల్లలుగ నున్నవి. తాత్త్విక ఘట్టముల యందీకవి యనన్యుడై భాసించును. "సర్వజీవులు నానుండి సాఁగివచ్చు సర్వభావములకు నే నసాక్షి సుమ్ము ధర్మమై నేను మీలోన దాఁగియుంటి, యేమి లేనట్టి గగనాన నిమిడియుండి అన్నియున్నట్టి భూమిని నవతరింతు నేను గగనాని కవ్వల నిలిచి యుంటి కాలగోళము నాలోన గరఁగిపోవు" (పుటలు. 65, 66) వంటి వాక్యములలో జటిలమైన తత్త్వార్థములను సూటియైన తేట

పలుకులతో చెప్పుట యేకొలదిమంది కవులకో సాధ్యమైన విషయము. "ఈ నేను శాశ్వతుండన యీ నీవును శాశ్వతం బదింతకు వేరై దేనిని గాంచిన నిలువదు..." అనియు, "ఈ నేను నీకు స్వామిని ఈ నీవే గోద-రాధ-యింకనుఁ బెక్కు-మానినులు గోపకన్యలు నీనా ప్రణయంబె జగతి నిత్యము సుమ్మీ" (పుట. 80) యనియు జెప్పుట స్వామి యొక్క శాశ్వత తత్త్వమునకు వ్యాఖ్యానము. "లక్ష్మియన నాదు సంకల్ప లక్షణమ్ము దాని రూపందు సృష్టియే ధరణి సుమ్ము తుది మొదలు లేక నింగిని తొంగిచూచు నీల దేహాపు కాంతియే నీలసుమ్ము!" (పుట. 198) అను వాక్యములు శ్రీ భూనీలా సహితుఁడైన స్వామిస్వరూపమును సుస్పష్టరీతిని వ్యాఖ్యానించు చున్నవి. ఈ రీతిగ గోదావైభవము కృష్ణకథా ప్రసక్తి గల్గిన కావ్యములలో నత్యున్నతస్థాయికి చెందినది.

కృష్ణమంజరి :

ఇటుపై మిక్కిలి విశిష్టమై చిత్తశుద్ధితో గూడి ప్రపత్తి భావ తుందిలమైన యొక చిన్న కావ్యము పూర్వ కవయిత్రి యగు తరిగొండ వెంగమాంబ రచించినది ప్రసక్తమగు చున్నది. అదియే కృష్ణమంజరి.[198] సుప్రసిద్ధ కవయిత్రియు, మహాభక్తురాలును అగు తరిగొండ వెంగమాంబ యీ చిన్ని కావ్యమున నొక విశిష్టతను సాధించినది. ఇందలంకృత కవితా రీతిగాని, శబ్దాడంబరము గాని లేవు. ఉన్నది ప్రార్థనా పూర్వకముగ హృదయమును స్వామి పాదముల కడ నివేదించుకొని తన దుస్సంస్కారముల బోనాడి దివ్యదర్శన మిమ్మని వేడుకొనెడు ఆర్తి. ఇది మంజరీ ద్విపదయందు విన్నపముల మార్గము ననుసరించు చున్నది. నెల్లూరు, రాయలసీమ మున్నగు మండలములలో భిన్న వర్ణములకు జెందిన స్త్రీలు భక్తి ప్రపత్తులతో నిత్య మనుసంధాన మొనర్చు పారాయణ గ్రంథమిదియని చెప్పుట

198. సంపాదకులు నవులూరి మాలకొండయ్య పంతులుగారు-ఉస్మాన్ సాహెబ్ పేట-నెల్లూరు-2.

కన్న తత్త్వశక్తికి నిరూపణ మక్కరలేదు. ఆమె చూడదలచిన స్వామి ముచ్చట లిట్టివి.

"బ్రహ్మ రుద్రాది దిక్పతులైనవారు
మ్రొక్క నొప్పగు పాదములఁ జూపు కృష్ణ! గంగాతరంగ
సంగత వామపాద
భాసురాంగుష్ట మేర్పడఁ జూపు కృష్ణా! క్షీర వారిధి యందు
శేష తల్పమున శయనించియున్న
ముచ్చట చూపు కృష్ణ! బాలుండవై వటపత్రంబు మీఁదఁ బవ
ళించు రీతిఁ
దప్పక చూపుకృష్ణ! మొనసి శ్వేత ద్వీపమున దివ్యకాంతి నొనరు
నీ రూపమ్ము
నాగిఁ జూపు కృష్ణ! అతలాది సకల లోకాధారమగుచు బలమైన
విశ్వరూపముఁ
జూపు కృష్ణ!" (పుట. 7) ఇఁక ఆమె కోరిన పదవి-
మాయచే జన్మ కర్మ ప్రభావమునఁ
బడనీక నన్ను చేపట్టవే కృష్ణ!...
పరమ యోగీంద్రుల భావనిశ్చయము
నాయాత్మ నుంచు నిర్ణయముగ కృష్ణ'..." (పుటలు 12-13).

ఆంధ్ర భాషయం దసదైన భక్తి వాఙ్మయమున నిట్టి రస ప్రపతెన్నియో లేవు. వెంగమాంబ కోరిన పదవియే యెల్లరకు ధ్యేయము.

# 4. సమీక్ష

పూర్వాధ్యాయములందుఁ గృష్ణకథాగతములైన యనేకాంశముల నాంధ్రవాఙ్మయము నందలి ముఖ్యరచనము లాధారముగ నిరూపించుట జరిగినది. అందు కృష్ణకథ యందలి ప్రముఖ విభాగములు తెనుఁగు కావ్యములం దెట్టి క్రమపరిణామము నందినవో, యీ పరిణామ చరిత్రమునందు భిన్నకవుల స్థాన మెట్టిదో, సాహిత్యపరముగను, తదనుమేయమైన తత్త్వపరముగను వ్యాఖ్యానించుటయు జరిగినది. ప్రసక్తి ననుసరించి భిన్నకవుల కవితా వైదగ్ధ్యములుఁ గూడ నవధిమేరకు నిరూపితములైనవి. ఆ పరిశీలనమునుఁ బట్టి కృష్ణకథా స్రవంతి యందు గమనార్హములైన పోకడల కేకోన్ముఖత్వమును కల్పించి నిరూపించుట యీ యధ్యాయము నందలి ప్రథమోద్దేశము.

ఈ గమనిక ఫలితముగ నాంధ్ర వాఙ్మయమున గమ్యమానము కావలసిన ప్రముఖాంశ మొకటి యున్నది. తన్నిర్దేశమిట్లుండును: సాహిత్యము జాతియొక్క సాముదాయిక చైతన్యమునకుఁ బ్రతీక. జాతిప్రజల యాశలు, ఆశయములు, భావనాసంస్కారములు తప్పక సాహిత్యమున ప్రతిబింబించుచుండును. కాని, ఆ ప్రతిబింబించుటలో రెండు పద్ధతులున్నవి. కొందరు మహాకవులైనవారు కారణ జన్ములై, ఋషి తుల్యులై, దార్శనిక స్థాయినందుకొని తమ జాతీయులకు వలసిన దివ్యసందేశము నుదాత్తుల చరిత్రము వలన ప్రసాదింతురు. అది జాతి చైతన్యమునందొక యాదర్శవ్యవస్థయై యర్వాచీన యుగముల వారినుత్తేజపరచుచుండును. ఆ జాతి చైతన్యమున, సంస్కృతియందు నదియొక విశిష్టాంశమై యుండును. శాశ్వతతత్త్వమున కిదియే కేంద్రమై వరలుచుండును. ఇది యొక పద్ధతి. రెండవది సామాన్య

కవులను గూర్చిన విషయము. వీరు తమ కాలమునందలి ప్రజల యాశ యాదులకు లొంగిపోయి వానిని తమ సాహిత్యము నందు ప్రతిబింబింతురు. వీరి చిత్త వృత్తులయందీ సమకాలీన భావ చిత్రణా ఫలితమైన కీర్తి గౌరవములందుఁ బ్రీతియొక భాగమై యుండును. ఉదాత్తేతివృత్తములఁ గైకొనినంత మాత్రమున వీరిసాహిత్యమున కౌదాత్త్యము లభింపదు. ఏలన సమకాలీన ప్రజా బాహుళ్యపు చిత్త వృత్తులనో, తమకు పోషకులైన రాజాదుల యభిరుచులనో వీరు మన్నించి తమ కావ్యములందాకరముఁ గల్పింతురు. వీరికవితా శిల్పములను గాని, చిత్తశుద్ధినిగాని శంకింపనక్కరలేదు. వీరును తమమార్గమునఁ తాము విశిష్టులే. వీరి కావ్యములందలి మొత్తము సంస్కారమును విలువ కట్టినచో నది యెన్నదగినదిగనే యుండును. కాని, జాతియొక్క సాముదాయిక చైతన్యము నుద్బుద్ధమొనర్చి, నిలిపి, నిర్దేశించి నడిపింప గల యవ్యగ్రత వీరికుండదు. ఒకవేళనిందుఁ గొందరు మహాకవి శబ్ద వాచ్యులైనను, దార్శనికస్థాయి నందుకొన్నవారు కారు. అంత మాత్రమున వీరిని క్రిందుపరచుట కాదు. తారతమ్యభేదమును గమనించుటయే యుద్దిష్టము. ప్రతి వత్సరసమానీతమైన సస్యరాశికిని, దానికి మూలమైయెప్పటికప్పుడు కేదారముల సస్యవంతములు జేయు బీజమునకును నెట్టి భేదమున్నదో యీ రెండుపద్ధతుల కావ్యములకట్టి భేదమేయున్నది. ఒకటి శాశ్వతమై మరల మరల నుద్దీపితమగునది, రెండవది తత్కాల వినియోగమున్నది. మానవ వికాసమున నీ రెండును సమప్రాధాన్యముఁ గల కేంద్రములు. ఈ రెంటి మొత్తమును విలువ గట్టిననే గాని మానవ జీవితమునకు వలెనే తత్ప్రతిబింబమైన సాహిత్యమునకు సమగ్రత లభింపదు. ఇట్లు రెండు మార్గములఁ బ్రస్థానమొనర్చియున్న యాంధ్ర వాఙ్మయమునుఁ బ్రస్తుత విషయమును దృష్టిలో నుంచికొని యనుశీలన మొనర్చినపుడు సిద్ధించు ప్రయోజనమొకటి కలదు. తన్నిర్దేశమే యీ యనుశీలనమున రెండవ యంశము. ఒక్క భారతీయ సాహిత్యముననే

గాక ప్రపంచ సాహిత్యము లందన్నిట నాయక పాత్ర యనన్య ప్రాధాన్యము గలది. జాతి తన సాముదాయిక చైతన్యమునందు కలుగు భిన్న భిన్న భావవికృతులను పరిణామములను నాయకుని యందు దర్శించి మురియు చుండును. పూర్వోక్త ద్వివిధ కవుల సంస్కారములును తన్నిరూపణమున లెక్కింపఁదగిన భాగములై యుండును. ఆ దృష్టిలో జగద్గురుడైన కృష్ణుని పాత్ర యెట్టి వికృతులను, పరిణామములను పొందుచు వచ్చినదో పరిశీలించుట మిక్కిలి మనోహరమైన దర్శనము. భిన్నయుగముల కృష్ణపాత్రయందు వచ్చిన పరిణామానుశీలన మీ శీర్షిక యందలి రెండవ విషయము.

ప్రథమాంశమైన సాహిత్య వికాస వివేచనమును, ద్వితీయాంశమైన కృష్ణ నాయకత్వ వివేచనమును కలిపికొన్నచో మన యనుశీలనమున కొక మూడవకోలత యేర్పడును. ఇంతగ సాహిత్యమును, జాతి వికాసమును నుత్తేజపరచిన యీ మహానాయకుని దివ్యమానుష తత్త్వము లెట్టివి? యను ప్రశ్న సహజముగ నుత్పన్నమగును. మూడవయంశముగ కృష్ణుని దివ్యమానుషాంశముల యనుశీలన మీ శీర్షికయం దుద్దిష్టము.

దివ్యమానుష లీలా విలాసములు భారతీయ దృక్పథమైన యవతారతత్త్వమున నొక ప్రముఖాంశము. దివ్యమానుషతత్త్వములకు కేంద్రములైన వ్యక్తులను గూర్చి సమకాలీనముగను నర్వాచీనయుగము లందును భిన్న భిన్నాభిప్రాయములు వెలసి, యని కాలక్రమమున నొకచో దార్శనిక ప్రతిపత్తి నందు కొనును. అట్టి వన్నియు సంభావ్యములని చెప్పఁ జాలము కాని వాని స్థితి వాని కున్నది. ఈ దృష్టితో కృష్ణుని గూర్చి వెలువడిన సమన్వయ మార్గము లిన్ని యని చెప్పఁ జాలము. అట్టి సమన్వయ మార్గములలో చారిత్రకుల దృక్పథ మొకటి, పూర్వాధ్యాయము లందుఁ బ్రసక్తి మేర కుల్లేఖింప బడినది. అట్టి సమన్వయములలో బౌద్ధ, జైన, క్రైస్తవ దృక్పథ మొకటి. తన్మూలమునఁ బ్రచలితమైన కృష్ణతత్త్వ

దర్శనమొక యాసక్తిప్రదమైన యంశము. కాని, దానితోఁ బ్రిస్తు కాను శీలనమునకు సాక్షాత్ప్రసక్తి లేదు. కావునఁ బరోక్షప్రసక్తినిఁ బురస్కరించు కొని తన్మార్గ సిద్దేశనము స్థూలము గఁ జేయుట యిందలి నాల్గవ యంశము. ఇది మిక్కిలి సంక్షిప్త మార్గమున నుండును.

ఇన్ని భావప్రస్థానములకుఁ గేంద్రమైన యా మహాపురుషుని, యా దివ్యుని, జీవిత మెట్టిది? అతఁడు సాధించిన యంశము లేవి? అతని శాశ్వత ధర్మగోప్తయని నరుఁడు స్తుతించెను గదా! యా శాశ్వత ధర్మగోప్తృత్వమునఁ, దత్ప్రతిపాదనమున నున్న బహుముఖము లెట్టివి? అను నంశముల పరిశీలన మీ శీర్షికయం దైదవ భాగము. అదియే యుపసంహారము గూడ.

ఈ శీర్షిక యందుక్తమైన యంశములు ప్రసక్తినిఁ బట్టియో, భంగ్యంతరముగనో, సూచనాప్రాయము గనో యెక్కువ భాగము పూర్వాధ్యాయము లందు స్పృశింపఁ బడినవే. ఈ శీర్షికయందించుక వివృతి, యేకోన్ముఖత్వము ఘటించి యీ సిద్ధాంతవ్యాసము నుప సంహరించుటయే యాశయము.

1. సాహిత్య సమీక్ష :

సాహిత్య పరముగఁ గృష్ణకథా విస్తృతియందు వ్యక్తమైన భిన్న మార్గముల నిర్దేశించుపట్ల గమనార్హమైన యంశ మొకటి కలదు. పౌరాణిక యుగమునందీ కథా వృత్తాంతమును గ్రహించి కావ్యముగఁ దీర్చి దిద్దిన వారందరు నాంధ్రవాఙ్మయమున యుగ కర్తలు. కవిత్రయమునుఁ గూర్చి చెప్పనక్కర లేదు. పోతన సాధారణ సాహిత్య విమర్శనా ప్రమాణములనుఁ బట్టి యుగకర్త కాక పోయి నను, కృష్ణకథా ప్రపంచమున నాయన స్థాన మద్వితీయము. వీరి స్థాయి కించుకంత సన్నిహితముగ నుండు మహాకవి నాచన సోమ నాథుడు. వీరే యర్వాచీన కాలమున బహుముఖములుగ వి

నందిన కృష్ణకథా సౌధమునకు మూలస్తంభముల వంటివారు. నన్నయకు సంబంధించి శిశుపాలవధ వృత్తాంతము పోను మిగత భాగ మంతయు గచ్ఛన్మార్గమున నున్నది. ఉన్నమట్టున కాతడు దానిని మహత్తర రీతిఁ దీర్చిదిద్దినాడు. అర్వాచీన యుగములన్నిటి యందు విస్తృతి నందిన మార్గములలో శిశుపాల వృత్తాంతమున నీ యన ముద్రలేని కావ్యమే లేదు. తిక్కనార్యుడు రచించిన భారత భాగ మున కృష్ణకథ లౌకిక పారలౌకిక భావ సమ్మేళనము నంది యున్నది. ఆ భాగముల నాతడ డనన్య శిల్ప మార్గమున రచించి యుండెను. అర్వాచీన యుగములందు విస్తృతినందిన సమస్త కృష్ణ కథా వాఙ్మయమున నీ యంశములు, ముఖ్యముగ లౌకికాంశము ప్రసక్తమైన తావులెల్ల తిక్కన సోమయాజి ముద్రనుఁ గలిగి యున్నవి. ఎఱ్ఱన భారతాంతర్గతమైన యరణ్య పర్వ శేషమునఁ బ్రసక్తమైన కృష్ణకథా భాగము నద్వితీయ తాత్త్విక ప్రతిపత్తితో రచించినాడు. ఈ యంశము లర్వాచీన వాఙ్మయమున విస్తృతి నంద లేదు. ఇక నీతని హరివంశ మొక యుదాత్త సృష్టి. గంభీర రచనా శిల్పమునను, కృష్ణతత్త్వ నిరూపణమునను ఎఱ్ఱన యనన్యుడు. అయి నను పోతనార్యుని భాగవతమువలె నీగ్రంథ మాంధ్ర వాఙ్మయమున కృష్ణకథా పర్యాయముగ భావింపఁ బడలేదు. అందులకొక కారణ మున్నది. కృష్ణతత్త్వము నందలి భక్తిగమ్యాంశము, శరణాగతి తత్త్వము భాగవతము నందలి ప్రధానాంశము. వానిని రచించుటకు వలసిన భావార్ద్రత, రచనోజ్జ్వల్యము పోతనకు సిద్ధించినవి. ఋషి తుల్యుడైన యాతని భావధారయే యాంధ్రజనుల హృదయస్థమై దాని నొక పారాయణ గ్రంథ మొనర్చినది. కావ్య తత్త్వము నందలి తారతమ్యము, కవి చిత్తవృత్తుల విభేదమును గమనించుకొని చూచినచో ఎఱ్ఱన హరివంశమున జ్ఞానమార్గ స్ఫూర్తి, శిల్ప గాంభీ ర్యము ప్రముఖాంశములు. కావున హరివంశమీ యంశములకు శిఖరాగ్ర ప్రాయముకాగా, భాగవత మందుండి యుద్భవించిన భక్తి

తత్త్వము గంగాఝరియై యాంధ్రహృదయములనుఁ బునీత మొనర్చినది. ఇది కథాతత్త్వ విస్తృతి, తత్ప్రభావములను నంశముల యెన్నికకై చెప్పిన మాటయే కాని మహోదాత్తులై, ఋషితుల్యులైన యిరువురు యుగకర్తలనుఁ దారతమ్య పరిశీలనము చేయుట కాదు. హరివంశము నందును, భాగవతము నందును సామాన్యమైన కథలలో నెక్కువ భాగము భాగవత మార్గముననే విస్తృతి నందుట యిందుల కుపస్కారకమైన యంశము. హరివంశ కథలలోఁ గొన్ని మాత్రమే యనంతర కవుల కుపాదేయములైనవి. సోమనార్యుడు తన యౌన్నత్యము నించుక యతిమాత్ర శబ్దార్థాలంకృతుల వలనను, నప్రతీత పద ప్రయోగము వలననుఁ జెనకికొన్నవాడు. కాని, తిక్కన మార్గమున హరిహరాద్వైత ప్రవచనము, ఉదాత్త భావస్థితి యీతని రచనమున నెన్నఁ దగినవి. అంతేకాక పోతన కవిత్వమున కాదర్శ ప్రాయమైన శబ్దార్థాలంకార సామగ్రి నీతడు విన్యసించినాడు. భక్తి ప్రధాన ఘట్టముల యందును నీతని రచన మెన్నికఁ గన్నదే. ఉత్తర హరివంశమునఁ బ్రధానమైయున్న హంసడిభకోపాఖ్యానమున కర్వాచీన విస్తృతిలేదు. ఒండు రెండు నాటకములందు మాత్రము యాదృచ్ఛిక ప్రసక్తి యున్నది. ఈ యైదుగురు కృష్ణకథా శరీరమునకుఁ బంచప్రాణముల వంటివారు. ఆంధ్రవాఙ్మయమునఁ దొలిదశ యందుఁ గృష్ణకథా స్వరూపమును సర్వాంగీణ స్ఫూర్తితో నావిష్కరించిన గౌరవము వీరికే దక్కినది. ఇందలి ప్రధానాంశము లన్నియు నుదాత్త గంభీరములై కథా విష్కృతి యందును, కృష్ణ పాత్ర నిరూపణము నందును, తత్త్వావిష్కరణము నందును సత్యోత్తమ స్థాయి నందుకొన్నవి.

అటుపైఁ జెప్పదగిన యొక పరిణామము ప్రబంధ కవుల చేతిలో, ముఖ్యముగ నంది తిమ్మన చేతిలో సిద్ధించినది. అది స్వామి శృంగారాంశము తక్కిన యంశముల కన్న ముఖ్యమై వాఙ్మయ రంగమున నెలకొనుట. ఇట్లు చెప్పుటవలనఁ దత్పూర్వ మీయంశ

ప్రతీయమానము కాలేదని కాదు. దానికొక సిద్ధి లభించినదని. ప్రబంధ యుగమున నితర రచనము లందును నీ యంశమే ప్రాయిక ముగ స్ఫూర్తి నందుకొన్నది. అటుపై నాయకరాజ, క్షీణయుగము లందు కృష్ణకథ పడిన పాట్లన్నిన్ని కావు. అంతటి స్వామికిని నధఃపతనము, అభిరుచి దైన్యము తిప్పలేదు. మరల నవ్య యుగమున స్వామి కథ యందలి వివిధాంశములు నూతన భావౌజ్జ్వల్యము నందుకొని భాసించినవి. ఇందు గమనింపఁదగిన యంశములు రెండు. కృష్ణకథా సంబంధమైన మహాకావ్యమొకటి విశ్వనాథ వారి రామాయణ కల్ప వృక్ష స్థాయిలోఁ బ్రథవింప కుండుట, ఉన్న మేరకే కావ్యము లయందుఁ బ్రాయికముగ నశ్లీలాదులు, హీనాభిరుచి ప్రతిబింబింప కుండుట. ఈ యభిప్రాయములను సంధించుకొని పూర్వాను శీలనమును గమనించినచో నొకే యంశము నిరూపింపఁ బడును. కృష్ణకథా ప్రస్థానమునఁ బూర్వోక్త యుగకర్తల ఘట్టమే యుదాత్త రమణీయము. అటుపై భిన్న మార్గముల భాసిల్లిన దంతయు నందలి యేకదేశ మహత్త్వమునకు వ్యాఖ్యాన ప్రాయమే. ఈ భిన్న మార్గము లందుఁ బ్రతీయమానమైన చర్వణ యోగ్యతయే పూర్వానుశీలన వృత్తాంతము. ఈ యన్వయము కథాంశము లన్నిటి యందుఁ బ్రతీయమానమై యుండుట కృష్ణకథా విషయమున నాంధ్ర వాఙ్మయము యొక్క ప్రత్యేకత. మంచిదైననదియే. చెడుగైన నదియే.

2. నాయక పాత్ర - క్రమపరిణామము :

నాయకుని ప్రాధాన్య మీవరకే నిరూపితము. మానవ నాయకులకే యింతటి యౌన్నత్యమున్నపుడిఁక దివ్యమానవ నాయకునిఁ గూర్చి చెప్పవలసిన దేమున్నది? ప్రాంతీయ మన స్తత్త్వములనుఁ బట్టి యొక్కొక్క భాషా ప్రాంతము వారి కొక్కొక్క యారాధ్య నాయకుఁడున్నాడు. అతడే దేవుడు. అతడే మానవుడు; అతని దివ్యత్వమున నాప్రాంతము వారి

స్వాప్నికాదర్శములు, తాత్త్విక భావములు లగ్నమగును. అతని మానవత్వమున వారి సుఖదుఃఖాది లౌకిక భావప్రపంచము లయమగును. తెలుగువారి కట్టిమూర్తి రాముడు. ఇట్టిమూర్తి నిర్దేశనమునకును, సాహిత్యమునకును సంబంధ ముండనక్కర లేదు. ఏలన నాంధ్ర ప్రాంతమే యుదాహరణముగఁ జెప్పించినచో నాంధ్రుల కారాధ్య దైవమైన రాముని కథకు సంబంధించి యెన్ని యుత్తమ కావ్యములు ప్రభవించినవి? కృష్ణకథకు సంబంధించి శిఖరాగ్రప్రాయములైన యుదాత్త సృష్టులు కనీసము నాలుగున్నవి. అనగా జీవితము నందలి యారాధనా కేంద్రమే యాయా ప్రాంతీయుల సాహిత్య సృష్టికిఁ గారణ భూతము కానక్కరలేదని వ్యక్తమైనది. దీనికిఁ దోడుగఁ బూర్వోక్తమార్గమున దార్శనికు లైనకవులు జాతి కీయఁ దలచిన సందేశమునందలి వైశిష్ట్యమునుఁ బ్రముఖకారణమే యగుచున్నది. తెలుగు వాఙ్మయమున నాదికవు లొసంగఁదలచిన సందేశము హరిహరాద్వైతము. అది యాంధ్రవాఙ్మయ చరిత్ర యందు శాశ్వత భావధారగ వ్యాపించి యున్నది. అట్టి మహత్తర దివ్యసందేశమునకే యీ యాదికవులు కృష్ణపాత్ర నాధారముగఁ గొని పురాణేతిహాసాంతర్గతమైన తత్త్వము నుజ్జ్వలముగ భాసింపఁ జేసియున్నారు. సాహితీపరుల యుత్తమసృష్టి కాదర్శముగ నొక నాయకుడును, జనమనః ఫలకమున నొక నాయకుఁడునుఁ బ్రతిష్ఠితులై యుండుట యాంధ్ర దేశమున నొక ప్రత్యేకత. ఉదాహరణప్రాయముగ వంగదేశమునుఁ గైకొన్నచో నందు కృష్ణ, దుర్గాతత్త్వములకు జనుల మనములందును, వాఙ్మయము నందును వ్యాప్తి యెక్కువ. కృష్ణతత్త్వముపై వెలువడిన గ్రంథముల సంఖ్యగాని, యర్వాచీన కృష్ణ వాఙ్మయ విస్తృతిగాని యీ యంశమునకే నిదర్శనము. ఇది యిట్లుండఁ గృష్ణకథా ప్రస్థానమున ననన్యుడైన పోతననుఁ గూర్చి యాలోచించినచోఁ గొన్ని ప్రత్యేకాంశము లీ సందర్భమున నను

సంధేయములు కాఁదగినవి వ్యక్తమగును. ఆయన కౌటుంబిక సంస్కారము శైవము. ఆరాధ్యదైవము రాముడు. సాహిత్యగత భావనాకేంద్రము కృష్ణుడు. ఇట్టి త్రివేణీ సంగమ మాయన వ్యక్తిత్వమున లేకున్నచో భాగవతము వంటి మహోజ్జ్వల సృష్టి నాయన యొనర్చి యుండఁ జాలడు. గాంభీర్యమర్యాద తత్త్వములను భిత్తికగ నుంచికొని భక్తి తన్మయత్వమున మేరఁ దప్పని రచనార్ద్రిత నాయన జీవలక్షణముగఁ బ్రతిబింబించు కొనినా డన్నమాట. ఇతర వాఙ్మయము లందుఁగాని, మన వాఙ్మయమునందుగాని కేవల భావావేశ పూరితులైన కవులు కృష్ణతత్త్వమునఁ దలమునుకలై భక్త్యున్మత్త స్థితి నంది యావేశమున నృత్యమొనర్చిరేమో గాని పోతనవలెఁ గావ్యకళా సంప్రదాయ బద్ధమైన శిల్పాకృతిగఁ దీర్చి దిద్దలేదు. మరియొక గమనిక. కృష్ణ తత్త్వము మత, సంప్రదాయాచారములకుగాని, తత్పాత్రములకుఁగాని లొంగని దివ్యత్వప్రతీక. ఆంధ్రవాఙ్మయమునుఁ బరిశీలించినచో కేవల వైష్ణవత్వముద్రగల కవుల వలనగాని, కృష్ణ భక్తులమని ప్రకటించుకొన్న కవులవలనగాని యుత్తమోత్తమ కృష్ణకథా కావ్యము లావిర్భంపలేదు. పోతన వలెను, తిక్కనాదుల వలెను నద్వైత మార్గానుయాయులే యిందులకు మార్గదర్శకులైరి. కావునఁ ద్రిలింగక్షేత్రమున సాహిత్య పారమ్యము మర్యాదాలంకృత మధుర గంభీర మార్గమున హరిహర తత్త్వమునకును, నారాధ్య భావ కేంద్ర నిర్దేశ మార్గమున రామతత్త్వమునకును, తారతమ్య మార్గమున బ్రతిష్ఠ యున్నదను విషయము వ్యక్తమైనది. మరి తెలుగు వారు మెచ్చిన కృష్ణు డెట్టివాడు? లోకాద్భుత దివ్య కార్యాచరణ చణుడై, బాల్యమున గోపాలనము జేసి రక్కసులను జంపి జననీ జనకు, లను, గోపికలను మురిపించిన బాలకృష్ణుడు, కురుపాండవ సంబంధముల తీర్పరియైన రాజనీతిచణుడు, రుక్మిణీ సత్యల నడుమ సతమతమైన శృంగారమూర్తి. గీతాకృష్ణుడు సర్వప్రపంచమున కాదర్శ శిఖరమైనట్లే వీరికిని నైనాడు. ఇందు ప్రత్యేకత లేదు. పై యంశములు

తెలుగువారి నాకర్షించి నంతగ నితరాంశము లాకర్షింపలేదు. ఆ యాకర్షణ మైనను రాముని యందున్నట్టిది కాదు. రెండవ కక్ష్యలో సాహిత్యపరమైన, మానసిక భావస్పందనా పరమైన ప్రీతివంటిది. మరి రాముని విషయమునవో జీవితమునవే పెనవేసికొన్న తత్త్వమది. సీతారాముల దాంపత్యము, రాముని యుత్తమ ధర్మ కర్మాచరణము, మర్యాదోచిత గాంభీర్యము మున్నగు నెన్నియో యంశము లీ యాంధ్రభూమియందు జీవన సంకేతములు. ఇది తారతమ్య నిర్దేశనమే గాని పరావర తత్త్వ ప్రతిపాదనము కాదు. కవిమ్మన్యు లెన్ని రచనములు చేసి స్వామి తత్త్వమును క్రిందు పరచినను నాబాల గోపాలమునకు బాలకృష్ణుడు, పాండవకృష్ణుడు, రుక్మిణీ సత్యా కృష్ణుడు, హృదయములందు శాశ్వతమూర్తి. రచనములను బోగు వేసి రాశినుండి యేర్చి కూర్చినచో గొన్ని క్రమపరిణామాంశములు గోచరించును. ఈ నాయకుడు తొలుత నుదాత్త సాహితియందు దివ్యమానవ సంకేతమై యొక యుగము చరిత్రను మలచిన వాడు. మలిదశలో శృంగారమునే ప్రత్యేక విద్యగ నభ్యసించి నాయికల నడుమ సతమతమైనవాడు. అటుపై విరహాంబుధిలో మునిగి చిలుక రాయబారములకు, చెలికత్తెల సందేశములకు లొంగినవాడు. యుద్ధమునకై వెడలి గుడారమున సత్యను దలచి ప్రాకృత నాయకుని కన్న హీనముగ ప్రవర్తించినవాడు. అటుపై పచ్చి బాలెంతల వెంటబడినవాడు. సానివాడల సందుగొందు లెరిగినవాడు. ఇట్లెంతయో చెప్పవచ్చును. మరికొంత కాలము గడచి తెలుగు కవులు వంగాంగ్ల భాషలను, విశిష్ట పురాణములను జదివిన వెనుక వారి లేఖినిలో క్రొత్త వెలుగుల సంతరించుకొని యుదాత్త భావస్థితిని మరల నందుకొనినవాడు. చెప్పవచ్చిన దేమన నిట్టి వైవిధ్యాధః పతనముల కతీతమైన పరమోదాత్త స్వరూపమొకటి యాంధ్ర జనతా హృదయమున ముద్రితమై యున్నది. భిన్నరాజకీయ వాదము లాయన క[illegible] యందారోపించినను, చిత్తశుద్ధి లేని క్రూరునిగ నాయనను చి[illegible]

నను, ప్రజాహృదయమున వీనికెట్టి స్థానమును లభింపదు. సాహిత్య ప్రాదుర్భావముతో బాటు ప్రారంభమై మహర్షి తుల్యులైన కవులచే ప్రతిష్ఠితమైన కృష్ణమూర్తి యట్టిది. తాత్పర్యముగ నాంధ్ర వాఙ్మయమున భిన్నయుగములలో వచ్చిన నాయకపాత్ర చిత్రణా పూర్వకములైన నూతనాంశములలో పురాప్రసిద్ధములే రక్తికి రంగ మునకు వచ్చినవిగాని, తదన్యములకు సాహిత్య చరిత్రయందు వినా స్థానము లేదని చెప్పదగును.

కృష్ణపాత్ర యందలి మరియొక యంశము పూర్వాధ్యాయ ముల సూచితమైనది యిందు ప్రసక్త మగుచున్నది. అది కృష్ణపాత్ర నవరస ప్రతీకయను విషయము. ఇది కొంత సూక్ష్మానుశీలనము నపేక్షించునది. మానవుని భావమయ జగత్తునందు నిత్యము ప్రచలి తము లగుచున్న యనేకానేక భావములలో కొన్నింటికి రసత్వము సిద్ధించును. ఇట్టివానిని స్థాయులనియు, వీని పర్యవసిత రూపమును రసమనియు నిర్దేశించు టాలంకారిక సంప్రదాయము. ఈ భావ ప్రపంచమునకు, దీని విస్తృతికి వలసిన వాసనా సంస్కారములు సర్వ మానవులయందును గలవు. పరిణామ చక్రమున వారి స్థానమును బట్టి కొన్ని యెక్కువ పాళ్ళలోను, మరికొన్ని తక్కువపాళ్ళలోను సమ్మేళనమునంది యుండును. భిన్నవ్యక్తుల స్వభావము లందలి భేద ముల కిదియే కారణముగ మనస్తత్త్వ వైజ్ఞానికులగు నాలంకారి కులు నిర్దేశింతురు. ఇట్టి వైవిధ్యము సత్త్వ, రజస్తమో గుణముల మేళవింపులోని భేదముల వలన సంక్రమించినదని తాత్త్వికులు నిర్దే శించి యీ త్రిగుణ సామరస్యపూర్వకమైన సత్త్వస్థితిని, అటుపై త్రిగుణాతీతమైన యుచ్చస్థితిని మోక్షమార్గముగ నిరూపింతురు. తత్త్వతః రెండును ఒకే విషయముయొక్క రెండు పార్శ్వములు. ఏలన పర్యవసానస్థితియందు గుణాతీతమైన యానంద కక్ష్యయే రెంటి కిని ధ్యేయమై యుండును. ఇట్టి పరిణామమునకు రంగము సహృద యుడు. కేంద్రము కవి రూపొందించిన పాత్ర. ఆ పాత్రయందు కవి

యారోపించిన భావ ప్రపంచము సహృదయుల సంస్కారముల నుద్బుద్ధ మొనర్చి యా పాత్రయను కేంద్రమే ధ్యేయముగ వాని సర్వలౌకిక వృత్తులు తాళనము నంది తత్ఫలితముగ బ్రహ్మానంద సబ్రహ్మచారియైన యానందము పాత్రతోడి యభేద స్థితిగమ్యమై యావిష్కృతమగును. ఇట్టి ధ్యేయము దివ్యతత్త్వ ప్రతీకమైనచో నీ చిత్తవృత్తుల లయమునకుగాని, తత్ఫలితమైన యానందమునకుగాని పారమ్య మధికమై సిద్ధించును. ఈ సౌకర్యమును పురస్కరించు కొనియే ప్రాచీనాలంకారికులు ప్రసిద్ధనాయకేతి వృత్తమునకు ప్రాధాన్య మొసగినది. ఈ యనుశీలనము వలన సర్వభావమయ ప్రపంచముయొక్క స్థితికి పాత్రయు, సహృదయుడును సమాన స్థానముననే గల్గి యున్నారనియు, నొకటి ధ్యేయమై, రెండవది పర్యవసానరంగమై విలసిల్లుననియు తెలుచున్నది.

ఈ యంశమును స్వామి కన్వయించి నపుడు నవరసముల కాయనయందు దీప్తికాకరముండుట గమనార్హము. ఇందుల కుదాహరణముగ భాగవతమున కంసవధ ఘట్టము నందలి ప్రసక్త పద్యము పూర్వాధ్యాయమున నుల్లేఖింప బడినది. అందు స్వామి మల్లులకు రౌద్రాకృతియై, నరులకు వీరకేంద్రమైన నాథుడై, పురస్త్రీలకు శృంగారమూర్తియై, కంసునికి మృత్యుభయానక మూర్తియై మూఢులకు వికటబీభత్సమూర్తియై, తండ్రికి కరుణామూర్తియై (దయార్ద్రమున), గోపికలకు హాస్యమూర్తియై-యిట్లెన్నియో రీతుల భాసించి తుదకు యోగిజన హృదయములందు శాంతమూర్తియై భాసిల్లినాడు. అనగా దివ్యత్వ చిహ్నమైన యీ శాంతమున నితరభావము లన్నియు లయించునట్టి రసభావవ్యవస్థ నిందు స్వామియం దారోపించుట జరిగినది. ప్రాయికముగ నన్నియవతార మూర్తులందును నిట్టి భావ నిర్దేశమున కవకాశమున్నను సర్వసమగ్రత కృష్ణునివలె భాసించు టరుదు. అందుల కాయా యవతార తత్త్వము నందున్న ప్రత్యేకాంశవ కారణము కావచ్చును. ఉదాహరణముగ రాముని యందు ?

ఆ స్థితిని మానవు లందు కొనునట్లు చేయుటయే వీని యంతర్ధ్యేయము. అవతారమెత్తిన స్వామి తన దివ్యత్వ చిహ్నములను వీడక మానవత్వ స్థితి నభినయించి యాదర్శ ప్రాయమైన తత్త్వమును నిర్దేశించి నాడు. జీవాత్మ పరమాత్మల సంబంధమునకు రెండంచు లైన యీ దివ్య మానుష తత్త్వముల నే యంశము విస్మృతమైనను నందలి సమగ్రతకు భంగము వాటిల్లును. కావుననే పురాణేతిహాస కర్తలీ రెండంశ ములను సమ్మేళన మొనర్చినారు. గిరియజ్ఞమున దీనానాథ సంతర్పణ మొనర్చిన స్వామి, కంస వధానంతరము కంస పత్నుల దుఃఖమును గాంచి కన్నీరు పెట్టిన స్వామి, సైంధవవధకు మున్నుగ పార్థుని విషయమై తల్లడిల్లిన స్వామి, గాంధారీ ధృత రాష్ట్రుల కన్నీటితో తన కన్నీటిని గలిపిన స్వామి, ఇట్లు మానుష భావసంపత్తికి సహస్రముఖము లున్నవి. ఆయీ ఘట్టముల నాధార ముగ స్వామి కథ యంతయు నొక మానవ మాత్రుని జీవిత కథగ చిత్రించిన యత్నము లన్నియు నేక దేశప్రశస్తినే పొందినవి.[1] స్వామి గోవర్ధనగిరి నెత్తుట యనగా నొక పర్వత గుహాయందు గోపాలాదులకు తావు చూపించుట అనుట వంటి యనుదాత్తరీతు లీ గ్రంథములందు నెలకొని గాంభీర్య భంజకము లైనవి. అనగా నీ రెండంశముల సమ్మే ళనమే సాంప్రదాయిక వైశిష్ట్యమునకు కారణము. ఇందు కర్తల విశ్వాసా విశ్వాసములకు తావు లేదు. కళా ధర్మమును బట్టియు, లోక ధర్మమును బట్టియు నీయాదర్శ వాస్తవిక తత్త్వముల సముచిత సమ్మేళనమే ఘంటాపథము. ఇట్టి ద్వంద్వస్థితి పరస్పరోపస్కార కమై కృష్ణకథయందు వర్తిల్లినట్లుగ నింకెందును వర్తిల్లలేదు.

4. సర్వదర్శన కేంద్రము :

( చారిత్రికులు, బౌద్ధులు, జైనులు. క్రైస్తవులు )

స్వామిని గూర్చి బయలు దేరినన్ని సిద్ధాంతములు, వాదోప

1. బంకించంద్రుని కృష్ణచరిత్రము, కె. యమ్. మున్షీ కృష్ణావతారము నిందుల కుదాహరణములు. మన వాఙ్మయమున నిట్టి ప్రయత్న ముదాత్తస్థాయి య- జరుగనే లేదు. ఒకటిరెండు గ్రంథము లున్నను నందలి సంభావ్యత మ్మ

వాదములు మరియెవ్వరిని గూర్చియు బయలుదేర లేదు. ఇవి యున్నియు సాధారణముగ మానవకృషికి సంబంధించిన యే యంశమునో ప్రతీయమానమొనర్చును గావున దీనిని మర్యాదతో 'దర్శన' పదముతో నిర్దేశించుట జరిగినది. ఇది యొకరీతి సంభావనము. స్వామిత్త్వము వారి వారి సంస్కారములను బట్టి ప్రసన్నమై దర్శనమొసగును కావున నిది యన్వర్థము. ఇట్టి బహు దర్శనముల నందిన వారిలో చారిత్రకులు మన దృష్టిని మున్ముగ నాకర్షింతురు. చారిత్రకదృక్పథ మెంతవరకు గార్యకారియో ద్వితీయ భాగమున స్పృశింప బడినది. దానికి సార్వత్రిక వినియోగము లేదు. కాని యనుశీలనమున నదియొక మార్గము. ఈ చారిత్రకులలో పలువర్గముల వారున్నారు. పాశ్చాత్య చారిత్రకులు, వారి ప్రభావమునకు లోనైన దేశీయచారిత్రకులు, దేశీయ సంస్కారములను, సాంప్రదాయిక విద్యావైశద్యమును గలిగి చరిత్రరచనమునకు బూనుకొన్నవారు - ఇట్లనేక రీతులవారు. వారి మార్గములతోగాని, సిద్ధాంతములతోగాని ప్రస్తుతానుశీలనమునకు పనిలేదు. కాగా వారియం దనుబింబితమైన సత్యదృష్టి, తద్వ్యతిరేకత యను నంశములతోనే మన ప్రసక్తి. సత్యము సర్వత్ర త్రివ్యాకముల లోను, శాసనములలోను, నాణెములలోను భాసింపనే యక్కర లేదు. దార్శనికులైన పురాణేతిహాసకవులు భిన్నకక్ష్యలకు జెందిన సత్యములను నిష్కర్షతో ప్రతిపాదించినారు. తదనుశీలనమునకు వలసిన గమనిక, సమన్వయశక్తి, సంప్రదాయ వేత్తలకే గమ్యమానము. అట్టి భావధారను బట్టికొన్నవాడు సత్య చరిత్ర వ్రాయును. లేని వాడు చరిత్ర వ్రాయును.

ఒక యుగమునందు ప్రవర్తిల్లిన మొత్తము జగత్కథను వారుదర్శించి దానిని కాల కాలములకు శాశ్వతముగ నుండునట్లు రచించి ఆ యుగీనమైన కాలకేంద్రమునుండి యనంతత్వమునకు వంతెనలు కట్టునట్టి మార్గమున వారు చారిత్రకాంశముల నిక్షేపించినారు. తదనుశీలనా ఫలితము లీ శీర్షికయందు ముందు ముందు నిర్దేశింప బడును. రెండవ కర్తవ్య మీ పురాణేతిహాసముల ప్రతీకాసిద్ధాంతము. వీనియందలి కథలన్నియు ప్రకృతియందు, విశ్వగోళమునందు శాశ్వతలిపితో రచింపబడి దార్శనికావిష్టతను బొందిన వారి కెప్పటికప్పు డవగత మగుచుండును. అందీయబడిన ప్రతీక లుపాసనా కేంద్రములై మానవజాతి నెప్పటి కప్పు డుద్ధరించుచుండును. సర్వారాధనా మార్గములకు సంబంధించిన యంశము లిందున్నవి. మహర్షుల లోకానుగ్రహదీక్ష కివి తావలములు. మూడవ కర్తవ్య వీని సాహిత్యప్రతిపత్తి. పౌరాణికేతిహాస కర్తలవంటి మహాశిల్పు లెందును లేరు. వేదమునుండి లౌకిక సాహిత్య స్థాయివరకు ప్రతీయమానము కావలసిన సర్వార్థ లోకములకు వీరు ద్వారములు తెరచినారు. అందు ప్రవేశించుట కర్హత గలవారందు కోదుగు. లేనివారు నవైర్యక దృక్కులై యందు కావ్యశిల్పము కొరవడినదని విమర్శక గ్రంథములు వ్రాయుచుందురు. పరంపరాగతము లైన సర్వగుప్తార్థములు సంప్రదాయసంకేతములు పురాణేతిహాసము లందు మహత్తర దివ్యశిల్పాకృతి నంది భాసించును. ఈ మూడు కర్తవ్యలలో నేయొకటి ప్రసన్నమైనను నది పారమ్యమే. చారిత్రకులలో పెక్కుమంది స్వామి చరిత్రను 'నిరూపింప' యత్నించిరి. అందు కొందరాయన మిక్కిలి యిటీవలి కాలమువాడని చెప్పి తృప్తినందిరి. మరి కొందరాయన నాటవిక నాయకుడని చెప్పి యానందించిరి. ఇట్లెన్నియో మార్గముల నాయనను వర్ణించినను, పాపమా సర్వాంతర్యామి యాను గాదన లేదు. 'నేను కాని దేమిరాయి చెప్పుడు చేతనైన'నన్నాడు. స్వామి కాలమునకు చెందిన యనుశీలనమున సాంప్రదాయికము,

సర్వశాస్త్రసమ్మతమునైన మార్గమొకటి యున్నది. అది భిన్న దేశకాలములందలి మహనీయు లందరు నంగీకరించినది. దానిని దిఙ్మాత్రముగ నిట్లు నిర్దేశింప వచ్చును.[2]

సత్యదృష్టిలేని చారిత్రకుల గణనమునుబట్టి మహాభారతము క్రీ. పూ. 2000లో రచింపబడిన దనియు లేదా క్రీ. పూ. 1000లో రచింపబడినదనియు నిరూపితమగును, కాని యిది శాస్త్రీయ నిష్కర్షగల మార్గము కాదు. ఇట్టి యంశములను ఖగోళశాస్త్రము నందలి వైజ్ఞానిక గణనమునుఁ బట్టి నిరూపింప దగుననియు, నట్లొనర్చుటే తిరుగులేని శాస్త్రీయ మార్గమనియు లోకమాన్య బాల గంగాధర్ తిలక్, ఓరియన్, ఆర్కిటిక్ హోమ్- అను రెండు గ్రంథముల మూలమున స్థాపించిరి. ఈ మార్గమును విజ్ఞులైన వైదేశిక పండితులు సైతము ప్రశంసించిరి. వేదకాల నిర్ణయ విషయమున ప్రసక్తమిన యీ సంప్రదాయమును ప్రస్తుతాంశమున కన్వయించి శ్రీకోట వేంకటాచలం మున్నగువారు కృషి చేసి యనేకాంశముల నిరూపించినారు. మహాభారత, విష్ణుపురాణ, హరివంశ, భాగవతము లందు లభించిన యంశములే యీ ఖగోళాత్మక గణనమునకు ప్రాతిపదికలు. భాగవతము నందు స్వామి నిర్యాణము నందినపుడే కలియుగ ప్రారంభమైనదని చెప్పిన భాగ మిందుల కొక సాక్ష్యము. "యస్మిన్ కృష్ణో దివం యాతః తస్మిన్నేవ తదాఽహని ప్రతిపన్నం కలియుగం..." అను వాక్యమునుఁ బట్టి యాదిన మేదై యుండునన్న నిర్దేశన మొకటి సాధ్యమగుచున్నది. స్వామి జననమునకు సంబంధించిన యంశములలో భాగవతమున ప్రజాపతి (రోహిణి) నక్షత్రముండుట, శ్రావణ బహుళాష్టమి నాడు స్వామి జన్మించి యుండుట, యను నంశములు వ్యక్తము లగుచున్నవి. అది యే సంవత్సరమో?

2. ఈ వృత్తాంతమునకు సంబంధించిన పూర్వాపరములను, అనేక శాస్త్రకర్తల యభిప్రాయములను, క్రోడీకరించి శ్రీ. ఇ. వేదవ్యాస, I. A. S., యుగపురుష డను గ్రంథమును రచించిరి, అందుండి యీ భాగము గృహీతము.

యని నిర్ణయించుటకు మరియొక సాక్ష్యమున్నది. అది ఖగోళ శాస్త్రమునకు సంబంధించిన విశేషము. సప్తర్షి నక్షత్ర మండలము ధర్మరాజుని రాజ్య పరిపాలన ముగియు కాలమున మఖలో నున్నట్లు గూడ తెలియును. స్వామి యవతార సమాప్తియైన సంవత్సరముననే పరీక్షిత్తు పట్టాభిషేకమును జరిగి యుండెను. ఆ యీ యంశముల క్రోడీకరణ సమన్వయముల వలన ధర్మరాజుని పట్టాభిషేకము క్రీ. పూ. 3138 లో జరిగెననియు, స్వామి జననము 19 జూలై క్రీ. పూ. 3228 యనియు, అవతార సమాప్తి క్రీ.పూ.3102లో జరిగెననియు నిర్ణయింపం బడినది. సర్వ దేశములకు, సంప్రదాయములకు సంబంధించిన విజ్ఞులీ గణనమార్గము నంగీకరించి యున్నారు. శ్రీ బి. వి. రామన్ మున్నగు శాస్త్రజ్ఞులు స్వామి జననకాల జ్యోతిశ్చక్రమును నిరూపించి ఫలితములను సాధించి యున్నారు. ఇట్లీ యంశము సాంప్రదాయిక నిష్కర్షతో, శాస్త్ర ప్రమాణముతో సాధింప బడినది. చారిత్రకుల నిర్ణయము నందు సాధారణముగ నుండ నట్టియు, నుండి తీరవలసి నట్టియు నొక మార్గమున కుదాహరణ ప్రాయముగ నీ యంశము నుల్లేఖింపవలసి వచ్చినది. ఇట్టి వనేకములు స్వామి కథయందు లీనమై యున్న యంశములు కలవు.

కృష్ణకథకు పూరక, ప్రత్యంగ దర్శనములుగ జెప్పదగినవి బౌద్ధ, జైన క్రైస్తవములు. సనాతన సంప్రదాయమున బుద్ధుడు దశావతారములలో చేర్చబడినాడు. జాతక కథలయందనేక భాగముల యందు కృష్ణ ప్రసక్తి నామాంతర, రూపాంతరములనంది భాసించుచున్నది. ఘట జాతకమున వాసుదేవుడు వార్ష్ణేయ వంశము వాడు, ఉత్తర మధుర వాసి, కృష్ణశబ్ద వాచ్యుడు. ఉత్తరాధ్యయన సూత్రమునందు (22వ యాశ్వాసము) వాసుదేవుడు క్షత్రియుడైన యువరాజు. 12వ యుపాంగమున కృష్ణ వాసుదేవ బలదేవుల వంశము పూర్వోక్తమే యైయున్నది. ఘట జాతకమున వాసుదేవ కుటుంబము కన్హా దీపాయనునిపై జూపిన యవినయము వలన నశించిన వైనము

చెప్పబడినది. ఎక్కువ భాగమీ కథలో ద్వేషము వ్యక్తము కా పోయినను వైచిత్రి నెలకొని యున్నది. ఘటజాతకమే యిందు కుదాహృతి. ఇందు స్వామికి గోపకులతో గల సంబంధము విరళితమై యున్నది. అసిప్తాంజన నగరమునకు జెందిన మహా కంసు పుత్రికయగు దేవభాగ నందగోపుని ప్రోత్సాహము వలన ను సాగరుని కలిసికొని వివాహమాడుట, దేవభాగ పుత్త్రుడు తనని (మహాకంస వంశీయుడైన కంసుని వంశమును) నాశనము చేయున ప్రాచీన జోస్యముండుట యను నంశ మిందున్నది. కావునఁ కంసుడ దేవభాగ సంతానమును పుట్టగనే సంహరింప వలెనని పూన కొనెను. తత్ఫలితముగ వారు నందగోప దశ పుత్రికలలో మార్పిఁ చేయబడిరి. ఈ కారణముచేత వాసుదేవ, బలదేవ, చంద్రదేవ సూర్యదేవ, అగ్నిదేవ, వరుణదేవ, అర్జున, పజ్జున, ఘట పండిత అంకురు- అనువారు నందగోప యొక్కయు, నామె భర్త యగు అంధక వెన్హుని యొక్కయు సంతానముగ పెరిగినారు. కాలక్రమమున వారు బలవంతులైన పిమ్మట కంసుడు వారిని దేవభాగ పుత్త్రులుగ గమనించి మల్ల యుద్ధమున కాహ్వానించుట, వారు వచ్చి మల్లులైన చాణూర ముష్టికులను సంహరించుట, వాసుదేవుడు తన చక్రముచే కంసుని యొక్కయు, నుపకంసుని యొక్కయు శిరములను ఖండించుట, యసిప్తాంజన నగరమున కధిపతియై, ద్వారవతీ నగరము నాక్రమించుకొని చిరకాలము వసించి యావద్భారతమును జయించుట, పూర్వోక్త కన్హదీపాయనుని శాపము వలన వాసుదేవ బలదేవులు పోను మిగత వారు నాశన మందుట మున్నగు వృత్తాంతము లున్నవి. ఈ కథ యందు దేవభాగ- దేవకి. నందగోప- యశోద, పాత్రల నామధేయ సంఖ్యాదుల యందును, యదువంశ వినాశము నకు కారణము నిర్దేశించుట యందును గల వైచిత్రి గమనార్హము. ఇందు బౌద్ధ దృక్పథమును బట్టి సాధింపఁ బడిన ప్రయోజన మేమన, వాసుదేవుని సోదరుడైన ఘటుడు బుద్ధునితోను, వాసుదేవుడు సారి

పుత్త్రినితోను అభిన్నులుగ చిత్రింపబడి యుండుట. ఇట్టి విచిత్రకథా కల్పనమే ప్రాయికముగ బౌద్ధ దర్శనమున కథావశమున వ్యక్తమగుచున్నది. సర్వార్వాచీన కథా ప్రపంచమును స్వామికథ యుత్తేజపరచిన వైనమునకీ యంశములు నిదర్శకములై యున్నవి. కావున నిది యొక పూరకాంశముగ భావింపవచ్చును.

జైన కథా పద్ధతులిందులకు వ్యతిరేకములై కృష్ణకథను, తత్త్వమును నథమముగ చిత్రించు పద్ధతి కాకరమై యున్నవి. అందులకు ప్రధానముగ జైన హరివంశము లందలి వృత్తాంతము లొండు రెండు గమనార్హములు. వసుదేవుని యొక్క యగ్రజునికి జన్మించిన నేమినాథుడు కృష్ణునికన్న వయసున చిన్నవాడు. ఒక నాడు కృష్ణుడు బంధుమిత్ర పరివార జనముతో సభ తీర్చి యుండగా నేమినాథు డక్కడకు వచ్చెను. కృష్ణుడు లేచి వెడలి యాతనికి స్వాగతాదులు నెరపెను. అతడు సభ యందు కృష్ణుని స్థానమునే యాక్రమించి కూర్చుండెను. అప్పుడు సభ్యులు ప్రపంచమున నత్యధిక బలాఢ్యుడెవ్వడను నంశము చర్చకు తెచ్చిరి. కొందరు కృష్ణుడని, మరికొందరు అర్జునుడని భిన్నాభిప్రాయముల ప్రకటించిరి. బలదేవుడు మాత్రము నేమినాథు నంతటి బలవంతు డన్యుడు లేడని చెప్పెను. కృష్ణు డాతనిని తనతో మల్ల యుద్ధముచేసి బలమును నిరూపించుకొనుమని యాహ్వానించెను. తన బలమును పరీక్షింప దలచినచో సింహాసనము నుండి తన పాదమును గదల్చిన చాలునని నేమినాథుడు చెప్పగా, కృష్ణుడు ప్రయత్నించి విఫలుడై నేమినాథుని యెడ నితోఽధిక గౌరవమును ప్రదర్శించెను. (జైన హరివంశము **55-1-14**).

ఒకప్పుడు వసంతఋతువున కృష్ణు ననుమతితో నాతని భార్యలు నేమినాథునితో క్రీడించిరి. (Play) కొందరాతని స్పృశించియు, మూర్కొనియు, దొరలించియు, పూలమాలలువైచి కౌగిలి(యత్నించియు బహువిధముల గ్రీడించిరి. (55-46). గ్రీః

నందాతడు వనితా జనముచే నాహూతుడై జలక్రీడ నొనర్చెను. వనితల కాసందర్భమున మోహావేశ ఫలితముగ గర్ణకుండలములు జారుట, కేశపాశములు సడలుట మున్నగు చిహ్నములు పొడమినవి. నేమినాథుని సేవకులు పొడివస్త్రములను దెచ్చి యిచ్చిరి. వానిని ధరించిన నేమినాథుడు జాంబవతిని బంచి తన తడి వస్త్రములను బిండుమని యాదేశించెను. ఆమె కుపితయై వీరుడైన తన భర్త సైతము తన నిట్టి నీచ కార్యములందు వినియోగింపడని చెప్పెను. అందులకు సమాధానముగ నేమినాథుడు కృష్ణుని బల మసన్యమైనది కాదని చెప్పి, కృష్ణుని సర్పశయ్యపై కేగి దానిపై నిలువబడి కృష్ణుని పాంచజన్యమును పూరించెను. దీనివలన నగరమున నపారమైన కల్లోలము పొడమినది. నేమినాథుడీ కార్యమును జాంబవతికి గుణపాఠము నేర్పుటకై యొనర్చెనని తెలిసికొనిన కృష్ణుడు మిక్కిలి సంతసించెను.

భోజకుటుంబమునకు జెందిన రాజమతియను కన్యతో నేమినాథునికి కృష్ణుడు వివాహ మేర్పరచిన సందర్భమున నానాదేశముల రాజు లాహూతులైరి. వనవిహారము చేయుచున్న నేమినాథు డరణ్యమృగము లన్నియు బంధింప బడియుండుట గాంచి తన వివాహ సందర్భమున విందునకై యిట్లు జరిగినదని యూహించి, వానికి స్వేచ్ఛనొసగి తాను వివాహ సంకల్పమును వదలి తపశ్చర్యను ఘటించుటకై వెడలిపోయినాడు (55-86-108). మరియొక సందర్భమున మహర్షియైన నేమినాథుడు కృష్ణుని సోదరుడైన గజకుమారుని వివాహ సందర్భమున ద్వారకకు వచ్చి యాదవుల నుద్దేశించి మత తత్త్వశాస్త్రములపై సుదీర్ఘ ప్రసంగ మొనర్చి, తాను ఇరువది రెండవ తీర్థంకరుడ ననియు, భావి కాలమున తీర్థంకరులలో చివరి వారగు పార్శ్వనాథ మహావీరులు జన్మింప నున్నారనియు జెప్పినాడు. (60-126-141). రుక్మిణి సత్యభామల స్పర్థలను గూర్చిన మనోహరమైన కల్పనమొకటి యిందే కలదు. ఒక విద్యాధరుని పుత్రికయగు సత్యభామ కృష్ణుని పట్టమహిషి. రుక్మిణి రెండవ రాజ్ఞి. వివిధ భవనము

లందు రాణులు వసింతురు కావున సత్యభామకు రుక్మిణిని గలిసికొను నవకాశము లభింపలేదు. ఆమె కృష్ణునితో రుక్మిణి పరిచయము తనకు గలుగునట్లు చేయుమని చెప్పినది. కృష్ణు డంగీకరించి యొక యామ్రి వనమున రుక్మిణిని నిలిపి కొలది దూరమున సత్యభామ నుంచి తాను వెడలి రుక్మిణిని దెచ్చునంతవరకందే యుండుమని సత్యభామకు నిర్దే శించి వెడలిపోయెను. ఈ లోపున రాణు లిద్దరును గలిసికొనిరి. సత్య భామ రుక్మిణి నొక దేవతా స్త్రీయని భావించి నమస్కరించి, యామె సౌందర్యాదుల కబ్బురపడి తనకు శ్రేయము కల్గునట్లును, రుక్మిణికి సపత్నుల వలన నవనతి జరుగునట్లును ప్రార్థించినది సరిగా నీ సందర్భముననే కృష్ణుడువచ్చి వారిరువురును తన ప్రమేయము లేకయే మైత్రిని సాధించినారని సరసమూడినాడు. రుక్మిణి సత్యభామకు నమస్కరించి యుత్తమ వంశ సంజాత యొక్క లక్షణముల నిరూ పించి యామె వినయ గుణమును శ్లాఘించినది (43-7-17). ఇట్టి మనోహర కల్పనములతో పాటు కృష్ణుని నరకలోక గమనాది వృత్తాంతములును నిందున్నవి. కథా కల్పనా వ్యూహమునందు కృష్ణకథాంశముల ప్రభావము వ్యక్తమగుచున్నను నందెక్కువ పాలు స్వమతాధిక్య నిరూపకమై యున్నది. అది యట్లుండ జైనుల కథా కల్పనము లందు కొన్ని యంశములు వాసుదేవ విషయమున కాకరములై యున్నవి. జైన దర్శనమున నున్న యరువది ముగ్గురు శక పురుషులలో వాసుదేవ బలదేవు లున్నారు. అట్లే శలాకా పురుష పరంపర యందు (మహనీయులు) తొమ్మండుగురు వాసుదేవులు, తొమ్మండుగురు బలదేవులు, తొమ్మండుగురు ప్రతి వాసుదేవులున్నారు. శలాకా పురుషులు సృష్ట్యాది నుండి జన్మించి తచ్చరిత్రమును దీర్చిదిద్దునట్టివారు. ఛాందోగ్యము నందు సూచింప బడిన యహింసా సిద్ధాంతమును జైనులు గ్రహించిరి. మహావీరుని జన్మగాథ పూర్తిగ కృష్ణ జన్మ కథ ననుసరించి యున్నది. వాసుదేవ కృష్ణుని యారాధనా తత్త్వము నుండి జైనులు ప్రజా రంజకములు,

విశ్వ జనీనములునైన యనేక సూత్రముల గ్రహించి యుండిరి. ఇట్లే వైన దర్శన మంతయు కృష్ణదర్శనోత్తేజమును, ప్రభావమును ప్రతిబింబించుచున్నది.

అట్లే బౌద్ధ ధర్మమునందలి యహింసా తత్త్వమును ఛాందోగ్యము నుండియే గృహీతము. సద్ధర్మ పుండరీకము నందును, అశ్వఘోషుని బుద్ధ చరిత్రమునందును, అతడు ప్రతిపాదించిన భూత తథాత్వ సిద్ధాంతము నందును భగవద్గీత ప్రభావ మున్నది. ఈ యభిప్రాయములను బలువురు విజ్ఞులైన పండితు లామోదించి యుండిరి.

ఈ కోవలో పరిశీలింపదగిన మరియొక దర్శనము క్రైస్తవము. భారతీయ సాహిత్య తత్త్వ శాస్త్రములను ప్రత్యయ బుద్ధితో ననుశీలన మొనర్చినవారి నట్లుంచి, ద్వేషపూరితులైన వారనుపపత్తికములు హాస్యాస్పదములునైన యనేక సిద్ధాంతముల నొనర్చి యున్నారు. శ్వేత ద్వీప వృత్తాంతమునకు, స్వామి బాల్య కథలకు, పశుపాలనాది చర్యలకు, జన్మాష్టమి వేడుకలకు నొక యూహా కల్పిత సమన్వయమును వారు సృష్టించి కాలగణన సూత్రముల వ్యత్యయ మొనర్చిరి. స్వామి క్రీస్తు యొక్క యవతారమని చెప్పు వరకు వారి యత్నములు కొనసాగినవి. లౌకిక కథ్య యందు వీని యవిచార మూలకత్వము, హాస్యాస్పద దృష్టి యింతకు పూర్వమే పలువురు శాస్త్రవేత్తలచే నిరూపిత మొనరింప బడినవి. వానిని ప్రస్తుతానుశీలనమున పునరుక్తము చేయనక్కర లేదు. గమనార్హములైన యంశములు యితర దర్శన కర్తలవలెనే వీరును స్వామి కథకు వైర భక్తులు. లౌకిక భ్రమా వలన నిట్టి యుపపత్తి రహితములైన సిద్ధాంతముల నిర్మించినారు. అసలు విషయ మేమన శాశ్వత ధర్మ గోష్ఠమైన స్వామి తత్త్వము కాలపరిధి యందలి ప్రయోజనావసరములను బట్టి క్రీస్తుగ, క్రైస్తవముగ నర్వాచీన కాలమున రూపొంది యున్నది. దివ్యజ్ఞానమునకు సంబంధించిన యాధికారిక గ్రంథము

లందును, సాధకుల యనుభవము నందును నీ విషయము సిద్ధమై యున్నది. ఇందలి శాశ్వతతత్త్వమేమన బాహ్యములైన నామ రూపాది భేదముల కతీతమై శాశ్వతమైన స్వరూప మొక్కటి పారంపర్యముగ దివ్య లక్షణ చిహ్నితమై మానవుల హృదయ సామ్రాజ్యము నధివసించి యుత్థాన మార్గమున కృషి సల్పుచుండును. ఆ పరంపర యందలి భిన్న కేంద్రములే యివి. సర్వదర్శన మార్గముల గమ్యమేది కలదో యది స్వామి తత్త్వము. దాని బాహ్యస్థితి కథ. ఉపాసనా మార్గ నిర్దేశము లందనేకము లిమిడి యున్నవి.

ఈ రీతిగ ననేక దర్శనముల నిముడ్చుకొనిన మహాతత్త్వమున కొక పేరు కృష్ణకథ.[3]

శాశ్వత ధర్మ గోప్త:

ఏదాదృశ మహావైభవోపేతమైన జీవితమున స్వామి సాధించినదేమి? ఆతని జీవిత విధానమున వ్యక్తములై ప్రోక్తములై వ్యాపించిన ధర్మాధర్మముల స్వరూపమెట్టిది? సమకాలీన జగత్తున ధర్మవేత్త, ప్రవర్తకుడునైన యాయన శాశ్వత ధర్మ గోప్త యెట్లయ్యెను? ఆయన జీవిత ఘట్టములందు బహు ముఖములుగ ప్రతీయమానమైన సాముదాయిక ధర్మ స్వరూప మెట్టిది? మున్నగు ప్రశ్నము లుదయించును. తదనుశీలనమునకు మున్ను ధర్మతత్త్వము నరయుటవసరము.

ధర్మ శబ్దమున కనన్యమైన బహ్వర్థ స్ఫూర్తి యున్నది. దీని సాముదాయిక తత్త్వమున నిహపర సాధకములైన సమస్త మానవ జీవితాంశములు లీనము కాగలవు. అంతటి విశాలార్థవంత మీ పదము. ధర్మము మానవ జీవితాంశముల ధరించునది. తనను

3. ఈ యనుశీలనమునకు వలసిన చారిత్రక, వాఙ్మయ ప్రాతిపదికలు బి. యన్. బేహారి మజుందార్ రచించిన Krsna in History and legend అను గ్రంథము నుండి కృతజ్ఞతతో స్వీకృతములు.

రక్షించినవారినది రక్షించును. తదవలంబకులకు మోక్ష ప్రాప్తి సిద్ధించును. ఇందు వ్యక్తి సామాజిక ధర్మములు, వర్ణాశ్రమ ధర్మములు, రాజనీతి యుద్ధనీతి, ధర్మములు, మోక్ష ధర్మము లుమున్నగు మార్గముల నీ భారతీయ ధర్మ నిర్దేశము కొనసాగినది. సూక్ష్మ ధర్మములు, ఆపద్ధర్మములు మున్నగు విశేషాంశములు నిందు లీనమై యున్నవి. వ్యావహారికముగ ధర్మమన్నప్పుడు న్యాయమను నర్థమున వాడుచున్నాము. ఇట్లు భిన్న సందర్భములందు ప్రచలించిన యంశముల క్రోడీకరించు కొన్నచో నొక విశిష్టమైన జీవన పథమునకీ పదము పర్యాయముగ నిర్దేశింప బడినదని వ్యక్తమగును. అందలి భిన్నాంశములను స్వామి యెట్లు నిరూపించెనో యను గమనిక యిందు ప్రధానము.

స్వామి వ్రజవాస ఘట్టమింములకు రమ్యమైన యాకరము. స్వామి రామసహితుడై బాల్యమున మరెందును వర్తింపక మనోహరమైన వ్రజము నెన్నుకొనుట ప్రత్యేకము. వ్రజవాసుల జీవిత మొక పవిత్ర వాహిని. అచటి వారు ప్రకృతితో పెనవేసికొన్న జీవితములు కలవారు. పచ్చిక బీళ్లయందు స్వేచ్ఛగా విహరించు ధేనువులు, వాని వలన వచ్చిన సంపద, ప్రకృతి నుండి కృషిఫలితములై సంక్రమించెడు సస్యములు, అందలి సుందర సీమలు, నదీహ్రదంబులు, గిరితరులతాదులు మున్నగునవి, వారి జీవితములందు స్థానమాక్రమించిన విషయములు. నేడు మన కర్థమగు భాషలో నార్థిక వ్యవస్థ యన్నది యందు లేదు. డబ్బుఅను పేరుగల యర్థముతో వారికి నిమిత్తము లేదు. సంపద నెల్ల వారనుభవించి సర్వభూత తృప్తి నొనర్చు మార్గమే వారికి తెలియును. దాచుకొనుట, వాని నెవరో దోచుకొనుట వంటి యంశములు వారిభావనా పరిధి కతీతములు. ఇట్టి జీవన మార్గమును స్వామి జగదాదర్శముగ భావించి యట్టి జీవన మార్గమున్న వ్రజమును వరించెను. అప్పుడాతనికి బాల్యము. అనగా భావప్రపంచము లోకవృత్త జ్ఞానమున ముదిరి పోయి యహంత,

స్వామ్యము మున్నగు లక్షణములకు తాపీయుని స్థితి. ప్రాయికముగ నిట్టి స్థితియే యావజ్జీవితము నిలుపుకొనియుండుట, సర్వకాల సర్వావస్థలయందు బాలోచితమైన మనస్తత్వము గలిగియుండుట స్వామి నేర్ప దలచినాడు. అట్టి వ్యవస్థ కెచ్చట నేనియు విఘాతము వచ్చినచో స్వామి చిలిపితనము నాయుధముగ దానిని దమించినాడు. ఇండ్లలో నుట్లపై గుట్టలు వేయబడియున్నపు డందలి స్వామ్యాహంకార లక్షణమును భంజించి వస్తువుల సర్వభూత వినియోగ మొనర్చినాడు. సస్యసంపద కాశించి కామ్య మార్గమున నింద్ర యజ్ఞాదుల నొనర్పనందాదులు ప్రయత్నించి నపుడు చాతుర్వర్ణ్య వ్యవస్థ యందలి సూక్ష్మ ధర్మముల నిరూపించి ప్రకృత్యారాధనము కామ్యకర్మల కన్న శ్రేష్ఠమని నిరూపించినాడు. దుష్టదమన వేళ శక్త్య శక్తుల పరిమేయ మక్కర లేకనే కర్మాచరణ మొనర్ప దగునని కాళీయహ్రదమున దుమికినాడు. సర్వాత్మనా శరణాగతి తప్ప తరించుట కన్య మార్గము లేదని గోపికల నిమిత్తముగ మానవాళికి నేర్పినాడు. జీవితమునందలి సర్వానుబంధములయందు దనను దర్శించుట మానవజాతి ధ్యేయమని బ్రహ్మదేవు డొనర్చిన గోవత్సాపహరణ మూలముగ నిరూపించినాడు. ఇట్లెన్నిటి నేని నెన్నవచ్చును. అనంతర జీవితమున స్వామి నిరూపించిన సర్వధర్మ మార్గముల కిందు ప్రాతిపదికలున్నవి. ప్రకృతియందైక్యము భజించిన జీవితము, స్వామ్యము లేక సర్వభూత తృప్తికైన సంపద, మధురానుబంధములు, ఆనంద తుందిలమైన జీవితము, మున్నగు నాదర్శము లిందు ప్రసక్తములు. బలుని హాలమున కృషిశీలము, తన వేణువున మంత్రజాలము స్వామి యీ ఘట్టమునకు ప్రతీకలు.

మధురలో జీవితమున నూతనాధ్యాయము ప్రారంభమై

అందొక దుష్టనియంత యున్నాడు, వాని వీగిచే సర్వభూత ప్రపంచము గడ గడ లాడినది. అట్టి వారిని నిర్దయగ నంత మొందించుట సమాజమునకు శ్రేయము. కావున సకల జన సమక్షమున వానిని దమించినాడు. అట్లు చేయుట కాయన యర్హత యెట్టిదన; నొక కక్ష్య యందు తాను సర్వ ధర్మ నిర్ణేతమైన పర స్వరూపుడు, మరి యొక దశలో నాటి భారతావని యందలి దుష్ట శక్తుల దమింప వలసిన యుగపురుషుడు, భారము తనపై నున్నది కావున నిట్టి యనేక దుష్ట దమన కార్యక్రమముల నిర్వహించినాడు. ఇప్పట్టున నొక గమనిక. లోకము నందలి యెల్లవారును నిట్టి మార్గమును జేపట్టినచో నవ్యవస్థయే మిగులును. అది ధర్మబద్ధు లైనవారు క్షాత్ర ధర్మము నవలంబించినవారు మాత్రమే రక్తపాత దృష్టితో కాక లోక సంగ్రహ బుద్ధితో చేయవలసినది. పూర్వ స్మృతులు వీడని స్వామి ద్వారక నొక మనోహర సీమగ నిర్మించుకొని యందు, ప్రకృతి విలాసముల నెలకొల్పి పరమ సుందరమైన జీవిత మార్గము నవలంబించినాడు. గురుశిష్య ధర్మ ప్రతిపదికలో, గోబ్రాహ్మణ భక్తి, పరోపకార పారీణత, ఆర్తరక్షణ- మున్నగు ధర్మముల కా మహామహుని జీవితమున నుదాహరణములు కొల్లలు. ధర్మ నిర్వహణమునకు పదవితోను, రాజ్య సింహాసనముతోను పని లేదనియు, పారంపర్యముగ నర్హులైన వారికే రాజ్యము ప్రాప్తింపవలెననియు భావించి యుగ్రసేనునికి రాజ్య మొసగిన స్వామి పరమ త్యాగ మూర్తి, ధర్మకీర్తి.

ఇటుపై స్వామి సమకాలీన రాజలోకమున నిర్వహించిన యంశముల పరిశీలింప వచ్చును. ఆ మహావీరు డొనర్చినన్ని దుష్ట సంహారణ కార్యములు మరి యెవ్వరును నిర్వహింపలేదు, ఇప్పుడు

స్వామి సుదర్శనమును కేలబట్టినాడు. ఇది కాలస్వరూప చిహ్నము. ఇందు లక్ష్యమగు వ్యక్తులందరు ధర్మ ప్రతీకలు. రాజకీయముగ చూచినచో, భిన్న భిన్న మార్గ దుష్టులగు రాజన్యుల చేతిలో నున్న యధికారమును దొలగించి, సర్వమును ధర్మరాజ్య నిర్వాహకుడగు నొకని చేతియందుంచుట యిందలి యాంతర్యము. ఈ మహాయజ్ఞమున స్వపర భేదము లేదు. ఇందెందరాహుతి కావలసి యున్నను తప్పునది లేదు. లోకమున ధర్మసంస్థాపన దీక్షను గ్రహించిన వారు పాటింప వలసిన ధర్మములు కొన్ని యున్నవి. వారికి దేహాత్మ భ్రాంతి చెల్లదు. వారు కర్మవీరులు, జ్ఞానయోగులు కావలెను. సర్వకర్మాచరణమున స్వామి యొక్క ధర్మస్వరూపము నరసి యాయన విభూతినే విశ్వమూర్తిగ భావించి దానియందు భక్తి నెరపి దానికి శరణాగతి నంది యాత్మత్వమునకే ఫలితములు వదలి శాశ్వత ధర్మస్థాపనమున నిమిత్తమాత్రులై వ్యవహరించి తరించవలెను. ఇట్టి మహా ధర్మమునకు నరుడు ప్రతీక. వానికి సన్నిధి నొసగిన నారాయణుడు గీతామూర్తి. ఇందు మరియొక యంశము లీనమైయున్నది. పై రీతిగ సంగ్రహింప బడిన గీతాన్వయము తద్గత సహస్రాంశములలో ప్రసక్తమైన యొక్కటి మాత్రమే. పార్థుని కిప్పట్టున చెప్పిన మాటయొకటి పరిశీల నార్హమగుచున్నది. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ..." అనునది. ఇక్కడ నర్జునుడు పరిత్యజించ వలసిన ధర్మమేది? యనుప్రశ్నమునకు లౌకిక ధర్మభ్రాంతియే యని సమాధానము. అర్జునుడొక భ్రాంతికి లోనయ్యెను. అది బంధు, గురు, స్వజనహింస వలన సంక్రమించునట్టి పాపమునకు సంబంధించినది. ఆ భ్రాంతి లోకవృత్తమున రమ్యమై, చర్వణయోగ్యమై, కారుణికగుణ ప్రవణమై యుండును. దానినే విషాదయోగ మందురు. దానిని జయించుట కనేక మార్గములను ప్రవచించిన పిమ్మట కడమెట్టుగ నీ లౌకిక

భ్రాంతులను త్యజించి ధర్మమార్గమున (శాశ్వత) స్వామిని శరణ మందుటయే ధ్యేయమై ప్రవచింప బడినది. గోపికలకు వస్త్ర విషయముగ జీవాత్మ పరమాత్మ సమ్మేళనమున కవరోధముగ నుండిన లౌకిక ప్రతీకలెట్లు తొలగింప బడినవో యిచ్చట నర్జునునికి ధర్మ విషయమున నట్లు పొరలు వీడినది. కావున శాశ్వతధర్మ దృష్ట్యా లౌకిక ధర్మ భ్రాంతుల త్యాగముచేయువలె ననునది ప్రసక్తాంశము.

ఈ శాశ్వత ధర్మమెట్టిది? ఇది యుగలక్షణ సంకేతమై, కాలమున లీనమైయుండి కాలకాలముల బాహిరిల్లి కాలమునందడగునది. ఈ యుగమున భిన్నకక్ష్యలందున్న సర్వభూతగ్రామమునకు దత్కృత శుభాశుభ కర్మ ఫలితముల ప్రసాదించి సృష్టి చక్రమున లీన మొనర్చునది. ఆ ప్రణాళికయందలి యొకముఖమునకు పార్థుడెట్లు సంకేతమో మరి యొక ముఖమునకు కౌరవాదులట్లే సంకేతములు. ఒక్కొక్క యావర్తమున నిట్లు లీనమై మరల భాసమానమై సహస్ర యుగ పర్యంతము శాశ్వతముగ వర్తించు నీ విశ్వము యొక్క చరిత్ర యందలి యీ ధర్మమునకే స్వామి శాశ్వత గోప్త, యుగీన వ్యాపనాకర్త, యుగాంతహర్త. ఈ దర్శనము స్వామి సందేశ సర్వస్వమైన గీత యందు నిక్షిప్తమైనది. సాంఘిక వ్యవస్థ యందలి వర్ణధర్మము తన సృష్టియే యని తాను చెప్పినాడు. ఆయా జీవుల సంస్కార ఫలితములను బట్టియు, పూర్వ భవ కర్మమును బట్టియు, తత్ఫలితముగ సంక్రమించిన మానసిక కక్ష్యను బట్టియు సర్వకాల దేశము లందును నాల్గు రీతుల వ్యక్తమగును. దీనికే చాతుర్వర్ణ్య మనిపేరు. ఇది పలువురు నవీనులు భావించినట్లు పలపర్యాయము కాదు సమాజము నందు ప్రవర్తిల్లి దానిని సత్పథమున నడిపింప గల నాలుగు కేంద్రముల ధర్మ సాంకర్యమీ కలియుగ లక్షణముగ పురాణములందు క్తమైనది. ఈ నాలుగు శుద్ధి చేసిన

వీణ యందలి తంత్రులవలె పరస్పరోపకారకములు. ఈ యర్థమే విశ్వ విరాడ్మూర్తిపుని ముఖ బాహ్వాదుల సంకేతముగ వేదము కీర్తించి యున్నది. ఈ ధర్మమునకు విప్రతిపత్తి వాటిల్లుట స్వామి సహింపడు. సహజముగ విప్రులయందు మహా వినయ శీలియై వారి కార్యముల నెత్తిన పెట్టుకొని చరించు స్వామి స్వధర్మమును వీడి రాగద్వేషాదులకు వశవర్తులై చరించిన ద్రోణాశ్వత్థామల కెట్టి దండనము విధించెనో గమనించినచో స్వామి దృక్పథము తెల్లమగును. రెండవది యాశ్రమ వ్యవస్థ. ఇది భారతజాతి దర్శించిన మహోదాత్త స్థితి. లోక శ్రేయమునే యాకాంక్షించుచు తాము వైయక్తికముగ కోరదగిన దేదియు లేకున్నను ప్రకృతితో సాహచర్యమున వర్తిల్లి నిరంతర తపశ్శీలురైన మునీంద్రుల యోగక్షేమముల స్వామి సహ స్రాక్షుడై రక్షించును. సాధ్యమైనన్ని సందర్భముల తద్దర్శన మొనర్చి తానే పునీతుడైనట్లు భావించును. వారికెడరు గల్గిన వేళ రుద్రుడై దుర్మార్గుల సంహరించును. అట్టి యుదాహరణములు పురా ణములందు కొల్లలుగ నున్నవి. అంతటితో స్వామి ముచ్చట తీరక తానే జటా వల్కలధారియై తపశ్చర్య సంఘటించెను. ఈ యంశము లన్నియు సమాజ ధర్మమున కొక రక్షా కేంద్రమైన యాశ్రమ ధర్మము నెడ స్వామి మక్కువకు నిదర్శనములు. వ్యక్తిగత నైతిక ధర్మమునకు, సమాజ నైతిక ధర్మమునకు పరమ సమ్మేళనము స్వామి ధ్యేయము. ఈ రెండును నొకదాని నొకటి పోషించును. ఇందు సాముదాయికతలోగాని, వైయక్తికతలోగాని చ్యుతి సంభ వించినచో స్వామి యోర్వడు. పాంచాలీ కేశపాశమును బట్టి యీడ్చిన కౌరవాపశదుల స్థితి, యామె నవమానించిన సైంధవుని స్థితి యెట్లయ్యెనో మన మెరుగుదుము.

ఇట్లు స్వామి సామాజిక, ఆర్థిక, రాజకీయ, నైతిక, లౌకి పారలౌకిక ధర్మ సముచ్చయము యొక్క తేజఃపుంజము. ఇది ... ముగ భిన్న యుగములందు ప్రతీయమానమై యుగాంతము...

స్వామి యందు లీనమై యెప్పటికప్పుడు వలసిన వేళల వలసిన మార్గమున నవతరించును, ఇట్టి యవతరణ లీల యందలి యొక్క సర్వ సమగ్ర ప్రతీకకే 'కృష్ణకథ' యని పేరు.

అది నరునికి సన్నిధి నొసగి నడిపించు దివ్యగీతమై శాశ్వతముగ విశ్వాంతరాళమున మార్మ్రోగును. పాంచజన్య సంకేతమై రోదసి నిండును. వేదనాదమై దెసల మ్రుమ్మరించును. వేణునాదమై మందర మార్గమున నంతర్యామి యగును. ఉపనిషణ్ణమై చిన్ముద్ర పట్టును. సర్వశాస్త్ర దర్శన సారమై శాసించును. పురాణేతిహాసములై ప్రచలించును. సర్వకళా స్వరూపమై స్పందించును. కావ్య మార్గమున గమనీయ మగును. తదను శీలనమున ధన్యత నొసగును.

## శ్రీకృష్ణార్పణమస్తు!

ఓం! శాంతిః శాంతిః శాంతిః.

# ఉపయుక్త గ్రంథ సూచిక*

## A. దార్శనిక సాహిత్యము :

1. శ్రీ మహావిద్యాది సూత్రావళి
2. శ్రీమద్భగవద్గీత-రామకృష్ణ మఠము, మద్రాసు-1962.
3. ఋగ్వేదమునందలి ప్రసక్త భాగములు.
4. అష్టోత్తర శతోపనిషదః-వావిళ్ళ ప్రచురణము-1954.
5. అహిర్బుధ్న్య సంహిత.
6. శతపథ బ్రాహ్మణము.
7. తైత్తిరీయారణ్యకము.
8. పంచవింశ బ్రాహ్మణము.
9. నారద భక్తిసూత్రములు-రామకృష్ణ మఠము, మద్రాసు-1953.

## B. పురాణేతిహాస కావ్యనాటకాది సాహిత్యము :

1. ఆంధ్ర మహాభారతము-సంశోధిత ముద్రణము, ఉస్మానియా విశ్వ విద్యాలయము, హైదరాబాద్.
2. శ్రీమహా భాగవతము-ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ ప్రచురణము, హైదరాబాద్-1968.
3. ఎఱ్ఱన హరివంశము-వావిళ్ళ ప్రచురణము.
4. సోమన ఉత్తర హరివంశము-వావిళ్ళ.
5. విష్ణుపురాణము - వెన్నెలగంటి సూరన-వావిళ్ళ ప్రచురణ-1955
6. విష్ణుపురాణము-కలిదిండి భావనారాయణ-ప్రాచ్యపరిశోధనాలయము, మద్రాసు విశ్వకళా పరిషత్తు-1931.

---

* ఇది దార్శనిక సాహిత్యమనియు పురాణేతిహాస కావ్యనాటకాది సాహిత్యమనియు విమర్శక సాహిత్యమనియు మూడు భాగముల నున్నది. ఈ పట్టికయందు ప్రచురణాది వివరములు లేనిచో నవి ప్రసక్తభాగమున నీయబడినవని గమనింపవలెను.

7. తెలుగు బ్రహ్మపురాణము - శ్రీ జనమంచి శేషాద్రిశర్మ- వావిళ్ళ-1930.
8. బ్రహ్మాండ పురాణము- ,,
9. దేవీ భాగవతము-తిరుపతి వేంకటీయము-1962. వేంకటేశ్వర పబ్లి కేషన్స్, కడియం.
10. శ్రీమదాంధ్ర పద్మపురాణము - పిసుపాటి చిదంబరశాస్త్రి, ప్రకాశకులు: పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి, ఆంధ్రాధ్యాపకులు, వెంకటగిరిరాజా కళాశాల, నెల్లూరు-1953.
11. మార్కండేయ పురాణము-మారనకవి, వావిళ్ళ-1918.
12. కూర్మపురాణము - మండ కామేశ్వరకవి - ఎంప్రెస్ ఆఫ్ ఇండియా ప్రెస్ ముద్రణము. 1888, చెన్నపురి.
13. గర్గ భాగవతము-శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి, శ్రీనివాసా ప్రింటింగ్ వర్క్స్, సికిందరాబాద్, 1954.
14. శ్రీకృష్ణ జన్మఖండము-గోపీనాథము వెంకటకవి.
15. పాండురంగ మాహాత్మ్యము-ఎమెస్కో సంప్రదాయ సాహితి ప్రచురణము-1970.
16. కృష్ణావతార తత్త్వము - జనమంచి శేషాద్రిశర్మ- వావిళ్ళ ముద్రణము (8 సంపుటములు).
17. కళాపూర్ణోదయము-పింగళి సూరన-ఎమెస్కో ప్రచురణము-1971 (2 సంపుటములు).
18. కాళీయమర్దనము, పూతనాహరణము-విజయరాఘవ నాయకుడు.
19. రాజగోపాల విలాసము-చెంగల్వ కాళకవి.
20. ప్రాతస్తవము, శ్రీకృష్ణ సంగీతము-విశ్వనాథ.
21. శ్రీకృష్ణపరమాత్మ-శ్రీ మాచిరాజు వేంకట కృష్ణమూర్తి.
22. రాసలీల-శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య.
23. కంసవిజయము-పురుషోత్తమకవి.
24. శ్రీకృష్ణలీల-పండిత, కె. సుబ్రహ్మణ్యశాస్త్రి.
25. శ్రీకృష్ణ లీలా నాటకము- శ్రీ నాగినేని వెంకయ్య.
26. సంగీత కృష్ణలీలలు-శ్రీ మలకపల్లి చినశేషగిరిరావు.
27. శ్రీ కృష్ణలీలలు-శ్రీ పోకా వెంకటకృష్ణదాసు.

28. త్యాగరాజ కీర్తనలు-సంపాదకులు-శ్రీ విస్సా అప్పారావు.
29. త్యాగరాజస్వామి నౌకాచరిత్రము.
30. పారిజాతాపహరణము-నందితిమ్మన-వావిళ్ళ, 1937.
31. భామాకలాపము-సిద్ధేంద్రయోగి.
32. సత్యభామా సాంత్వనము-లింగమఖి కామేశ్వరకవి.
33. రుక్మిణీ పరిణయము-కూచిమంచి తిమ్మకవి.
34. నీలాసుందరీ పరిణయము- ,,
35. రాధికా సాంత్వనము-ముద్దుపళని.
36. శ్రీకృష్ణ విలాస యక్షగానము-విజయరాఘవ నాయకుడు.
37. విష్ణు పారిజాతము-తరిగొండ వెంగమాంబ.
38. పారిజాతాపహరణము-మాతృభూతకవి.
39. రాధికా సాంత్వనము-సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు.
40. స్త్రీల పాటలు-కృష్ణశ్రీ సంకలనము.
41. తెలంగాణా జానపదగేయాలు-శ్రీ లక్ష్మీకాంతమోహన్ సంకలనము.
42. శ్రీ వైదర్భీ పరిణయము-శ్రీ మచ్చా వెంకటపతిరాయలు.
43. రుక్మిణీ కల్యాణము-ద్విపద- శ్రీ పేమకుర్తి లింగయ్య.
44. రుక్మిణీ పరిణయము-శ్రీ కొప్పర్తి నరసయ్య.
45. ప్రద్యుమ్నోదయము-శ్రీ విశ్వనాథ.
46. రుక్మిణీ పరిణయ నాటకము-శ్రీ బొమ్మరాజు సీతారామకవి.
47. రుక్మిణీకల్యాణ నాటకము-శ్రీ జాషువా.
48. శ్రీ రుక్మిణీ కల్యాణము-శ్రీ పెట్టి లక్ష్మీనరసింహము.
49. సాత్రాజితీయము-శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతకవి.
50. సంగీత శమంతక నాటకము-శ్రీ రాముడుగు రామకృష్ణాచార్యులు, శ్రీ వారణాసి రామమూర్తి.
51. శమంతక మణి-శ్రీ దరిశి వీరరాఘవస్వామి.
52. పారిజాతాపహరణము-శ్రీ చిలకమర్తి.
53. శ్రీ కృష్ణ తులాభారము-శ్రీ ముత్తరాజు సుబ్బారావు.
54. శ్రీకృష్ణ తులాభారము-శ్రీ పోతుకుచ్చి సుబ్బయ్య.
55. కాళిందీకన్యా పరిణయము-శ్రీ అహోబలపతి.
56. కాళిందీ పరిణయము-శ్రీ విశ్వనాథ వెంకటేశ్వర్లు.

57. లక్షణా పరిణయము-తిరుపతి వేంకటీయము.
58. లక్షణా పరిణయము-శ్రీ కుప్పిలి సీతారామ కవి.
59. లక్షణా పరిణయము-శ్రీ నిష్ఠల సింహాచల శాస్త్రి.
60. లక్షణా పరిణయము-శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి, ప్రచురణ-మాడపాటి నాగేశ్వర రావు-విజయవాడ-3. ద్వితీయ ముద్రణము-1965.
61. కుబ్జా కృష్ణ విలాసము-శ్రీ అక్కెన ప్రగడ హరిదాసు.
62. అచ్చతెనుగు కుబ్జాకృష్ణ విలాసము-శ్రీ వల్లంభిఘుల్ చక్రవర్తుల రంగయాల లక్ష్మీనృసింహాచార్యులు.
63. బృందావనము-శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు.
64. శృంగారవీథి-శ్రీ విశ్వనాథ.
65. పాండవోద్యోగము-తిరుపతి వేంకటీయము.
66. సంగీత కృష్ణరాయబారము-శ్రీ చక్రావధానుల మాణిక్యశర్మ.
67. శ్రీకృష్ణరాయబారము-శ్రీ జొన్నలగడ్డ వెంకటరాధాకృష్ణయ్య.
68. పాండవ విజయము-తిరుపతి వేంకటీయము.
69. కురుక్షేత్ర సంగ్రామము-శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి.
70. మహాభారత యుద్ధము-శ్రీ కట్టా అచ్చయ్య.
71. మహాభారత నాటకము-శ్రీ సంపన్మూడుంబ సింగరాచార్యులు.
72. సంపూర్ణ భారతము-శ్రీ వింగళి వేంకటనరసయ్య.
73. పాండవాశ్వమేధము-తిరుపతి వేంకటీయము.
74. పాండవాశ్వమేధము-శ్రీ రామ నారాయణ కవులు.
75. శిశుపాలీయము-శ్రీ దూర్వాసుల వరహా నరసింహము.
76. పాండవ రాజసూయము-తిరుపతి వేంకటీయము.
77. రాజసూయము-శ్రీ సందేపూడి శ్రీహరిరావు.
78. పార్థ కృష్ణలీల-పండిత, కె. సుబ్రహ్మణ్యశాస్త్రి.
79. నరకాసుర వ్యాయోగము-శ్రీ కొణ్డండ వేంకటరత్నము పంతులు.
80. ప్రసన్నయాదవము-శ్రీ చిలకమర్తి.
81. అంపశయ్య-శ్రీ అమ్మతిని వేంకటచలపతిరావు.
82. కుచేలోపాఖ్యానము-శ్రీ గట్టుప్రభువు.
83. భక్తకుచేల-పండిత, కె. సుబ్రహ్మణ్యశాస్త్రి.

84. శ్రీ పురిటి రఘురామదాసు రచించిన భక్తకుచేల.
85. సుహృత్సుదామము-శ్రీ నోరి నరసింహశాస్త్రి.
86. బహుళాశ్వచరిత్రము-శ్రీ దామరల వెంగళభూపాలుడు.
87. రాధామాధవము-శ్రీ చింతలపూడి ఎల్లన
88. దశావతార చరిత్రము-శ్రీ ధరణిదేవుల రామయ్యమంత్రి.
89. రాధామాధవ సంవాదము-శ్రీ వెలిదండ్ల వేంకటపతి.
90. గోపీ కథాకౌముది-శ్రీ చిలకపాటి రామానుజ శర్మ.
91. విరజోపాఖ్యానము-శ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి.
92. ప్రేమమయిరాధ-శ్రీ చిరావూరు కామేశ్వరరావు.
93. రాధ-శ్రీ పోడూరి భోగరాజు.
94. రాధాకృష్ణ నాటకము-శ్రీ పానుగంటి.
95. శ్రీ సంగీత కృష్ణలీల-శ్రీ సంపన్మూడుంబ సింగరాచార్యులు.
96. శ్రీకృష్ణలీల-శ్రీ మద్దూరి శ్రీరామమూర్తి.
97. రాధాకృష్ణలీల-శ్రీ కంచెర్ల వెంకటహనుమయ్య.
98. విష్ణుమాయా నాటకము-శ్రీ చింతలపూడి ఎల్లన.
99. విష్ణుమాయా విలాసము-శ్రీ కంకంటి పాపరాజు.
100. విష్ణుమాయా విలాసము-ద్విపద-శ్రీ కంకంటి నారసింహకవి.
101. కృష్ణార్జున సంవాదము-శ్రీ నాదెండ్ల గోపమంత్రి.
102. గయోపాఖ్యానము-శ్రీ రామనామాత్యుడు.
103. గయోపాఖ్యానము-శ్రీ చిలకమర్తి.
104. అర్జున గర్వభంగము-శ్రీ శేషాద్రి రమణ కవులు.
105. గర్వభంజనము-శ్రీ గండికోట బాబూరావు.
106. గర్వభంగము-శ్రీ అయినాపురపు సుందరరామయ్య.
107. పంచకన్యా పరిణయ యక్షగానము-శ్రీ బాలకవి సుబ్బన్న.
108. సత్యభామా కృష్ణ సంవాదము-శ్రీ కాకరపర్తి తిరుపతి పాత్రి కృతము.
109. వసుంధరా పరిణయము-శ్రీ నెల్లూరు వీరరాఘవకవి.
110. సాంబోపాఖ్యానము-శ్రీ రామరంగప్పరాజకవి.
111. చంద్రభాను చరిత్రము-శ్రీ తరిగొప్పుల మల్లన మంత్రి.
112. సాంబ విలాసము-శ్రీ అయినాపురపు సుందరరామయ్య.
113. రుక్మవతీ పరిణయము-శ్రీ కేశపల్లి సోమనాథకవి.

114. ప్రద్యుమ్నోపాఖ్యానము-శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.
115. మాయావతీ విజయ నాటకము-శ్రీ నారాయణం రామానుజాచార్యులు.
116. ఉషాపరిణయము-రంగాజమ్మ.
117. అనిరుద్ధ చరిత్రము-శ్రీ కనుపర్తి అబ్బయామాత్యుడు.
118. ఉషాహరణము-శ్రీ పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులు.
119. ఉషానాటకము-శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి.
120. శృంగార ఉషా కల్యాణము-శ్రీ నాగిసేని వేంకటకవి.
121. ఉషా పరిణయము-శ్రీ భోగరాజు సత్యనారాయణమూర్తి.
122. ఉషాసుందరి-శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి.
123. యాదవ ప్రళయము-శ్రీ జి. వి. కృష్ణారావు.
124. శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనలు-శ్రీ అన్నమాచార్యులు.
125. క్షేత్రయ్య పదములు.
126. సారంగపాణి పదములు.
127. భక్తిరస శతక సంపుటములు-వావిళ్ళ.
128. శతక సముచ్చయము-ఆంధ్ర సాహిత్య పరిషత్తు.
129. జనార్దనాష్టకము-శ్రీ కందుకూరి రుద్రకవి.
130. గోపికాగీతలు, భ్రమర గీతలు-శ్రీ విశ్వనాథ.
131. వేదనావాసుదేవము-శ్రీ నాయని సుబ్బారావు.
132. బృందావనము-శ్రీ మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి.
133. బృందావనము-శ్రీ చామర్తి రాజశేఖరరావు.
134. అన్వేషణము-శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి.
135. దీపావళి-శ్రీ వేదుల.
136. ఉదయశ్రీ-కరుణశ్రీ.
137. బసవరాజు అప్పారావు గీతాలు.
138. కవితా కదంబము-శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ.
139. కల్పలత-శ్రీ గురుజాడ రాఘవశర్మ.
140. నాగమల్లిక-శ్రీ పిలకా గణపతి శాస్త్రి.
141. మోహనవంశి-లత.
142. మంద్రజాలము-శ్రీ డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య.
143. ద్విపద భాగవతము-శ్రీ మడికి సింగన

144. జైమిని భారతము-శ్రీ పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు.
145. అష్టమహిషీ కల్యాణము-శ్రీ తాళ్ళపాక తిరువేంకటనాథుడు.
146. కృష్ణాభ్యుదయము-శ్రీ మండపాక పార్వతీశ్వరకవి.
147. శ్రీమదాంధ్ర రుక్మిణీ విజయము-శ్రీ పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులు.
148. శ్రీకృష్ణాతి మానుష తత్త్వము-శ్రీ దివి రంగాచార్యులు.
149. గోదావైభవము-శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్య.
150. కృష్ణమంజరి-తరిగొండ వెంగమాంబ.
151. గోపీహృదయము-రేహానా త్యాబ్జీ-అనువాదము-శ్రీ ముత్తవి లక్ష్మణదాసు, కుమారి ముత్తవి అలవేల్మంగతాయారు, సురుచి ప్రచురణములు-ఏలూరు.
152. శ్రీకృష్ణ కర్ణామృతము-వెలగపూడి వెంగనార్యుని యనువాద సహితము-వావిళ్ల - 1922.

## C. విమర్శక సాహిత్యము, ఇతర గ్రంథములు :

1. విజ్ఞాన సర్వస్వము-తెలుఁగు భాషాసమితి.
2. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశము-
3. సమగ్ర ఆంధ్ర సాహిత్యము-శ్రీ ఆరుద్ర.
4. జానపదగేయవాఙ్మయ చరిత్రము-శ్రీ డా॥ బి. రామరాజు.
5. Gropel of Sri Krishna - Duncan Greenless, The Theosophical Publishing house, Adyar, Madras-20.
6. KRISHNA in History and Legend byBiman Behari Majumdar.
7. నాటక సంచిక-కళావని.
8. ఆంధ్రభాగవతోపన్యాసములు-ఆంధ్ర సారస్వత పరిషత్తు.
9. గౌతమవ్యాసములు-త్రివేణి పబ్లిషర్స్, మచిలీపట్నము.
10. యుగపురుషుడు - శ్రీ ఇ. వేదవ్యాస. I. A. S. United Sosial Cultural and Educational Foundation, Hyderabad.

11. Cultural Heritage of India Volumes-Advaitasran
Publication, Calcutta.

12. Studies in Apics and Puranas of India by A. D
Pusalkar, Bharatiya Vidya Bhavan, Bombay.

13. శ్రీకృష్ణ చరిత్రము-బంకించంద్ర, అనువాదము, బాలాం
త్రపు సూర్యనారాయణ, ఆంధ్ర ప్రచారిణీ ముద్రాక్షరశా
నిడుదవోలు-1917.

14. Bhakti Renaissance by A. K. Majumdar, Bhara
tiya Vidya Bhavan, Bombay-7

15. Religion in Andhra by Dr. B. S. L. Hanumanth
Rao, Guntur.

16. పురాణములు-శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రి, పబ్బా శం
రయ్యశ్రేష్ఠిగారి ద్రవ్యసహాయమునఁ బ్రకటింపఁబడినది
సికిందరాబాద్-17.

17. తెలుగు నాటక వికాసము- శ్రీ డా॥ పి. యస్. ఆర్. అప్పా
రావు, నాట్యమాలా ప్రచురణము, హైదరాబాద్-20, 1967

18. యక్షగాన వాఙ్మయ చరిత్రములు-శ్రీ డా॥ ఎస్. వి. జోగ
రావు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.

# ముఖ్యపదానుక్రమణిక

# ముఖ్య సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 21 | అ సహజ | అసహజ |
| 10 | పద్యము 1వ పంక్తి | కామోత్కంఠిత | కామోత్కంఠత |
| 10 | పద్యము 2వ పంక్తి | నృతతుల్ | నృపతుల్ |
| 11 | 2 | తంభునాయక | తంతువాయక |
| 11 | 24 | దౌపది | ద్రౌపది |
| 13 | రెండవపద్యము | కారదవులకడ | కౌరవులకడ |
| 14 | పద్యము చివర | భువన దీపుండు | భువన దీపుడు |
| 16 | 4 | మట్టిన | ముట్టిన |
| 17 | పద్యము 6వ పంక్తి | నుజ్జనోద్యోగానుషక్తుని | నుజ్జనోద్యోగానుషక్తుని |
| 19 | 9 | వ్యక్తి. | వ్యక్తి |
| 22 | పద్యము 3వ పంక్తి | యిదె | యిది |
| | పద్యము 4వ పంక్తి | నీదయ జేయు | నీ దయఁజేకుఁజేయు |
| | పద్య సంఖ్య | (2-267) | (3-267) |
| 40 | సీసము చివరిపాదము | బొడగంటి | విష్ణుఁ బొడగంటి |
| 56 | 1 | లోజను | లోచను |
| | .. | మోహన | విమోహన |
| | 20 | కుంచితానయన | కుంచితావయవ |
| | 22 | వేభూషణముగ | వేషభూషణముగా |
| | .. | నాకసృత్కారార్ది | నసృత్కారార్థి |
| 62 | సీసము 6వ పంక్తి | ముస్నిటిల్ | ముస్నిటిలో |
| 62 | 23 | వ్యాప్యము | వాక్యము |
| 77 | 2 | ఏదునొకంటి | పదునొకంటి |
| 92 | పద్యము 1వ పంక్తి | శరదిందు | సుందర శరదిందు |
| | పద్యము 6వ పంక్తి | రచనాళి | రదనాళి |
| 98 | 15 | లొసంగని | లొసఁగని |
| | 22 | నెమ్మొగమున్ | నెమ్మొగమ్ము |
| 101 | పద్యము 2వ పంక్తి | వియోగమ్ముందుకైన | వియోగమ్ము మందుకైన |
| 108 | 2 | వెలుఁగు | మెఱుఁగు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 110 | 1 | మపుడు | మిపుడు |
| 113 | పద్యము 1వ పంక్తి | మహోపనిషత్సార | మహోపనిషత్సార |
| 124 | 21 | శతగిరి | శీతగిరి |
| 132 | 10 | గన్పట్టు | గన్పట్ట |
| | 11 | మంచి | మంజు |
| 145 | 15 | తిలకమ తిలకమ | తిలకిసీ తిలకమ |
| 170 | 14 | కుసుమేషూ | కుసుమేషూ |
| 171 | 19 | మాయావిత్ విజయ | మాయావతీ విజయ |
| 173 | 4 | షాలంకారము | ష్టాలంకారము |
| 186 | 6 | వాసుదేవ | వామదేవ |
| | 24 | దక్షిణమనియు | దక్షిణ యనియు |
| 190 | చివరి పంక్తి | నోఁచిదొగదే | నోఁచిరొగదే |
| 191 | 6 | యణయె | యదియె |
| | 14 | యీలూవు | యీలువు |
| 197 | 17 | సమ్యద్భోగం | సమ్యగ్భోగం |
| 204 | 26 | గొల్పుచు | గొల్పుదు |
| 206 | 2 | సేకతా | సైకతా |
| 215 | 5 | వెంగిలి | ఎంగిలి |
| 223 | 12 | కట్టువలెను | కట్టవలెను |
| 224 | 8 | మందాంబుధి | మదాంబుధి |
| 234 | 23 | నారిపోయినది | మారిపోయినది |
| 236 | 12 | సవ్యయుగము | నవ్యయుగము |
| 240 | 1 | తోఁకు | తోఁద |
| 241 | 26 | కాయుచున్నవి | కాయుచున్నది |
| 246 | 9 | దమోఘ | వమోఘ |
| | 13 | మెల్లన | యల్లన |
| 247 | 11 | మిమ్ము | మును |
| | 22 | వాయువునందు | వాయువునను |
| | .. | కృష్ణా | కృష్ణ |
| 252 | 15 | మోటు | మ్రోడు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 253 | 11 | జరవడ్డ | జెఱవడ్డ |
| 264 | 6 | రచించె | రచించి |
| 267 | 22 | గాక | దువుగాక |
| 268 | 24 | దనుజావహమగు | దనుజాభావమగు |
| 269 | 10 | పట్టి | పట్టె |
| | 11 | బిల్లం | బిల్లల |
| | 23 | యొగ | యేఁగ |
| 271 | 9 | నందు | ననుఁగు |
| | 18 | తోడి | తోడ |
| 272 | 7 | కమలజముఖుల్ | కమలజముఖులు |
| | 9 | నమృతంబునై | నమృతంబుమై |
| | ,, | మీగడ యో | మీగడయొ |
| 273 | 20 | గొంపు | గుంపు |
| 282 | శీర్షిక | 4 సమీక్ష | IV సమీక్ష |
| 286 | 2 | వత్తాంతము | వృత్తాంతము |
| 305 | అథసూచిక 1వ పంక్తి | బి. యన్ | బినయ్ |
| 309 | 2 | ధర్మ ప్రతీకలు | అధర్మ ప్రతీకలు |

## విజ్ఞప్తి

ఆంధ్రవాఙ్మయము—కృష్ణకథ మొదటి సంపుటము విషయసూచికలో ఈ క్రింది మార్పులు చేసికొన ప్రార్థన.

కృష్ణకథా మూలములు - క్రమవికాశము అను అధ్యాయమునకు ముందు I ఉండవలెను. అవతరణ పరిణామముల దిఙ్మాత్ర నిర్దేశము అను అధ్యాయమునకు ముందు II ఉండవలెను. కృష్ణకథాంశముల క్రమ పరిణామాను శీలనము అను అధ్యాయమునకు ముందు III ఉండవలెను. అవతరణ వ్యూహము అను అధ్యాయ భాగమునకు ముందు 1 ఉండవలెను.

— రచయిత.

# వెలువడినవి

ఈ సిద్ధాంత గ్రంథములో మొదటి భాగము కృష్ణ కథా మూలములు- క్రమ వికాసము, అవతరణ పరిణామముల దిఙ్మాత్ర నిర్దేశము, కృష్ణకథాంశముల క్రమపరిణామాను శీలనము (అవతరణ వ్యూహము, శైశవబాల్యలీలలు, శృంగార కల్యాణలీల, ధర్మ సంస్థాపనము) మున్నగు అంశములు గల

## ఆంధ్రవాఙ్మయంలో - కృష్ణకథ -1



భారత భాగవత హరివంశ విష్ణుపురాణ బ్రహ్మ బ్రహ్మాండ బ్రహ్మవైవర్త మార్కండేయ కూర్మ పద్మ గర్గ దేవీ భాగవతాదుల నుండి సంకలనము చేసిన సమగ్ర కృష్ణ కథా స్వరూపము గల అనుబంధ గ్రంథము.

## కృష్ణకథ

మధుమతి పబ్లికేషన్స్
లాయరుపేట, ఒంగోలు 523 002.